# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 12 సంచిక : 1 హైదరాబాద్ 150 జనవరి 2014 పేజీలు : 68 రు. 15

- కొత్త రాష్ట్రాల పునర్నిర్మాణం - పాత సమస్యలు

  ఉత్తరాంధ్ర, రాయలసీమ, కోస్తా, తెలంగాణలపై ఎనిమిది వ్యాసాలు

- ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు
- కంచి స్వామి నేరం చేయలేదా?
- తెహల్కా - పత్రికా రంగంలో అకృత్యాలు
- అమెరికా దౌర్జన్యం ఇప్పుడే తెలిసిందా?
- విప్లవం నుంచి విరమణ దాకా మండేలా

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 50 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని | | |
| పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| సమాధిలోకి సామ్రాజ్యవాదం | డి. పాపారావు | 200 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు – మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి మిత్రులు | 150 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| టాల్‌స్టాయ్ పరిచయ వ్యాసాలు | యన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు | 30 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

## కథ – నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ ద్యుమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh** | **(1956-2006)** | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunuri Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunuri Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunuri Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunuri Bharathi | 150 |
| **On Education** | Mudunuri Bharathi, R.S. Rao | 100 |
| **Understanding Maoists** | N. Venugopal | 300 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

## పాఠకులకు, రచయితలకు, ప్రకటనకర్తలకు, శ్రేయోభిలాషులకు, న్యూస్ ఏజెంట్లకు
## 2014 నూతన సంవత్సర శుభాకాంక్షలు


150 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జనవరి 2014
సంపుటి : 12
సంచిక : 1



| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్: | కంపోజింగ్: | సబ్ ఎడిటర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|---|---|
| **వి. హనుమంతరావు** | **ఎన్. వేణుగోపాల్** | **వై. రామచంద్రం** | **సి. రాజశేఖర్** | **ఎ. మల్లేశ్** | **ఎస్. వెంకటేష్** |


## లోపలి పేజీల్లో...


❖ పాఠకుల వీక్షణం — 4
❖ సంపాదకీయం ◆ డిసెంబర్ ఫలితాలు ఏప్రిల్ ఎన్నికలకు సూచికలేనా? — 5
❖ సంపాదకీయ వ్యాఖ్యలు ◆ ఇష్టారాజ్యపు దౌర్జన్యమే రాజ్యాంగమా? ◆ మండేలా - అనుకూల పాఠాలూ ప్రతికూల పాఠాలూ — 6
❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు — 7
❖ ఈనెల - ఎ. మల్లేశ్ — 8
❖ వర్తమానం - ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు - సి. రాజశేఖర్ — 9
❖ వర్తమానం - గొంతునులిమి చంపబడ్డ న్యాయం - బి. రామకృష్ణ — 11
❖ వర్తమానం - తెహల్కా, కుదుపు, ఇప్పడిక తమాషా - సత్యసాగర్ — 15
❖ విధానవిమర్శ - ఎర్ర బల్బు, వింత హారన్లపై సుప్రీం కొరడా - చెరుకూరి సత్యనారాయణ — 18
❖ అంతర్జాతీయం - దక్షిణాఫ్రికా పేదలను అమ్మేసిన ఎఎన్‌సి - రానీ కాస్రిల్స్ — 19
❖ అంతర్జాతీయం - సంకెళ్లలో దౌత్యవేత్త, జాత్యహంకార గగ్గోలు - పార్థా బెనర్జీ — 22
❖ అంతర్జాతీయం - అమెరికా ఒత్తిడికి తలొగ్గిన ఇరాన్ - ఎ. నర్సింహా రెడ్డి — 23
❖ కొత్త రాష్ట్రాలు - పాత సమస్యలు - ఉద్యమాలతోనే ఉజ్వల భవిష్యత్తు - దుప్పల రవికుమార్ — 27
❖ - కరువుల సీమ స్థితి మారేదెన్నడు? - ఎం. భాస్కర్ — 29
❖ - ఇరుకులో విశాలత - దిద్దుబాటు తప్పదు! - జాన్సన్ చోరగుడి — 33
❖ - ఫుడ్ కారిడార్ - పెట్రో కారిడార్ - తుంపాల శ్రీరామమూర్తి — 35
❖ - ఊపందుకుంటున్న రాయలసీమ నినాదం - ఎం.కె. కుమార్ — 36
❖ - తెలంగాణ పునర్నిర్మాణ సమస్యలు - ఎల్. అరణ్య — 42
❖ - వ్యవసాయ సంక్షోభం - ఆత్మహత్యలు - నైనాల గోవర్ధన్, టి. సారయ్య — 46
❖ - భవిష్యత్తు తెలంగాణ - కొన్ని ఆలోచనలు - ఎన్. వేణుగోపాల్ — 50
❖ సంస్మరణ - తెలంగాణ ప్రజా ఫ్రంట్ అధ్యక్షుడు ఆకుల భూమయ్య — 45
❖ సామాజికాంశం - విశాఖ మన్యంలో పోలీసుల రాజ్యం - కొర్రజ్యోతి — 53
❖ నివేదిక - నిత్యజీవితంలో సోషలిజం' పుస్తకావిష్కరణ సభ - సదస్సు - భూసారం — 54
❖ విధానవిమర్శ - సరండాలో గ్రీన్‌హంట్ మార్క్ అభివృద్ధి - ఎన్. రవి — 55
❖ సమీక్షావ్యాసం - సామ్రాజ్యవాదం: పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యున్నత దశ - ఎన్.వి. ఎస్. నాగభూషణ్ — 57
❖ చర్చ - 'మేం మళ్లీ వస్తాం' - విమర్శలకు వివరణ - తోలేటి జగన్మోహనరావు — 61
❖ ఇరుగు-పొరుగు - వై. రామచంద్రం — 64
❖ భూగోళం - సి. రాజశేఖర్ — 65
❖ అసహజ మరణాలు - వై. రామచంద్రం, ఎ. మల్లేశ్ — 66


'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.


ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ /**
**చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com


**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

వీక్షణం డిసెంబర్ 2013 సంచికలో 19వ పేజీలో బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి వ్యాసం 'ఆహార పంటలకు కీడు చేసే కీటకాలు' శీర్షిక తప్పుగా అచ్చయింది. వ్యాసం శీర్షిక 'ఆహార పంటలకు కీడు చేసే కీటక నాశకాలు' అని చదువుకోవాలి. ఈ పొరపాటుకు చింతిస్తున్నాం. – సం.

**వీ**క్షణంలో సెప్టెంబర్ నుంచి డిసెంబర్ 2013 సంచికలలో సీరియల్‌గా వచ్చిన రంగనాయకమ్మ 'మేం మళ్లీ వస్తాం' అనే సమీక్షావ్యాసంలో 'ఉపయోగపు విలువ' (శ్రమశక్తిని కొన్నవాడిదే అయినప్పుడు 'మారకపు విలువ' (శ్రమశక్తిని అమ్మినవాడిది అవదా? '(శ్రమశక్తి' వల్ల దాని విలువని మించిన విలువ గల వస్తువులు వస్తాయి. వాటిని ఉపయోగించడం అంటే '(శ్రమశక్తి' ఉపయోగపు విలువను పొందడమే; అంటే పెట్టుబడిదారుడు వాటిని మారకపు విలువగా మార్చడం. ఆ మార్చిన మారకపు విలువ మాదే అని కార్మికులు ఎందుకు వాదించకూడదు? ప్రాక్టికల్‌గా (శ్రమదోపిడీ కనిపిస్తూ ఉండగా మార్క్స్ ఉపయోగపు విలువ ఒక్కదాని గురించే చెప్పాడా? మార్క్స్ మారకపు విలువ గురించి చెప్పలేదా? అమ్మకాలు, కొనుగోళ్లు మొత్తం రద్దవుతాయని చెప్పలేదా? అప్పుడు వీళ్ల మధ్యనున్న అమ్మే కొనే సంబంధం కూడా పోదా? అసలు ఈ సబంధం పోవడం మీదే కదా వర్తకం రద్దు ఆధారపడి ఉన్నది!

నాకు ఈ '(శ్రమ శక్తి–ఉపయోగపు విలువ' వ్యాసం చదువుతూ ఉంటే ఒక చిన్నపిల్లల కథ గుర్తుకు వస్తోంది. మేకలు కాచుకునే అతని దగ్గరికి ఒక తెలివైన అతను వచ్చి 'ఆవులిస్తే మేకలిస్తావా?' అని అడిగేడట. మేకలు కాచుకునే అతను అలాగే అన్నాట్ట. తెలివైన ఆయన ఆవులించేడట. 'మేకని కట్టేసి పో' అన్నాడట. మేకాయన మేకని తాడుతో కట్టి, తాడుని తెలివైన ఆయన చేతికిచ్చేసి ఆవులియ్యి అని అడిగేడట. తెలివైన ఆయన మరోసారి ఆవులించేడట. 'ఆవులిచ్చేను కదా ఇంకా ఇచ్చేదేమిటి' అని దబాయించి మేకని తోలుకుపోతున్నాడు. గ్రామాధికారి ఎదుట కూడా తెలివైన ఆయన ఇదే తంతు. అప్పుడు గ్రామాధికారి 'సరే మేకాయన నీకు మేకని తాడుతో కట్టి కదా ఇచ్చింది! నువ్వు కూడా ఆవులింతని తాడుతో కట్టి అతని చేతికియ్యి', అనడంతో తెలివైన ఆయన తిక్క కుదురుతుంది. కథ సమాప్తమవుతుంది. కథలోని తెలివైన ఆయన వాదంలా ఉంది పెట్టుబడిదారుడి వాదన. కార్మికుల్ని, మార్క్స్‌నీ కూడా తెల్లబోయేటట్టు చేయదా ఆ వాదం.

– ఎస్. రామక్రిష్ణ
జీడిమెట్ల, హైదరాబాద్

'**శ్ర**మ ఉపయోగపు విలువ వ్యాసం మీద సూటిగా విషయం గురించే ప్రస్తావిస్తున్న ఉత్తరాలు కూడా వస్తున్నాయి. 'శ్రమ దోపిడియే లేదని దోపిడీదారుడు విర్రవీగుతోంటే నోరెత్తలేని స్థితిలో శ్రామికుడు పడిపోయాడంటే కారణం, నా గురువు పొరపాటే' అని కార్మికుడి నోటంట అనిపించే విధంగానే కార్మికుడు, పెట్టుబడిదారుడు మధ్యవాదం ఉండనవసరం లేదు. 'మార్క్స్ ఏ చిన్న విషయంలోనూ పొరపాటు చేయలేదు. ఆయన వాదనా పద్ధతి పెట్టుబడిదారుడివైన నీకేం అర్థం అవుతుంది? మాకు బాగా అర్థమయింది. అమ్మే, కొనే సంబంధంగా వివరణ మొదలై, ఆఖరికి అది కాదు అని తేల్చడమే ఆయన తర్క పద్ధతి. కార్మికులం, మేం మా శ్రమని అమ్మితే, మీ దగ్గర కొనడానికి ఏముంది? ఇంతకు ముందు కార్మికుల నుంచి దోచిందే తప్ప, మీరు స్వయంగా శ్రమించిన ఫలం ఏమైనా ఉందా? అమ్మడానికి మా శ్రమ ఉంది మా దగ్గర, కొనడానికి మీ శ్రమ లేదే మీ దగ్గర ! మీరు కొనేదే మా శ్రమతోనే! మేము అమ్ముకోవడానికి మా శ్రమ తప్ప మరేమీ లేని వాళ్లం ఎలా అయ్యాం? మీ దోపిడీల వల్లే. మన మధ్య అమ్మే, కొనే సంబంధం లేదు. పీడితుడు, పీడకుడు మధ్యనున్న సంబంధమే ఉంది. 'ఇది అమ్మే, కొనే సంబంధం కాదు' అని చెప్పడానికే ఆయన 'అయి ఉంటుందేమో చూద్దాం' అని మొదలెట్టేడు – అని కార్మికుడు చెప్పే అప్పుడు కార్మికులు తెల్లమొహాలూ వేయనక్కరలేదు, మార్క్స్‌ని పొరపాటు చేసిన గురువు స్థానంలోనూ నిలబెట్టనక్కరలేదు. పెట్టుబడిదారుడే తెల్లమొహం వేయాలి. వాదనలో ఓడిపోయాను కదా అని పెట్టుబడిదారుడు, 'అదనపు విలువు', 'స్వంతాస్తి' 'యజమానితనం' అన్నీ ఒదిలేస్తాడా? వాదనలు పెట్టుబడిదారుడితో వాదించడానికా, కార్మికులు చైతన్యం తెచ్చుకోవడానికా ? పెట్టుబడిదారుడితో 'దాస్ క్యాపిటల్' గురించి వాదిస్తే సోషలిజం వస్తుందా? కార్మికుల్లో కార్మికులు చర్చించుకుని, సిద్ధాంత బలంతో సాయుధ పోరాటం చేస్తే వస్తుందా? పెట్టుబడిదారుడి వాదానికి కార్మికులు తెల్లమొహాలు వేసినా, – గురువుని పొరపాటు చేసినవాడుగా, తమను గురువుని దిద్దిన శిష్యులుగా నిలబెట్టుకుని పెట్టుబడిదారుడిపై వాదనలో విజయం సాధించినా, పెట్టుబడిదారుడు శ్రమ దోపిడీ ఉందని ఒప్పుకోడు. కార్మికుడు తెల్లమొహం వేశాడా, ఎర్రమొహం వేశాడా అన్నది – అతనికి అనవసరం. పెట్టుబడిదారుడికీ, కార్మికుడికీ మధ్య వాదన సీను పెట్టి, దాంట్లో 'మార్క్స్ పొరపాటు చేసేడు' అనిపించడం ప్రమాదాలకు దారి తీస్తుంది.

– కె. రత్నకుమార్,
గుంటూరు

**డి**సెంబర్ వీక్షణం సంచికలో వచ్చిన 'మేకల సంరక్షణ కోసం తోడేళ్ల సమావేశం' అనే వ్యాసాన్నందించిన కె.వి.కూర్మనాథ్‌కు ముందుగా కృతజ్ఞతాభివందనములు. ఈ వ్యాసంలోని విషయాలు సాధారణ రైతాంగమే కాదు సమస్త ప్రజానీకం కూడా గ్రహించాల్సిందిగా అభిప్రాయపడుతున్నాను.

– కడియాల సుబ్బనాచారి,
నెల్లూరు

**మా**ణిక్యాపూర్, గౌరవెల్లి రెండు గ్రామాల ప్రజల జీవన విధానాన్ని, మార్పులను ప్రపంచానికి పరిచయం చేసినందుకు వీక్షణం పత్రికకు కృతజ్ఞతలు. 'ఊరి దారి' పుస్తకం గ్రామంలో బహుళజాతి సంస్థల దోపిడిని అరికట్టి, ఆ స్థానంలో స్థానిక స్వదేశీ ప్రభుత్వ రంగ పారిశ్రామిక ఉత్పత్తులు అందించగలిగితే దేశీయ పారిశ్రామికీరణ ఎంత సుస్థిరంగా ఉండగలదో చూపింది. జాతక కథలు, కౌటిల్యుని అర్థశాస్త్రం. డి.డి. కోశాంబి, కారల్‌మార్క్స్, మనుస్మృతి, కైఫియత్తులు, గ్రామ అధ్యయనాలు చేసిన రచయితల గురించి, పుస్తకాల గురించి వివరాలు తెలుపుతూ మా గ్రామాల అధ్యయనాన్ని ఆ నేపథ్యంలో పెట్టింది. నిజంగా ఇట్లాంటి అధ్యయనాలు జరగాలి. గ్రామీణ ప్రజలకు అర్థమయ్యేరీతిలో రాసినందుకు, పట్నం నుండి గ్రామానికి (మా పల్లెకు) ఎన్నోసార్లు వచ్చి ఇంటింటికీ తిరిగి ప్రజలను ఆప్యాయంగా పలకరిస్తూ మా ఊరిని అధ్యయనం చేసి, రాజకీయార్థిక పరిస్థితిని ప్రచురించినందుకు వీక్షణం పత్రికకు కృతజ్ఞులం. మా గ్రామ ప్రజలు వీక్షణం, 'ఊరి దారి' పుస్తకం చదివి మా ఊరి చరిత్ర, మా ఊరి కథ ఇంత ఉన్నదా అని సంతోష పడుతున్నారు. మాకు తెలియని విషయాలను ప్రపంచానికి తెలియచేసినందుకు వై. రామచంద్రం, డి.వి. రామకృష్ణ గార్లకు కృతజ్ఞతలు.

– ఉగ్గె శేఖర్,
మాణిక్యాపూర్

**డి**సెంబర్ వీక్షణంలో పి.జె.ఒ. రూర్కి 'డోంట్ వోట్, ఇట్ జస్ట్ ఎంకరేజస్ బాస్టర్డ్స్' అనే పుస్తకం గురించి చదివాక ఆ పుస్తకాన్ని తెలుగు పాఠకుల కోసం ఎవరైనా అనువాదం చేస్తే ఎంత బాగుండు అనే కోరిక కలిగింది. ఎవరైనా ఈ పని చేస్తారేమోనని వీక్షణం వంక చూడడం అత్యాశ కాదేమో. రంగనాయకమ్మ రాసిన 'శ్రమ శక్తి ఉపయోగపు విలువ' వ్యాసంపై కె. శ్రీనివాస్, టీచర్ – పిఠాపురం నుండి రాసిన ఉత్తరం చదివాను. రంగనాయకమ్మకు తట్టిన ఆలోచన మార్క్స్‌కు తట్టలేదని నేను అనుకోవడం లేదు. శ్రీనివాస్ అన్నట్లుగా 'ప్రూఫ్ బై కాంట్రడిక్షన్' అనే మెథడ్ ప్రకారమే రాశాడనిపిస్తుంది.

స్పెయిన్ దేశానికి చెందిన కమ్యూనిస్టు నమూనా గ్రామం మరినలెదా గురించి చదివాక ఈ రెండు మాటలు రాయాలనిపించింది. ఒక గ్రామంలో భూముల

(మిగతా 7వ పేజీలో...)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత

# డిసెంబర్ ఫలితాలు ఏప్రిల్ ఎన్నికలకు సూచికలేనా?



రాజస్థాన్, మధ్యప్రదేశ్, చత్తీస్‌గఢ్, ఢిల్లీ, మిజోరం రాష్ట్రాల శాసనసభలకు నవంబర్ – డిసెంబర్ లో జరిగిన ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 7–9ల్లో వెలువడ్డాయి. ఢిల్లీలో అధికారంలో ఉండిన కాంగ్రెస్ చిత్తుగా ఓడిపోయి గత శాసనసభ లోని 43 స్థానాల నుంచి 8 స్థానాలకు పడిపోయింది. కాంగ్రెస్ తో పోటీపడిన భారతీయ జనతా పార్టీకి కూడ ప్రభుత్వం స్థాపించేందుకు అవసరమైన ఆధికత్య రాలేదు. మూడో పార్టీగా కొత్తగా రంగంలోకి దిగిన ఆమ్ ఆద్మీ పార్టీకి కూడ ఆధిక్యత రాకపోయినా రెండో స్థానానికి చేరి, బైటి నుంచి కాంగ్రెస్ మద్దతుతో అధికారాన్ని చేపట్టింది. రాజస్థాన్‌లో అధికార కాంగ్రెస్ ను ఊడ్చేసి భారతీయ జనతా పార్టీ అధికారానికి వచ్చింది. మధ్య ప్రదేశ్, చత్తీస్ గఢ్ లలో భారతీయ జనతా పార్టీ, మిజోరంలో కాంగ్రెస్ తమ అధికారాన్ని నిలబెట్టుకున్నాయి.

అయితే ఈ గెలుపు ఓటములను ఈ అంతిమ ఫలితాలతో మాత్రమే చూడడానికి వీలులేదు. ఆయా పార్టీలు తెచ్చుకున్న వోట్ల సరళిని గత 2008 ఎన్నికలతో పోల్చి చూసినా, ఆమ్ ఆద్మీ పార్టీ వంటి కొత్త రాజకీయ పక్షపు ప్రవేశం గురించి చూసినా, గత మూడు వారాలుగా అతిశయోక్తులతో జరుగుతున్న విశ్లేషణలను చూసినా ప్రజలవైపు నుంచి గుర్తించదగిన, ఆలోచించవలసిన అంశాలెన్నో ఉన్నాయి.

మొట్టమొదట ఈ ఎన్నికల వోట్ల సరళిని పరిశీలిస్తే అన్ని ప్రధాన పార్టీల పట్ల సమానమైన ఆదరణ లేదా నిరాదరణ వ్యక్తమయిందని స్పష్టమవుతుంది. కాంగ్రెస్‌కు ఢిల్లీ, రాజస్థాన్‌లలో వోట్ల శాతం తగ్గి చత్తీస్‌గఢ్, మధ్యప్రదేశ్, మిజోరం లలో వోట్ల శాతం పెరిగింది. భారతీయ జనతా పార్టీకి మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లలో వోట్ల శాతం పెరిగి, ఢిల్లీ, చత్తీస్‌గఢ్‌లలో తగ్గింది. చాల చోట్ల బహుజన్ సమాజ్ పార్టీ వోట్ల శాతం భారీగా తగ్గింది. ఢిల్లీలో కొత్తగా ఏర్పడిన ఆమ్ ఆద్మీ పార్టీ పోటీ చేసిన మొదటి ఎన్నికలలోనే 32 శాతం వోట్లు సంపాదించుకుంది.

అంటే నిశితంగా పరిశీలిస్తే ఈ ఫలితాలలో ఏ ఒక్క పార్టీకీ అనుకూలంగా బలమైన గాలి లేదు. వోటింగ్ శాతం పెరిగిన చోట్ల కూడ అది స్థానిక సమస్యల మీద, అభ్యర్థుల మీద ఆధారపడి జరిగిందే తప్ప ఆయా పార్టీల విధానాలకు ఆమోదం కాదు. అసలు ప్రస్తుతం కొనసాగుతున్న పార్లమెంటరీ ఎన్నికల విధానమే ప్రజాభిప్రాయానికి నిజమైన సూచికగా ఉండడం లేదనే వాస్తవాన్ని గమనంలో ఉంచుకుని పరిశీలిస్తే, అన్ని పార్టీల విధానాల పట్ల ప్రజలలో వ్యతిరేకత ఉన్నదని స్పష్టమవుతుంది. అన్ని పార్టీలూ ప్రజావ్యతిరేక విధానాలే అవలంబిస్తున్నప్పటికీ, ఒక పార్టీ అభ్యర్థి స్థానిక సమస్యలను పరిష్కరిస్తారనే ఆశ ఉంటే, ఇతరేతర ఆకర్షణలు చూపితే గెలిచే అవకాశం ఉంది, దాన్ని పార్టీ గెలుపు కన్న అభ్యర్థి గెలుపు అనడమే వాస్తవం.

అలాగే అధికారంలో ఉన్నవారికి వ్యతిరేక వోటు అనే పాత నిర్ధారణ కూడ ఈ ఎన్నికలలో నిజం కాలేదు. అధికారంలో ఉన్నవారు ఒక చోట ఓడారు, మరొక చోట గెలిచారు. ఎన్నికలలో పార్టీల విధానాలే ప్రధానం కానప్పుడు కాంగ్రెస్ తరఫున రాహుల్ గాంధీ గాని, భారతీయ జనతా పార్టీ తరఫున నరేంద్ర మోడీ గాని ఈ ఎన్నికలను ప్రభావితం చేశారని కూడ చెప్పలేం.

మొత్తం మీద ఈ ఎన్నికలు 2014 సార్వత్రిక ఎన్నికలకు డ్రెస్ రిహార్సల్స్ అని, ఈ ఎన్నికలలో విజయం సాధించినట్టుగానే 2014 ఎన్నికలలో కూడ భాజపా నాయకత్వంలోని ఎన్‌డిఎ కూటమి అధికారం సాధిస్తుందని సంఘ పరివార్ నాయకులూ, మేధావులూ ఊహాగానాలు చేస్తున్నారు. మత విద్వేష రాజకీయాలను ప్రచారం చేసే భాజపా, నరేంద్ర మోడీ వంటి నరహంతకుడిని ప్రధానమంత్రి అభ్యర్థిగా ప్రకటించి ఈ ఎన్నికలకు వెళ్లదలచుకుంది. దేశాన్ని మత ప్రాతిపదిక మీద చీల్చి, అధికారం సంపాదించి, దేశాన్ని మరింతగా ప్రపంచీకరణ రథచక్రాలకు కట్టివేయదలచుకున్న భాజపా కలలు నిజం కావడం కష్టమని ఈ ఫలితాలే చూపుతున్నాయి. ఒక్క రాజస్థాన్‌లో మినహా మిగిలిన అన్ని చోట్లా భాజపా చెప్పుకోదగిన విజయాలేమీ సాధించలేదు. రాజస్థాన్‌లో కూడ కాంగ్రెస్ దుష్టపాలనకు వ్యతిరేకతే భాజపాను గెలిపించింది. అసలు భారత రాజకీయాలలోనే ప్రజలకు తాము ఎవరిని ఎక్కువ వ్యతిరేకిస్తున్నారో చెప్పే ప్రతికూల వోటు అవకాశమే తప్ప, ఎవరు కావాలనుకుంటున్నారో చెప్పే అనుకూల వోటు అవకాశం లేదు. అలాగే భారతీయ జనతాపార్టీ దుర్మార్గ రాజకీయాల గురించి మాట్లాడడమంటే ఎటువంటి పరిస్థితిలోనూ కాంగ్రెస్ పట్ల అనుకూలత కాదు. ప్రజావ్యతిరేక విధానాలలో, చివరికి మతోన్మాదం విషయంలో కూడ భాజపాకూ కాంగ్రెస్ కూ ఏమీ తేడా లేదు. కాకపోతే ఆ రెంటిలో ఒకదాని తర్వాత మరొకదాన్ని మార్చి చూడడం తప్ప ప్రజలకు మరొక ప్రత్యామ్నాయం లేదు.

సరిగ్గా ఈ ప్రత్యామ్నాయం లేదనే ప్రాతిపదిక మీదనే పాలకవర్గాలు ఆమ్ ఆద్మీ పార్టీ వంటి ప్రయోగాలు మొదలుపెట్టాయి. పార్లమెంటరీ పార్టీలన్నీ ఒకటే అనీ, వాటన్నిటినీ తోసివేయక తప్పదనీ ప్రజలు గుర్తిస్తున్న కొద్దీ, పార్లమెంటరీ వ్యవస్థ లోపలనే ప్రత్యామ్నాయం ఉందని భ్రమలు కల్పించి మరికొంతకాలం మనుగడ కొనసాగించడం ఈ వ్యవస్థ అవసరం. ఆ అవసరం నుంచే కార్పొరేట్ శక్తుల వెన్నుదన్నుతో, ఉన్నత మధ్యతరగతిని రంగస్థలం మీద ఉంచి, అవినీతి రహిత, పారదర్శక పాలన, నిరాడంబరత్వం వంటి మాయమాటలతో ఆమ్ ఆద్మీ పార్టీ ప్రయోగం మొదలయింది. ధరల పెరుగుదల వంటి నిజమైన ప్రజాసమస్యను తీసుకుని, దానికి కారణం అవినీతే అని చెప్పి, ఆమ్ ఆద్మీ పార్టీ ప్రజల మద్దతు సంపాదించగలిగింది. కాని ప్రపంచీకరణ విధానాలను, కార్పొరేట్ అవినీతిని మౌలికంగా ప్రశ్నించని ఆమ్ ఆద్మీ పార్టీ ప్రకటనలు బోలు సరుకు మాత్రమే. కాంగ్రెస్ మద్దతుతో ప్రభుత్వం స్థాపించడం ద్వారా తాము నిజమైన ప్రత్యామ్నాయం కాదని ఆమ్ ఆద్మీ పార్టీ తొందరగానే తనను తానే బహిర్గతం చేసుకున్నది.

భారత సమాజపు సమస్యలను పరిష్కరించే శక్తి గాని, కోరిక గాని పార్లమెంటరీ రాజకీయ పక్షాలలో ఏ ఒక్కదానికీ లేదు. ఆ వాస్తవాన్ని ప్రజలు గుర్తించే దాకా, ప్రేక్షకులు తెరలు చించి రంగస్థలం మీదికి దూకి, ఇప్పటిదాకా నటులుగా ఉన్నవారిని కిందికి లాగేదాకా ఈ నాటకాలు యథావిధిగా జరుగుతూనే ఉంటాయి.

వీ

# ఇష్టారాజ్యపు దౌర్జన్యమే రాజ్యాంగమా?

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో కోస్తా, రాయలసీమ సభ్యుల ప్రవర్తన చూస్తుంటే ఈ దేశ పరిపాలనను నిర్దేశించడానికి ఒక లిఖిత రాజ్యాంగం ఉన్నదని ఈ ఎన్నికైన ప్రజా ప్రతినిధులకు తెలుసునా అని అనుమానం కలుగుతున్నది, శాసనసభలో తమ అభిప్రాయాలు ప్రకటించడానికి, నిరసన తెల్పడానికి ప్రతి సభ్యుడికీ పూర్తి హక్కు ఉంది. కాని రాజ్యాంగం నిర్దేశించిన నిబంధనలను, సభామర్యాదలను ఉల్లంఘించి, అబద్ధాలతో ప్రజలను వంచించడానికి ఎవరికీ హక్కు లేదు. అధికరణం 3 మీద రాజ్యాంగ నిర్మాణ సభ చాల వివరంగా చర్చించిన తర్వాతనే, ఎప్పుడైనా ఒక రాష్ట్రం నుంచి వేరయిపోతామనే ప్రతిపాదన మైనారిటీ నుంచే వస్తుంది గనుక ఆ శాసనసభలో వారు ఎప్పుడూ గెలవలేరు గనుక ఆ ప్రతిపాదనను నేరుగా కేంద్ర ప్రభుత్వం చేయాలనే అంగీకారం కుదిరింది. కేంద్ర ప్రభుత్వానికి ఆ నిరంకుశాధికారం ఇవ్వడం సరికాదనే ఉద్దేశంతోనే రాష్ట్రపతి అనుమతితో మాత్రమే ఆ బిల్లు ప్రవేశపెట్టాలని, ఆ బిల్లు ప్రవేశానికి ముందర సంబంధిత శాసనసభ అభిప్రాయాలు తెలుసుకోవడానికి పంపించాలని అధికరణం 3 స్పష్టంగా నిర్దేశించింది. ఆ అధికరణాన్ని సుప్రీంకోర్టు కూడ ధృవీకరించింది. మరి డిసెంబర్ మొదటివారంలో రాష్ట్ర శాసనసభలో ఆ బిల్లుపై చర్చను అడ్డుకున్న, ఆ బిల్లును చింపివేసిన, తగులబెట్టిన శాసనసభ్యులకు వారు ఏ రాజ్యాంగం మీద ప్రమాణం చేసినందువల్ల శాసనసభ్యులయ్యారో ఆ రాజ్యాంగం మీద కనీస గౌరవం ఉన్నదా? తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావాలనే ఆకాంక్ష అనేక దశాబ్దాలుగా అనేక రూపాలలో వ్యక్తమయిన తర్వాత, 2004 ఎన్నికలలో, 2009 ఎన్నికలలో పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నీ కూడ అంగీకరించిన తర్వాత, 2009 నుంచి ఐదు సంవత్సరాలుగా తెలంగాణ ప్రాంతం అట్టుడికి పోయిన తర్వాత, జూలై 30న సిడబ్ల్యుసి తీర్మానం తర్వాత, ఇప్పుడు హఠాత్తుగా మేలుకొన్నట్టుగా విభజన పద్ధతిని వ్యతిరేకిస్తున్నామని అంటున్నవారి విజ్ఞత ఏమిటి? నా ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తాను అనడానికి సాధారణ పౌరులకైనా అవకాశం ఉంది గాని చట్టసభ సభ్యులకు ఆ అవకాశం లేదు. వారు చేసే ఏ పని అయినా, ఆడే ఏ మాట అయినా రాజ్యాంగబద్ధంగా ఉండవలసిందే. రాజ్యాంగ బద్ధంగానే రాష్ట్రపతి దగ్గరినుంచి అభిప్రాయ సేకరణ కోసం బిల్లు ఆంధ్రప్రదేశ్ శాసనసభకు వచ్చింది. దాని మీద ఏ అభిప్రాయమైనా చెప్పవచ్చు. నిజానికి ఆ బిల్లు ఇటు తెలంగాణ ప్రజల ఆకాంక్షలనూ, అటు కోస్తా, రాయలసీమ ప్రజల ఆకాంక్షలనూ కూడ ప్రతిబింబించడం లేదు. ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఆ విషయాలు చర్చించి, బిల్లుకు అర్థవంతమైన సవరణలు సూచించవచ్చు. ప్రస్తుత దశలో బిల్లును ఆపగలమని తమను తాము వంచించుకోవడం, ప్రజలను వంచించడానికి ప్రయత్నించడం కుటిల రాజకీయ క్రీడ మాత్రమే గాని ప్రజా ప్రయోజనాల పట్ల శ్రద్ధ కాదు. రాజకీయ నేతలను నీతికీ న్యాయానికీ ప్రజా సంక్షేమానికీ కట్టుబడి ఉండమని అడిగే రోజులు ఎప్పుడో పోయాయి గాని వారు ప్రమాణం చేసిన చట్టానికీ, రాజ్యాంగానికీ అయినా కట్టుబడి ఉండమని అడగవలసిన దుస్థితి వచ్చినట్టుంది.

వీ

# మండేలా - అనుకూల పాఠాలూ ప్రతికూల పాఠాలూ

దక్షిణాఫ్రికా జాతి వివక్ష వ్యతిరేక పోరాట యోధుడు, వలసానంతర దక్షిణాఫ్రికా అధ్యక్షుడు, నెల్సన్ రోలిహ్లాలా మండేలా తన 95వ ఏట డిసెంబర్ 6న మరణించాడు. శ్వేతజాతి దురహంకార పాలనకు వ్యతిరేకంగా అద్భుతమైన సాయుధ పోరాటం నడిపి, పాలకుల దమన నీతికి బలి అయి, 27 సంవత్సరాలు జైలు జీవితం గడిపి, పోరాటానికీ, పట్టుదలకూ, జాతి విముక్తికీ ఒకప్పుడు ప్రతీకగా నిలిచిన మండేలా మరణించే నాటికి ఆ ప్రతీక నుంచి చాల దూరమయ్యాడు. ఒకప్పుడు ఆయనను హత్య చేయించడానికి, సుదీర్ఘకాలం జైలులో నిర్బంధించడానికి కారణమైన వాళ్లూ, ఇవాళ్టికీ ఆయన దారిలో నడుస్తున్న పోరాటాలను నెత్తురుటేర్లలో ముంచుతున్న వాళ్లూ ఇవాళ ఆయనను సంస్మరిస్తున్నారంటే ఆయన ప్రయాణం ఎక్కడిదాకా సాగిందో అర్థమవుతుంది. దక్షిణాఫ్రికాలో జాతివివక్ష పాలన అంతమై, 1994లో అధ్యక్షుడుగా పదవి స్వీకరించగానే, అప్పటివరకూ అత్యంత అమానవీయమైన దుర్మార్గాలు జరిపిన వారిని క్షమించడంలో గాని, పాత పాలకుల కనుసన్నలలో ప్రపంచీకరణ విధానాలను తలకెత్తుకోవడంలో గాని మండేలా తన గతాన్ని తానే తుడిచేసుకునే ప్రక్రియ ప్రారంభించాడు. ఆ తర్వాత ఇరవై సంవత్సరాలు గడిచాయి. దక్షిణాఫ్రికా జాతి విముక్తి పోరాటంలో స్వయంగా తాను, తన నాయకత్వంలోని ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్, తాను నడిపిన సాయుధ పోరాట సంస్థ ఉంకోటో విసిజ్వె ఏ ఆదర్శాలను ప్రకటించారో, ఆ ఆదర్శాలన్నిటినీ తానే భూస్థాపితం చేసి, దక్షిణాఫ్రికా జనజీవితంలో ఏ మార్పూ లేని స్థితి కల్పించాడు. అంటే నెల్సన్ మండేలా జీవితంలో ప్రజానుకూల భాగమూ ఉంది, ప్రజా వ్యతిరేక భాగమూ ఉంది. ఆయన జీవితం నుంచి గ్రహించవలసిన అనుకూల పాఠాలూ ఉన్నాయి, ప్రతికూల పాఠాలూ ఉన్నాయి. అంత పరిశీలన చేసే ఓపిక లేకపోయినా బారక్ ఒబామా, మహింద రాజపక్సె, మన్మోహన్ సింగ్ వంటి ప్రజావ్యతిరేక పాలకుల ప్రశంసలు చూరగొంటున్న మండేలాను ఇవాళ ఎలా చూడాలనే అంశంలో చాలమంది పొరపడుతు న్నట్టున్నారు. భారతదేశంలోని, తెలుగు సీమలోని ప్రగతిశీల వాదులు, చివరికి తమను తాము విప్లవకారులుగా పిలుచుకునేవారు కూడ మండేలా గురించి చేసిన ప్రకటనలు ఆశ్చర్యకరంగా ఉన్నాయి. చనిపోయేనాటిదాకా మండేలా విప్లవకారుడిగా జీవించాడన్నట్టుగా, మండేలా నిత్యపోరాట స్ఫూర్తి అన్నట్టుగా వ్యాఖ్యలు వెలువడ్డాయి. పరాయి పాలనలో మగ్గిపోతున్న దక్షిణాఫ్రికాలో యువకుడిగా జాతి విముక్తి పోరాటంలోకి దూకిన 1942 నుంచి, 1960లలో సాయుధ పోరాటానికి నాయకత్వం వహించిన నాటి నుంచి, వీరోచితంగా దమనకాండను ఎదుర్కొని రెండున్నర దశాబ్దాలు నిర్బంధాన్ని భరించిన దాకా మండేలా జీవితం ఆదర్శప్రాయమైనదే. ప్రపంచంలోని ప్రజానుకూల కార్యకర్తలూ, ఆలోచనాపరులూ నమూనాగా గ్రహించవలసిందే. కాని, అధికారంకోసం ఆదర్శాలను పణంగా పెట్టడం ప్రారంభమైన నాటి నుంచి, వాస్తవంగా అధికారంలో కొనసాగిన రోజుల దాకా, ఆ తర్వాత అధికారంలో లేకపోయినా విధాన నిర్ణయ సారథిగా చివరి దాకా సాగిన మండేలా ఒక ప్రజాపోరాటం ఎలా నడపాలో చూడ డానికీ, ఎక్కడ దారితప్పగలదో చూడడానికీ ఉదాహరణగా నిలిచాడు. పోరాటయోధుడు మండేలాకు జోహార్లు చెపుతూనే, ఆయన నాయకత్వం లోనే జరిగిన విద్రోహం గురించి కూడ జాగ్రత్త వహించవలసి ఉంది.

వీ



❖ **లెనిన్ జీవిత కథలు** – పిల్లల కోసం – మహీధర జగన్మోహన రావు – కావ్య పబ్లిషింగ్‌హౌస్ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : మంచి పుస్తకం, తార్నాక, సికింద్రాబాద్, సెల్: 9490746614; email : info@manchipustakam.in; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; నవోదయ బుక్‌హౌస్; మైత్రీ బుక్‌హౌస్



❖ **గురి** – గుండెబోయిన శ్రీనివాస్ – చెలిమి సాహిత్య సాంస్కృతిక వేదిక – 40 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: గుండెబోయిన శ్రీనివాస్, ఇ.నెం. 3-1-74/1/ఎ, కాకతీయ కాలనీ, హనమకొండ – 506011, వరంగల్, సెల్ : 9985194697



❖ **సామాజిక రాజకీయ విశ్లేషణ బహుజన దర్శనం** – డా. కత్తి పద్మారావు – లోకాయత ప్రచురణలు – 222 పేజీలు, 1/8 డెమీ, రు. 150, గ్రంథాలయ ప్రతి రు. 300, ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, లుంబినీ వనం, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు – 522 124, ఫోన్: 08643-42840, సెల్ : 98497 41695, email : padmaraokathi@yahoo.co.in



❖ **నేను తెలంగాణోన్ని మాట్లాడుతున్న** – కాశీం – స్నేహ ప్రచురణలు – 296 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **ప్రజాస్వామ్య తెలంగాణ** – చారిత్రక పత్రాలు – నడుస్తున్న తెలంగాణ ప్రచురణలు – 140 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **అలుపెరుగని ప్రజా పోరాట యోధుడు కా. మాదాల నారాయణ స్వామి** (1914-2013) – సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ ప్రచురణ – 82 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: ప్రజాపంథా, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 44; సహచర బుక్‌హౌస్; దిశ బుక్‌హౌస్; నవోదయ బుక్‌హౌస్; మైత్రి బుక్‌స్టాల్; విశాలాంధ్ర అన్ని బ్రాంచిలలో



❖ **నేల జారని ఊడలు** – ఎస్.ఎం. ప్రాణ్‌రావ్ – 191 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఎస్.ఎం. ప్రాణ్‌రావ్, 9-14/1, రవీంద్రనగర్ కాలనీ, హబ్సిగూడ, హైదరాబాద్ – 500 007; విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **ఈ కోతి ఈ డ్రామాకు పనికొస్తుందా?** – అసంబద్ధ నాటిక – నాయుని కృష్ణమూర్తి – వియన్నార్ బుక్‌వరల్డ్ – 51 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: వివిఎన్‌ఆర్ బుక్ వరల్డ్, చౌడేపల్లి – 517 257, చిత్తూరు జిల్లా



❖ **రియాలిటీ చెక్ (కొన్ని కిటికి ప్రయాణాలు)** – పూదూరి రాజిరెడ్డి – తెనాలి ప్రచురణలు – 365 పేజీలు, 1/8 డెమీ, రు. 250, ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు



❖ **కార్మికవర్గ పుత్రుడు** – వు యన్ టు స్వీయ చరిత్ర – తెలుగు అనువాదం: ప్రగతి – విప్లవ రచయితల సంఘం ప్రచురణ – 151 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **వార్తల వెనుక కథ** – సంపాదకులు: కె. రామచంద్రమూర్తి, కట్టా శేఖర్‌రెడ్డి – న్యూ మీడియా కమ్యూనికేషన్స్ ప్రచురణ – 373 పేజీలు, 1/8 డెమీ, రు. 250, ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్; ప్రజాశక్తి బుక్‌హౌస్; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **కాశీబుగ్గ** (కథలు) – ఈతకోట సుబ్బారావు – 122 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: ఈతకోట సుబ్బారావు, ఇ.నెం. 24-ii-1697, రెండవ వీధి, రవీంద్ర నగర్, నెల్లూరు – 524 004; సెల్: 9440529785; email : ethakotas@yahoo.com

---

*(...4వ పేజీ తరువాయి)*

*ఆక్రమణ జరిగి కమ్యూన్ నమూనాలో అక్కడి సమాజానికి భిన్నమైన అభివృద్ధి నమూనా అమలు జరుగుతున్న అక్కడి పాలక వర్గాలు దానిని అడ్డుకోకుండా ఎలా మిన్నకుండి పోయాయి. అదే మన దేశంలో దండకారణ్యంలో భ్రూణ రూపంలో కొనసాగుతున్న కమ్యూన్ తరహా ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను మొలకలోనే తుంచేయాలని సల్వాజుడం, గ్రీన్‌హంట్ నిర్బంధ అభియాన్లు కొనసాగించి రక్తపుటేరుల్లో ముంచెత్తుతున్నాయి పాలక వర్గాలు. ఈ రెండింటి మధ్య తేడా ఎందుకుందో తెలుసుకోవడం అవసరం. పాలక వర్గాలైన దోపిడి వర్గాలు (భూస్వామ్య, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాదులు) ప్రపంచంలో ఎక్కడైనా ఒకే స్వభావం కలిగి ఉంటాయి. ఇందులో సందేహం అవసరం లేదు. ఎక్కడైనా పాలక వర్గాలు చూసేది ఈ ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను నడుపుతున్న శక్తులేమిటి? వాటి పొలిటికల్ విజన్ ఏమిటి? అవి సంస్కరణవాద దృష్టి కలిగి ఒకటి, రెండు గ్రామాలకే పరిమితమైనవా? ఈ వ్యవస్థనే సమూలంగా మార్చేంతా ప్రమాదకరమైనవా? అనే కోణంలోంచి పరిశీలిస్తాయి. అలాంటి అభివృద్ధి నమూనాలు కొంత మంది వ్యక్తుల నాయకత్వంలోనో, ఏ ఎన్‌జిఒల నాయకత్వంలోనో, ఏ అన్నా హజారేల నాయకత్వం లోనో జరిగితే దానిని ధ్వంసం చేయవు. కావల్సితే జైరాం రమేష్ లాంటి వాళ్ల ద్వారా ప్రభుత్వమే దానిని పొగిడిస్తుంది. మహారాష్ట్రలోని కోత్రమెంద గ్రామం అభివృద్ధి గురించి జైరాం రమేష్ పొగడ్తలు పాఠకులు చదివే ఉంటారు. అదే అబూజ్‌మాడ్‌లోనో, దంతెవాడ, బిజాపూర్‌ల్లోనో స్పష్టమైన రాజకీయ లక్ష్యం కలిగిన ఎం.ఎల్.ఎం సిద్ధాంత ఆయుధంతో సాయుధమైన పార్టీ నాయకత్వంలో ఆ అభివృద్ధి నమూనా కొనసాగితే అది 20 ఇండ్లు గల చిన్న గూడెం అయినా అక్కడ జరిగే ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను రాజ్యం ససేమిరా సహించదు. ఒక చిన్న గ్రామంలో అలాంటి అభివృద్ధి నమూనాను నిలబెట్టుకోవడం కోసం దానిని ధ్వంసం చేయబూనుకునే రాజ్యాన్ని ధ్వంసం చేసే యుద్ధంతో ముడిపడి ఉంటుంది. ఈ స్పష్టతతోనే స్పెయిన్ నమూనా గ్రామాన్ని పరిశీలించాలి.*

**– నటాషా**

*(వీక్షణం బ్లాగ్ www.veekshanam.wordpress.com పై పోస్ట్ చేసిన వ్యాఖ్య)* వీ

## మండే సత్యం మృతి

విప్లవ గేయ రచయిత మండే సత్యం (80) నవంబర్ 26న హైదరాబాద్‌లోని ప్రైవేట్ హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ గుండెపోటుతో చనిపోయారు. ఆయన నల్లగొండలోని భువనగిరిలో 1933లో జన్మించారు. ఆయన ఎర్రసైన్యం, చీమల దండు, దళం మొదలైన సినిమాలకు పాటలు రాశారు.

## ఎఐఎస్ఎఫ్ మహా సభలు

అఖిల భారత విద్యార్థి సమైక్య (ఎఐఎస్ఎఫ్) 28వ మహా సభలు హైదరాబాదులోని ఉస్మానియా యూనివర్సిటీ ఠాగూరు ఆడిటోరియం లో నవంబర్ 28, 29 తేదీలలో జరిగాయి. ఈ సభల్లో పాల్గొన్న వక్తలు నూతన ఆర్థిక విధానాలకు, ప్రైవేట్ విద్యా విధానాలకు వ్యతిరేకంగా మాట్లాడారు. ఈ సభలకు ఒయు విసి. సత్యనారాయణ, ప్రొ. జి.హరగోపాల్, సిపిఐ కేంద్ర కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి, సిపిఐ రాష్ట్ర కార్యదర్శి కె. నారాయణ, ప్రొ. కె. నాగేశ్వర్, సంగీత దర్శకులు వందేమాతరం శ్రీనివాస్, సినీ దర్శకులు మాదాల రవిలతో పాటు వివిధ రాష్ట్రాల విద్యార్థి సంఘాల నాయకులు, విద్యార్థులు పాల్గొన్నారు.

## సినీ నటుడు ధర్మవరపు సుబ్రమణ్యం మృతి

సినీ హాస్యనటుడు ధర్మవరపు సుబ్రమణ్యం (53) డిసెంబర్ 7న హైదరాబాదులోని ప్రైవేట్ హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ చనిపోయారు. ఆయన 1960 ఆగస్టు 9న ప్రకాశం జిల్లా, బల్లకురువ మండలం, కొన్నినేనివారి పాలెంలో జన్మించారు. ఆయన 300 పైగా సినిమాల్లో నటించారు.

## క్షిపణి ప్రయోగాలపై గిరిజనుల తిరుగుబాటు

నల్లగొండ, రంగారెడ్డి జిల్లాల సరిహద్దులో భారత్ డైనమిక్ లిమిటెడ్ (బిడిఎల్) ఆధ్వర్యంలో ఏర్పాటు చేస్తున్న రాచకొండ ఫీల్డ్ ఫైరింగ్ రేంజ్ (ఆర్ఎఫ్ఎఫ్ఆర్) సంస్థపై అవగాహన నిర్వహించడానికి వచ్చిన అధికారులపై డిసెంబర్ 4న గిరిజన ప్రజలు తిరగబడ్డారు. రోడ్‌కు అడ్డంగా కట్టెలు వేసి తగులబెట్టి నిరసన తెలిపారు. కొంత మంది గిరిజనులు ఒంటిపై కిరోసిన్ పోసుకొని అధికారులపై చల్లి 'మేము చచ్చి మిమ్ములను చంపుతాం' అని హెచ్చరించారు. అధికారుల వాహనాలను ధ్వంసం చేశారు.

## మాదాల నారాయణస్వామి మృతి

తొలితరం కమ్యూనిస్టు నాయకులు, సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ కేంద్ర కమిటీ సభ్యులు మాదాల నారాయణ స్వామి (99) డిసెంబర్ 9న గుంటూరులో చనిపోయారు. ఆయన 1914 ఫిబ్రవరి 13న ప్రకాశం జిల్లా, సంతనూతలపాడు మండలం, మైనంనాడు గ్రామంలో జన్మించారు. ఆయన ప్రజాపంథా పత్రిక సంపాదకు లుగా, అఖిల భారత రైతు కూలీ సంఘం అధ్యక్షులుగా పని చేశారు.

## రావెళ్ల వెంకట రామారావు మృతి

తెలంగాణ గేయ రచయిత, అభ్యుదయ కవి నిజాం వ్యతిరేక పోరాట యోధులు రావెళ్ల వెంకట రామారావు (86) డిసెంబర్ 10న చనిపోయారు. ఆయనది ఖమ్మం జిల్లా, ముదిగొండ మండలం, గోకినేపల్లి గ్రామం. ఆయన పద్య, వచన, గేయ కవిత్వం రాశాడు, పల్లె భారతి, జీవనరాగం, అనల తల్పం, రాగజ్యోతులు మొదలైన కవిత సంకలనాలు రాశారు.

## అసెంబ్లీకి తెలంగాణ బిల్లు

రాష్ట్ర అసెంబ్లీ శీతాకాల సమావేశాలు డిసెంబర్ 12న ప్రారంభ మయ్యాయి. రాష్ట్రపతి రాష్ట్ర పునవ్యవస్థీకరణ బిల్లు – 2013 డిసెంబర్ 12న స్పీకర్‌కు పంపించారు. ఈ బిల్లుపై చర్చించేందుకు అసెంబ్లీకి 40 రోజుల గడువు ఇచ్చారు. డిసెంబర్ 16న స్పీకర్ బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టారు. అసెంబ్లీలో స్పీకర్ నాదేండ్ల మనోహర్, మండలిలో చైర్మన్ చక్రపాణి బిల్లు ప్రవేశపెట్టారు. రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా నిరసన తెలుపుతున్న ఆంధ్ర, రాయలసీమ శాసనసభ్యులు, బిల్లు ప్రతులను చించి, తగులబెట్టారు. దీంతో బిల్లుపై చర్చ జరగకుండానే సమావేశాలు వాయిదాపడ్డాయి.

## అటవీ అధికారుల హత్య

చిత్తూరు జిల్లాలోని శేషచలం అడవుల్లోని పెద్దబండ చేను అటవీ ప్రాంతంలో డిసెంబర్ 14న స్మగ్లింగ్ కార్యకలాపాలను అడ్డుకునేందుకు వెళ్లిన అటవీ అధికారులపై ఎర్ర చందనం స్మగ్లర్లు దాడి చేశారు. స్మగ్లర్లు గొడ్డళ్లు, కర్రలతో దాడి చేయడంతో డిప్యూటీ రేంజ్ ఆఫీసర్ ఎ.ఆర్. శ్రీధర్, అసిస్టెంట్ బీట్ ఆఫీసర్ డేవిడ్ కరుణాకర్ మరణించారు. మరో నలుగురు సిబ్బంది తీవ్రంగా గాయపడ్డారు. అక్రమంగా ఎర్ర చందనం చెట్లు నరుకుతున్న దాదాపు వంద మంది ఈ దాడిలో పాల్గొన్నారు.

## బిసి సింహ గర్జన సభ

బిసి సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో డిసెంబర్ 15న హైదరాబాదు లోని నిజాం కాలేజ్ గ్రౌండ్‌లో 'బిసి సింహ గర్జన' సభ జరిగింది. ఈ సభలో బిసి సంఘం అధ్యక్షులు ఆర్. కృష్ణయ్య మాట్లాడుతూ బిసిలకు చట్ట సభల్లో 50 శాతం వాటా ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఈ సభకు మాజీ సిఎం నారా చంద్రబాబు నాయుడు, టిఆర్ఎస్ జనరల్ సెక్రెటరీ కేశవరావు, రాష్ట్ర ఐటి మంత్రి పొన్నాల లక్ష్మయ్య, ఎంపిలు పొన్నం ప్రభాకర్, అంజన్ కుమార్ యాదవ్, వి.హనుమంతరావు, రాపోలు ఆనంద భాస్కర్, బిజెపి నాయకులు బండారు దత్తాత్రేయలతో పాటు అనేక మంది బిసి సంఘాల నాయకులు ఈ సభకు హాజరయ్యారు.

## హైదరాబాదు బుక్ ఫెయిర్

నేషనల్ బుక్ ట్రస్టు ఆధ్వర్యంలో హైదరాబాదులోని ఎన్‌టిఆర్ స్టేడియంలో డిసెంబర్ 7 నుంచి 15 వరకు హైదరాబాదు బుక్‌ఫెయిర్ జరిగింది. ఈ బుక్ ఫెయిర్‌లో మొత్తం 275 బుక్ స్టాల్స్ పాల్గొన్నాయి. దీని ప్రారంభోత్సవానికి ముఖ్య అతిథులుగా రాష్ట్ర గవర్నర్ నరసింహన్, ప్రముఖ విద్యావేత్త చుక్కా రామయ్య, ఆంధ్రజ్యోతి ఎడిటర్ కె. శ్రీనివాస్ హాజరయ్యారు. పలు పుస్తకాల ఆవిష్కరణలు జరిగాయి. వీ

# ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

***ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల ఫలితాలను విశ్లేషిస్తూ, అధిక ధరలూ, ప్రజా వ్యతిరేక విధానాలూ పార్టీల జయాపజయాలపై ప్రభావం చూపాయని అంటున్నారు* సి. రాజశేఖర్**

రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ, చత్తీస్‌గఢ్, మిజోరం రాష్ట్రాల అసెంబ్లీల ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 8, 9 తేదీలలో వెలువడ్డాయి. 2014లో జరగబోయే సార్వత్రిక లోక్‌సభ ఎన్నికలకు ముందు జరిగిన ఈ ఎన్నికలు చాలా ఆసక్తికరంగా నడిచాయి. ఈ ఫలితాలు రేపు జరగబోయే లోక్‌సభ ఎన్నికలపై ఎంత ప్రభావం చూపుతాయో వేచి చూడాలి.

ఈ ఎన్నికలలో స్పష్టంగా కనిపించిన అంశం కాంగ్రెస్ వ్యతిరేకత. ప్రజలు కాంగ్రెస్ పాలనలో పెరిగిన అవినీతి, నిత్యావసర ధరలు, ప్రజా వ్యతిరేక విధానాలు ఈ ఎన్నికల ఫలితాలపై రాష్ట్ర సమస్యలకన్నా మొత్తం దేశం ఎదుర్కొంటున్న అవినీతి, అధిక ధరలు చాలా ప్రభావం చూపాయి. ఎన్నికలు జరిగిన ఐదు రాష్ట్రాల్లో మూడు రాష్ట్రాలను భారతీయ జనతా పార్టీ (బిజెపి) గెలుచుకుంది. రాజస్థాన్, మధ్యప్రదేశ్, చత్తీస్‌గఢ్‌లలో బిజెపి గెలువగా, ఢిల్లీలో ఏ పార్టీకి సంపూర్ణ ఆధిక్యం రాలేదు. మిజోరంలో కాంగ్రెస్ తిరిగి అధికారాన్ని చేజిక్కించుకుంది.

**రాజస్థాన్**

రాజస్థాన్ కోటను బిజెపి కైవసం చేసుకుంది. 199 అసెంబ్లీ స్థానాలకు జరిగిన పోటీలో బిజెపి 162 (2008లో 78) సీట్లు గెలుచుకుని పూర్తి ఆధిక్యాన్ని ప్రదర్శించింది. కాంగ్రెస్‌కు 21 (2008లో 96) సీట్లు మాత్రమే వచ్చాయి. రాజస్థాన్ అసెంబ్లీ ఎన్నికల చరిత్రలో ఇది కాంగ్రెస్‌కు ఘోర పరాభావం. బిజెపికి 46 శాతం ఓట్లు పోలయ్యాయి. వైద్య, పర్యాటక సహా పలువురు మంత్రులు సైతం ఓటమి పాలయ్యారు. అరవై ఏళ్ల వసుంధర రాజె మరోసారి ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించారు. కాంగ్రెస్ పతనానికి సొంత కాంగ్రెస్ పార్టీయే ముఖ్య కారణమని ఆ పార్టీకే చెందిన నాయకులు విమర్శించారు.

ఇక బిజెపి తరఫున ఈ ఎన్నికలలో నరేంద్ర మోడీ ప్రచార మంత్రం కూడా బాగా పనిచేసింది. వచ్చే సార్వత్రిక ఎన్నికలలో బిజెపి ప్రధానమంత్రిగా ఎన్నికయిన మోడీ సుడిగాలి ప్రచారం చేశాడు. కాంగ్రెస్ నాయకురాలు సోనియా గాంధీ, రాహుల్ గాంధీ ప్రచారం చేసినా అంతగా ప్రభావం చూపలేకపోయింది.

ఈ ఎన్నికలలో ఓటింగ్ శాతం పెరిగింది. 2008 ఎన్నికలలో 67 శాతం ఓటర్లు పాల్గొనగా, ఈ ఎన్నికలలో అది 75 శాతానికి చేరింది. మొత్తం 199 స్థానాలకు 2097 మంది ఎన్నికల బరిలో నిలబడ్డారు. నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల, రైతులు పండించిన పంటలకు కనీస మద్దతు ధర ప్రకటించడంలో అశోక్ గెహ్లాట్ ప్రభుత్వం విఫలమైంది. ఇక ఈ ఎన్నికలలో ఉల్లిగడ్డల ధరల పెరుదల చాలా ప్రభావాన్ని చూపింది. నాలుగు నెలలుగా ఉల్లిగడ్డల ధరలు 80 నుంచి వంద రూపాయల వరకు చేరింది. మంత్రులపై, అధికారులపై వచ్చిన అత్యాచారం, లైంగిక ఆరోపణలు కూడా ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేశాయి. ఇది సామాన్య ప్రజల నుంచి ఉన్నత మధ్యతరగతి ప్రజల వరకు ప్రభుత్వం మీద వ్యతిరేకత ఏర్పడేలా చేసింది. గ్రామీణ ప్రజలకు కాంగ్రెస్ చేరువ కాలేకపోయింది. ముఖ్యంగా మంత్రులపై వచ్చిన అత్యాచారం, లైంగిక ఆరోపణలు బిజెపి అభ్యర్థి వసుంధర రాజె బాగా ఉపయోగించుకున్నారు. ఈ ఎన్నికల ఫలితాలను బిజెపి లోక్‌సభ స్థానాలకు జరిగే పోటీలో ఉపయోగించుకుని మొత్తం 25 సీట్లు గెలవాలనే లక్ష్యంతో ముందుకు సాగాలని చూస్తోంది.

**మధ్యప్రదేశ్**

మధ్యప్రదేశ్‌లో శివరాజ్ సింగ్ చౌహాన్ హ్యాట్రిక్ సాధించారు. 230 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరగగా బిజెపి ఏకంగా 165 స్థానాలను గెలుచుకుంది. 2008 కంటే 22 స్థానాలను ఎక్కువగా గెలుచుకుంది. కాంగ్రెస్ 58 (2008లో 71) స్థానాలతో సరిపెట్టుకుంటే, బిఎస్‌పి 4 (2008లో 7) స్థానాలు గెలుచుకుంది. ఇతరులు మూడు స్థానాలలో గెలుపొందారు. ఈ ఎన్నికలలో 72.52 శాతం పోలింగ్ నమోదయింది.

మధ్యప్రదేశ్‌లో బిజెపికి విజయం నల్లేరుపై నడకలా ఉంటుందని అందరూ ఊహించినదే. కాని కాంగ్రెస్ ఇంతలా ఘోర పరాజయం పొందుతుందని ఊహించలేదు. ముఖ్యంగా చౌహాన్ ప్రభుత్వంలోని మంత్రులు, అధికారుల అవినీతి ప్రజలలో ప్రభుత్వంపై తీవ్ర వ్యతిరేక భావాన్ని పెంచింది. గత ఐదేళ్లలో మధ్యప్రదేశ్‌లోని ఎంతోమంది అధికారులను అవినీతి నిరోధక శాఖ అరెస్టు చేసింది. ఒక్కొక్క అధికారి వందల కోట్లు కూడబెట్టిన వాళ్లే. వాళ్ల ఆస్తులను చూసిన రాజకీయ నాయకులు సైతం ఆశ్చర్యపోవాల్సి వచ్చింది. మంత్రుల అవినీతి కూడా దీనికి తోడైంది. దీనికి సంకేతంగానే పది మంది సిట్టింగ్ మంత్రులు ఓడిపోయారు.

ప్రభుత్వ పాలన అన్ని రంగాలలో వైఫల్యం చెందింది. శాంతి భద్రతలు క్షీణించాయి. ప్రభుత్వం వాగ్దానం చేసిన విద్యుత్తు, రోడ్డు, నీరు లాంటి మౌలిక అవసరాలను తీర్చడంలో కూడా విఫలమైంది. ఇది ఎన్నికల మీద ప్రభావం చూపుతుందని కాంగ్రెస్ ఆశించింది. కాని కేంద్రంలో కాంగ్రెస్ పాలనలో అవినీతి, అధిక ధరల పెరుగుదల, మహిళలపై దౌర్జన్యాలు, లైంగిక దాడులు పెరగడం వంటి ప్రజా వ్యతిరేక అంశాలు రాష్ట్ర ఎన్నికల ఫలితాలలో ఆ పార్టీని దెబ్బతీశాయి. ఇది రాష్ట్ర ఎన్నికలలో ప్రజలు బిజెపికే మళ్లీ పట్టం కట్టేలా చేసింది. దీనికి రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీలో అంతర్గత కుమ్ములాట కూడా ఒక కారణం అయింది. జ్యోతిరాదిత్య సింధియాకు ఎన్నికల బాధ్యత అప్పజెప్పడం అక్కడి సీనియర్ కాంగ్రెస్ నాయకులకు ఆమోదం కాలేదు. నాయకుల మధ్య సమన్వయ లోపం, అంతర్గత కుమ్ములాటలు ఇలా అన్ని అంశాలు కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా పనిచేశాయి. కాంగ్రెస్ ఘోరపరాజయానికి కారణమయ్యాయి.

**ఢిల్లీ**

ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు దేశ రాజకీయాల్లో ఒక సంచలనాన్ని సృష్టించాయి. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్, బిజెపి మధ్య తీవ్ర పోటీ ఉంటుందని అందరూ ఊహించారు. కాని కొత్తగా ఆవిర్భవించిన ఆమ్ ఆద్మీ పార్టీ (ఎఎపి) అందరి అంచనాలను తలకిందులు చేస్తూ రెండవ అతిపెద్ద పార్టీగా ఆవిర్భవించింది. మొత్తం 70 అసెంబ్లీ స్థానాలలో బిజెపి 31 (2008లో 23), కాంగ్రెస్ 8 (2008లో 43), ఎఎపి 28, శిరోమణి అకాలీ దళ్ 1, జనతాదళ్ 1, ఇతరులు 1 గెలుచుకున్నాయి.

మిగతా ఎన్నికలు జరిగిన రాష్ట్రాలలో నరేంద్ర మోడీ ప్రభావం ఉన్నా దేశ రాజధాని ఢిల్లీ నగరంలో మాత్రం ఆ ప్రభావం ఏమాత్రం చూపలేదు. మూడు పర్యాయాలు తిరుగులేని ఆధిపత్యం చూపించిన షీలాదీక్షిత్ ప్రభుత్వం ఈ ఎన్నికలలో ఘోరపరాజయాన్ని చవిచూసింది. దీనికి కేంద్ర, రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వ పాలనే ముఖ్య కారణం. రోజు రోజుకూ పెరిగిపోతున్న నిత్యావసరాల ధరలూ, మహిళలపై అత్యాచారాలూ, అవినీతి, అరాచకాలతో ఢిల్లీ ప్రజలు విసిగిపోయారు. గత ఏడాది బస్సులో యువతిపై జరిగిన సామూహిక అత్యాచారం దేశం మొత్తాన్ని కుదిపేసింది. ప్రభుత్వంపై తీవ్ర వ్యతిరేకతను ప్రకటిస్తూ ప్రజలు వీధుల్లోకి వచ్చి నిరసన ప్రదర్శనలు చేపట్టినప్పుడు షీలాదీక్షిత్ ప్రభుత్వం దాన్ని అణచివేయడానికి దుర్మార్గ చర్యలకు పాల్పడింది. ఇది ప్రజల్లో ప్రభుత్వంపై ఇంకా తీవ్ర ఆగ్రహానికి గురిచేసింది.

ఇక అన్నా హజారేతో కలిసి జన్ లోక్‌పాల్ బిల్లు కోసం ఉద్యమించిన వారిలో ఐఆర్ఎస్ అధికారి అరవింద్ కేజ్రీవాల్ ఒకరు. అన్నా హజారేతో విభేదాల కారణంగా విడిపోయి, నవంబర్ 2012లో ఆమ్ ఆద్మీ పార్టీ పేరుతో కొత్త రాజకీయ పార్టీని ఏర్పాటు చేశారు.

అవినీతి నిర్మూలన, నిరుపేద, బడుగు వర్గాలకు విద్యుత్తు రాయితీలు, రోజుకు 700 మిల్లీలీటర్ల తాగునీరు ఉచితం లాంటి వాగ్దానాలతో ఎన్నికల బరిలోకి దిగారు కేజ్రీవాల్. ఎన్నికల ప్రచారంలో కూడా కొత్త పంథాలను అవలంబించారు. సోషల్ మీడియాలో ప్రచారంతో యువతను ఆకట్టుకున్నారు. కాంగ్రెస్ పాలనతో విసిగిన మధ్యతరగతి ప్రజలకు ఆమ్ ఆద్మీ పార్టీ కొత్త ఆశలను కలుగజేసింది.

కాంగ్రెస్ పార్టీ ఓటమికి ప్రధాన కారణం అధిక ధరలూ, అవినీతి, మహిళలపై అత్యాచారాలు, లైంగిక వేధింపులు ఎక్కువ కావడం. ఈ అంశాలను కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ప్రజల్లోకి ఆమ్ ఆద్మీ పార్టీ బాగా ప్రచారం చేసింది. పదిహేనేళ్లుగా అధికారంలో ఉండి కూడా అటు మధ్యతరగతి ప్రజానీకానికీ, ఇటు నిరుపేద, బలహీనవర్గాలకూ చేరువ కాలేకపోయింది. కార్పొరేట్ వర్గాలకూ, బహుళజాతి కంపెనీలకూ అనుకూల విధానాలను అవలంబించింది.

మరోవైపు బిజెపి ఈ ఎన్నికలను ప్రతిష్ఠాత్మకంగా తీసుకుంది. కాంగ్రెస్‌పై వ్యతిరేకతను తనకు అనుకూలంగా మార్చుకోవడానికి తీవ్రంగా ప్రయత్నించింది. నరేంద్రమోడీతో పెద్ద ఎత్తున ప్రచారం చేయించి ప్రజలను ప్రభావితం చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేసింది. మోడి ప్రభంజనం ఢిల్లీలో కనిపించలేదు. కేంద్రంలో బిజెపి ప్రభుత్వం అధికారంలోకి రావడానికి ఢిల్లీలో ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఎంతో ప్రాధాన్యతనిస్తుంది.

ఏ పార్టీకి సంపూర్ణ మెజారిటీ రానందున ప్రభుత్వ ఏర్పాటుకు ఏ పార్టీ ముందుకు రాలేదు. అటు అతి పెద్ద పార్టీగా విజయం సాధించిన బిజెపి అవిశ్వాసానికి భయపడి ప్రభుత్వ ఏర్పాటుకు ముందుకు రాలేదు, ఇటు రెండవ స్థానంలోని ఆమ్ ఆద్మీ పార్టీ తనంతటతానుగా ప్రభుత్వ ఏర్పాటుకు సుముఖత చూపలేదు. ఈ పరిణామాలతో ఢిల్లీలో హంగ్ ఏర్పడడంతో కాంగ్రెస్ పార్టీ ఆమ్ ఆద్మీ పార్టీకి బయట నుంచి మద్దతు ఇస్తానని తెలిపింది. అరవింద్ కేజ్రీవాల్ ప్రభుత్వ ఏర్పాటుకు ముందు కాంగ్రెస్, బిజెపిలకు కొన్ని షరతులు పెట్టారు. విద్యుత్, నీరు, జన్‌లోక్‌పాల్ బిల్లు, అనధికారిక కాలనీల క్రమబద్ధీకరణ లాంటి మరికొన్ని హామీల అమలుకు సహకరిస్తే ప్రభుత్వ ఏర్పాటుకు ముందుకు వస్తామని తెలిపారు. అలాగే ప్రభుత్వ ఏర్పాటుకు ప్రజల్లోకి వెళ్లి వారి ఆమోదాన్ని తెలుసుకుంటామని చెప్పారు. ఎస్ఎంఎస్‌ల ద్వారా, మెయిల్‌ల ద్వారా ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి 75 శాతం ప్రజలు తమకు ఆమోదం తెలిపారని అన్నారు. డిసెంబర్ ఆఖరి వారంలో లెఫ్టినెంట్ గవర్నర్‌ను కలిసి ప్రభుత్వ ఏర్పాటుకు తన ఆమోదం వ్యక్తం చేశారు. మధ్యతరగతి మెట్రోపాలిటన్ ప్రజలు కేజ్రీవాల్‌ను ముఖ్యమంత్రిగా చూడాలను కుంటున్నారు. ఢిల్లీలోని మురికివాడల్లో నివసిస్తున్న ప్రజలు తమ జీవితాలు బాగుపడతాయేమోనని ఆశతో ఉన్నారు.

**ఛత్తీస్‌గఢ్**

ఛత్తీస్‌గఢ్‌లో బిజెపి హ్యాట్రిక్ కొట్టింది. అధికారం కోసం జరిగిన హోరాహోరీ పోరులో మరోసారి కాంగ్రెస్‌పై గెలిచింది. 90 స్థానాలకు జరిగిన పోటీలో బిజెపి 49 (2008లో 50), కాంగ్రెస్ 39 (2008లో 38), బిఎస్‌పి 1 (2008లో 2), ఇతరులు 1 గెలుపొందాయి. క్రితంసారి కంటే ఒక సీటు తక్కువ వచ్చిన ప్రభుత్వ ఏర్పాటుకు పూర్తి ఆధిక్యం ఉండడంతో మూడవసారి రమణ్‌సింగ్ ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. మావోయిస్టుల దాడిలో హతమైన కాంగ్రెస్ నాయకుడు మహేంద్ర కర్మ సానుభూతితో కాంగ్రెస్ పార్టీకి ప్రభావిత ప్రాంతాలలోని 12 స్థానాలలో 8 స్థానాలు గెలుచుకుంది. అవినీతి ఆరోపణలు, స్థానిక వ్యతిరేకత వల్ల బిజెపిలోని సిట్టింగ్ మంత్రులు ఓటమి పాలయ్యారు. ఈ ఎన్నికలలో తొలిసారి ప్రవేశపెట్టిన నన్ ఆఫ్ ది ఎబవ్ (నోటా) విధానం కూడా ఛత్తీస్‌గఢ్ ఎన్నికలలో ప్రభావం చూపింది. ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ ఆహార భద్రత బిల్లు, జనాకర్షక పథకాల ప్రచారం బిజెపి విజయంలో కీలకపాత్ర పోషించాయి. నరేంద్రమోడీ ప్రచారం కూడా ఈ విజయంలో కొంత ఉపకరించింది.

**మిజోరం**

నాలుగు రాష్ట్రాల ఫలితాల్లో ఖంగుతిన్న కాంగ్రెస్‌కు మిజోరం ఎన్నికల ఫలితాలు కొంత ఊరట కలిగించాయి. 40 స్థానాలలో కాంగ్రెస్ పార్టీ 33 స్థానాలను గెలుచుకుని అధికారం నిలుపుకుంది. లాల్ తన్హావ్లా ఐదోసారి ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టారు. ఎంఎన్ఎఫ్ 5, ఎంపిసి 1 స్థానాలు గెలుచుకున్నాయి.

ఏది ఏమైనా పార్లమెంటరీ పంథా ఎన్నికలు ఒక ప్రహసనమే తప్ప వేరేమీ కాదు. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా, ఏ నాయకుడు పదవి చేపట్టినా సామాన్య ప్రజలకు బతుకు భరోసా లేదు. ప్రజాస్వామ్యమే ఎన్నికలుగా భావించేలా పాలకులు ప్రజలను నమ్మిస్తున్నారు.

సామ్రాజ్యవాద, బహుళజాతి కంపెనీలు భారతదేశంలో ఎన్నికల ఫలితాలను శాసించే స్థితికి చేరుకున్నాయి. వారికి అనుకూలమైన పార్టీకి అధికారం వచ్చేలా చేయడం, తమ విధానాలను అమలు చేసే మనుషులను గద్దెనెక్కించడం, వాటికి లాభాలు చేకూర్చే విధానాలను అమలు చేసుకుంటున్నాయి. వాటి ప్రవేశంతో అవినీతిరహిత పరిపాలన సాధ్యం కాదు. ఉన్నత మధ్యతరగతి, సంపన్న వర్గాల ప్రయోజనాలే వారికి ముఖ్యం. ఏ పార్టీకి చెందిన వారైనా పేద ప్రజల గురించి, ఆర్థిక అసమానతల గురించి ఆలోచిస్తారని ఆశించడం అత్యాశే.

*(రచయిత పాత్రికేయులు)*

వీ

# గొంతునులిమి చంపబడ్డ న్యాయం

***న్యాయస్థానాల తీర్పుల్లో ధన, రాజకీయ ప్రాబల్యం, మత పలుకుబడి పెచ్చరిల్లుతోందనీ, దోషులు నిర్దోషులుగా, నిర్దోషులు దోషులుగా మారిపోతున్నారనీ అంటున్నారు* బి. రామకృష్ణ**

తమిళనాడు రాష్ట్రంలోని కంచికామకోటి మఠం 69వ అధిపతిగా 19 ఏళ్ల వయసున్న జయేంద్ర సరస్వతి 1954లో నియమింప బడ్డాడు. అంతకంటే ముందు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి మఠాధిపతిగా ఉండేవాడు. ఇతన్ని పరమాచార్య అని కూడా పిలుస్తుంటారు. ఇక్కడి మఠాధిపతిని శంకరాచార్య అని అంటారు. 1987 అగస్టు 24న ఎవరికీ చెప్పకుండా మఠం వదిలి వెళ్లిపోవడంతో 13 ఏళ్లున్న విజయేంద్ర సరస్వతిని పరమాచార్య 70వ మఠాధిపతిగా చేశాడు. 1987 సెప్టెంబర్ 17న తిరిగి జయేంద్ర రావడంతో కంచికామకోటి మఠానికి జయేంద్ర, విజయేంద్రలు 69,70వ అధిపతులుగా కొనసాగుతున్నారు.

స్వాతంత్ర పోరాటకాలంలోని సీనియర్ నాయకులెందరో చిత్తరంజన్‌దాస్ వంటివారు, గాంధీ సహితం పరమాచార్యను కలిసిన వారిలో ఉన్నారు. హిందూమతానికి సంబంధించి కంచికామకోటి మఠానికి ఎంతో ప్రాధాన్యత ఎప్పటి నుంచో ఉంది. కులవ్యవస్థ పట్ల, మహిళా విద్యపై, బాల్యవివాహాలపై, వితంతువుల స్థానంపై చాల సంకుచిత ఛాందస భావాలుండేవి. అయినప్పటికీ అతన్ని కలిసి సలహాలు, ఆశీర్వాదాలు, మార్గదర్శకత్వం పొందేవారిలో జాతీయ నాయకులు, శాస్త్రవేత్తలు, సాంకేతిక నిపుణులు, రచయితలు ఎందరో ఉండేవారు. ఎప్పుడూ ఆయన రాజకీయాలకు దూరంగానే ఉండేవాడు. ఆయన చాలా సామాన్యమైన జీవితం గడిపే వాడని, కాలినడకన ప్రయాణం చేసే వాడని, ప్రయాణాల్లో గుడిసెల్లో విశ్రాంతి తీసుకునే వాడని అంటారు. పూజలు వేద, హిందూ దర్మశాస్త్రాల అధ్యయనం తప్పించి మరింత విస్తృతమైన రాజకీయ కార్యక్రమాల్లోకి వెళ్లడంపై పరమాచార్యకు, జయేంద్రకు మధ్య భేదాభిప్రాయాలు ఉన్నాయి.

1987 అక్టోబర్ 2న జయేంద్ర జనకళ్యాణ్ – జనజాగరణ్ అనే కార్యక్రమాన్ని తీసుకున్నాడు. జనకళ్యాణ్ అంటే సేవచేయడం, జనజాగరణ్ అంటే ప్రజలను జాగృత పరచడం. ఇందులో మతాలకు అతీతంగా ప్రవేశముంటుందని చెపుతాడు. ఇతని ఉపన్యాసాలుగాని, కార్యక్రమాలుగాని హిందూయిజానికి అనుకూలంగా ఉండేవి. ఆవును జాతీయ జంతువని చెపుతాడు. కొన్ని మతసంస్థలు విదేశీ నిధులు పొందుతున్నాయనీ, ఆ నిధులు మత మార్పిడులకు వినియోగించ బడుతున్నాయనీ సంఘ్‌పరివార్ వాదనలను ముందుకు తెస్తాడు. ఎన్నికల్లో కూడా పాల్గొంటామని 1989లో ప్రకటించాడు. 1994లో పరమాచార్య మృతి తరువాత ఈ కార్యక్రమాలను విస్తృత పరిచాడు. 1990లలో కంచి మఠం విద్యా, వైద్య, రియల్ ఎస్టేట్ వ్యాపారాల్లోకి ప్రయాణించడం మొదలైంది. పిల్లల ఆసుపత్రి, మల్టీ స్పెషాలిటీ ఆసుపత్రి, వేద పాఠశాలలు, ఓరియంటల్, శంకర్ పాఠశాలలు, 120 వరకు ట్రస్టులు నడుపుతూ రెండువేల కోట్ల రూపాయలకు పైగా తన సామ్రాజ్యాన్ని విస్తరించుకున్నది. పి.వి. నర్సింహారావు ప్రధాన మంత్రిగా ఉన్నపుడు 1993లో స్థాపించిన రెండేళ్లకే శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి విద్యాలయం డీమ్డ్ యూనివర్సిటీగా చేయబడింది. ఎంతో మంది వ్యాపారవేత్తలు, పారిశ్రామికవేత్తలు, ఎన్ఆర్ఐలు హిందూయిజం అనుయాయులు ఎందరో తమ నల్లధనాన్ని కంచిమఠ ట్రస్టుల్లోకి తరిలించారు. పోలీసులకిచ్చిన వాంగ్మూలంలో ఈ విషయాన్ని జయేంద్ర తెలిపాడు. 1991 – 96లో జయలలిత ముఖ్యమంత్రిగా ఉన్నపుడు కంచిమఠానికి, ప్రభుత్వానికి దగ్గరి సంబంధం ఉండేది. 1996లో అసెంబ్లీ ఎన్నికల అభ్యర్థులు జాబితాను ప్రకటించే ముందు జయలలిత కంచి మఠానికి వెళ్లి జయేంద్ర ఆశీస్సులు తీసుకుంది. దీనికి సంబంధించిన ఫొటోలు అప్పటి పత్రికల్లో కూడా వచ్చాయి. 2004 ఏప్రిల్‌లో లోక్‌సభ ఎన్నికల సందర్భంగా చెన్నైలో బిజెపి ఎన్నికల కార్యాలయాన్ని ప్రారంభించాడు. ఆ ఎన్నికల్లో ఎఐడిఎంకె – బిజెపి కలిసి తమిళనాడులో పాల్గొన్నాయి. 2001 – 2006లో తమిళనాడులో ఎఐడిఎంకె అధికారంలో ఉన్నది. ఆ సమయంలో జయేంద్రకు ప్రభుత్వ కార్యకలాపాల్లో ప్రముఖ స్థానం ఉండేది. రాష్ట్ర స్థాయి దేవాలయ ఆస్తుల పరిరక్షణ కమిటీకి ముఖ్య బాధ్యునిగా చేయబడ్డాడు.

1980లలో తమిళనాడులో మొదటిసారిగా మత ఉద్రికత్తలు హిందూ, క్రిష్టియన్‌ల మధ్య కన్యాకుమారి జిల్లాలో పొడచూపాయి. తిరున్వేలి జిల్లాలో అధిక సంఖ్యలో దళితులు ఇస్లాం మతం స్వీకరించడం దేశవ్యాప్త దృష్టిని ఆకర్షించింది. విహెచ్‌పి, హిందు మన్నని, తమిళనాడు దేవాలయ పరిరక్షణ కమిటీ వంటివి మత మార్పిడులను తీవ్రంగా వ్యతిరేకిస్తూ దక్షిణాదిన తమ పట్టును పెంచుకోవడం కోసం తీవ్రంగా ప్రయత్నించాయి. ఈ ప్రయత్నాల వెనుక జయేంద్ర సరస్వతి ఆశీస్సులు అమోఘంగా ఉన్నాయి. కాంచి పురానికి దగ్గరలో ఉన్న కూతి రంబక్కంలోని దళితులు ఆలయ ప్రవేశం గురించి కంచిమఠ సహాయం అర్థించారు. దానికి శంకారాచార్య జయేంద్ర మొదలైతే మీరు స్నానం చేసి, మిమ్మల్ని మీరు శుభ్రం చేసుకోండి, ఆ తరువాత ఆలయ ప్రవేశహక్కును పొందండి అని అన్నాడని పుతియా తమిగజం అనే రాజకీయ పార్టీ నాయకుడు కె. కృష్ణస్వామి కోర్టు దృష్టికి తీసుకుపోయాడు. ఆలయ ప్రవేశం విషయంలో ప్రభుత్వం కంచిమఠ స్పందన, కరువైన సందర్భంలో దళితులు చాలా మంది మత మార్పిడిలకు సిద్ధపడ్డారు. మత మార్పిడు లను ఆపడానికి తెరవెనుక, ముందు శంకరాచార్యుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. దీనికి ప్రతిగా 2002లో ఎఐడిఎంకె ప్రభుత్వం బలవంతపు మతమార్పిడి నిరోధక చట్టం తెచ్చి, మత మార్పిడిలను నిషేధించాలనే హిందూత్వ శక్తుల డిమాండ్‌ను ఈ రూపం లో నెరవేర్చే ప్రయత్నం చేసింది. ఇలా భారత రాజ్యాంగ తాత్వికతలో ఒకటైన సెక్యులర్ భావన ప్రకారం ఎవరికి నచ్చిన మతాన్ని వారు విశ్వసించవచ్చనే, పాటించవచ్చనే ప్రాథమిక సూత్రం విస్మరించింది.

1998, 1999లలో కేంద్రంలో బిజెపి ప్రభుత్వం ఉన్నపుడు జయేంద్రకు ప్రాముఖ్యత పెరిగింది. బిజెపి ముఖ్య నాయకులెందరో కంచిమఠానికి వస్తూ పోతూండడంతో జయేంద్ర రాజకీయ ప్రాబల్యం పెరిగింది. కంచిమఠం శంకరాచార్య జయేంద్ర నేతృత్వంతో విహెచ్‌పి, బిజెపి తదితర సంఘ్‌పరివార్ శక్తుల తోడ్పాటులో రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొనడం విస్తరించింది. ఇలా దేశవ్యాప్తంగా తన ప్రాబల్యాన్ని పెంచుకుంటూ పోతూ తుదకంటూ ఈ దేశంలో ఏకీకృత హిందూ మతాధిపతిగా మారాలని కాంక్షించాడని అనడంలో తప్పేమి కనిపించదు. పోప్ లాంటి స్థానం కోసం తీవ్రంగానే కృషి చేసుకుంటూ పోవడం దానికి సంఘ్‌పరివార్ అండదండలుండడం అసహజమైనదేమి కాదు. రాజకీయ అధికారం అనేది బిజెపితో చాపకిందనీరులాగా సుస్థిర ఏకీకృత హైందవ మతాధిపతి వ్యవస్థను నెలకొల్పి మొత్తంగా అఖండ హైందవ రాజ్య స్థాపన దిశగా సాగే ప్రయత్నాలు విస్తరిస్తున్నాయి. అయితే శంకర్ రామన్ హత్య కేసులో 2004లో జయేంద్ర అరెస్టును విహెచ్‌పి, బిజెపి వంటి హిందూత్వశక్తులు వ్యతిరేకించడాన్ని అర్థం చేసుకోవాలి. విహెచ్‌పి ప్రథమ కార్యదర్శి ప్రవీణ్ తొగాడియా 'పోప్‌నైతే ఇలాగే అరెస్టు చేస్తారా?' అంటాడు. అరెస్టు విధానం ప్రజల మనోభావాలను గాయపరిచిందని, జయేంద్రకు తగు భద్రత కల్పించి రోజు పూజలు చేసుకునేందుకు వసతులు కల్పించాలని మాజీ ప్రధాని వాజ్‌పేయి సెలవిస్తాడు. వీరెవరికి కూడా వరదరాజ పెరుమాళ్ ఆలయ మేనేజర్ శంకర్ రామన్ హత్యకు గురవ్వడం గురించి చీమ కుట్టినట్లు కూడా లేదు. మఠంలో జరిగిన, జరుగుతున్న అవినీతి, అనైతిక కార్యకలాపాలను బయటపెడుతూ ఉత్తరాలు రాసిన శంకర్ రామన్ హత్యపై స్పందించకపోవడం, కంచిమఠంలోని అక్రమాల గురించి మాట్లాడకపోవడం అనేది వారి పక్షపాత వైఖరి చెపుతున్నది. మాట్లాడితే హిందు మతాధిపతుల వ్యవస్థ ఎక్కడ బలహీనపడి అఖండ హిందూ రాజ్యానికి, పీఠాధిపతుల సంస్కృతికి భంగం కలుగుతుందేమోనని వారి భయం కావచ్చు.

**శంకరాచార్య జయేంద్ర సరస్వతి అరెస్టు నేపథ్యం**

2004 సెప్టెంబర్ 3న సాయంత్రం కాంచిపురానికి సమీపంగా ఉన్న వరదరాజపెరుమాళ్ ఆలయ మేనేజర్ 51 ఏళ్ల శంకర్ రామన్ దేవాలయ కార్యాలయ గదిలో హత్య కావించబడ్డాడు. ఇతడు అక్కడ గత 25 సంవత్సరాలుగా పని చేస్తున్నాడు. కొన్ని సంవత్సరాల క్రితమే ఆలయ మేనేజర్ అయ్యాడు. ఇతని తండ్రి పరమాచార్యకు చాలా సన్నిహితుడు. శంకర్ రామన్ హత్య నేపథ్యంలో 2004 నవంబర్ 11న ఆంధ్రప్రదేశ్‌లోని మహబూబ్‌నగర్‌లో కంచికామకోటి మఠాధిపతి శంకరాచార్య జయేంద్ర సరస్వతిని అరెస్టు చేశారు. అప్పుడది సంచలనంగా మీడియాలో వచ్చింది. హిందూ మఠాధిపతుల్లో అధిక ప్రాచుర్యం, ప్రాబల్యం గలవాడు జయేంద్ర.

జయేంద్ర చేస్తున్న అవినీతి, అనైతిక పనులు, అక్రమాలు, మఠ సాంప్రదాయాల ఉల్లంఘనలపై ఎన్నోసార్లు ఉత్తరాలు రాశాడు. వీటిని కంచిమఠానికి, హిందూ రిలిజియస్ చారిటిబుల్ ఎండోమెంట్ (హెచ్‌ఆర్ సిఇ) కు పంపేవాడు. వాటి కాపీలను కొన్నింటిని నక్కిరన్ అనే తమిళ పత్రికకు పంపాడు. 2004 సంవత్సరం మేలో రెండు, జూలైలో రెండు, ఆగస్టులో రెండు ఉత్తరాలు రాశాడు. అంతకు ముందు కూడా చాలా సంవత్సరాల నుండే రాస్తున్నాడు. వీటిలో ఇద్దరు శంకరాచార్యులు జయేంద్ర, విజయేంద్ర సరస్వతులు పాల్పడుతున్న అక్రమాలు, ఆలయ సంబంధిత సొమ్మును దుర్వినియోగ పరచడం, వారు భౌతిక సుఖాలు, శారీరక, కుటుంబ బంధాల నుండి దూరంగా ఉండలేకపోవడం పై తరుచుగా ప్రస్తావించేవాడు. చివరి ఉత్తరం 2004 ఆగస్టు 30న రాశాడు. దీన్ని తన చివరి నోటీస్‌గా (తమిళంలో ఇరిది అరివిప్పు) పేర్కొన్నాడు. దీనిలో జయేంద్ర, విజయేంద్రలను శంకరాచార్యులుగా అనర్హులని ప్రకటింపచేసేందుకు హెచ్‌ఆర్ & సిఇ ప్రకారం కోర్టుకు వెళతానని హెచ్చరికలు చేశాడు. ఈ లెటర్‌తో పాటు తదితర లెటర్లు కూడా నక్కిరన్ పత్రిక వద్ద ఉన్నాయని ఆ పత్రిక 2004 సెప్టెంబర్ 11 సంచికలోని వ్యాసంలో రాసింది. ఈ నేపథ్యంలో నక్కిరన్ పత్రికకు జయేంద్ర ఇచ్చిన ఇంటర్వ్యూను 2004 సెప్టెంబర్ 25 సంచికలో ప్రచురించింది. మఠంలో జరిగే అవినీతి అక్రమాల గురించి మాట్లాడినందుకు శంకర్ రామన్ హత్య జరిగిందా? అనే దానికి స్పందిస్తూ... 'నా కాలి గోళ్లకు నొప్పి వస్తే కనీళ్లు కార్చే భక్తులు నాకున్నారు. నన్ను దశాబ్దాలుగా శంకర్ రామన్ వేధిస్తున్నాడు. ఇంకా వేధింపులు కొనసాగిస్తూనే ఉన్నాడు. నన్ను ఎంతగానో ఇబ్బందులకు గురిచేసిన శంకర్ రామన్ మాట్లాడి ఒప్పిస్తే వినే రకం కాదు. ఒకసారి బృందావనం అంటే పరమాచార్య శవాన్ని పూడ్చి పెట్టిన చోటికి వచ్చినప్పుడు నాతో గొడవ పెట్టుకున్నాడు. శంకర్‌రామన్ వేధింపులను భరించలేని నా భక్తుల్లో కొందరు అతని అంతు చూసి ఉంటారు. దానికి నేనెలా బాధ్యున్ని అవుతాన'ని అన్నాడు.

కంచి (శంకర్) మఠం మేనేజర్ సుందరేషన్ సెల్‌ఫోన్ నుండి శంకర్ రామన్‌ను హత్య చేసిన కిరాయి హంతుకులకు ఫోన్‌కాల్స్ వెళ్లినట్లు గుర్తించడం, ఈ హత్యకు సంబంధించిన ఇద్దరు ప్రధాన అనుమానితులు జయేంద్ర సరస్వతితో మాట్లాడినట్లు ఒప్పుకోవడం, ఈ హత్యకు పథకం చేయించిన అప్పుతో జయేంద్రకు సంబంధాలు ఉన్నట్లు సాక్ష్యాధారాలుండడం, మఠ సంబంధిత ట్రస్టుల ద్వారా హంతకులకు సొమ్ము చెల్లించినట్లు సాక్ష్యాలుండడం, శంకర్ రామన్‌ను తన భక్తుల్లో ఎవరో చంపి ఉండవచ్చని ఇంటర్వ్యూలో జయేంద్ర చెప్పడం అనే వాటిమూలంగా జయేంద్రను అరెస్టు చేశామని పోలీసులు తెలిపారు.

శంకర్ రామన్ హత్యతో పాటుగా ఇంకా ఎన్నో విషయాలు వెలుగులోకి వచ్చాయి. 2002 సెప్టెంబర్‌లో జయేంద్రకు వ్యతిరేకంగా శంకర్‌రామన్ లాగే ఉత్తరాలు రాసిన ఎస్. రాధకృష్ణన్‌పై హత్యాయత్నం జరిగింది. దీనిలో పాల్గొన్న అప్పు, కదిరావన్ అనే వ్యక్తులే శంకర్‌రామన్ హత్య కేసులో కూడా నిందితులు. గుడిలో శివుని విగ్రహాన్ని పునః స్థాపించే విషయంలో జయేంద్ర ప్రయత్నాలను అడ్డుకున్న పూజారి తిరుకొట్టియూర్ మాధవన్‌పై కదిరామన్ 2004 ఆగస్టులో దాడి చేశాడు. కంచి మఠానికి వ్యతిరేకంగా ప్రదర్శన జరిపిన తిరుకొట్టియూర్ మాధవన్‌పై గ్రీమ్‌రోడ్, చెన్నయ్‌లో దాడి జరిగింది. అయితే అనేక గాయాలతో, తాత్కాలిక కోమాలోకి వెళ్లి, 16 కుట్లతో చావు నుండి బయట పడగలిగాడు.

కంచి కామకోటి మఠం పేద బ్రాహ్మణ బాలికల కొరకు నడిపే వసతిగృహం కామదుర్గలో శుభశ్రీ అనే పదకొండేళ్ల బాలిక లైంగిక అత్యాచారం కారణంగా మృతి చెందిందని ఆరోపణలున్నాయి. 2004, జూలై 9న ఈ బాలిక మరణించింది. అవుట్‌లుక్ పత్రిక జరిపిన విచారణలో కామదుర్గకు విజయేంద్ర సరస్వతి, అతని సోదరుడు రఘు తరుచుగా వస్తుంటారనీ, ఇక్కడ ఉంటారనీ, వేదశ్లోకాలు బోధిస్తారనీ తేలింది. వాళ్లు వచ్చినప్పుడు ఈ వసతి గృహంలోనే ఏర్పాటు చేసిన రెండు ఎసి గదుల్లో ఉండేవారనీ, టివి చూసేవారనీ తేలింది.

ప్రముఖ కాలమిస్ట్ అనురాధ రామనన్‌నూ 1992లో లైంగిక వేధింపులకు జయేంద్ర గురిచేశాడని ఆమె స్వయంగా చెప్పిన విషయం 2004, డిసెంబర్ 31న అవుట్‌లుక్‌లో అచ్చయింది. కంచి మఠం ప్రచురించబోయే ఆధ్యాత్మిక పత్రికకు ఎడిటర్‌గా పనిచేయమన్న జయేంద్ర పిలుపును దైవ ఆహ్వానంగా భావించి అతన్ని కలిసింది. ఆ

సందర్భంలో, మధ్యవర్తిగా ఉన్న మహిళతో అసభ్యంగా ప్రవర్తిస్తూ, తనను కూడా అలాగే అతని దగ్గరకు రమ్మని కోరాడు. షాక్‌కు గురయిన అనురాధ రామనన్ 'నీవు మనిషివా?' అన్న ప్రశ్నకు సమాధానం లేదు. మధ్యవర్తి మహిళను ఉద్దేశించి ఇలాంటి వాటి గురించి నీవు ఎప్పటిలాగానే ఈమెకు తెలియపరచలేదా? అని ప్రశ్నించాడు. లేదని అన్న ఆమెని దుర్భాషలాడాడు. భర్తను పోగొట్టుకున్నా కుంకుమ పెట్టుకుని, మంచి బట్టలేసుకున్న నిన్ను కోరుకోవడంలో తప్పేంటనీ, నీవు సహకరిస్తే అన్ని విధాలా లాభం కలిగేలా చూస్తానని చెప్పాడు. ఒకవేళ బయట నీవు ఈ ఘటన గురించి మాట్లాడితే నీ గురించి చెడుగా ప్రచారం చేయిస్తానని బెదిరించాడు. కంచి మఠాధిపతి ఇలా ప్రవర్తించే సరికి షాక్‌కు గురవ్వడం, ఫలితంగా నోటిమాట పడిపోయి, పక్షవాతానికి గురయ్యింది. కోలుకోవటానికి సంవత్సర కాలం పట్టిందని అనురాధ రామనన్ తెలిపింది.

కంచి మఠం నిర్వహించే శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి మహా విద్యాలయంలో డిగ్రీ రెండవ సంవత్సరం చదువుతున్న కేశవన్, శంకరన్ నంబూత్రిలు 1985లో అనుమానాస్పద మృతి చెందారు. కేశవన్ నంబూత్రి మఠంలో జరిగే అవాంఛనీయ కార్యక్రమాలను వెలుగులోకి తెచ్చే ప్రయత్నం చేశాడని అతని సోదరుడు కృష్ణన్ నంబూత్రి చెప్పాడు. ఈ విషయంలో శివకంచి పోలీస్ స్టేషన్‌లో కేసు నమోదు అయింది కాని ఎలాంటి ముందడుగు వేయలేదు. శంకర్‌రామన్ హత్యతో పాటుగా ఎన్నో అనైతిక, అవినీతి అక్రమాలకు కంచికామ కోటి మఠం, అలాగే దాని అధిపతులైన శంకరాచార్యులు పాల్పడడం చాలా సంవత్సరాలుగా జరుగుతూనే ఉంది. ఇంకా బయటకురానివెన్నో?

నక్కీరన్ తమిళ పత్రిక శంకరరామన్ హత్య విషయంలో వరుసగా వ్యాసాలు రాస్తుండడంతో పోలీసులపై వత్తిడి పెరిగింది. నిందితులను అరెస్టు చేయడంలో జాప్యం ఎందుకు జరుగుతున్నదని పెద్ద ఎత్తున డిఎంకె డిమాండ్ చేయనారంభించింది. 2004, నవంబర్ 13న కాంచీపురంలో, నిజమైన దోషులను శిక్షించాలని డిమాండ్ చేస్తూ నిరాహార దీక్షను చేపట్టింది. దాన్ని డిఎంకె డిప్యూటీ సెక్రెటరీ జనరల్ స్టాలిన్ ప్రారంభిస్తారని ప్రకటించారు. కె. వీరమణి నాయకత్వంలో ఉన్న ద్రవిడ కజగం కూడా ఈ విషయంలో ఒత్తిడి చేస్తున్నది. కరుణానిధి ఈ హత్య కేసులో నిందితులను అరెస్ట్ చేయడంలో జాప్యాన్ని ప్రశ్నిస్తూ ప్రకటనలు చేశాడు. ఈ హత్య వెనుకున్న వ్యక్తిని ఎందుకు అరెస్టు చేయడం లేదని తీవ్రంగా ప్రశ్నించాడు.

2004 లోక్‌సభ ఎన్నికల్లో ఎఐడిఎంకె, బిజెపితో పొత్తు పెట్టుకుని తమిళనాడులో పోటీ చేసింది. అయితే ఫలితాలు వీరికే వ్యతిరేకంగా వచ్చాయి. కేంద్రం బిజెపి అధికారం కోల్పోయింది. 2004, జూన్ 26న ముంబైలో టైమ్స్ న్యూస్ నెట్‌వర్క్‌కు జయేంద్ర ఇంటర్వ్యూ ఇస్తూ, జయలలిత అహంకారమే ఆ పార్టీని పరాజయం పాల్జేసిందని అన్నాడు. బిజెపిని తప్పు పట్టకుండా కేవలం జయలలితనే టార్గెట్ చేశాడు. తమిళనాడు ఉద్యోగులు 2003లో చేసిన సమ్మెను తగురీతిలో డీల్ చేయకపోవడం ఆమె చేసిన పొరపాటు. ఫలితంగా వేలాది కుటుంబాలు ఎఐడిఎంకెకు వ్యతిరేకం అయ్యాయి. ఇలా చేయమని ఆమెకు ఎవరు సలహా ఇచ్చారని టిఎన్ఎన్ అడిగినప్పుడు సీలింగ్ వైపు చూస్తూ 'అది దేవుడికే తెలియాలి, ఆమెకు ఆమెయే సలహాదారని అనుకుంటా'నని జయేంద్ర అన్నాడు. ఒకప్పుడు తనకు బలమైన సానుకూల వ్యక్తి తనకు వ్యతిరేకంగా మాట్లాడుతుండడం జయలలితకు కోపం తెప్పించి ఉండొచ్చుని, అలా మఠం నుండి ఆమె దూరంగా వైదొలిగి ఉంటుందని కొందరంటారు.

ఈ అన్ని విషయాల నేపథ్యంలో జయేంద్ర అరెస్టుకు జయలలిత సిద్ధపడిందని తెలుస్తున్నది. జయేంద్ర అరెస్టుపై సంఘ్ పరివార్ శక్తులు దేశవ్యాప్తంగా నిరసనలు తెలిపాయి. విహెచ్‌పి సెక్రటరీ తొగాడియా, వాజ్‌పాయిలు జయేంద్ర అరెస్టును తీవ్రంగా ఖండించారు. దీనికి స్పందనగా జయేంద్ర అరెస్టు విషయంలో నిర్భయంగా వ్యవహరించామని జయలలిత చెపుతూ, శంకర్‌రామన్ హత్య సామాన్యమైన హత్య కాదు పట్టపగలే కిరాయి హంతకులు దేవాలయంలో చేసిన క్రూరమైన హత్య, ఇంతటి దారుణమైన దానిని చట్టపరంగా విచారించకుండా, కుట్రదారుల, హంతకులపై ఎలాంటి చర్యలు లేకుండా వదిలేయాలా? అని 2004 నవంబర్‌లో ప్రశ్నించింది.

ఇంత తీవ్రంగా స్పందించిన జయలలిత, 2013, నవంబర్ 27న శంకర్‌రామన్ హత్య కేసులో నిందితులందరిని నిర్దోషులని కోర్టు తీర్పునిచ్చిన నేపథ్యంలో ప్రస్తుతం ముఖ్యమంత్రిగా ఉన్నా ఏమి చర్యలు తీసుకుంటుందో? హంతకులకు శిక్షలు పడేలా అప్పీల్‌కు వెళుతుందా? అనేది కాలమే నిర్ణయించాలి.

శంకర్‌రామన్ హత్య కేసులో ఎన్నో మలుపులు, తిరకాసులు ఉన్నాయి. తొమ్మిది సంవత్సరాల విచారణలో శంకర్ రామన్ హంతకులెవరో తెలియకుండానే నిందితులు అందరిని నిర్దోశులుగా ప్రకటిస్తూ కోర్టు తీర్పు వచ్చింది. 2004, సెప్టెంబర్ 3న వరదరాజు పెరుమాళ్ ఆలయంలో దాని మేనేజర్ శంకర్ రామన్ హత్య కావడం, 2004, నవంబర్ 11న జయేంద్ర, 2005, జనవరి 10న విజయేంద్ర అరెస్టు కావడం జరిగింది. 2004 , సెప్టెంబర్ 3 నుండి 2005, జనవరి 10 వరకు ఈ హత్య కేసులో మొత్తం 24 మంది అరెస్టయ్యారు. ఎ1గా జయేంద్ర సరస్వతి, ఎ2గా విజయేంద్ర సరస్వతి ఈ కేసులో ఉన్నారు. ఐపిసి 302, 201, 205, 213, 120-బి, 34 సెక్షన్ల ప్రకారం నేరారోపణ మోపబడింది.

మద్రాస్ హైకోర్టులో జయేంద్రకు బెయిల్ నిరాకరించబడితే సుప్రీం కోర్టు 2005, జనవరి 10న బెయిల్ మంజూరు చేసింది. ఈ విషయాన్ని రాంజెఠ్మాలని సుప్రీంకోర్టుతో వాదించాడు. విజయేంద్రకు 2005, ఫిబ్రవరి 10న మద్రాస్ హైకోర్టు బెయిల్ ఇచ్చింది. తమిళనాడు రాష్ట్ర కోర్టులో విచారణ జరిగితే తమకు న్యాయం జరగదని, తమిళనాడు ప్రభుత్వం, పోలీసుల జోక్యం వలన స్వేచ్ఛగా, సక్రమంగా ట్రయల్ జరుగవని జయేంద్ర సుప్రీంకోర్టును అభ్యర్థించాడు. ఈ కేసుపై న్యాయ విచారణ తమిళనాడు రాష్ట్రానికి ఆవల జరిపించమన్న జయేంద్ర అభ్యర్ధనను సుప్రీంకోర్టు అంగీకరిస్తూ, దీనిపై తమిళనాడు ప్రభుత్వానికి నోటీసులు జారీచేసింది. 2005, అక్టోబర్ 26న సుప్రీంకోర్టు ఈ కేసును చెన్నయ్‌కు చేరువలో ఉన్న ప్రిన్సిపల్ సెషన్స్ కోర్టు చెంగల్పేట్ నుండి పుదుచ్చేరి కోర్టుకు బదిలీ చేసింది. దీనికి సంబంధించి జయేంద్ర తరఫున సుప్రీంకోర్టులో 'నారీ ఫాలిమన్' అనే సీనియర్ న్యాయవాది వాదించాడు.

పుదుచ్చేరి కోర్టులో ప్రాసిక్యూషన్ వాదనలు వినిపించేందుకు తమిళనాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ కాకుండా తన స్వంత పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను నియమించుకోమని సుప్రీంకోర్టు, పుదుచ్చేరి కోర్టును ఆదేశించింది. తమిళనాడు ప్రభుత్వం, పోలీసులు, దాని యంత్రాంగం తమిళనాడు కోర్టులపై సుప్రీంకోర్టు అవిశ్వాసాన్ని చెప్పకనే చెప్పినట్లయింది.

ఒక కోర్టు ఒక రకంగా, మరో కోర్టు మరో రకంగా స్పందించడం, ఒక న్యాయవాది వాదిస్తే ఒక రకంగా, మరో న్యాయవాది వాదిస్తే ఇంకో రకమైన తీర్పు వస్తుందని అర్థం చేసుకోవచ్చు. తీర్పులకు సార్వజనీనత, సాధికారతలుండవని, రాజకీయ శక్తులు, ప్రభుత్వం, రాజ్యం, ఆధిపత్య శక్తుల చేతుల్లో అవి పనిముట్లుగా మారుతుంటాయని

ఇక్కడ స్పష్టమవుతున్నది.

2005, నవంబర్ 25 నుండి 2013 నవంబర్ వరకు పుదుచ్చేరి ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్, సెషన్స్ కోర్టులో శంకర్ రామన్ హత్యకేసుపై ట్రయల్స్ జరిగాయి. మొత్తం 187 మంది సాక్షులు విచారించబడ్డారు. పునః విచారించబడ్డారు. ప్రాసిక్యూషన్ వారు ప్రవేశపెట్టిన సాక్షుల్లో 83 మంది సాక్షులు తామిచ్చిన గత సాక్ష్యానికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పారు. అప్రూవర్‌గా మారిన ఒకే ఒక వ్యక్తి రవి సుబ్రమణియన్ కూడా తన గత సాక్ష్యానికి వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చాడు.

ఈ హత్య కేసులో చిన్నపండి, డి. కృష్ణరాజా, టి. రామసామి, సి.ఎస్. మురుగన్ అనే నలుగురు జడ్జీలు 2005, నవంబర్ 25 నుండి 2013 నవంబర్ వరకు జరిగిన కోర్టు ట్రయల్స్‌ను విన్నారు. కోర్టులో న్యాయ విచారణపై మద్రాస్ హైకోర్టు 2011 అగస్ట్‌లో స్టే విధించింది. 2012 ఫిబ్రవరిలో మద్రాస్ హైకోర్టు టి. రామసామి అనే జడ్జి స్థానంలో సి.ఎస్. మురుగన్‌ను నియమించింది. పక్కదారి పడుతున్నదని న్యాయ విచారణను నిలుపుదల చేయడం, జడ్జీలను మార్చడం చూస్తుంటే నిందితులు తమకు అనుకూలంగా ఎంతలా ప్రభావితం చేస్తున్నారో తెలుసుకోవచ్చు. ఇలా ప్రభావితం చేయగలిగే శక్తి, ఉన్నత న్యాయస్థానాల్లో ప్రాబల్యం, రాజకీయ ప్రాబల్యం ఎంతమంది సాధారణ భారత ప్రజానీకానికి ఉంటుంది? ఇక్కడ న్యాయం కొనుక్కో బడుతుందని, న్యాయం అన్యాయం అయిపోగలదని, అన్యాయం న్యాయంగా చెలామణి కాగలదని ఎంతగా ధన, రాజకీయ, అధికార, మత పలుకుబడులుంటే అంతగా తమకు అనుకూలంగా న్యాయం మలచబడుతుందని అర్థం అవుతుంది.

2013, నవంబర్ 27న శంకర్ రామన్ హత్య కేసులో పుదుచ్చేరి డిస్ట్రిక్ట్, సెషన్స్ కోర్టు జడ్జి సి.ఎస్. మురుగన్ తీర్పు ప్రకటించారు. ప్రాసిక్యూషన్ వారి వాదనలు హంతకులను, కుట్రదారులను నిరూపించడంలో వైఫల్యం చెందాయని నిందితులందరిని నిర్దోషులుగా పేర్కొన్నారు. శంకర్ రామన్ భార్య పద్మ, కూతురు మైత్రేయిలు కూడా చెన్నయ్ కేంద్ర కారాగారంలో నిర్వహించిన నిందితుల గుర్తింపు పరేడ్‌లో గుర్తించిన నిందితులను కోర్టులో గుర్తు పట్టడంలో విఫలం అయ్యారని కోర్టు తెలిపింది.

శంకర్ రామన్ కొడుకు ఆనంద్‌శర్మను, అతని తల్లి, సోదరి ఎందుకు కోర్టులో నిందితులను గుర్తించలేదని అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ చెన్నయ్‌లో ఉండే నీ కొడుకు, కూతురు సజీవంగా ఉండాలంటే నీవు వేరే విధంగా పాడాలని ఎవరో అరిచారని ఫ్రంట్‌లైన్ రిపోర్టర్‌కు చెప్పాడు. కాంచీపురంలో తనింట్లో ఉన్న ఆనంద్‌శర్మను ఫ్రంట్‌లైన్ రిపోర్టర్ కలిసినప్పుడు తన తల్లి, సోదరిలు ఇద్దరూ కూడా 2004, సెప్టెంబర్ 3న తన తండ్రి హత్యకు గంట ముందు సాయంత్రం 4.30 గంటలకు తమ ఇంటికి వచ్చి, తన తండ్రి గురించి వాకబు చేసిన వారిని గుర్తు పట్టగలిగారు. కాని బెదిరింపుల కారణంగా ఆ పనిచేయలేక పోయారని చెప్పుకొచ్చాడు. మొత్తం మీద 24 మంది నిందితుల్లో ఎ6గా కతిరావన్ తీర్పుకు ముందే హత్య కావించ బడడంతో మిగతా 23 మంది నిర్దోషులుగా ప్రకటింపబడ్డారు. అందరూ నిర్దోషులే అయితే వీరిలో ఎవ్వరూ మా నాన్నను హత్య చేయకపోతే మరెవరు హత్యచేశారు? ఇది ఆనంద్‌శర్మ ప్రశ్నగా మాత్రమే మిగిలి పోకూడదు. ప్రజాతంత్ర వాదులందరి ప్రశ్న కావాలి. ఈ తీర్పుపై అప్పీలుకు వెళతారా? అంటే సంశయం వెలిబుచ్చాడు. ఒకవేళ ప్రభుత్వం కనుక అప్పీల్‌కు వెళితే సహకరిస్తామని చెపుతున్నాడు. ఎంఎ (సంస్కృతం) చేసి నిరుద్యోగిగా ఉంటున్న శంకర్ రామన్ కొడుకు ఆనంద్ శర్మ.

2001, డిసెంబర్ 13న పార్లమెంట్‌పై దాడికి సంబంధించిన కుట్రలో భాగస్వామి అంటూ అఫ్జల్‌గురుపై నేరారోపించి తగు సాక్ష్యాధారాలు లేకుండానే ఉరితీశారు. స్పెషల్ టాస్క్‌ఫోర్స్‌తో మిలాఖత్ అయిన పోలీసుల కథనాలపై ఆధారపడి ఈ శిక్ష వేశారని అఫ్జల్‌గురు తన న్యాయవాదికి రాసిన లేఖల్లో పేర్కొన్నాడు. బలవంతంగా తెల్లకాగితాలపై సంతకాలు తీసుకుని ఒప్పుకోలు స్టేట్‌మెంట్ రాయించుకుని దాని ఆధారంగా శిక్ష ఖరారు చేశారు. అఫ్జల్ గురును ఉరితీయమని బిజెపి తదితర సంఘ్ పరివార్ శక్తులు ఒత్తిడి తెచ్చాయి. చివరకు అతడు ఉరి తీయబడ్డాడు. అయితే శంకర్ రామన్ హత్య కేసులో మాత్రం సాక్షులు తామిచ్చిన గత సాక్ష్యానికి వ్యతిరేకంగా తిరిగి సాక్ష్యమిస్తారు. స్వయాన శంకర్ రామన్ భార్య, కూతుర్లు గతంలో పరేడ్‌లో గుర్తించిన నిందితులను కోర్టులో గుర్తించ లేకపోవడం జరుగుతుంది. జయేంద్ర, విజయేంద్ర సరస్వతులకు అనుకూలంగా బిజెపి, సంఘ్ పరివార్ శక్తులు దేశవ్యాప్తంగా ఆందోళనలు చేస్తారు.

మానవ హక్కుల కార్యకర్త, పియుసిఎల్ నాయకుడు, పిల్లల డాక్టర్ బినాయక్‌సేన్‌పై చత్తీస్‌గఢ్ కోర్టులో యావజ్జీవ శిక్ష ఖరారు చేయ బడుతుంది. ఇక్కడ కూడా కనీస సాక్ష్యాధారాలు లేవు. కేవలం జైలులో ఉన్న మావోయిస్టు నాయకుడి నుండి ఉత్తరం వేరెవరికో చేరవేయ బోయాడని, నిషేధిత మావోయిస్టు పార్టీకి అనుకూలంగా పని చేస్తున్నాడని అభియోగం మోపి తీవ్రమైన శిక్షను విధించారు. అనారోగ్యంతో బాధపడుతున్న అతనికి బెయిల్ ఇవ్వకుండా ఎన్నో ఏళ్లు ఇబ్బంది పెట్టారు. జయేంద్ర సరస్వతిల విషయంలో బలమైన సాక్ష్యాధారా లున్నప్పటికీ అరెస్టయిన రెండు నెలల్లోనే సుప్రీంకోర్టు బెయిల్ మంజూరు చేస్తుంది. జైలులో జయేంద్రకు రోజు పూజలు చేసుకోవడానికి తగు వసతులు ఏర్పాటు చేయాలని వాజ్‌పాయి అప్పటి హోంమంత్రి శివరాజ్ పాటిల్‌కు విజ్ఞప్తి చేస్తాడు.

జీవితఖైదు విధించబడి, ఆ కాలం ఎప్పుడో పూర్తయి సంవత్సరాలు గడుస్తున్నప్పటికీ విడుదలకు ఎదురు చూస్తున్న మావోయిస్టు పార్టీకి చెందిన గణేష్ నేటికీ విడుదల కాలేదు. శంకరాచార్యులు తదితరులు నిర్దోషులుగా నిరూపించబడతారు. విడుదలవుతారు. బిజెపి నాయకుడు సుబ్రమణ్యస్వామి జయేంద్ర సరస్వతిపై తీర్పుపై స్పందిస్తూ శంకరా చార్యలిద్దరికి, విజయేంద్ర, జయేంద్ర సరస్వతిలకు తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత స్వయంగా వచ్చి క్షమాపణలు చెప్పాలని డిమాండ్ చేస్తాడు. ఈ తీర్పుపై పై కోర్టుకు అప్పీలుకెళ్లడం శుద్ధ దండగని చెపుతాడు.

సీమా ఆజాద్ ఒక హక్కుల కార్యకర్త. పియుసిఎల్ ఉత్తర్‌ప్రదేశ్ నిర్వాహక కార్యదర్శి. హక్కుల ఉల్లంఘనలపై, ప్రజా వ్యతిరేక పాలక విధానాలపై నిత్యం రాస్తూ ఉంటుంది. ఆమెను, ఆమె భర్త విశ్వ విజయ్‌ను మావోయిస్టు కార్యకర్తలని, వారి వద్ద మావోయిస్టు పార్టీ ప్రచురించిందని చెబుతున్న సాహిత్యం ఉందని చెప్పి 2010, ఫిబ్రవరి 10న అరెస్టు చేసి కేసు నడిపించి, 2012, జూన్ 8న అలహాబాద్ జిల్లా సెషన్స్ కోర్టు వీరికి జీవిత ఖైదు నిర్ణయించేసింది. అరెస్టయిన రెండున్నరేళ్లలోపే వీరిద్దరికి శిక్షలు ఖరారైపోతాయి. అయితే జయేంద్ర సరస్వతికి సంబంధించి మాత్రం నేర విచారణ పూర్తి కావడానికి 2004 నుండి 2013 వరకు తొమ్మిదేళ్లు పడుతుంది. కోర్టులు మారుతుంటాయి. జడ్జీలు మార్చబడతారు. సాక్షులు తిరగబడతారు. చివరకు ఏ శిక్షలు లేకుండానే వారికి అనుకూలంగా తీర్పు వచ్చేస్తుంది.

*(రచయిత ఉపాధ్యాయులు, డిటిఎఫ్ సభ్యులు)*

వీ

# తెహల్కా కుదుపు, ఇప్పుడిక తమాషా

***పత్రికా రంగంలో సామ్రాజ్యవాద పెట్టుబడి ప్రవేశించాక దాని విలువలు దిగజారిపోయాయనీ, లైంగిక, ఆధిపత్య అకృత్యాలకు నిలయాలుగా మారిపోయాయనీ అంటున్నారు* సత్యసాగర్**

ఎనిమిది సంవత్సరాల కింద బెంగళూరులో ఒక సదస్సులో వార్తా మాధ్యమాలు మెరుగైన ప్రపంచాన్ని ఎలా సాధిస్తాయో తరుణ్ తేజ్‌పాల్ ఉపన్యాసం ఇచ్చాడు. దేశంలోని క్రైస్తవ విద్యాసంస్థల జర్నలిజం విద్యార్థుల సమావేశం అది. ప్రచార మాధ్యమాలకు ఉండ వలసిన స్వేచ్ఛ గురించి తేజ్‌పాల్ ఇచ్చిన ఆ ఉపన్యాసం అందరినీ ఆకట్టుకుంది.

ఆయన ఉద్వేగభరితంగా, సమ్మోహకంగా, చాల స్పష్టతతో మాట్లాడాడు. భారతీయ జర్నలిజంలో అత్యంత ఉత్తమమైన వార్తా కథనాలలో కొన్నిటిని ప్రచురించిన తెహల్కా ప్రధాన సంపాదకుడిగా ఆయన మాటలకు చాల విశ్వసనీయత ఉండింది. ఆ ఉపన్యాసం కాగానే ఒక చోటి నుంచి మరొక చోటికి ఎగిరిపోతూ భజనపరులైన శ్రోతలకు అగ్నిసదృశ ప్రవచనాలు ఇచ్చే ప్రబోధకుడి లాగ తేజ్‌పాల్ హడావుడిగా వెళ్లిపోయాడు.

ఆయన తరువాత వక్తగా నేను ఆయన మాట్లాడినదాని మీద స్పష్టంగానే అనుమానాలు ప్రకటించాను. జర్నలిజం వృత్తిని అంతగా కీర్తించడం సముచితం కాదేమోనని, జర్నలిజానికి మొత్తంగా ఏవో పైపైపూతలు మినహా లోతైన పరివర్తనను తీసుకువచ్చే శక్తిలేదని నేనన్నాను. (ఇప్పుడు రుజువైనట్టుగా తేజ్‌పాల్ నకిలీ మనిషిగా బైటపడతాడని నాకప్పటికి చిన్నమెత్తు అనుమానం కూడ లేదు).

అక్కడ శ్రోతలుగా ఉన్న విద్యార్థులను, ప్రచార మాధ్యమాల అధ్యాపకులను ఉద్దేశించి నేను చెప్పిన మామూలు అంశం ఒకటే – ప్రచార మాధ్యమాల పరిశ్రమ చట్రానికి బైట 'జర్నలిజం' అనే ప్రత్యేక వస్తువు ఏదీ లేదు అని. ప్రజాస్వామ్యపు నాలుగో స్తంభం అని అందరూ పిలుస్తున్నది వాస్తవానికి పెట్టుబడికి ఐదో స్తంభం మాత్రమే అని. గతంలో ఈ పాత్ర కొంతవరకు దాగి ఉండేది గాని ఈరోజుల్లో బహిరంగంగానే కనబడుతున్నది.

జర్నలిజం పరిమితులను రూపొందించే ఏకైక ప్రధాన అంశం ప్రచార మాధ్యమాల యజమానుల వ్యాపార ప్రయోజనాలే. అదే పత్రికా స్వేచ్ఛకు అతి పెద్ద ప్రమాదం. అది ప్రచార మాధ్యమ సంస్థ లోపలనే ఉంటుంది. పత్రికాసమావేశాల్లో సింహంలా గర్జించే ప్రతి జర్నలిస్టూ, తన కార్యాలయంలో ఉన్నప్పుడు తన తోకను మడిచి కాళ్లమధ్య పెట్టుకోవడం తప్పనిసరి.

చాల మంది జర్నలిస్టులకు తాము నమ్మే వృత్తి ఆదర్శాలు అని ప్రగల్భాలు పలికే వాటి కన్న ముఖ్యమైనవి ఉద్యోగ భద్రత, ఆ వృత్తిలోని సౌకర్యాలు. ఇందులో ప్రత్యేకమైనదీ, ఆశ్చర్యకరమైనదీ ఏమీ లేదు. ఒక్క ప్రచార మాధ్యమాల విషయంలోనే కాదు, అన్ని పరిశ్రమలలోను పరిస్థితి అదే. అయితే ప్రచార మాధ్యమాలలో పనిచేసే చాలమంది వ్యక్తులు తమకు వేతనాలిచ్చే యజమానులకు పూర్తిగా లొంగిపోవడమే వారు ప్రతిరోజూ కనబడే అతి ముఖ్యమైన వార్తలను ఉద్దేశపూర్వకంగా బైటికి తేకుండా విస్మరించడానికీ, చిల్లర వార్తలను 'బ్రహ్మాండం బద్దలు కొట్టే వార్తలు'గా ప్రకటించడానికీ కారణం.

ఈ రోజుల్లో దేవాలయాల్లో, మసీదుల్లో, చర్చిలలో మతాన్ని చూడడం, ఆసపత్రులలో ఆరోగ్యాన్ని చూడడం, మన పాఠశాలల్లో విద్యను చూడడం, విప్లవ పార్టీలలో విప్లవాన్ని చూడడం సాధ్యం కానట్టుగానే, వార్తా పరిశ్రమ నుంచి సత్యాన్ని ఆశించడం అర్థరహితం.

ఇదంతా చెప్పి, ఇంకా వారిని రెచ్చగొట్టడానికి, ఇవాళ మనం నివసిస్తున్న సమాజం గురించి లోతైన విషయాలు అర్థం చేసుకునే అవకాశం టెలివిజన్ సీరియళ్లలో, సినిమాలలో ఉన్నదని, అలాగే పూర్తిస్థాయి వినోదం కావాలంటే మాత్రం చూడవలసింది వార్తా ఛానళ్లేనని నేనన్నాను.

ఎంతో గౌరవాన్ని పొందిన జర్నలిస్టు, ప్రచురణకర్త, నవలాకారుడు, ప్రజా వినోద కార్యక్రమాల నిర్వాహకుడు, ఇప్పుడు లైంగిక నేరస్తుడుగా మారిన తేజ్‌పాల్ ఇవాళ అరెస్టయి, మిగిలిన భారత ప్రచార మాధ్యమాల వేటకు గురవుతున్నప్పుడు నాకివన్నీ గుర్తుకొచ్చాయి. ఈ నూట ఇరవై కోట్ల జనాభాగల దేశంలో మరే ఇతర ముఖ్యమైన సంగతీ జరగనట్టుగా, ఆయన గురించిన కథనాలు వరుసగా ఐదురోజులపాటు పతాక శీర్షికల స్థలాన్ని ఆక్రమించాయి.

నిస్సహాయురాలైన ఒక యువ మహిళా ఉద్యోగి మీద తేజ్‌పాల్ లైంగిక అత్యాచారానికి పాల్పడడం ఒక దిగ్భ్రాంతికరమైన పచ్చి నేరపూరిత చర్య అనడంలో నాకు ఎటువంటి సందేహమూ లేదు.

లైంగిక నేరాలకు మహాకేంద్రం లాంటి బృందంలో తరుణ్ తేజ్‌పాల్ పనిచేస్తుండేవాడు. అక్కడ పైస్థానాలలో ఉన్నవాళ్లు, బలవంతులు తమకన్న కింది స్థానాలలో ఉన్నవారి మీద తమ ఇష్టారాజ్యంగా ప్రవర్తించవచ్చు. అధికారం, సంపద, కీర్తి వాజీకరణ ఔషధాలుగా పనిచేయడం మాత్రమే కాదు, అంతులేని విచారణాతీత నేరాలు చేయడానికి పురికొల్పే గ్రహానికి చెందిన వాడాయన. అక్కడ చివరికి కూతురి వయసున్న యువతిని కూడ ఎరలోకి లాగడం (దాన్ని ఆ బృందంలో స్కోరింగ్ అనే ముద్దుపేరుతో పిలుస్తారు) రోజువారీ క్రీడలో భాగం.

అంతేకాదు, తెహల్కా అలమరల్లో దాచిన అస్థిపంజరాలు ఒక్కొక్కటీ బైట పడుతున్నకొద్దీ తేజ్‌పాల్‌తో సహా ఆ పత్రిక అత్యున్నత స్థాయి యాజమాన్యంలో ఉన్నవాళ్లందరూ (కనీసం ఇటీవలి సంవత్సరాలలో ఉన్నవాళ్లు) తాము బిగ్గరగా వల్లించిన సూత్రాలలో ప్రతి ఒక్కదాన్నీ తుంగలో తొక్కారని స్పష్టమవుతున్నది. సొమ్ము చేసుకోవడం కోసం వార్తా కథనాలను అచ్చువేయకుండా తొక్కిపట్టడం, కార్పొరేట్

ప్రయోజనపరుల కోసం వార్తాకథనాలు రాయడం, ప్రచారమాధ్యమాల అధికారాలను వినియోగించుకుని ఆస్తి పోగేసుకోవడం, అందరికీ తెలిసిన మోసగాళ్లతో వ్యాపార సంబంధాలు కలుపుకోవడం వంటి పనులన్నీ వాళ్లు చేశారు. మరొకపక్క తెహల్కా ఉద్యోగులతో మాత్రం 'గొప్ప' జర్నలిజం ఆశయాల కోసం నడుం బిగించి పని చేయమనీ, గొడ్డుచాకిరీ చేయమనీ ఉపదేశాలిచ్చారు.

ఇందుకు తేజ్‌పాల్‌ను విచారించాలి. చట్టం అనుమతించినంత కఠినంగా శిక్షించాలి. సముచితంగా ఎక్కువకాలం జైలుశిక్షను అనుభవించకుండా ఆయన తప్పించుకోలేడని ఇప్పటికి అనిపిస్తున్నది.

ఇదంతా చెపుతూనే, మిగిలిన భారత ప్రచార మాధ్యమాల గురించి కూడ ఒక మాట చెప్పాలి. తెహల్కా సంపాదకుడు తమ మధ్య ఏదో అనుకోకుండా జరిగిన ప్రమాదమన్నట్టుగా మిగిలిన భారత ప్రచార మాధ్యమాలన్నీ ఎడతెగని సంభాషణలు జరుపుతున్నాయి. పదాడంబరపు సంపాదకీయాలు రాస్తున్నాయి. వాటికి ఆ నైతిక హక్కు ఉన్నదా అని నా అనుమానం. తరుణ్ తేజ్‌పాల్ ప్రవర్తన ప్రస్తుత ప్రచారమాధ్యమ పరిశ్రమలో సాధారణాంశమే తప్ప మినహాయింపు కాదు.

మొట్టమొదట వార్తా ఛానళ్లలో, వార్తాపత్రికలలో అత్యధికభాగం ఈ వార్తా కథనాన్ని చూపుతున్నది తేజ్‌పాల్ చేసిన నేరపు దారుణత్వం వల్ల కాదు. ఇరవైనాలుగు గంటల ఛానళ్లు ఎలా పనిచేస్తాయో తెలిసిన వారెవరికైనా ఆ విషయం తెలుసు. ఈ హడావుడి అంతా 'ఐదు నక్షత్రాల హోటల్ నేపథ్యంగా, రాబర్ట్ డి నీరో వంటి హాలీవుడ్ తార సాక్షిగా అత్యాచారం' అనే వార్తకు ఎంత ఆకర్షణ ఉంటుందో, అది ఎంతమంది వీక్షకుల గుండెలను వేగంగా కొట్టుకునేలా చేస్తుందో, అలా ఆ ఛానళ్ల టిఆర్‌పి రేటు ఎట్లా పరుగెత్తుతాయో తెలిసినందువల్ల మాత్రమే.

'మహిళా జర్నలిస్టు తన దుస్తులు సవరించుకుంటూ లిఫ్ట్ లోంచి బైటికొస్తున్న దృశ్యాన్ని చూపిన సిసిటివి కెమెరాలు' అని టైమ్స్ ఆఫ్ ఇండియా కామోద్దీపాన్ని కలిగించే పతాక శీర్షిక పెట్టింది. సందర్భం ఏమిటనే దాని పట్ల ఉద్దేశపూర్వకంగానే మొరటుగా ఉన్న జర్నలిస్టులు ఇటువంటి దుర్మార్గమైన వాక్యాలను, పదబంధాలను ప్రతిరోజూ తమ వార్తాపత్రికల మొదటి పేజీలలో నింపారు.

కొన్ని సంవత్సరాల కింద ఈ పనికిమాలిన మాధ్యమాల సంస్థలో పనిచేస్తున్న నన్ను దేశంలో కోళ్ల పరిశమ పెరుగుదల గురించి రాసినందుకు చివాట్లు పెట్టారు. అధికారిక ఉత్తరంలో ఆ ప్రచార మాధ్యమ సంస్థ విధానం ప్రకారం 'మాంసం పరిశ్రమను ప్రోత్సహించే వార్తలు రాయగూడద'ని హెచ్చరించారు. బహుశా ఆ సంస్థ యజమానులు శాకాహారాన్ని ప్రేమించే జైనులు కావడం కారణం కావచ్చు. కాని ఇవాళ వాళ్ల వెబ్‌సైట్ మీద ప్రచురిస్తున్న కథనాలు, దృశ్యాలు ఊరికే అలా చూసినా మొత్తం స్త్రీజాతినే 'మాంసం'గా చూపడంలో టైమ్స్ ఆఫ్ ఇండియా అగ్రభాగాన ఉన్నదని తేలుతుంది. ఈ దినపత్రిక భారతదేశపు నిక్కబొడుచుకున్న ప్రజాస్వామ్యానికి (ఎలెక్టొరల్ డెమొక్రసీ – ఎన్నికల ప్రజాస్వామ్యం – అనే మాటను రచయిత వెటకరిస్తూ ఎరెక్టొరల్ డెమొక్రసీ అని వాడారు. ఎరెక్టొరల్ అంటే లింగం నిక్కబొడుచుకోవడం) ప్రధాన స్తంభం గనుక ఈ దినపత్రికకు అత్యాచారం అనేది చాల ఇష్టమైన విషయం. ఆర్నబ్ అత్యాచార గోస్వామి తన యజమానులను ఈ విషయంలో ఒకసారి నిలదీసి ప్రశ్నిస్తే బాగుంటుంది. (జాతి ఈవిషయం తెలుసుకో దలచుకున్నది... అని ప్రగల్భాలు పలుకుతుంటాడు గదా...)

రెండో విషయం, తెహల్కా పతనం చూసి కొందరు ప్రధాన స్రవంతి జర్నలిస్టులు కనబరచిన ఆనందోత్సాహాలు చూడండి. అందుకు కారణం తెహల్కాను ఇన్నాళ్లూ భారత ప్రచార మాధ్యమాల ప్రపంచం లోకి దూసుకొచ్చిన అల్లరి ఆగంతుకుడుగా భావించారు. దాన్ని తమలో ఒకరుగా ఎన్నడూ అంగీకరించలేదు. మాధ్యమాల మార్కెట్ లో కొత్త వ్యాపారిగా తెహల్కా వస్తువులోనూ, పద్ధతులలోనూ సంప్రదాయాన్ని ధిక్కరించడానికి సిద్ధపడింది. అందువల్ల పాత పద్ధతిని, ఎక్కువగా మితవాద జర్నలిజాన్ని సమర్థించేవారికి దానిపట్ల తక్షణమే ఏవగింపు కలిగింది.

టైమ్స్ ఆఫ్ ఇండియా, హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, హిందుస్తాన్ టైమ్స్, ఈ రెండు దశాబ్దాలలో పుట్టుకొచ్చిన గోలగోలగా సాగే లెక్కలేనన్ని టివి ఛానళ్లు – అన్నిటిలోనూ ఎక్కువభాగం పాతుకు పోయిన, కుటుంబ వ్యాపారస్తుల వ్యాపార గృహాలే. అవి 'భారతదేశం' అనే పేరుతో సాగుతున్న వలసవాద దొంగల దోపిడీని నాగరిక పద్ధతుల ముసుగు కప్పి పరిరక్షిస్తున్నాయి. ఒక దశాబ్దంన్నర కింద తెహల్కా ఒక కుదుపుతో ప్రారంభమైనప్పుడు దాని వార్తాసేకరణ పద్ధతులు ఉత్తి సాహస చర్యలుగా కనిపించాయి. మిగిలిన మాధ్యమాలన్నీ యజమానుల స్వార్థ ప్రయోజనాల వల్ల నిర్వీర్యమైపోయి ఎప్పుడో పోగొట్టుకున్న సాహసాన్ని తెహల్కా ప్రదర్శించింది.

ఆశ్చర్యకరమైన విషయమేమంటే, తెహల్కా ఏదో బ్రహ్మాండం బద్దలుకొట్టిన పేరు తెచ్చుకున్నప్పటికీ, దాని ప్రఖ్యాతమైన కూపీలుగా బైటపెట్టినవేవీ అప్పటికి ప్రధానస్రవంతి మాధ్యమాలకు తెలియని విషయాలు కావు. అవన్నీ ప్రజలు అప్పటికే అనుమానిస్తున్న విషయాలే. భారత సైన్యంలో అత్యున్నత అధికారులను స్కాచ్ విస్కీ సీసాలతో కొనవచ్చుననీ, క్రికెట్ మాచ్‌లలో ఎవరు గెలవాలో, ఎవరు ఎలా ఆడాలో ముందే నిర్ణయమవుతున్నదనీ, 'జాతీయవాద' రాజకీయ పార్టీల నాయకులు జాతీయ భద్రతను పణంగా పెట్టి లంచాలు తీసుకుంటున్నారనీ అప్పటికే ఎందరో జర్నలిస్టులకు తెలుసు. కాని ఏ ఒక్క వార్తాసంస్థకూ ఈ విషయాలు రాసే దమ్ములు లేవు. అతి మామూలు కారణమేమంటే, భారత సైన్యం, క్రికెట్, హిందూ జాతీయ వాదం అనే మూడూ ఘనత వహించిన భారత మధ్యతరగతి వర్గాల దృష్టిలో పవిత్ర గోమాతలు. వాటిని విమర్శించడం అంటే 'భారతదేశం' అనే భావననే దిగలాగడం.

'అందరి బట్టలూ ఊడదీసినవాడు ఇప్పుడు తన బట్టలే ఊడదీసుకున్నాడు' అనే మాట సోషల్ మీడియా వేదికల మీద ఎందరో అనామక వ్యాఖ్యాతలు అంటున్నారు. ఈ వ్యాఖ్యాతలకు ప్రతి విషయం మీద అభిప్రాయం ఉంటుంది. కాని దేనికీ బాధ్యత ఉండదు. ఈ మధ్యతరగతి ఆగ్రహంలో కొంత భాగమే ఇప్పుడు మాధ్యమాలలో తేజ్‌పాల్ వార్తా కథనాన్ని ప్రచురిస్తున్న తీరులో ప్రతిఫలిస్తున్నది. వాళ్లు తేజ్‌పాల్ కు 'అతని స్థానాన్ని' చూపదలచుకున్నారు.

ఇలా అనడమంటే, మతోన్మాదాన్ని, రాజ్య అత్యాచారాలను, ఇతర ముఖ్యమైన విషయాలను తెహల్కా ప్రచురించిన తీరును ప్రశంసించిన వారు ఇప్పుడు తేజ్‌పాల్ నేర స్వభావం పట్ల, ఆ తర్వాత బైటపడిన ఆ సంస్థ అవినీతి పట్ల కోపంగా లేరని కాదు. భారత ప్రజానీకానికి అత్యవసరమైన ప్రముఖమైన సమస్యలను లేవనెత్తే వేదికగా తెహల్కాను

భావించినవారిలో ఒకరకమైన ద్రోహానికి గురయ్యామన్న భావన లోతుగానే ఉంది.

భారత ప్రధాన స్రవంతి మాధ్యమాలకు ఏమాత్రమైనా సిగ్గూ, నిజాయితీ ఉన్నట్టయితే, వారు తేజ్‌పాల్ కథనాన్ని ప్రచురించడంతో పాటే వారి సొంత సామ్రాజ్యాలలో అత్యున్నత స్థానాలలో కూచున్న లెక్కలేనంతమంది తేజ్‌పాల్ లను బైటికి పంపవలసి ఉండేది. తెహల్కా మాజీ సంపాదకుడిని వెంటాడుతున్న కెమెరాలు తమ సొంత కార్యాలయాలకు తీసుకువెళ్లి అక్కడ జూనియర్ ఉద్యోగులు, ముఖ్యంగా మహిళలు ప్రతిరోజూ వారి పైవారి చేతిలో ఏమి అనుభవిస్తున్నారో చిత్రించవలసి ఉండేది.

అట్లాగే వారిలో కొందరు తమ ప్రస్తుత, మాజీ ఉన్నతోద్యోగుల చరిత్రను పరీక్షించవలసి ఉంటుంది. 'సాహసిక జర్నలిజం' సాగిస్తున్నానని గప్పాలు కొట్టుకునే వార్తాపత్రిక స్థాపకుడైన 'మహా నాయకుడు' ఆ సంస్థలోని మహిళా ఉద్యోగుల పట్ల ఎటువంటి లైంగిక దుశ్చర్యలు జరిపేవాడో సుదీర్ఘకాలంగా ఉన్న ఆరోపణలను తవ్వితీసే దమ్ములు భారత ప్రచార మాధ్యమాలలో ఎవరికైనా ఉన్నాయా? ఆ అత్యాచారాల సాక్ష్యాధారాలు బైటపడితే 'మాధ్యమాల పరిరక్షకుడిగా' పేరుపొందిన ఆ మహాత్ముడి పేరు మీద అవార్డులు అందుకున్న జర్నలిస్టులు ఆ అవార్డులను తిరిగి ఇచ్చేస్తారా? కనీసం ఆయన అత్యాచారాలకు బలి అయి మిగిలిపోయిన వ్యక్తులను కలిసి, మాట్లాడి, సాక్ష్యాధారాలు సేకరించే ఆసక్తి ఉన్నవారు మాధ్యమాలలో ఉన్నారా?

ఈ పరిశోధనను వార్తా మాధ్యమాల రంగానికే పరిమితం చేయడం ఎందుకు? మొత్తంగానే భారత కార్పొరేట్ వ్యాపార రంగంలో అమలవుతున్న లైంగిక దుర్మార్గాలను ముట్టుకోవడానికి మాధ్యమాలు సిద్ధంగా ఉన్నాయా? భారత దేశంలోని అతి ప్రధాన ఐటి కంపెనీలో ఒక అత్యున్నత అధికారికి సంబంధించి కొన్ని సంవత్సరాల కింద బైటపడిన ఉదంతం సముద్రంలోంచి పైకి తేలిన చిన్న మంచుగడ్డ మాత్రమే. భారత వ్యాపార రంగంలో లైంగిక అత్యాచారాలు, వేధింపులు సర్వవ్యాపితమైనవి.

ఇక భారతదేశంలోని మధ్య, ఉన్నత మధ్యతరగతిని దాటి అవతలికి చూడదలచుకుంటే లైంగిక అత్యాచారాల, దాడుల, వేధింపుల ఘటనలు లెక్కలేనన్ని, భయానకమైనవి. ప్రత్యేకించి నిర్మాణ రంగంలో స్త్రీలు తమ రోజు కూలీ సంపాదించుకోవాలంటే పైవారికి లైంగిక కానుకలు ఇవ్వక తప్పని నిస్సహాయ స్థితి ఉంది. వ్యవసాయ కార్మికుల విషయంలో భూస్వాముల చేతుల్లో స్త్రీల లైంగిక దోపిడీ వ్యవస్థీకృత రూపాలు ధరించి 'సంప్రదాయం'పేరు మీద చలామణీ అవుతోంది.

తెహల్కా కథ కేవలం లైంగిక దాడి మాత్రమే కాక, అది దాటి జర్నలిజం మౌలిక విలువలను ధ్వంసం చేసేదిగా సాగింది. అందువల్ల ఇవాళ ప్రతి ఒక్క వార్తా సంస్థా ఏదో ఒక ప్రముఖ వ్యాపార సంస్థ గుప్పెట్లో ఎలా చిక్కి ఉన్నదో పరిశోధన జరగాలి. ప్రతిరోజూ వ్యాపార సంస్థలకు అనుకూలమైన కథనాలు ప్రచురిస్తున్నందుకు, వారికి ఇబ్బంది కలిగించే కథనాలు తొక్కిపడుతున్నందుకు ఎటువంటి రూపాలలో లంచాలు అందుతున్నాయో చెప్పడానికి ఏదైనా వార్తా సంస్థ సిద్ధంగా ఉందా? కనీసం తమ ప్రచురణ సంస్థలను, ఛానళ్లను నిజంగా నడుపుతున్నదెవరో, యజమానులెవరో అయినా చెపుతారా? లేదా, ఎంత మంది సీనియర్ పాత్రికేయులు రాజ్యం నుంచి గాని, కార్పొరేట్ సంస్థల నుంచి గాని, వారికి ప్రజాసంబంధాల వాహికలుగా పనిచేసినందుకు భూమి, ఇళ్లు, ఉచిత విదేశీ యాత్రలు, ఇతర కానుకలు పొందారో చెపుతారా?

ఈ జాబితా ఇలా కొనసాగుతుంది. కాని భారత ప్రచార మాధ్యమాలు తమ గురించో, తమ సంపన్న పోషకుల గురించో పరిశోధనలు జరుపుతాయని నేను అనుకోవడం లేదు. ఆ పని చేయవలసింది మిగిలిన భారతదేశమే. ఈ లోగా ఎవరైనా చేయగల, చేయవలసిన పని ఏమంటే ఇంట్లో టెలివిజన్ ఆపివేయడం. వార్తా పత్రికను ఆ పత్రిక తెచ్చిన కుర్రాడి మీదికి విసిరికొట్టడం. బైట వాస్తవ ప్రపంచంలో నిజంగా ఏం జరుగుతున్నదో తెలుసుకోవడానికి కిటికీ లోంచి బైటికి చూడడం. మన మెదళ్లలో విషం నింపడానికి, మనను జీవన్మృతులుగా మార్చి మనం ఏం చేయాలో నిర్ణయించడానికీ మనకు ఈ బలిసినవారి మాధ్యమాలు అక్కరలేదు.

అలాగే, సదుద్దేశాల తోనే టెలివిజన్ చర్చా కార్యక్రమాలలో కనబడే కార్యకర్తల కోసం ఒక మాట చెప్పాలి. ఉదారవాద, వామపక్ష ఆశయాలకు తెహల్కా ఇచ్చిన తాజా కుదుపు అనుభవం నుంచి మనం తీసుకోవలసిన జాగ్రత్త ఏమంటే భారత ప్రచార మాధ్యమాల కపటత్వం నిండిన చర్చలలో పాల్గొనడానికి ఉత్సాహపడడం అంటే ఆ తమాషాకు తెలియకుండానే గుడ్డిగా విశ్వసనీయత కల్పించడమే.

మాధ్యమాలు కేవలం తటస్థమైన వార్తాహరులు మాత్రమే కాదనీ, ఒక పెద్ద బానిసల శిబిరంగా మారిపోయిన ఈ దేశపు బానిస యజమానులలో అవి భాగమనీ అర్థం చేసుకోవలసిన సమయం ఇది. ఇవాళ మనకు కావలసింది భారత ప్రజలతో నేరుగా సంభాషించే మార్గాలు కనిపెట్టడం. ఇరవైనాలుగు గంటల స్టింక్ ఫెస్ట్ (కంపు ఉత్సవం – తెహల్కా జరిపిన థింక్ ఫెస్ట్ కార్యక్రమంపై వ్యంగ్యం) అనే భారత ప్రచార మాధ్యమాలను అవి నిజంగా ఎక్కడ ఉండాలో అక్కడికి, అంటే చెత్తబుట్టలోకి, తోసి వేయడం.

(రచయిత మాజీ జర్నలిస్టు. ప్రస్తుతం పశ్చిమ బెంగాల్‌లో శాంతినికేతన్‌లో ప్రజారోగ్య కార్యకర్తగా పనిచేస్తున్నారు. ఈ వ్యాసం ఇంగ్లిష్‌లో http://kafila.org/ మీద అచ్చయింది.) వీ

# ఎర్రబల్బు, వింత హారన్లపై సుప్రీం కొరడా

*తాము సాధారణ ప్రజల కంటే అధికులమని విర్రవీగే నాయకులకూ, అధికారులకూ సుప్రీం కోర్టు తీర్పు చెంపపెట్టులా పనిచేస్తుందని అంటున్నారు* **చెరుకూరి సత్యనారాయణ**

లోక్‌సత్తా అధ్యక్షులు జయప్రకాష్ నారాయణ ప్రకాశం జిల్లా కలెక్టర్‌గా ఉన్న సమయంలో కలెక్టర్లకి కారుపై ఎర్ర బల్బు పెట్టుకునే అర్హత లేదని చెప్పి స్వయంగా దగ్గరుండి ఆ ఎర్రబుగ్గని తొలగించి కారుని వాడారు. ఎస్.ఆర్. శంకర్ నెల్లూరు కలెక్టర్‌గా ఉన్నప్పుడు ఒక్కడే మార్కెట్‌కు నడిచి వెళ్లి కూరగాయలు కొనుక్కునేవాడు. కనకమహల్లో క్యూలో నిలబడి సినిమా టికెట్ కొనుక్కున్నాడు. ప్రయాణమై వెళ్లేటప్పుడు పక్కన డఫేదారు లేకుండా స్టేషన్‌కు వెళ్లి రైలెక్కడమేగాక తనకు వీడ్కోలు ఇచ్చే అధికారుల్ని సైతం డఫేదారుల్ని వెంట తేవద్దని ఆదేశించేవాడు.

కాని మా గుంటూరులో సాదాసీదా పదవులైన మేయర్, డిప్యూటీ మేయర్, గ్రంథాలయ సంస్థ ఛైర్మన్, ఆర్.టి.సి. రీజియన్ అధ్యక్షులుగా ఉన్నవారు సైతం కారుపై ఎర్రబుగ్గ తగిలించుకుని తిరుగుతూ ట్రాఫిక్ పోలీసులను హైరానా పెట్టి తమ తమ వాహనాలకు ముందు దారి చేయించుకుని అమితానంద పడడం చూశాను.

ఫ్యూడల్, రాజరిక ప్రభువుల్లాగా నేటి ప్రజా ప్రతినిధులు ప్రవర్తించడం, ప్రజలకంటే తాము అధికులమనే దర్పాన్ని ప్రదర్శించడం హేయం. ఈ తరహా ప్రజా వ్యతిరేక, ప్రజాస్వామ్య విరుద్ధ ప్రవర్తన గల ప్రజా ప్రతినిధుల అక్రమ చర్యలకు వ్యతిరేకంగా వారికి మంచి నడవడిక నేర్పాలని డిసెంబర్ 10న జి.ఎస్. జస్టిస్ సింఘ్వీ, జస్టిస్ నాగప్పన్‌లతో కూడిన సుప్రీం కోర్టు ధర్మాసనం ఒక మంచి తీర్పుని ప్రకటించింది.

ఇది జస్టిస్ సింఘ్వీ పదవీకాలంలో ఇచ్చిన చివరి తీర్పు. 2జి కుంభకోణంపై దర్యాప్తు చేయించి కేంద్ర మంత్రుల్లో అక్రమార్కుల భరతం పట్టిన గొప్ప నిజాయితీ పరుడు జస్టిస్ సంఘ్వీ, ఈ తీర్పు చెప్పిన రోజే పదవీ విరమణ చేశారు.

ఉత్తరప్రదేశ్‌కు చెందిన అభయ్ సింగ్ అనే సామాజిక కార్యకర్త దాఖలు చేసిన పిటిషన్‌పై ఆయన తరపున ప్రముఖ న్యాయవాదులు హరిష్ సాల్వే, ప్రశాంత్ భూషన్‌లు వాదించారు. విషయ విస్తృతి కారణంగా దీన్లో అన్ని రాష్ట్ర ప్రభుత్వాల్ని ప్రతివాదులుగా చేర్చిన తర్వాత సుప్రీం ధర్మాసనం ప్రజాస్వామ్య స్ఫూర్తిని కలిగించే ఈ తీర్పుని వెలువరించింది. వీటి వాడకం రాచరిక మనస్తత్వానికి చిహ్నమని అనర్హులు వీటిని వాడకుండా నిరోధించాలని రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల్ని అదేశించింది.

మోటరు వాహనాల చట్టంలోని అనేక సెక్షన్లని, రూల్స్‌ని సవివరంగా ఉదహరిస్తూ భారత రాజ్యాంగ సభలో రాజ్యాంగ నిర్మాతలు జవహర్‌లాల్ నెహ్రూ, బాబూ రాజేంద్రప్రసాద్‌ల ఉపన్యాసాల్ని సుదీర్ఘంగా ఉటంకించారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను వాగ్దానం చేయడమేగాక స్వాతంత్ర్య ఫలాల్ని ప్రజలందరూ అనుభవించేటట్లు చేయడమే రాజ్యాంగ లక్ష్యంగా వారు నిర్దేశించారు. పౌరుల మధ్య ఎక్కువ, తక్కువల్ని, పేద, ధనిక తేడాల్ని తొలగించి అందరూ సమానం అనే భావన కలిగిస్తామని వారు వాగ్దానం చేసిన విషయాన్ని ధర్మాసనం గుర్తు చేసింది.

కార్లపై ఎర్రబల్బుల్ని వాడే ప్రజాప్రతినిధులు, అధికారులు తాము అధికారానికి ప్రతీకలుగా భావించి అవిలేని వాళ్లని చులకనగా చూస్తున్నారని అలాంటి వారికి చట్టంపై ఏమాత్రం గౌరవం లేదని ప్రజలంటే వారికి లెక్కలేదని వ్యాఖ్యానించారు. ఈ పరిస్థితి మిగతా ప్రపంచంలో ఎక్కడా లేదని కూడా చెప్పారు.

తనకు సంక్రమించిన అధికారంతో కేంద్ర ప్రభుత్వం జనవరి 2002 11 నాటి నోటిఫికేషన్‌ను 2005 జులై 28న సవరించింది. దీని ప్రకారం ఎర్రబల్బు ఫ్లాష్‌తో సహా పెట్టుకోదగిన వారు 1. రాష్ట్రపతి 2. ఉప రాష్ట్రపతి, 3. ప్రధాన మంత్రి, 4. మాజీ రాష్ట్రపతి, 5. ఉప ప్రధాని, 6. సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి, 7. లోక్ సభ స్పీకర్, 8. కేంద్ర కేబినెట్ మంత్రులు, 9. మాజీ ప్రధానులు, 10. ప్లానింగ్ కమిషన్ డిప్యూటీ ఛైర్మన్, 11. పార్లమెంటు ఉభయ సభల్లో ప్రతిపక్ష నాయకులు, 12. సుప్రీం న్యాయమూర్తులు, ఫ్లాస్ లేకుండా ఎర్రబల్బు పెట్టుకోతగ్గ మరో 15 కేటగిరీ వ్యక్తుల్ని కూడా గుర్తించింది.

కారు ప్రయాణించే సమయంలో ఆయా వ్యక్తులు కారులో లేకపోతే బల్బుకి నల్లని ముసుగు తొడగాలి. రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర పాలిత ప్రాంత పాలనా యంత్రాంగం కూడా ఇలాంటి ఆదేశాలు ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వం కోరింది. కాని ఇతరులు ఎర్రబల్బులు కలిగి వివిధ రకాల శబ్దాలతో కూడిన సైరన్లు మోగిస్తూ వెళ్లడం చట్ట వ్యతిరేకం, రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం అని ధర్మాసనం పేర్కొంది.

చాలా రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర పాలిత ప్రాంత పాలనాధికారులు కేంద్ర ప్రభుత్వ ఆదేశాల్ని దుర్వినియోగపరిచాయని, దేశంలో వివిధ ప్రాంతాల్లో నేరాలు చేయడానికి ఈ ఎర్ర బుగ్గల కార్లు వినియోగించుకున్నారని ఇలాంటి కార్లని తనిఖీ చేయడానికి పోలీసు అధికారులు భయపడతారని సుప్రీం కోర్టు అభిప్రాయపడింది.

చట్టంలో ఉన్న 'గొప్ప హోదా గల వ్యక్తులు' అనే పదం దుర్వినియోగపరిచారని, ఈ పదం విస్తృత పరచరాదని, ఒకవేళ అలా జరిగుంటే మూడు నెలల్లోపల దాన్ని సవరించుకోవాలని సూచించింది.

అంబులెన్సులు, పైలట్ కార్లు, ఎస్కార్ట్ కార్లు, ఫైర్ ఇంజన్లు, శాంతి భద్రతల నిర్వహణలో ఉన్న పోలీసు కార్లు కూడా ఎర్రలైట్లు ఉపయోగించరాదని అవసరమనుకుంటే బ్లూ, తెలుపు లాంటి ఇతర రంగులు ఉపయోగించుకోవచ్చని సైచించింది.

# దక్షిణాఫ్రికా పేదలను అమ్మేసిన ఎఎన్‌సి

**వర్ణవివక్ష పాలనకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం చేసిన ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ (ఎఎన్‌సి) అధికారంలోకి వచ్చాక ఎలా పతనమైపోయిందో వివరిస్తున్నారు రానీ కాస్రిల్స్**

దక్షిణాఫ్రికాలోని యువతరాన్ని 'స్వేచ్ఛలో జన్మించిన తరం'గా పిలుస్తారు. తమను ఎవరు పాలించాలో తామే నిర్ణయించుకునే వోటు హక్కు ఉన్న ప్రజాస్వామిక సమాజ గౌరవాన్ని వారు అనుభవిస్తున్నారు. కాని ఆధునిక దక్షిణాఫ్రికా సమగ్రమైన సమాజం కాదు. పూర్తి సమానత్వం - సాంఘిక, ఆర్థిక సమానత్వం - అక్కడ ఉనికిలో లేదు. దేశపు సంపద మీద అధికారం కొద్ది మంది చేతుల్లోనే ఉంది. అందువల్ల కొత్త సవాళ్లూ, కొత్త నిరాశలూ తలెత్తుతున్నాయి. జాతివివక్షకు వ్యతిరేకంగా పోరాడిన నావంటి వాళ్లకు ఈ నిరుత్సాహకరమైన నేపథ్యంలో తరచుగా ఒక ప్రశ్న వస్తుంటుంది. మేం చేసిన త్యాగాలు వ్యర్థమయ్యాయా అని. ఆ త్యాగాలు వ్యర్థం కాలేదని జవాబు చెపుతూనే కొన్ని పొరపాట్ల గురించి నేను పశ్చాత్తాపం ప్రకటిస్తున్నాను. మనం ఇంకా చాల చేయగలిగి ఉండేవాళ్లమని నేననుకుంటాను. స్వాతంత్ర్యం సంపాదించి ఇరవై ఏళ్లు గడిచిన తర్వాత, మనం చేయవలసింది చేయలేకపోవడానికి వర్ణవివక్ష పాలనను కారణంగా చూపెట్టలేం.

1994లో స్వాతంత్ర్యం సాధించిన తర్వాత చెప్పుకోదగిన విజయాలు సాధించాం. గృహ నిర్మాణంలో, శిశు సంరక్షణా కేంద్రాలు, పాఠశాలలు, రహదారులు, మౌలిక సాధన సంపత్తి నిర్మించడంలో, లక్షలాది మందికి నీరు, విద్యుత్తు అందించడంలో, ఉచిత విద్యను, ఆరోగ్య సేవలను అందించడంలో, వృద్ధులకు జీవనభృతి, సామాజిక నిధుల పంపిణీ, ద్రవ్య, బ్యాంకింగ్ స్థిరత్వం, నింపాదిగా అయినా స్థిరమైన ఆర్థిక వృద్ధి (కనీసం 2008 సంక్షోభం వరకూ) వంటి విజయాలు సాధించాం. కాని ఈ విజయాలన్నీ నిజంగా ప్రజలకు చేరలేదు. పేద, అణగారిన వర్గాలు హింసాత్మక నిరసన ప్రకటించడానికి దారితీశాయి. విద్యా ఆరోగ్య రంగాలలో భయంకరమైన లోపాలు, అసమానతలు తలెత్తాయి. నిరుద్యోగం చెప్పరానంత తీవ్రతతో పెరిగిపోయింది. పోలీసు హింస, పాశవికత్వం ఎంత మాత్రం తగ్గిపోలేదు. పాలకపక్షంలో అనుచితమైన అధికార కుమ్ములాటలు మొదలై చివరికి 2008లో ఎంబెకి తొలగింపుతో తారస్థాయికి చేరాయి. ప్రభుత్వంలో ప్రమాదకరమైన రహస్య, నిరంకుశ ధోరణులు తలెత్తాయి. న్యాయవ్యవస్థలో జోక్యం పెరిగిపోయింది. ప్రచారమాధ్యమాలకు బెదిరింపులు, భావ ప్రకటనా స్వేచ్ఛకు ప్రమాదాలు పెరిగిపోయాయి. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ (ఎఎన్‌సి) అత్యున్నత అధికార వర్గం చౌకబారు ఫొటో అవకాశాల కోసం చివరికి నెల్సన్ మండేలా వ్యక్తిగత హోదాను కూడ తాకట్టుపెట్టింది.

అన్నిటికన్న ఆందోళనకరమైన అంశం రాజ్యాంగ యంత్రపు బాధ్యతా రాహిత్యం పెరిగిపోవడం. యోగ్యతలేని ఆశ్రితులను అత్యున్నత పదవులలో నియమించే అలవాటు వల్ల జాతీయ, ప్రాంతీయ, పురపాలక స్థాయిలలో దుష్పరిపాలన, అసమర్థత పెరిగిపోయాయి. నాయకత్వ లేమి కొట్టవచ్చినట్టుగా కనబడుతోంది. పాఠశాలలకు పాఠ్యపుస్తకాలు అందకపోవడం, అధ్యక్షుడు జాకబ్ జుమాకు చెందిన ఎన్‌కాండ్లా ఇంటికీ, అధ్యక్షుడికి సన్నిహితుడైన బహుళజాతి కార్పొరేట్ వ్యాపారి గుప్తా కుటుంబానికీ రక్షణ కోసం ఇరవై కోట్ల రాండ్లు వృథాగా ఖర్చుపెట్టడం వంటి పనులు దక్షిణాఫ్రికా ఒక దళారీ దేశంగా మారిపోతున్నదని చూపుతున్నాయి. విలాసవంతమైన భారీ కార్ల మీద, హోటళ్ల మీద మంత్రులు పెడుతున్న ఆడంబరపు ఖర్చులను ఆశ్రితులకు, కుటుంబ సభ్యులకు టెండర్లు, ప్రభుత్వ కంట్రాక్టులు కట్టబెట్టడానికి సాగుతున్న అపారమైన లంచగొండితనాన్ని వీటికి కలిపి చూడండి. ఈ నిరాశాజనక మైన జాబితాకు అంతులేదు. ఇవాళ మనదేశంలో ముఖం మీద గుద్దినట్టు కనబడుతున్నవి ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం, లంచగొండితనం.

---

ఆయా వాహనాల సైరన్లు కూడా అవాంఛనీయ శబ్దకాలుష్యాన్ని కలుగ చేస్తాయని, నెల రోజుల్లోపల భయపడకుండా పోలీసు అధికారులు ఈ హారన్లని తొలగించాలని ఆదేశించింది. వి.ఐ.పి.ల కోసం రోడ్లు బ్లాక్ చేయడం చట్టసమ్మతమేనా? దేశం మొత్తం మీద రాజ్యాంగేతర ముఖ్యులకు కల్పించే భద్రత ఖర్చు ఎంత? దానికోసం ఉపయోగిస్తున్న పోలీసుల సంఖ్య ఎంత? అన్న పిటిషనర్ ప్రశ్నలకు మాత్రం ఈ తీర్పులో సమాధానం లేవు.

ధర్మాసనం తీర్పుని అన్ని పత్రికల్లోనూ ప్రకటించి ప్రచారం చేయాలని అన్ని రాష్ట్రాల ప్రభుత్వ ప్రధాన కార్యదర్శుల్ని ఆదేశించింది. ఈ ఆదేశాల్ని ఉల్లంఘించిన వారికి పెద్ద మొత్తంలో జరిమానా విధించాలని కోర్టు ఆదేశించింది.

సాధారణ వాహన చోదకులకన్నా, పౌరులకన్నా అధికులమనే అహంకారంతో స్వేచ్ఛగా తిరిగే ఈ నకిలీ 'పెద్దల'కు ఈ తీర్పు చెంపపెట్టు అయితే దీన్ని అమలు చేయడంలో ప్రభుత్వాలు, పోలీసు వ్యవస్థ ఎంత వరకు ప్రయత్నిస్తాయో చూడాలి.

*(రచయిత గుంటూరు బార్ అసోసియేషన్ మాజీ అధ్యక్షులు)* వీ

వీటన్నిటిలోకీ దిగ్భ్రాంతికరమైనదీ, అవమానకరమైనదీ రక్తసిక్త గురువారంగా పేరుపొందిన 2012 ఆగస్ట్ 16 హత్యాకాండ. లండన్‌కు చెందిన లాన్‌మిన్ కంపెనీ యాజమాన్యంలో నడిచే మరికానా ప్లాటినం గనుల్లో సమ్మె చేస్తున్న కార్మికులపై పోలీసులు జరిపిన కాల్పులలో 34 మంది మరణించారు.

నేను ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లో చేరడానికి ప్రేరణ అయిన 1960 షార్ప్‌విల్లి మారణకాండ కన్న దారుణమైనది ఈ మరికానా మారణకాండ. ప్రజాస్వామిక దక్షిణాఫ్రికా అటువంటి పాశవికత్వానికి ముగింపు పలకవలసి ఉండింది. కాని అధ్యక్షుడు, ఆయన మంత్రివర్గ సభ్యులు ఆ హత్యాకాండకు సాకులు వెతికే, మసిపూసి మారేడుకాయ చేసే సంస్కృతిలో మునిగిపోయారు. అంతకన్న ఘోరంగా, నేను యాభై సంవత్సరాలకు పైగా నా పార్టీ అనుకుంటున్న దక్షిణాఫ్రికా కమ్యూనిస్టు పార్టీ కూడ ఆ పోలీసు దుర్మార్గాన్ని ఖండించలేదు.

వర్ణవివక్ష పాలన అంతరించడంతో దక్షిణాఫ్రికా విముక్తి పోరాటం ఒక ఉన్నత దశను చేరిందే గాని అంతిమ గమ్యాన్ని చేరలేదు. మా దేశంలో ఉన్న ఆధునిక పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థను, వ్యూహాత్మకమైన ఖనిజ వనరులను (కేవలం బంగారం, వజ్రాలు మాత్రమే కాదు), సంపన్నమైన పోరాట సంప్రదాయం గల కార్మిక వర్గాన్ని, సంఘటిత కార్మికోద్యమాన్ని చూసుకుని అప్పుడు మా ఆశలు అత్యున్నత స్థాయిలో ఉండేవి. కాని అంతర్జాతీయ పెట్టుబడిదారీ వ్యవస్థ ఎంత గట్టిదో కనిపెట్టడంలో మా ఆశలు విఫలమయ్యాయి. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఆత్మను కొల్లగొట్టడానికి 1991 నుంచి 1996 దాకా జరిగిన యుద్ధంలో చివరికి కార్పొరేట్ శక్తుల అధికారమే విజయం సాధించింది. నయా ఉదారవాద ఆర్థిక వ్యవస్థ మమ్మల్ని దిగ్బంధనం చేసేసింది. ఇవాళ్టికీ దేశంలో కొందరు నినదిస్తున్నట్టుగా మేం 'మా ప్రజలను మధ్య దారిలో అమ్మేశాం.'

నా దృష్టిలో ఆ ద్రోహక్షణం మా మొదటి ప్రజాస్వామిక ఎన్నికల కోసం అంతర్జాతీయ ద్రవ్య నిధి రుణం తీసుకున్నప్పుడు వచ్చింది. ఆ అప్పు అనివార్యమైన ప్రమాదమని అప్పుడు మేం అనుకున్నాం. ఆంక్షలతో వచ్చిన ఆ రుణం ఎటువంటి విప్లవ ఆర్థిక కార్యక్రమం ఉండగూడదని శాసించింది. చర్చలు కొనసాగించడానికీ, ప్రజలకు వాగ్దానం చేసిన భూపంపిణీకి భూమిని వెనక్కి తీసుకోకుండా ఉండడానికీ రాయితీలు ఇవ్వడం కూడ అనివార్యమైన ప్రమాదాలే అనుకున్నాం. అప్పుడు సందేహాలదే రాజ్యమైంది. మేం చాల తప్పుగా మరొక దారిలేదని నమ్మాం. మా శక్తిమంతమైన మిత్రదేశం సోవియట్ యూనియన్ ఆయుధ పోటీ వల్ల దివాళా తీసి కూలిపోయింది గనుక మేం జాగ్రత్తగా వ్యవహరించాలని అనుకున్నాం.

అన్ని ఆటంకాలనూ అధిగమించగలిగే మా విప్లవ ప్రజారాశుల శక్తిసామర్థ్యాల మీద నమ్మకం పోగొట్టుకోవడమే మేం చేసిన క్షమించరాని తప్పు. దక్షిణాఫ్రికా విప్లవాత్మకంగా మారితే ఒంటరిని చేస్తామనే బెదిరింపులు ఎన్ని ఉన్నప్పటికీ, మాకు ఉండిన అపారమైన ఖనిజ వనరుల వల్ల ప్రపంచం మమ్మల్ని ఒంటరి చేయగలిగి ఉండేది కాదు. అంటే మేం మా స్థైర్యాన్ని కోల్పోవలసిన అవసరమూ లేదు, అది అనివార్యమూ కాదు. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ నాయకత్వం దృఢంగా, ఐక్యంగా, అవినీతిని దగ్గరకు రానివ్వకుండా ఉండవలసింది. అన్నిటికన్న ముఖ్యంగా తన విప్లవ సంకల్పానికి కచ్చితంగా అంటిపెట్టుకుని ఉండవలసింది. అందుకు బదులుగా మేం లొంగిపోయాం. ప్రజలకు సేవ చేయాలనే తన లక్ష్యానికి, నిబద్ధతకు ఎఎన్‌సి నాయకత్వం స్థిరంగా నిలబడి ఉండవలసింది. అలా చేసి ఉంటే దానికి పాతుకుపోయిన పెట్టుబడిదారీ వర్గం మీద, అప్పుడే తలెత్తుతున్న ఉన్నతవర్గాల మీద అవసరమైన అదుపు వచ్చి ఉండేది. ఆ కొత్త ఉన్నత వర్గాలు నల్లవారి ఆర్థిక సాధికారతతో, అవినీతితో, రాజకీయ ప్రభావాన్ని సొమ్ము చేసుకోవడంతో సంపదను పోగేసుకోదలిచాయి.

రక్తపాతంతో కూడిన అంతర్యుద్ధం ద్వారా కాక చర్చల ద్వారా వర్ణ వివక్ష పాలనను అంతం చేయాలని అనుకోవడం మాకు అప్పటికి విస్మరించడానికి వీలులేని మంచి అవకాశంగా కనబడింది. అయితే అప్పటికి అధికార బలాబలాలు ఎఎన్‌సి కి అనుకూలంగానే ఉన్నాయి. మేం చర్చల బల్ల దగ్గర అంతిమంగా అంగీకరించిన దానికన్న విప్లవాత్మకమైన మార్పులు తేవడానికి పరిస్థితులు అనుకూలంగానే ఉన్నాయి. అంగీకరించకపోతే దారుణమైన రక్తపాత దమనకాండ జరుగుతుందని మండేలా నాయకత్వం అభిప్రాయపడింది గాని, నిజానికి అప్పటికి పాత పాలకవర్గాలకు అటువంటి హింసాకాండకు తలపడే శక్తీ లేదు, ఉద్దేశమూ లేదు. కొద్దిమంది ఏకాకి మితవాద తీవ్రవాదులు మాత్రమే హింస గురించి ఆలోచించారు. మేం అప్పుడు గట్టిగా ఉండి ఉంటే, అప్పుడు మేం ఇచ్చిన రాయితీలు ఇవ్వకుండానే ముందుకు అడుగేసి ఉండగలిగేవాళ్లమే.

ఆర్థిక నియంత్రణలో ఇచ్చిన రాయితీలతో మేం ఒక బంగారు అవకాశాన్ని పోగొట్టుకున్నామో లేదో చరిత్ర తీర్పు చెపుతుంది. ఇక్కడ నేనేదో సవ్యంగా ఉన్నానని చెప్పుకోదలచుకోలేదు. అప్పుడు నేను నా బాధ్యతల మీద మాత్రమే దృష్టి కేంద్రీకరించి, ఆర్థిక వ్యవస్థ వ్యవహారాలను ఎఎన్‌సి నిపుణులకు వదిలేయడం నేను చేసిన పెద్ద తప్పు. అటు విప్లవ సైనికులైనా, ఇటు రాజకీయ కార్యకర్తలైనా ఆర్థిక విషయాలను చాల ఎక్కువగా నిపుణులకు వదిలేస్తారు. అర్థశాస్త్ర అధ్యయనాన్ని నిర్లక్ష్యం చేయడం నేను చేసిన తప్పు. విప్లవకారులు కాదలచుకున్న వారెవరైనా ఇది హెచ్చరిక. వారు ప్రతిరోజూ మేలుకోగానే, 'ఇది ఆర్థిక వ్యవస్థ, తెలివి తక్కువగా ఉండకు, దాన్ని అర్థం చేసుకో' అని తమకు తాము చెప్పుకోవాలి,

అయితే నిజానికి మాలో చాలమందికి అత్యున్నత స్థాయి ఆర్థిక చర్చలలో ఏమి జరుగుతున్నదో తెలియదు. 'లాస్ట్ ఇన్ ట్రాన్స్‌ఫర్మేషన్' అనే విమర్శా గ్రంథంలో అర్థశాస్త్రవేత్త సాంపీ టెర్రెబ్లాంచి బహిర్గతం చేసినట్టుగా 1993 చివరినాటికే బడావ్యాపార గృహాల వ్యూహాలు దక్షిణాఫ్రికా డెవలప్ మెంట్ బ్యాంక్ లో జరుగుతున్న అర్ధరాత్రి రహస్య చర్చలలో స్పష్టమైన రూపం తీసుకుంటున్నాయి. ఆ వ్యూహాలు 1991లోనే జోహన్స్‌బర్గ్‌లో భారీగనుల యజమాని హారీ ఓపెన్ హీమర్ ఇంట్లో తయారయ్యాయి. ఆ చర్చలలో దక్షిణాఫ్రికా ఖనిజ వనరుల, ఇంధన వనరుల నాయకులు, దక్షిణాఫ్రికాలో వ్యాపారాలు ఉన్న అమెరికన్, బ్రిటిష్ కంపెనీల యజమానులు, ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ కు చెందిన యువ అర్థశాస్త్రవేత్తలు పాల్గొన్నారు. ఆ యువ అర్థశాస్త్రవేత్తలందరూ పాశ్చాత్య ఆర్థిక శాస్త్రం చదువుకున్నవారే. వారు తమ చర్చల వివరాలను నేరుగా మండేలాకు నివేదిస్తుండేవారు. వినాశకర ఆర్థిక విధానాలుగా

భావిస్తున్నవాటిని అమలు చేయాలని ఎఎన్‌సి పట్టుబడితే దారుణమైన పర్యవసానాలుంటాయనే సూచనలతో ఆ అర్థశాస్త్రవేత్తలను లొంగ దీయడమో, భయపెట్టడమో జరిగింది.

దేశంలోని 'పేదలలోకెల్లా పేదలకు' మండేలా, ఎఎన్‌సి చేసిన ప్రతిజ్ఞాపూర్వక వాగ్దానం పేదరికాన్ని నిర్మూలిస్తాం అని. కాని అలా పేదరికాన్ని నిర్మూలించే సాధనాలన్నిటినీ ఈ ప్రక్రియలో పోగొట్టు కున్నాం. స్వాతంత్ర్య ప్రకటనలో ప్రకటించినట్టుగా గనులను, ఆర్థిక వ్యవస్థలోని ఉన్నత స్థానాలన్నిటినీ జాతీయకరణ జరపడం అనే దాన్ని వదులుకున్నాం. వర్ణ వివక్ష పాలనలో దేశం చేసిన అంతులేని అప్పులను చెల్లించబోమని ప్రకటించి, రద్దు చేయవలసి ఉండగా, ఆ అప్పులన్నీ తిరిగి చెల్లిస్తామని ఎఎన్‌సి బాధ్యత పడింది. అభివృద్ధి కార్యక్రమాలకు నిధులు సమకూర్చుకోవడం కోసం బడా సంపన్నుల మీద సంపద పన్ను విధిస్తామనే మాట పక్కన పెట్టడం జరిగింది. వర్ణ వివక్ష వల్ల సంపద పెంచుకున్న దేశీయ, అంతర్జాతీయ కార్పొరేషన్లను క్షమించి, ఎటువంటి నష్టపరిహారాలు వసూలు చేయకుండా వదిలేయడం జరిగింది. భవిష్యత్తులో వచ్చే ఏ ప్రభుత్వమైనా ఏమీ చేయడానికి వీలులేకుండా, చేతులు కట్టేసినట్టుగా తీవ్రమైన, కఠినమైన బడ్జెట్ నిబంధనలు విధించడం జరిగింది. నయా ఉదారవాద స్వేచ్ఛా వాణిజ్య సూత్రాలకు అనుగుణంగా స్వేచ్ఛా వాణిజ్య విధానాన్ని అమలు చేయాలని, అన్ని రకాల సుంకాల పరిరక్షణలను రద్దుచేయాలని నిబంధనలు విధించడం జరిగింది. బడా కార్పొరేషన్లు తమ ప్రధాన ఖాతాలను విదేశాలకు బదిలీ చేయడానికి అనుమతించడం జరిగింది. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఆమోదించిన ఈ రాయితీలు 'దక్షిణాఫ్రికాను ఎన్నో తరాలపాటు వేటాడబోయే విద్రోహకరమైన నిర్ణయాలు' అని టెర్రెబ్లాంచి అభిప్రాయపడ్డాడు.

రాజకీయాధికారాన్ని చేపట్టాలనే తొందరలో దయ్యంతో ఈ ఒప్పందానికి సిద్ధపడిన ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ – కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం (అందులో నా పాత్ర ఏమీ తక్కువ కాదు) ఆ క్రమంలో ధ్వంసమై పోయింది. మన ప్రజలలో అత్యధికుల దుస్థితిని సవరించడానికి ఏమీ చేయలేని నయా ఉదారవాద ప్రపంచ సూత్రానికి, మార్కెట్ ఛాందస వాదానికి కట్టుబడి పోయిన ఆర్థిక వ్యవస్థను తన చేతుల్లోకి తీసుకుంది.

ప్రజల ఓపిక నశించి పోయిందంటే ఆశ్చర్యమేమీ లేదు. నానాటికీ దిగజారుతున్న తమ జీవన పరిస్థితులతో వారి ఆందోళనలూ నిరసనలూ పెరిగిపోయాయంటే ఆశ్చర్యమేమీ లేదు. అధికారంలో కూచున్నవారి దగ్గర పరిష్కారాలేమీ లేవంటే ఆశ్చర్యమేమీ లేదు. ఎక్కడన్నా మిగిలిన తుంపులు ఉంటే అవి అప్పుడప్పుడే తలెత్తుతున్న నల్లజాతి ఉన్నత వర్గానికి మాత్రమే అందాయి. ఎముక ముక్క కోసం కొట్లాడుకునే కుక్కల ఆశపోతు, భీకర యుద్ధంలో అవినీతి వేళ్లూనుకుంది.

దక్షిణాఫ్రికాలో 2008లో నిరుపేదలుగా ఉండిన 50 శాతం మందికి మొత్తం జాతీయాదాయంలో 7.8 శాతం మాత్రమే అందింది. అదే సంవత్సరం తెల్లజాతి దక్షిణాఫ్రికన్లలో 83 శాతం మంది అత్యున్నత ఆదాయం పొందిన 20 శాతంలో భాగంగా ఉన్నారు. ఆ 20 శాతంలో ఉండిన నల్లజాతివారు 11 శాతం మాత్రమే. నిజానికి ఏమాత్రం చెదరని మానవ విషాదాన్ని ఈ అంకెలు పూర్తిగా చెప్పజాలవు. దేశంలో ప్రజా అసంతృప్తి విపరీతంగా ప్రజ్వరిల్లిందంటే ఆశ్చర్యమేమీ లేదు.

ఇలా అంధకారంలోకి సాగుతున్న పతనాన్ని ఆపవలసి ఉంది. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ కూటమి పట్ల ఆశ పెట్టుకోలేని స్థితి వచ్చిందని నేననుకోవడం లేదు. దాని శ్రేణులలో లెక్కలేనంతమంది మంచి వాళ్లున్నారు. కాని ఆ సంస్థను పైనుంచి కింది దాకా పునరుజ్జీవింప జేయడం, పునర్నిర్మించడం తక్షణమే జరగాలి. ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఆత్మను పునరుద్ధరించాలి. దాని సాంప్రదాయిక విలువలను, సేవా సంస్కృతినీ పునఃస్థాపించాలి. అది దయ్యంతో చేసుకున్న ఒప్పందాన్ని ధ్వంసం చేయాలి.

ప్రస్తుతానికైతే నిరుపేద ప్రజానీకానికి పాలక పక్షం కన్న మరొక ఆశ లేదు. ఆ ఆశలను నిలబెట్టే శక్తిని ఎఎన్‌సి క్రమక్రమంగా కోల్పోతున్నది. ఇప్పటికి బలంగా ఉన్న పార్లమెంటరీ ప్రతిపక్షం అనేక రకాల బడా వ్యాపార ప్రయోజనాలకే ప్రాతినిధ్యం వహిస్తోంది. అధికారపక్షం ఎప్పటికప్పుడు సక్రమంగా నడవాలంటే బలమైన పార్లమెంటరీ ప్రతిపక్షం ఉండాలనే మాట నిజమే గాని, ఇవాళ చాల మంది వోటర్లు కోరుకునేది బడా వ్యాపార ప్రయోజనాలను పరిరక్షించే విధానాలను పెంచడమూ, ఇంకా ఎక్కువ ప్రైవేటీకరణ జరపడమూ, ఎక్కువ నయా ఉదారవాద విధానాలను అమలు చేయడమూ కాదు. ప్రజలు సోషలిస్టు విధానాలను కోరుకుంటున్నారు.

ఇదంతా చెపుతున్నానంటే దేశాన్ని సంక్షోభాల నుంచి రక్షించే బాధ్యత ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ మీద, దక్షిణాఫ్రికా కమ్యూనిస్ట్ పార్టీ మీద, కాంగ్రెస్ ఆఫ్ సౌత్ ఆఫ్రికన్ ట్రేడ్ యూనియన్స్ మీద మాత్రమే ఉన్నదని కాదు. ఇప్పటికే ఉన్న సంఘటిత నిర్మాణాలలోనూ, రూపొందుతున్న నిర్మాణాలలోను భాగమైన అసంఖ్యాక దేశభక్తులూ, కామ్రేడ్సూ ఈ ప్రక్రియకు కీలకమైన వారు. అలాగే ప్రజా రక్షక కార్యాలయం, మానవ హక్కుల సంఘం వంటి చట్టబద్ధ మార్గాలూ, సంస్థలూ ఉన్నాయి. చివరికి రాజ్యాంగబద్ధ న్యాయస్థానానికి విన్నవించుకునే అవకాశమూ ఉంది. అన్యాయాల గురించి, హక్కుల ఉల్లంఘనల గురించి ఈ మార్గాలను ఉపయోగించుకుని పరీక్షించవచ్చు, బహిర్గతం చేయవచ్చు, సవాలు చేయవచ్చు. అలాగే అట్టడుగు స్థాయిలో పనిచేసే కార్మిక సంఘాలు, పౌర సంఘాలు, ప్రజా సంఘాలు, మహిళా, యువజన బృందాలు తమ వ్యూహాలతో, ఎత్తుగడలతో, తమ అహింసాయుత, గౌరవప్రదమైన క్రియాశీల చర్యలతో ఏ మార్గాన సాగవలసి ఉన్నదో చూపవచ్చు.

అన్నిటికన్న మిన్నగా మనం ఆర్థిక వ్యవస్థను వ్యూహాత్మక ప్రజా నియంత్రణ కింద ఉండేలా, ఆర్థిక వ్యవస్థ కొందరి మేలు కొరకు కాక, ప్రజలందరికొరకు పనిచేసేలా చూడాలి. దశాబ్దాల పోరాటాల ద్వారా మన భావాలు వెలువరించే హక్కూ, అవకాశాలూ సాధించాం. వాటిని నిలిపి ఉంచుకోవాలి, మరింతగా అభివృద్ధి చేసుకోవాలి. అటువంటి భవిష్యత్తు దీపధారులుగా మనం చూడవలసింది కార్మికులవైపు, 'స్వేచ్ఛా యువతరం' వైపు.

(రచయిత 1960 లనుంచీ ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లో, దక్షిణాఫ్రికా కమ్యూనిస్టు పార్టీలో, సాయుధ పోరాటంలో, విదేశాలలో పోరాట ప్రచారంలో అనేక బాధ్యతలు నిర్వహించారు. వలస వివక్ష పాలన ముగిసిన తర్వాత 1994 నుంచి 2008 వరకు విభిన్న శాఖలలో మంత్రిగా పనిచేసి, 2008లో ప్రభుత్వం నుంచి బైటికి వచ్చారు. ఆర్మ్‌డ్ అండ్ డేంజరస్ : మై అండర్ కవర్ స్ట్రగుల్ అగెనెస్ట్ అపార్థీడ్ అనే స్వీయచరిత్ర పుస్తకం తాజా కూర్పుకు 2013 జూన్ లో రాసిన ముందు మాట భాగాలు ఇవి.) వీ

# సంకెళ్లలో దౌత్యవేత్త, జాత్యహంకార గగ్గోలు

***అమెరికాకు వలస వచ్చే నిరుపేద, అమాయక పౌరులు నిత్యం వేధింపులు ఎదుర్కొన్నా ఖండించని ప్రచార మాధ్యమాలు దేవయాని విషయంలో తమ కపటత్వం, ద్వంద్వ నీతి బయటపెడుతున్నాయని అంటున్నారు* పార్థా బెనర్జీ**

న్యూయార్క్ నగరపు చట్ట సంరక్షక అధికారులు ఒక ఉన్నతస్థాయి భారతీయ దౌత్య అధికారిని, అందులోనూ మహిళను, నిర్బంధంలోకి తీసుకున్నారు. చేతులకు సంకెళ్లు వేశారని, శరీరమంతా తడిమి సోదా చేశారని ఆరోపణలు వచ్చాయి.

వెంటనే భారత ప్రచార మాధ్యమాలలో ఆగ్రహోదగ్ర వ్యాఖ్యలు వెలువడ్డాయి. అమెరికా ప్రభుత్వానికి నమ్మినబంటూ, భజనపరురాలూ అయిన భారత ప్రభుత్వం కూడ ఈ 'అన్యాయానికి' వ్యతిరేకంగా గట్టిగా మాట్లాడింది (లేదా మాట్లాడడానికి ప్రయత్నించింది). ఢిల్లీ, బొంబాయి, బెంగళూరు, కలకత్తాలలో, భారతదేశంలో ప్రతి ఉన్నత వర్గ, అధికారవర్గ రాత్రి భోజనాల బల్ల దగ్గర ఇదే చర్చ జరుగుతోంది.

ఈ ప్రచారమాధ్యమాల విపరీత ప్రచార కథనం వల్ల హఠాత్తుగా, చివరికి అత్యంత సగటు భారతీయులు కూడ కడుపునిండా అమెరికా వ్యతిరేక కోపంతో రగిలిపోతున్నారు.

తప్పనిసరిగా, అది అన్యాయమే. న్యూయార్క్‌లోని భారత ఉపదౌత్యవేత్త దేవయాని ఖోబ్రగడేను 'తన ఇంటి పనిమనిషికి వీసా దరఖాస్తులో చెప్పిన వేతనం కన్న తక్కువ వేతనం ఇస్తున్నారని, అంటే అబద్ధం చెప్పారనే (ఆమె పనికి గంటకు మూడు డాలర్ల కన్న తక్కువ చెలిస్తున్నారని, అంటే అమెరికాలో కనీస వేతనంలో సగానికన్న తక్కువ అని అమెరికా ప్రాసిక్యూటర్లు అంటున్నారు) నేరారోపణపై మన్‌హట్టన్‌లో ఆమె కూతురు చదువుతున్న పాఠశాల ముందు గురువారం (డిసెంబర్ 12)న అరెస్టు చేశామని పోలీసులు చెపుతున్నప్పటికీ, బహిరంగంగా చేతులకు సంకెళ్లు విధించడం, జైలులో శరీరమంతా తడిమి సోదా చేయడం, మర్మస్థానాలలో సోదా చేయడం ఎంత మాత్రమూ అంగీకరించడానికి వీలులేనివి.

అయితే పెద్ద మొత్తంలో వేతనమూ, నమ్మడానికి వీలు లేనన్ని ఇతర సౌకర్యాలూ, అవి కూడ అమెరికన్ డాలర్లలో పొందే అత్యున్నత దౌత్య అధికారి, తన పనిమనిషిని అంత దారుణంగా దోపిడీ చేయగూడదని వాదించినప్పటికీ. ఇంత దారుణమైన మానవహక్కుల ఉల్లంఘనల పట్ల ఆగ్రహం తెచ్చుకోవడానికి భారతీయులకు అన్ని హక్కులూ ఉన్నాయి.

సమస్య ఏమంటే, ఇప్పుడింతగా గగ్గోలు పెడుతూ, అమెరికన్ ప్రభుత్వం జాత్యంహంకారాన్ని చూపిందని ఆరోపిస్తున్న ఈ ఉన్నతవర్గ దౌత్య అధికారులు, భారత ప్రభుత్వం, ప్రచార మాధ్యమాలు, భారతదేశం నుంచి వలస వచ్చిన నిరుపేదలపై అమెరికాలో ప్రతిరోజూ ఇటువంటి అన్యాయమైన ప్రవర్తన జరుగుతూనే ఉన్నప్పుడు ఏ ఒక్కరోజూ నోరెత్తి పలకలేదు, ఆ అన్యాయాలను ఖండించలేదు.

ఇప్పుడు దౌత్యపరమైన మినహాయింపులు, రాయితీలు ఉన్న ఉన్నత స్థాయి దౌత్యాధికారికి కూడ అమెరికన్ దౌర్జన్యం ఎలా ఉంటుందో ఒక్కసారి తెలిసేసరికి, ప్రతి ఒక్కరూ గొంతెత్తి గగ్గోలు పెడుతున్నారు. చివరికి మార్క్సిస్టులు, అటుచివర శివ సైనికులు కూడ అనేక భారత నగరాలలో 'అమెరికన్ పాశవికత్వం' మీద నిరసన ప్రదర్శనలు జరిపారు.

ఆహా, మార్క్సిస్టులు, అత్యంత అభివృద్ధి నిరోధక శివసేన...! నిజంగా అంచులలో ఉన్న శక్తులే!

ఐదారు సంవత్సరాల కింద ప్రఖ్యాత బాలీవుడ్ నటుడు షారుఖ్ ఖాన్‌కు కూడ జాన్ ఎఫ్ కెన్నెడీ విమానాశ్రయంలో ఇటువంటి అనుభవమే ఎదురైనప్పుడు భారత ప్రచార సాధనాలు ఇలాగే ఉద్రేక పడ్డాయి. అప్పుడు కలకత్తా నుంచి వెలువడే ఒక బెంగాలీ దినపత్రికలో ఈ కపటత్వం గురించి నేనొక వ్యాసం రాశాను.

అలాగే, వివిధ వర్ణాల ప్రజల పట్ల తెల్లవారి జాత్యహంకారం గురించి భారతీయులు ఎప్పటినుంచి ప్రశ్నిస్తున్నారు? భారత దేశం లోనూ, అమెరికాలోనూ భారతీయులు – హిందువులూ ముస్లింలూ కూడ, కనీసం వారిలో అత్యధిక సంఖ్యాకులు, చాల మామూలుగా నల్లవారిని చిన్నచూపు చూస్తారు. బాలీవుడ్, హాలీవుడ్ మొరటు సినిమాల వల్ల, ప్రచార మాధ్యమాల మూస తయారీల వల్ల ఇవాళ్టికి కూడ చాలమంది భారతీయులు సాధారణంగా నల్లవారిని నేరస్తులు గానే భావిస్తారు. అమెరికాలో నివసించే భారతీయులు తమ పొరుగున ఉన్న, తమ సహోద్యోగులుగా ఉన్న నల్లవారి గురించి తెలుసుకోవడం అలా ఉంచి, మాట్లాడడానికి కూడ ఇష్టపడరు.

అమెరికాలో నేను గడిపిన ఇరవై ఐదు సంవత్సరాలలో భారతీయులు ఇతర అల్పసంఖ్యాక వర్గాల గురించి, ప్రత్యేకంగా నల్లవారి గురించి దారుణమైన, అసహ్యకరమైన వ్యాఖ్యలు చేసిన సందర్భాలు లెక్కలేనన్ని చూశాను. న్యూయార్క్ నగరంలో నల్లవారు ఎక్కువగా నివసించే బ్రూక్లిన్ వంటి ప్రాంతాలలో నివసించడానికి భారతీయులు అసహ్యించు కుంటారు. నేను అక్కడే నివసిస్తాను.

నాకు మరొక సంగతి కూడ గుర్తుకొస్తోంది. ఇరవై సంవత్సరాల కింద కాంగ్రెస్ ప్రధానమంత్రి పి వి నరసింహారావు తన దౌత్య బృందం తో సహా అమెరికా పర్యటనకు వచ్చినప్పుడు ఒక విలాసవంతమైన హోటల్‌కు వెళ్లి, అక్కడ నల్ల జాతి వెయిటర్లు తమకు ఆహార పదార్థాలు అందిస్తే తిరస్కరించారు.

భారత ప్రధానమంత్రి జాతి వివక్షను పాటించాడని అప్పుడెవరూ అనలేదు.

# అమెరికా ఒత్తిడికి తలొగ్గిన ఇరాన్

***ప్రపంచాధిపత్యంలో భాగంగానే అమెరికా, దాని మిత్ర అగ్రరాజ్యాలు అణ్వాయుధాల సాకుతో అలీన దేశాలపై ఆంక్షలు విధిస్తున్నాయని అంటున్నారు* ఎ. నర్సింహా రెడ్డి**

ఇరాన్ భౌగోళికంగా, వ్యూహాత్మకంగా, రాజకీయంగా కీలక స్థానంలో ఉంది. మధ్య ఆసియా, వాయవ్య ఆసియా పశ్చిమాసియా, యూరప్‌లకు ఇరాన్ ముఖద్వారం లాంటిది. చమురు నిల్వల్లోనే కాదు మొత్తం పశ్చిమాసియా ప్రాంతంలో ముఖ్యంగా ఇస్లామిక్ ప్రపంచంలో ఇరాన్‌కు ఆధ్యాత్మిక, సాంస్కృతిక ప్రాబల్యం ఉంది. గత దశాబ్ది ఆరంభంలో నైరుతి ఆసియాలో గల ఇరాక్, ఆఫ్ఘన్ దేశాలలో మిలిటరీ జోక్యం పట్ల అమెరికా, దాని మిత్రదేశాల్లో విముఖత పెంచాయి. ఉదాహరణకు సిరియాలో మిలటరీ జోక్యంపై అమెరికన్ కాంగ్రెస్‌లో తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది. అమెరికా ప్రజల్లో అరవై శాతం మంది సిరియాపై మిలటరీ జోక్యాన్ని వ్యతిరేకించినట్లు సర్వేలు వెల్లడించాయి. ఇరాక్, ఆఫ్గనిస్థాన్‌లపై యుద్ధం అమెరికా, బ్రిటన్‌లకు మిగిల్చిన చేదు అనుభవాలే దీనికి కారణం. ఇరాన్‌తో మరో యుద్ధాన్ని మోసేందుకు పశ్చిమ సమాజాలు సిద్ధంగాలేవు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఒకవైపు రష్యా, చైనా, మరోవైపు అమెరికా, యూరప్ మోహరించి ఉన్న పరిస్థితుల్లో ఇరాన్ కీలకపాత్ర పోషిస్తోంది. రాజకీయ వ్యవస్థలోకి ఇరాన్ పునః ప్రవేశం అంతర్జాతీయంగా భౌగోళిక రాజకీయాల్లో ప్రాధాన్యం సంతరించుకోనుంది. ఈ నేపథ్యంలో జెనీవా ఒప్పందాన్ని చూడాల్సి ఉంది.

గత కొంతకాలంగా ఇరాన్ అణు కార్యక్రమం కారణంగా యుద్ధ మేఘాలు కమ్ముకున్న పశ్చిమాసియాలో, ఆ కార్యక్రమంపై కఠినమైన ఆంక్షలకు అంగీకరిస్తూ తమ దేశంలోని అణు కార్యక్రమంపై స్వయం నియంత్రణ దిశగా ఇరాన్‌కు, భద్రతా మండలి శాశ్వత దేశాలు ప్లస్ జర్మనీల మధ్య (పి.5ప్లస్1) నవంబర్ 24న జెనీవాలో ఒప్పందం కుదిరింది. సంప్రదింపుల ద్వారా ఇరాన్ సమస్యకు పరిష్కారం కనుగొనవలసిందిగా ఐరాస భద్రతా మండలి 2006లో తన శాశ్వత సభ్యులు ఐదుగురిని (అమెరికా, బ్రిటన్, రష్యా, ఫ్రాన్స్, చైనా -పి.5) ప్లస్ జర్మనీని ఆదేశించింది. ఇరాన్ మాజీ అధ్యక్షుడు అహ్మది నెజాద్ ఒంటెత్తుపోకడ వల్ల చర్చలకు అవకాశం లభించలేదు. ఇరాన్‌పై స్వయంగా లేక ఇజ్రాయిల్ ద్వారా బాంబుదాడులు చేసే అమెరికా యుద్ధోన్మాద పథకాలను రష్యా, ఫ్రాన్స్, జర్మనీలు ఎదుర్కొన్నాయి. ఇరాన్ ఆర్థిక వ్యవస్థను కృంగదీసి లొంగదీసుకునే వ్యూహంతో అమెరికా ఇరాన్‌పై అత్యంత కఠినమైన ఆంక్షలు విధించింది.

ఇరాక్, ఆఫ్ఘనిస్థాన్, లిబియా తదితర దేశాలపై దాడులు సాగిస్తూ ఒక్కో దేశాన్ని ఛిద్రం చేస్తున్న అమెరికా ఇరాన్ విషయంలో సంప్రదింపులకు దిగడం హఠాత్తుగా జరిగింది కాదు. పాశ్చాత్య దేశాల ఆంక్షలను విఫలం చేయడానికి ఇరాన్ ఎంతో చాకచక్యంతో వ్యవహరించింది. లాటిన్ అమెరికా దేశాలు మొదలుకొని చైనా, రష్యా వరకు పలు దేశాలతో దౌత్య సంబంధాలు పటిష్టం చేసుకున్నది. అమెరికా సైన్యాలను కూడా దింపి పశ్చిమాసియాలో సృష్టిస్తున్న భయానక ఒత్తిడికి తట్టుకుని తన ప్రాబల్యాన్ని కాపాడుకున్నది. అనేక సందర్భాలలో అమెరికాను ఇరుకున పెట్టింది. ఈజిప్టు, సిరియాలలో పరిణామాలు అమెరికా ఆశించిన రీతిలో సాగడంలేదు. ఇరాక్, లెబనాన్, ఆఫ్ఘాన్ తదితర దేశాలలో పరిస్థితి ఆశాజనకంగా లేదు. అరబ్బు దేశాలలో తన కీలుబొమ్మలుగా ఉన్న రాచరికాలను దింపి, ఉద్యమాలను సృష్టించి మార్పులు చేపట్టాలని, తద్వారా తన పట్టును మరికొన్ని దశాబ్దాలు కొనసాగించాలని అమెరికా భావించింది. కానీ అందుకు శక్తియుక్తులు సరిపోక ఎత్తుగడలు విఫలం అవుతున్నాయి.

---

నిజమే, అమెరికాలో శాంతి భద్రతల యంత్రాంగం ఎంత నిర్బంధ పూరితమైనదో, ఎంత దుర్మార్గమైనదో, ఎంత తలకిందులదో మనందరికీ తెలుసు. అమెరికన్ ప్రభుత్వం పౌరుల జీవితాల్లోకి ఎంతగా చొచ్చుకు వస్తున్నదో జాతీయ నిఘా సంస్థ కుంభకోణపు వివరాలు బైట పడుతున్న కొద్దీ అర్థమవుతోంది. ఈ విషయాలు నాకు బాగానే తెలుసు. సెప్టెంబర్ 11 పరిణామాల తర్వాత నేను అట్టడుగుస్థాయి ప్రజల మధ్యన సామాజిక కార్యకర్తగా పనిచేశాను. దక్షిణ ఆసియా నుంచి వచ్చి న్యూయార్క్, న్యూజెర్సీలలో ఉన్న ముస్లిం, అరబ్, సిక్కు ప్రజల మధ్య పనిచేశాను. అమెరికా ఇమ్మిగ్రేషన్, శాంతిభద్రతల అధికార యంత్రాంగం అర్ధరాత్రి వేళల్లో తుపాకులు ఎక్కుపెట్టి ఎందరో అమాయకులను ఇళ్లనుంచి ఎలా లాక్కుపోయిందో, వారిని ఎలా నిర్బంధించిందో, వారిని తమ భార్యా బిడ్డల నుంచి వేరుచేసి వారి దేశాలకు తరలించిందో కళ్లారా చూశాను. అప్పుడు ఈ ఉన్నతవర్గ దౌత్య అధికారులు, వారి భారత ప్రభుత్వాలు, ప్రచార మాధ్యమాలు గగ్గోలు కాదు గదా, పల్లెత్తి మాట పలకలేదు. నిజం చెప్పాలంటే, ఏం జరిగినా ఫరవాలేదన్నట్టు ఉండిపోయారు. ఇప్పుడు బహిర్గతమవుతున్నది ఆ బ్రహ్మాండమైన కపటత్వం, ద్వంద్వ నీతి.

*(రచయిత న్యూయార్క్ కేంద్రంగా పనిచేస్తున్న మానవహక్కుల, ప్రచార మాధ్యమాల కార్యకర్త. ఎంపైర్ స్టేట్ కాలేజిలో అధ్యాపకుడు. 'ఇన్ ది బెల్లీ ఆఫ్ ది బీస్ట్: హిందూ సుప్రిమసిస్ట్ ఆర్ ఎస్ ఎస్ అండ్ బిజెపి ఆఫ్ ఇండియా' అనే పుస్తక రచయిత. ఈ వ్యాసపు ఇంగ్లిష్ మూలం http://www.countercurrents.org మీద ప్రచురితమైంది.)*

వీ

సిరియా అంతర్యుద్ధంలో ఆ దేశాధ్యక్షుడు అసాద్‌కు ఆర్థిక, రాజకీయ మద్దతు అందించడంపై, చమురుకు నిత్యావసరాలను కొనుగోలు చేసే 'వస్తు మార్పిడి' విధానంతో కూడిన వాణిజ్యాన్ని అనుసరిస్తూ డాలర్ ప్రపంచాధిపత్యాన్ని ప్రశ్నించడంపై అమెరికా దాని మిత్రదేశాలు ఇరాన్‌పై కొంతకాలంగా మండిపడుతున్నాయి. భౌగోళిక రాజకీయాధిపత్యం కోసం ఇరాక్, ఆఫ్ఘనిస్థాన్‌లో వలె ఇరాన్‌పై దాడి చేసి దారికి తెచ్చుకునేందుకు అమెరికా విధానకర్తలు ఉవ్విళ్ళూరుతున్నప్పటికీ, ప్రపంచ ఆర్థిక సంక్షోభం నేపథ్యంలో మరో యుద్ధం చేసేందుకు పరిస్థితులు అనుకూలించక పోవడం, ఇలాంటి యుద్ధాలవల్ల అమెరికా ఆర్థిక వ్యవస్థ మరింత సంక్షోభంలోకి కూరుకుపోతుందన్న భయంతో ఇరాన్‌తో ఒప్పందం చేసుకునేందుకు అమెరికా సిద్ధపడింది. అయినా, ఆర్థిక, భౌగోళిక రాజకీయాల్లో తన వైఖరి మార్చుకోవాలని మరింత ఒత్తిడి తెస్తూ మరో ఆరు నెలల్లో పాశ్చాత్య దేశాలు ఇరాన్‌పై కొత్తగా అనేక కీలక ఆంక్షలు విధించే అవకాశముందని అంతర్జాతీయ పరిశీలకులు అంచనా వేస్తున్నారు.

ఇరాన్ అణు కార్యక్రమాన్ని పూర్తిగా ఆపేయాలన్న అమెరికా, పాశ్చాత్య దేశాలు ఒక మెట్టు దిగొచ్చాయి. యురేనియం శుద్ధిని 5 శాతానికి మించనీయొద్దని ఈ ఒప్పందం నిర్దేశిస్తున్నది. ఇప్పటికే నిల్వ ఉన్న శుద్ధిచేసిన యురేనియంను పలచన చేయాలని లేదా ఆక్సైడ్‌గా మార్చాలని ఒప్పందం సూచించింది. ఇరాన్ వద్దనున్న సెంట్రిఫ్యూజుల సంఖ్యను పెంచకూడదని కూడా స్పష్టం చేసింది. ఇరాన్ కూడా తన వంతుగా ఒక మెట్టుదిగింది. మొత్తంగా అణ్వస్త్ర నిషేధానికి దారితీసే విధంగా చర్చలుండాలన్న తన షరతును సడలించుకుంది. దశాబ్దకాలం నుంచి కొనసాగుతున్న ఇరాన్ అణు కార్యక్రమానికి ఈ ఒప్పందం ద్వారా తొలిసారి అడ్డుకట్ట వేయగలిగామని అమెరికా సంతృప్తి పడుతుండగా, స్తంభింపజేసిన ఖాతాల్లోని 400 కోట్ల డాలర్ల చమురు అమ్మకాల సొమ్ము తన చేతికొస్తుందని ఇరాన్ ఊపిరి పీల్చుకుంటున్నది.

గత ఆగష్టులో ఇరాన్‌లో కొత్త ప్రభుత్వం ఏర్పడినాక అమెరికా, భద్రతామండలి ఇతర శాశ్వత సభ్యులు ఇరాన్‌తో దౌత్యమార్గాల్లో రహస్య చర్చలు ప్రారంభించారు. అధ్యక్షుడు ఒబామా, ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహాని మధ్య 2013 ఆగష్టులో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. ఇప్పుడు జెనీవాలో నవంబర్ 20-24 తేదీల మధ్య జరిగిన మూడు దఫాల ముమ్మర చర్చల అనంతరం అత్యంత ప్రాముఖ్యతగల తొలి ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం ప్రకారం ఐక్యరాజ్య సమితి ఇరాన్‌పై విధించిన ఆంక్షలు కొన్ని సడలిపోతాయి. జెనీవా ఒప్పందంతో ఇరాన్ నుండి అమెరికా రెండు ప్రయోజనాలు పొందాలని ఆశిస్తున్నది. ఒకటి, చమురు పరిశ్రమ సహా ఇరాన్ ఆర్థిక వ్యవస్థను అమెరికా, ఈయూలకు తెరవడం. ఆర్థిక మాంద్యంతో, ఇందన సమస్యతో సతమతమవుతున్న ఈయూకు ఇది ప్రత్యేకించి కీలకమైంది. రెండవది, సిరియా నుండి ఆఫ్ఘనిస్తాన్ వరకు ఉన్న ప్రాంతంలో అమెరికా ఆధిపత్యాన్ని నెలకొల్పడానికి ఇరాన్ నుంచి సహకారం పొందడం. నిజానికి సిరియా సంక్షోభకాలం అంతటా అసద్‌కు మద్దతుగా నిలిచిన ఇరాన్, అమెరికాతో నెయ్యం కోసం అతన్ని బలిపెట్టే అవకాశం లేదు. పైగా రష్యా ప్రమేయం లేకుండా సిరియాలో అధికార మార్పిడికి అవకాశాలు తక్కువ.

ఆఫ్ఘనిస్థాన్‌లో మాత్రం అమెరికా అనుకూల ప్రభుత్వం ఏర్పాటుకు ఇరాన్ సహాయపడగలుగుతోంది. 2001లో హమీద్ కర్జాయ్ ప్రభుత్వం ఏర్పాటులో ఇరాన్ కీలక పాత్ర వహించింది. ఇటు సిరియా లోనూ అటు ఆఫ్ఘనిస్తాలోనూ కూడా పలుకుబడి గల ఇరాన్ నేడు సైతం ఆఫ్ఘాన్ 'శాంతి'లో కీలక పాత్రధారిగా నిలిచే అవకాశం ఉంది. అందరూ అంటున్నట్టుగా ఇరాన్ జెనీవా ఒప్పందానికి కట్టుబడుతుందా లేదా అనేది ప్రశ్న కానేకాదు. ఆ ఒప్పందమేమీ దాని అణు శక్తి కార్యకలాపాలను పూర్తిగా నిషేధించేది కాదు. ఆరునెలల తర్వాతైనా అలాంటి ఒప్పందం కుదిరే అవకాశం లేదు. కాకపోతే ఇరాన్ అమెరికా, ఈయూ ప్రయోజనాలకు సహకరించాల్సి ఉంటుంది. కనీసం ఆఫ్ఘాన్ 'సుస్థిరీకరణ'కు సహకరించాల్సి వస్తుంది. జెనీవా ఒప్పందం ఇజ్రాయెల్‌కు ఇరాన్ నుంచి ఉన్న 'అస్తిత్వ ప్రమాదాన్ని' నిర్లక్ష్యం చేసిందని ఇజ్రాయెల్ ప్రధాని బెంజామిన్ నెతన్యాహూ అక్కసు వెళ్లగక్కుతున్నారు. సిరియాలో జరుగుతున్న అంతర్యుద్ధంలో ప్రభుత్వాధినేత అసద్‌కు, పాలస్తీనా తిరుగుబాటు గ్రూపులకు ఇరాన్ సహాయం అందిస్తున్న నేపథ్యంలో ఇదొక 'హానికరమైన ఒప్పందం'గా అభివర్ణించి తమ నిరసన వ్యక్తం చేశారు. అందుకే అది ఇరాన్‌కు 'లొంగుబాట'ని, దాని అణు బాంబు కార్యక్రమానికి పచ్చజెండా చూపడమేనని మండిపడుతున్నారు.

భారత్‌తో సహా ఐక్యరాజ్య సమితిలోని మెజారిటీ సభ్య దేశాలు ఈ ఒప్పందాన్ని స్వాగతించాయి. ఈ ఒప్పందం ప్రకారం ఇరాన్ ఇకపై తన అణు కార్యక్రమాల పరిశీలనకు అంతర్జాతీయ పర్యవేక్షకులను అనుమతిస్తుందని యూరోపియన్ యూనియన్ (ఈయూ) విదేశీ విధాన అధినేత కేథరిన్ ఆష్టన్ ప్రకటించారు. అమెరికాను నిరంతరాయంగా ధిక్కరించిన అహ్మదీ నెజాద్ స్థానంలో కొత్త అధ్యక్షుడిగా మితవాది రౌహానీ ఎన్నికై, ఇరాన్‌లో సంస్కరణవాద శకానికి నాంది పలకడంతో ఇది సాధ్యమైంది. ఈ ఒప్పందం శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తిని ఉపయోగించేందుకు ఇరాన్‌కుగల జన్మహక్కును గుర్తించింది. అదే సమయంలో బాంబు గ్రేడు అణు కార్యక్రమాలన్నిటిపైనా ఆంక్షలు పెట్టింది. అణుబాంబు తయారుచేయకుండా ఇరాన్‌ను నిరోధించేందుకు ఉద్దేశించిన అణు శుద్ధి కార్యక్రమాల నిరోధన, ఇంధన నిల్వలు తదితర అంశాలపై తుది ఒప్పందం కొరకు ఆరు మాసాల కాలాన్ని నిర్దేశించింది.

ఈ ఒప్పందం పర్యవసానాలు ఎట్లా ఉంటాయో అనే ఆందోళన పశ్చిమాసియాలో ఇప్పటికే వ్యక్తమవుతున్నది. ఈ నేపథ్యంలో పాశ్చాత్య దేశాలు దౌత్యం ద్వారా సాధించిన సత్ఫలితాలను కాపాడుకుంటూ, తదుపరి చర్చలను ఫలవంతం చేసుకుంటే పశ్చిమాసియాలో శాంతి స్థాపనకు మార్గం ఏర్పడవచ్చు. ఇరాన్‌ను ఒక స్థాయికి మించి లొంగదీసు కోలేమని మొదటగా అమెరికా గ్రహించాలి. ఇరాన్ ఆంక్షల నుంచి బయట పడాలని భావిస్తున్నదే తప్ప అమెరికాకు బయపడి చర్చలకు రాలేదు. శాంతి ఒప్పందాలు తాత్కాలిక ఉపశమనం కల్గిస్తాయి. ఇరాన్ పక్కనే ఉన్న ఇజ్రాయెల్ ఇప్పటికే అణ్వస్త్ర దేశం. అమెరికా అనుసరించిన విధానాల వల్ల పశ్చిమాసియా శత్రు శిబిరాలుగా చీలిపోయి ఉన్నది. పాశ్చాత్య దేశాలు ఒక్కో రాజ్య వ్యవస్థను కూలదోస్తున్న తీరును ఇరాన్ గమనిస్తున్నది. ఈ నేపథ్యంలో ఇరాన్ అస్తిత్వ పోరాటం చేయక మానదు. ఇరాన్ అణుకార్యక్రమాన్ని బలవంతంగా నిలిపివేయించడం అసాధ్యం కావచ్చు. ఎందుకంటే, అగ్రరాజ్యాలు అణ్వాయుధాలు కలిగి ఉండి, పేద దేశాలు తమ దేశ రక్షణ కొరకు అణ్వాయుధాలు కలిగి ఉండరాద

నడంలో హేతుబద్ధత, న్యాయబద్ధత కొరవడంది. పశ్చిమాసియా రాజకీయాలలో శాంతిని నెలకొల్పాలనుకుంటే, అణ్వాయుధాలు కలిగి ఉన్న దేశాలు ముందుగా వాటిని ధ్వంసం చేసుకోవాలి. ఇరాన్ కానీ మరో దేశం కానీ అణు కార్యక్రమం చేపట్టవలసిన అవసరమే ఉండదు. అణ్వస్త్ర పోటీని నివారించడమే శాంతికి మార్గం. ఇరాన్‌తో భవిష్యత్తులో సాగే చర్చల్లో ఆచరణ సాధ్యమైన పరిష్కారం లభిస్తుందా? అంటే సందేహమే.

1950లలో అణు ఇంధన ఏర్పాటుకు సాయపడింది అమెరికాయే. అమెరికాకు ప్రీతిపాత్రుడైన ఇరాన్ షా ను అక్కడి విద్యార్థి విప్లవం 1979లో పదవీచ్యుతుణ్ణి చేసే వరకూ రెండు దేశాల మధ్యా సన్నిహిత సంబంధాలుండేవి. 2001లో తమదేశంపై జరిగిన తీవ్రవాద దాడులకు కారణమంటూ అమెరికా ఇరాన్‌పై కత్తి దూసింది. ఇరాన్, ఇరాక్, ఉత్తర కొరియాలను దుష్టదేశాలుగా అమెరికా అభివర్ణించింది. అటు తర్వాత ఇరాన్‌పై కఠినమైన ఆంక్షలు మొదలయ్యాయి. ఏ అంతర్జాతీయ సంస్థనుంచీ ఇరాన్‌కు అప్పు పుట్టకుండా చేయడం, తమ దేశంలో ఇరాన్‌కు ఉన్న వేల కోట్ల డాలర్ల బ్యాంకు డిపాజిట్లు అడ్డుకోవడం, బంగారం, ఇతర ఆస్తుల్ని స్తంభింపజేయడం వంటి చర్యలకు అమెరికా పూనుకుంది. అది ఉత్పత్తి చేస్తున్న చమురును ఏ దేశమూ కొనకూడదన్న ఒత్తిళ్లూ ఎక్కువయ్యాయి. ఇలాంటి దుర్భర పరిస్థితుల్లో సైతం ఇరాన్ అణు కార్యక్రమానికి పూనుకున్నది. అయితే, ఈ అణు కార్యక్రమంపై చర్చలకు తాను సిద్ధమేనని ఇరాన్ ఆది నుంచీ చెబుతూనే వచ్చింది. ఈ చర్చలు పశ్చిమాసియాలో పూర్తి అణ్వస్త్ర నిషేదానికి తోడ్పడాలన్నది ఇరాన్ వాదన. ఇరాన్‌కు పొరుగున ఉన్న ఇజ్రాయెల్ వద్ద ఇప్పటికే అణ్వస్త్రాలున్నందువల్ల ఈ ప్రతిపాదనకు అమెరికా అంగీకరించలేదు.

జెనీవాలో ఇరాన్ అణు వ్యవహారంపై చర్చలు ప్రారంభం కావడానికి ముందు అమెరికా కాంగ్రెస్ కొత్తగా మరిన్ని ఆంక్షల్ని విధించబోతున్నట్లు హెచ్చరించిన నేపథ్యంలో ఈ ఒప్పందం జరిగింది. అత్యంత కఠినమైన అంతర్జాతీయ ఆంక్షలతో అత్యవసర మందులు, ఆహారం వంటి నిత్యావసరాల దిగుమతులకు సంబంధించిన తీవ్ర ఆంక్షల ఉపసంహరణ కోసం ఇరాన్ అనివార్యంగా తలవంచవలసి వచ్చింది. అమెరికా విధించిన ఆంక్షల కారణంగా ఇరాన్ చమురు ఎగుమతులు సగానికిపైగా పడిపోవడమే కాకుండా, అంతర్జాతీయంగా బ్యాంకింగ్, ద్రవ్యవ్యవస్థల లావాదేవీలన్నీ స్తంభించిపోయాయి. దాంతో ఆ దేశంలో ద్రవ్యోల్బణం విపరీతంగా పెరిగిపోయింది. నిరుద్యోగం వైపరీత్యంలా మారి ప్రజలు ఆర్థిక కష్టాల సుడిగుండంలో ఇరుక్కుపోయారు. ఇరాన్‌లో అమెరికా సారథ్యంలో సాగిన ఆర్థిక విధ్వంసం అక్కడి ప్రజా జీవితాల్ని అతలాకుతలం చేసింది. ఒప్పందం ఫలితంగా పెట్రో ఉత్పత్తులు, బంగారం వంటి విలువైన లోహాలు, విమాన విడిభాగాల వాణిజ్యానికి అవకాశం లభించడమే కాకుండా, ఆహారం, ప్రాణాధార మందులు వంటి వస్తువులు దిగుమతులపై ఆంక్షలు తొలగిపోతాయి. ఫలితంగా దేశంలో ఉపాధి అవకాశాలు మెరుగుపడడంతో పాటు ద్రవ్యోల్బణం ఉపశమించి ప్రజలకు ఊరట కలుగుతుంది. దేశ సార్వభౌమత్వానికి సంబంధించిన కీలక అంశాల విషయంలో ఇరాన్ రాజీ పడదని అంటూనే మధ్యంతరం అణు ఒప్పందాన్ని అధ్యక్షుడు రౌహానీ సమర్థించుకున్నాడు. శాంతియుత అణు కార్యక్రమాన్ని నిర్వహించడం కన్నా ఆర్థిక మెరుగుదల, ప్రజల సంక్షేమం, మెరుగైన జీవనపరిస్థితులు అత్యంత ప్రాధాన్యతగల అంశాలని ఆయన తెలిపారు.

అమెరికా విధించిన ఆర్థిక ఆంక్షల ఫలితంగానే ఇరాన్ సంప్రదింపులకు వచ్చిందని అది వాదిస్తోంది. వాస్తవానికి అమెరికా ఆంక్షలను ఎదుర్కోవడానికి ఇరాన్ అనుసరించిన వ్యూహాలు కూడా పశ్చిమ దేశాలను పునరాలోచింపజేశాయి. ఇరాన్ చమురు ఎగుమతులపై అమెరికా, మిత్రదేశాలు ఆంక్షలు విధించడంతో టెహ్రాన్ కొత్త మార్గాలను అన్వేషించింది. బ్యాంకింగ్ వ్యవస్థపై కూడా ఆంక్షలు విధించడంతో డాలర్లతో చమురు వాణిజ్యం చేయడం కష్టమై యూరోల్లో వాణిజ్యం ప్రారంభించింది. అయితే అమెరికా యూరోపియన్ బ్యాంకులపైనా ఒత్తిడి తెచ్చింది. దీంతో ఇరాన్ చైనా, భారతదేశాలతో ఎన్, రూపాయిల్లో చమురు వాణిజ్యం చేసేందుకు ముందుకు వచ్చింది. టర్కీతో చమురుకు బదులుగా బంగారం తీసుకుని వ్యాపారం చేసింది. దక్షిణ కొరియా, జపాన్ లాంటి దేశాలతో కూడా ఇరాన్ చమురు వాణిజ్యాన్ని పెంచింది. ద్రవ్య వ్యవస్థపై ఉన్న ఆంక్షలను అధిగమించేందుకు వివిధ దేశాలతో ఉన్న అవకాశాలను ఇరాన్ సమర్థంగా ఉపయోగించుకుంది. అమెరికా ఆంక్షల ఫలితంగా ఇరాన్‌పై చైనా, రష్యా ప్రాబల్యం పెరిగింది.

ప్రపంచ చమురు నిక్షేపాల్లో మూడింట రెండొంతుల మేరకు పశ్చిమాసియాలోనే ఉన్నాయి. చమురు ఉత్పత్తి చేసే ముఖ్యమైన దేశాల్లో ఇరాన్ ఒకటి. ప్రపంచంలో రెండో అతిపెద్ద నిక్షేపాలున్న దేశం ఇరాన్. అందుకే ఈ ప్రాంతంలో అస్థిరత అంతర్జాతీయ చమురు సరఫరాలపై ప్రతికూల ప్రభావం చూపుతుంది. ఫలితంగా అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థపై దుష్ప్రభావం పడుతుంది. ఈ రాజకీయ ఆర్థిక ప్రతికూలతను గమనించిన అమెరికా, పశ్చిమదేశాలు పట్టు సడలించాయి. ఇరాన్‌ను తిరిగి డాలర్ ఆర్థిక వ్యవస్థలోకి తేవడం మాంద్య ప్రభావంలో ఉన్న పశ్చిమ దేశాలకు తప్పనిసరైంది. అందుకే ప్రస్తుతం కుదిరింది తాత్కాలికమైందే, అయినా ఆహ్వానించదగిందే. ఈ నేపథ్యంలో ఇరాన్‌తో దౌత్యం ద్వారా సత్సంబంధాలు నెలకొల్పుకోవడం తప్పనిసరి అయినది. కానీ ఇరాన్‌తో ఒప్పందం వల్ల అమెరికా చిక్కుల్లోంచి బయట పడుతుందా? అనేది సందేహమే. ఇంతకాలం ఇజ్రాయెల్, అరబ్బు దేశాల మధ్య వైషమ్యాలను పెంచి పోషిస్తూనే, రెండు శిబిరాలపై తన పట్టు కాపాడుకున్నది. ఇప్పుడు ఇరాన్‌తో ఒప్పందాన్ని ఈ రెండు శిబిరాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. యూదు – అరబ్బు కలహాన్ని సృష్టించిన ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులు గత కొంత కాలంగా పశ్చిమాసియా అంతటా ఇస్లామిక్ ప్రపంచాన్ని సున్నీలు, షియాలుగా విడగొట్టి పబ్బం గడుపుకోవాలని భావిస్తున్నారు. కానీ ఈ వైరుధ్యాలు అమెరికా కూటమికి కూడా సమస్యలు సృష్టించక మానవు.

అందుకే, ఈ ఒప్పందం తారురోడ్డు మీద ప్రయాణంలా సాఫీగా సాగిపోతుందని చెప్పడానికి వీల్లేదు. పాశ్చాత్య ప్రపంచంతో ఎలాంటి రాజీకైనా ససేమిరా అంగీకరించని ఛాందసవాదుల ప్రాబల్యం ఇరాన్‌లో బలంగానే ఉంది. అలాగే, ఇరాన్ పై బలప్రయోగం చేసి పాదాక్రాంతం చేసుకోవాలి తప్ప, ఆ దేశంతో చర్చలేమిటని ప్రశ్నించే ఇజ్రాయెల్ అమెరికా మిత్రదేశంగా ఉంది. ఒప్పందం కుదిరిందన్న వార్తలు వెలువడిన వెంటనే 'ఇది చారిత్రాత్మక ఒప్పందం కాదు... చారిత్రాత్మక తప్పిదం' అంటూ బుసలుకొట్టింది. ఇక నుంచి ఈ ప్రపంచం మరింత

ప్రమాదకరంగా మారబోతున్నదని ఆందోళన వ్యక్తం చేసింది. పశ్చిమాసియాలోని సౌదీ అరేబియా వంటి ఇరాన్ శత్రుదేశాలు ఇజ్రాయెల్ అభిప్రాయంతో గొంతు కలిపాయి. ఇలాంటి ప్రమాదాలున్నాయి గనుకే రానున్న ఆరు నెలలూ కీలకమైనవి. ఇప్పుడు కుదిరిన జెనీవా ఒప్పందం తాత్కాలికమైనదే. దీని ప్రాతిపదికన రానున్న ఆరు నెలల కాలంలో మరిన్ని చర్చలు కొనసాగి సమగ్రమైన, శాశ్వత ఒప్పందం సాకారం కావాల్సి ఉంది. అది జరిగాకే ఇరాన్‌పై ఇప్పుడున్న ఆంక్షలన్నీ పూర్తిగా తొలగే అవకాశం ఉంది.

జెనీవా ఒప్పందం సవ్యంగా కార్యాచరణకు నోచుకున్న పక్షంలో టెహరాన్ తేరుకొంటుంది. ఇంటా బయటా అనూహ్య పరిణామాలూ విప్పారతాయి. పశ్చిమాసియాలో దుర్భర ఏకాకితనం అనుభవిస్తున్న దుర్దశ అంతమై – సిరియా, ఇరాక్, గల్ఫ్ ప్రాంతాలతో పాటు ఆఫ్ఘనిస్తాన్‌తోనూ ఇరాన్ అనుబంధం కొత్త చిగుళ్లు తొడిగే రోజులు రావచ్చు. ఆంక్షలు ఒత్తిళ్లు తగ్గించి సైనిక మోహరింపును పరిమిత స్థాయికి చేర్చడంతో ఆగని అమెరికా – పశ్చిమాసియాలో ఇరాన్ సేవలను వినియోగించుకోవడానికి ఆసక్తి కనబరచనుందన్న విశ్లేషణలు ఇప్పటికే వెలుగుచూస్తున్నాయి. అవే నిజమైతే – సౌదీ అరేబియా లేదా ఇజ్రాయెల్ స్థానాన్ని ఇరాన్ భర్తీ చేసే అవకాశాన్నీ కొట్టిపారేయలేం. ఈ నేపథ్యంలోనే ప్రాంతీయంగా స్వీయ ప్రయోజనాలు, అగ్రరాజ్యం వద్ద తమ పలుకుబడి బీటలు వారక తప్పదన్న యోచనే – సౌదీ అరేబియా, ఇజ్రాయెల్ నాయకుల్ని కుపితుల్ని చేస్తోంది. అనూహ్య ఒడంబడిక పట్ల నిరసనలు, అసంతృప్తుల వెనక దాగిన అసలు మర్మమిది.

ఇరాన్ నూతన అధ్యక్షుడు హసన్ రౌహానీ పట్టువిడుపుల కారణంగానే అణు ఒప్పందం కుదిరిందని భావిస్తున్నవారు పొరబడుతున్నారు. ఆఫ్ఘాన్ 'సుస్థిరీకరణ' వ్యూహంలో భాగంగానే అమెరికా ఇరాన్ పట్ల తన వైఖరిని మార్చుకుంది. ఆయన గద్దెనెక్కింది ఆగష్టులోకాగా అమెరికా మార్చిలోనే ఇరాన్ సఖ్యతకు ఒమన్‌లో అమెరికా విదేశాంగశాఖ ఉప మంత్రి విలియం బరన్స్ సహా అత్యున్నత స్థాయి అధికారుల బృందం ఇరాన్ ప్రతినిధులతో చర్చలు సాగించింది. ఆ తర్వాత ఇరాన్ ఎన్నికలకు ముందు మేలో విదేశాంగ మంత్రి జాన్ కెర్రీ ఒమన్‌లో రహస్యంగా అణు ఒప్పందానికి 'ప్రాతిపదిక'ను తయారు చేసిన విషయం రచ్చకెక్కింది. ఇటు ఆఫ్ఘాన్‌లో రష్యా, చైనాల ప్రాబల్యానికి కళ్లెం వేయడానికి, అటు తన ప్రత్యర్థిగా నిలుస్తున్న చైనాకు కళ్లెం వేయడానికి ఇరాన్ తురుపు ముక్కను ఒబామా ప్రయోగించారు. ఫలితం వేచి చూడాల్సిందే!

ఇరాన్‌తో భద్రతా మండలిలోని ఐదు దేశాలు, జర్మనీ సమష్టిగా ఒప్పందం కుదుర్చుకున్నప్పటికీ, చర్చలు ప్రతి దేశం విడిగా జరుపుకున్నవి. దీనిని బట్టి ప్రతి దేశం సొంత ప్రయోజనాలకు ఎంత ప్రాధాన్యం ఇస్తుందో అర్థమవుతున్నది. ఈ క్రమంలో భారత్ కూడా అమెరికా నుంచి ఎంత ఒత్తిడి వచ్చినప్పటికీ తన సొంత విదేశాంగ విధానాన్ని స్వీయ ప్రయోజనాల దృష్ట్యా రూపొందించుకోవాల్సి ఉంది. ఇరాన్ అణు కార్యక్రమాన్ని భద్రతా మండలికి నివేదించే తీర్మానంపై ఐఎఇఎలో మన ప్రభుత్వం 2005లో రెండుసార్లు అమెరికాతోపాటు ఓటు చేసి దేశంలో తీవ్ర విమర్శలకు గురైంది. అమెరికా ఒత్తిడికి లొంగి ఇరాన్ – పాకిస్థాన్ – భారత్ గ్యాస్ పైప్‌లైన్ ప్రాజెక్ట్ నుండి వైదొలగింది. ఇరాన్ నుంచి క్రూడ్ ఆయిల్ సరఫరా తగ్గిపోయింది. 2009 లాగాయతు పాతికేళ్లపాటు ఏటా 50 లక్షల టన్నుల ద్రవీకృత సహజవాయు దిగుమతుల నిమిత్తం 1800 కోట్ల డాలర్లతో కుదుర్చుకున్న భారీ వాణిజ్య ఒప్పందం చతికిల పడటానికి అమెరికాను అంటు కాయడమే కారణం. సాకుల మాటున సొంత అజెండా అమలుపరచే అగ్రరాజ్య నిజనైజానికి సాకారం కాని గ్యాస్ పైప్‌లైన్ ప్రబల దృష్టాంతరంగా నిలిచిపోతుంది. ఇరాన్ వంటి దీర్ఘకాల మిత్రదేశాలను దూరం చేసుకోకూడదు. ఇరాన్‌తో సంబంధాలను గ్యాస్ పైప్‌లైన్‌కే పరిమితమై చూడకూడదు.

ఇరాన్‌పై అణు పెత్తందారీతనానికి తెగబడిన అణు దేశాల స్వార్థ బుద్ధులేమిటో యావత్ ప్రపంచానికీ తెలుసు. నిజానికి టన్నుల కొద్దీ అణ్వాయుధాలు తయారు చేసుకుని కూచున్న అగ్రదేశాలు మరోక దేశం అణ్వాయుధ పరీక్షలు చేయకూడదని ఆంక్షలు విధించే అర్హత వాటికి లేదు. తమకు తొత్తుగా ఉన్న ఇజ్రాయెల్‌కు 1958లోనే 20 టన్నుల భారజలాన్ని సరఫరా చేసిన ఔదార్యం బ్రిటన్‌ది. మన పొరుగున పాకిస్థాన్‌కు అణుభిక్ష పెట్టింది చైనా. దేశదేశాలూ అణుసామర్థ్యం కోసం వెంపర్లాడే దురవస్థను దాపురిల్లజేసిందే ఇరాన్‌తో ఒప్పందం కుదుర్చుకున్న దేశాలు. 'అణుబాంబు తయారు చేయకుండా ఇరాన్‌ను నిరోధించే వ్యవహారంలో అందరూ విజేతలే!' అని రష్యా విదేశాంగ మంత్రి సెర్గీ లవ్రోవ్ పేర్కొనడం అగ్రరాజ్య అధిపత్య ధోరణికి అద్దం పడుతున్నది. ఇరాన్ నేడు ఆంక్షలకు వెరచి దారికొచ్చినట్లు కనిపించినా – అణు నిరాయుధీకరణపై అగ్రరాజ్యాల ధూర్తధోరణులు ద్వంద్వ ప్రమాణాలు రూపుమాసిపోనన్నాళ్లు, ప్రపంచ మానవాళికి పెనుముప్పు పొంచే ఉంటుంది!

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

రాబోయే సంచికలలో...

- **సహకార సంఘాలు - ప్రకాష్ బక్షి కమిటీ - ముప్పాళ్ల భార్గవశ్రీ**
- **భారతీయ సహనం ఇంకెన్నాళ్లు? - వాసిరెడ్డి భాస్కర రావు**
- **నేర స్వభావాల మూలాలు - ఎన్. భగవాన్‌రెడ్డి**
- **ఆదివాసుల స్వయం పాలన - దాసరి నివాస్**
- **రోగమొస్తే మరణమే దిక్కు - ఎం. నాగమణి**
- **జీవిత బీమా రంగం - నేటి పరిస్థితి - కె. కృష్ణమూర్తి**
- **నిత్య జీవితంలో గతితర్కం - లోకసంచారి**
- **స్త్రీలపై అత్యాచారాలు - మన కర్తవ్యం - రోజారమణి**

# ఉద్యమాలతోనే ఉజ్వల భవిష్యత్తు

***ఉత్తరాంధ్రను, గిరిజనులను నిర్లక్ష్యానికి గురిచేసిన పాలకులను నిలదీయాలనీ, తమ అస్తిత్వాన్ని చాటిచెప్పేలా స్థానిక తండాల్లోని, గూడాల్లోని ప్రజలు చైతన్యవంతులై ఉద్యమించాలనీ అంటున్నారు* దుప్పల రవికుమార్**

కొత్తగా ఏర్పడనున్న తెలంగాణ రాష్ట్రాన్ని శాసనసభ జాబితాలో వరుసక్రమంలో తమిళనాడు తరువాత స్థానంలో పెట్టినపుడు దానికి కూడా మన రాజకీయ నాయక వినాయకులు ఎంతో రాద్ధాంతం చేయబూనారు. సమైక్యం పేరుతో గౌరవ శాసనసభ సభ్యులు, ఆ సభ్యత్వాన్ని ఆశిస్తున్న వారు, ఆ సాంఖ్యక క్రీడతో పదవులకోసం అంగలారుస్తున్నవారు ఆడుతున్న చిత్ర విచిత్ర విన్యాసాలను గమనించిన వారెవ్వరికైనా, వారెవరికీ ప్రజల భవిష్యత్తు గురించి లేశమాత్రం ఆలోచన లేదనిపిస్తుంది. ప్రముఖ ఆంగ్ల దినపత్రిక హిందూలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గురించి ఏదైనా అనుకూల వార్త వస్తే చాలు తెలుగునేల ముక్కలైపోతే బాగుండునని తమిళులంతా భావిస్తున్నట్టు పాసింగ్ రిమార్కులు పారేస్తాం. స్వాతంత్ర్యం రాకముందు భోగరాజు పట్టాభి సీతారామయ్య తదితరులు భాషాపరంగా, భావజాలపరంగా, సాంస్కృతిక పరంగా, చదువులూ ఉద్యోగాలలో వాటాలపరంగా, ఆర్థిక పంపిణీలో అసమానతల పరంగా తమిళులు తెలుగువారిని అణిచివేస్తున్నారని తెలుగు వారందరినీ ఏకతాటిపై ఉంచడానికి అదే పత్రికను వాడుకున్నారన్న సంగతి ఎవరూ చెప్పరు. కన్వీనియెంట్‌గా మర్చిపోతారు.

ఒకట్రెండు రోజుల రైలు ప్రయాణంలోనే ఎంతో కలిసిపోయామనుకున్న ప్రయాణీకులు విడిపోయినప్పుడు కొంత బాధపడతారు. అలాంటిది హైదరాబాద్‌ను విడిచిపెట్టి వెనక్కి వచ్చేయాలన్న వ్యాపారస్తులకు, పెట్టుబడిదారులకు ఉద్వేగం పాలు మోతాదుకు మించి ఉండడం సహజమే. బతుకుతెరువు కోసం, పొట్టగడవడం కోసం, కూలీ నాలీ కోసం భాగ్యనగరం చేరుకున్న సామాన్య ప్రజానీకానికి హైదరాబాద్ మన దేశంలోనే ఏ రాష్ట్రంలో ఉన్నా ఒకటే. అది హైదరాబాద్ అయినా, సూరత్ అయినా, ముంబై అయినా, ఢిల్లీ అయినా మరేదైనా అదంతా ఒక్కటే. అలాంటిది ఏ సంబంధమూ లేని ప్రజలలో అనవసర భయాలు, మిథ్యాపూరిత ఆందోళనలు, ప్రగతి సంబంధిత అభూతకల్పనలు కల్పించి తెలంగాణ ఏర్పాటైతే మిగిలిన పదమూడు జిల్లాల్లో ప్రజలకు బతుకేలేదు అన్నట్టు దుష్ప్రచారాన్ని విషపూరితంగా వారి ఆధీనంలో ఉన్న మీడియా ద్వారా ప్రచారం చేస్తున్నారు.

తెలంగాణ ప్రజల దీర్ఘకాల ప్రజాస్వామిక గౌరవనీయ ఆకాంక్ష నెరవేర్చుకోవడానికి మనం మనస్ఫూర్తిగా సహకరిస్తేనే రెండు నూతన రాష్ట్రాల ప్రజల నడుమ సుహృద్భావ సంబంధాలు నెలకొంటాయి. ఈ కనీస ఇంగితం కరువయిన రాజకీయ నాయకులు, ఇతర మేధావులు ప్రజలకు ఇదంతా నచ్చ జెప్పాల్సింది పోయి, దీనికి పూర్తి భిన్నంగా ఉన్న అపోహలకు మరిన్ని అసత్యాలు, అర్ధసత్యాలు జోడించి ప్రజల మనసులు మరింతగా విరచడానికే ప్రయత్నిస్తుండడం చాలా విచారకరం. విద్వేషాలు ప్రబలిన తరువాత ఎన్ని సపర్యలు చేపట్టినా పెద్దగా ప్రయోజనముండదని పాకిస్తాన్‌తో మన సంబంధాలు రుజువు చేస్తాయి.

నెలలు గడుస్తున్నా బ్యానర్లు, ఇతర కరపత్రాలపై సమైఖ్యాంధ్ర అనే రాస్తుండడం సమైక్యాంధ్ర పోరాటకారులకు పెద్దగా భాషా పరిజ్ఞానం లేదని పట్టి చూపిస్తుంది. ఇక చారిత్రక పరిజ్ఞానం లేదని చెప్పేందుకు దాదాపు సీమాంధ్ర అన్ని జిల్లాల్లో కరపత్రాలలో, బ్యానర్లలో, ఫ్లెక్సీలలో ఆ వాదానికి ప్రతినిధిగా పొట్టి శ్రీరాములు బొమ్మను వాడడం మనం చూస్తున్నాం. నిజానికి పొట్టి శ్రీరాములు విభజనవాది. ఆనాటికి తమిళులతో కలిసి ఉండడం ద్వారా జీవితంలో అన్ని రంగాలలో కనాకష్టాలు పడుతున్నామని తెలుగువారిని (అందులో ఇప్పటి తెలంగాణ ప్రజలు లేరని గమనించాలి) విడదీసి ఆంధ్రులకు ఒక కొత్త రాష్ట్రం ఏర్పరచాలన్న ఆకాంక్షతో తన ప్రాణాలను సైతం త్యాగం చేసుకున్నారు. పొట్టి శ్రీరాములు స్ఫూర్తి మనకు అర్థమైతే ఆంధ్రులకోసం అప్పటి ఆయన ఆత్మబలిదానానికి, తెలంగాణ ప్రజల ఇప్పటి ఆత్మగౌరవ నినాదానికి ఉన్న సారూప్యం అర్థమయ్యేది. ఆమాటకొస్తే తమిళనాడు నుంచి తెలుగువారు వెళ్లడానికి అసలు ఇచ్చగించని అసలు సిసలు సమైక్యవాది రాజాజీ. ఆంధ్రుల 'ప్రత్యేక' పోరాటాన్ని ఆపడానికి ఆయన ఎంతగానో ప్రయత్నించారు. ఇప్పటి కిరణ్‌కుమార్ రెడ్డికంటే చాలా ఎక్కువ చేశారు. ఇదంతా వందల ఏళ్ల కిందటి చరిత్ర కాదు. కేవలం ఐదారు దశాబ్దాల కిందటి చరిత్రను సైతం మనం గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నం చేయకపోవడం విడ్డూరం. ఇదంతా తెలుగునేల మీద తిష్టవేసుక్కూర్చున్న మీడియా కుట్రగా ప్రజలు గుర్తించాలి.

ఆరు దశాబ్దాల కిందట నాలుగు కోట్ల ఆంధ్రులు తమిళుల రాష్ట్రం నుంచి విడిపోవడానికి చేసిన ఆత్మగౌరవ పోరాటంలో ఏయే కారణాలు చెప్పి ఆంధ్ర రాష్ట్రంగా ప్రత్యేకంగా ఏర్పడ్డారో ఇప్పుడు అదే నాలుగు కోట్ల మంది తెలంగాణ ప్రజలు ఆంధ్రప్రదేశ్ నుంచి అచ్చంగా అవే కారణాలు చెప్పి ప్రత్యేక తెలంగాణగా ఏర్పడాలని కోరుకోవడం ఏ విధంగా అభ్యంతరకరమో అర్థం కాక పొరుగు రాష్ట్రాల ప్రజలు తలలు బద్దలుకొట్టుకుంటున్నారు.

దబాయింపుల పర్వంలో మరో ఉదాహరణగా హైదరాబాద్‌ను అభివృద్ధి చేసింది హైదరాబాద్ రాష్ట్రం విలీనం తర్వాత తెలుగు ప్రజలేనని జరుగుతోన్న తప్పుడు ప్రచారాన్ని తప్పక చెప్పుకోవాలి. ప్రపంచంలోనే ఒకానొక ప్రముఖ నగరంగా స్వాతంత్ర్యానికి పూర్వమే ఖ్యాతి పొందిన భాగ్యనగరం విలీనం తర్వాతే సాగు భూములనక, పోడు భూములనక,

పోరంబోకు భూములనక, దేవుడి భూములనక, చెరువులనక, కాలువలనక, గుట్టలనక, కొండలనక, శివార్లనక ఎల్లెడలా కబ్జాలకు గురైన సంగతి మన రాజకీయ నాయకులు చెప్పరు గానీ ఒక్క సంగతి గుర్తు చేయాలి. తమిళనాడు నుంచి ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటైనప్పుడు మొదట నెహ్రూతో చర్చల్లో కొన్నేళ్లపాటు ఉమ్మడి రాజధానిగా మద్రాసు ఉండడానికి సూత్రప్రాయంగా రాజాజీ అంగీకరించారు. కొంతమంది తమిళ రచయితలు, సాంస్కృతిక కళాకారులు ముఖ్యంగా కల్కిలాంటి గొప్ప రచయితలు ఇందులో ఉన్న లొసుగులను తమ రచనల్లో, ఇతర కళారూపాల్లో వ్యక్తం చేసినతరువాత 'తాత్కాలిక ఉమ్మడి కథ'లో అసలు సంగతి బోధపడిన తరువాత మూడేళ్లు కాదు కదా, మూడు రోజులు కూడా మద్రాసు ఉమ్మడి రాజధాని కుదరదని కరాఖండిగా చెప్పేశారు. దాంతో రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు ఏవేవో లెక్కలు వేసి కర్నూలును రాజధానిగా చేసుకుని చిక్కులు తెచ్చుకున్న సంగతి మనకు తెలిసిందే. కొన్నాళ్లపాటు దేరాలలో గడిపిన ప్రభుత్వ యంత్రాంగం తర్వాత నిజాం నవాబుల భవనాలపైన కన్నేసి నడిపిన కథ ఎట్టకేలకు ఇప్పుడు ఒక ముగింపుకొచ్చింది.

తెలంగాణ పోరాటం ఉధృతంగా జరిగినప్పుడు ప్రజల సెంటిమెంట్ ను దొంగాయుధంగా వాడుకుని మర్రి చెన్నారెడ్డి ఆనాడు సాగించిన దుష్ట నాటకాన్ని పునరావృతం చేయాలని ఇప్పుడు తాజా ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి ఉవ్విళ్లూరుతున్నట్టు సీమాంధ్ర ప్రజలు ఇంకా గుర్తించడం లేదు. కొత్త పార్టీ పెట్టి సెంటిమెంటుతో గెల్చుకున్న సీట్లను తిరిగి కాంగ్రెస్‌కు అప్పజెప్పడం ప్రజలను మోసం చేయడానికేనని ప్రజలకు ప్రత్యామ్నాయ పత్రికలే ఎరుకపరచాలి. సుదీర్ఘ రాష్ట్ర రాజకీయ ప్రయోజనాలను పట్టించుకోకుండా కేవలం ఇప్పుడు రావలసిన ఓట్లు సీట్లు నినాదంతో అటు తెలుగుదేశం పార్టీ, ఇటు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ప్రజలలో గూడుకట్టుకున్న మిథ్యా సెంటిమెంటును తమ తమ పత్రికలు, టీవీ చానళ్లద్వారా మరింత ప్రజ్వల్లింప జేస్తున్నాయి.

నూతన తెలంగాణ రాష్ట్రం ఏర్పాటైతే ఏం జరుగుతుంది? 1956లో జరిగిన విలీనం రద్దయినట్టవుతుంది. అంటే తమిళనాడు నుంచి ఆంధ్రరాష్ట్రం 1953లో ఏర్పడినపుడు ఉన్న ప్రాంతంగా 2014కు మిగులుతుంది. ఈ కొత్త రాష్ట్రంలో అవే రాజకీయ పార్టీలు ఉంటాయి. ప్రజల జీవనాధారాలు అదే మాదిరిగా ఉంటాయి. జనజీవితం యథావిధిగా కొనసాగుతుంది. వివిధ రకాల సమస్యలు అవే రూపంలో ప్రజలను ఇబ్బంది పెడుతుంటాయి. కొత్త స్వరూపంతో రాజకీయ పార్టీలు మళ్లీ ప్రజల ముందుకు కొత్త దసరా వేషాలతో ఓట్ల కోసం వస్తాయి. వాగ్దానాల వాగాడంబరం ప్రదర్శిస్తాయి. కొత్త బంగారులోకం కలల్లో చూపిస్తాయి. ఓట్లు కొల్లగొడతాయి. అధికారం చేజిక్కించుకుంటాయి. మళ్లీ ఐదేళ్లకు ఎన్నికలు వచ్చేవరకు చేసిన బాసలన్నీ నీటిమీద రాతలవుతాయి. ప్రజల సమస్యలు అలాగే ఉండడం ఆయా పార్టీలకెంతో అవసరం. ఉన్న సమస్యలన్నీ పరిష్కరించేస్తే ప్రజలదగ్గరకు ఏం ముఖం పెట్టుకుని వెళతారు? వాటిని పరిష్కరించకపోతేనే కదా, మళ్లీ మళ్లీ వాగ్దానాలిస్తూ పబ్బం గడుపుకోవడానికి వీలయ్యేది.

ఇందుకు భిన్నంగా ఆలోచనాపరులు, సామాజిక ఉద్యమకారులు స్పందించాలి. తమ సమస్యలను తామే గుర్తించాలి. వాటిపైన తమ ప్రజలను తామే చైతన్యవంతులను చేయాలి. మొద్దునిద్ర నటించే ప్రభుత్వాలు కదిలేవరకు నూతన పోరాటరూపాలను అన్వేషించాలి. సమస్య తీవ్రతను గుర్తించి గగ్గోలు పెట్టి ప్రజలను చైతన్య పరచడంతో తమ బాధ్యత తీరిపోదని వీరంతా గుర్తించాలి. ఆయా సమస్యల నుంచి తాత్కాలిక ఉపశమనానికి, శాశ్వత పరిష్కారానికి తగిన ప్రత్యామ్నాయాలను, అందుకు సంబంధించిన ప్రణాళికలను సిద్ధం చేయాలి. వీటన్నిటిపైన స్థానిక ప్రజలకు సంపూర్ణ అవగాహన కల్పించాలి. ప్రభుత్వం చేపట్టవలసిన పరిష్కార మార్గాలను, ప్రత్యామ్నాయ పద్ధతులను సిద్ధం చేసుకుని ప్రజలను సమాయత్తపరచాలి. ప్రజా పోరాటాలను బలహీనపరిచేందుకు ప్రభుత్వం, ఇతర పెట్టుబడిదారీ సంస్థలు పన్నే కుట్రలను పసిగట్టగలగాలి. వాటినెలా ఎదుర్కోవాలో, ఆ మాయజలతారు వలలో చిక్కుకుపోకుండా తమను తాము కాపాడుకోవడమెలానో ఉద్యమకారులకు ఉగ్గుపాలతో నేర్పించాలి. ఇదంతా ఏ స్వచ్ఛంద సంస్థల బాధ్యతో, దివినుండి దిగివచ్చే భువన నాయకుల బాధ్యతో అని అనుకోకుండా దీనిని మనందరి బాధ్యతగా స్వీకరించాలి.

చారిత్రక దృక్పథం పూర్తిగా కొరవడిన నేటి తరానికి చరిత్రపట్ల కనీస అవగాహన కల్పించాలి. రాజకీయ నాయకగణమే కాకుండా, ఉద్యోగులు, అధ్యాపకులు, విద్యార్థులు ఎవరినన్నా అడగండి, ఈ రాష్ట్రంలో ఎన్ని ప్రాంతాలున్నాయంటే తడుముకోకుండా మూడు ప్రాంతాలేనని జవాబు చెప్తారు. చివరకు కళింగాంధ్ర ప్రాంతమని పిలవబడే శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాల ప్రజలు సైతం ఈ రాష్ట్రంలో ప్రాంతాల లెక్కింపు చేసుకున్నప్పుడు తెలంగాణ, రాయలసీమ, కోస్తాంధ్ర అనే ప్రాంతాల పేర్లు చెప్పి చాలా విచారకరంగా తమ ఉనికిని తామే రద్దు చేసుకుంటారు. తమ ఉనికిని, ప్రాంతీయ అస్తిత్వాన్ని తామే గుర్తించలేనంతగా సీమాంధ్ర సంస్కృతి, భాష, చరిత్రలు ఇప్పటికే ఇక్కడి ప్రజల తలల్లోకి చేరిపోయాయి. నావోమి వుల్ఫ్ తన 'షాక్ డాక్ట్రిన్' గ్రంథంలో చర్చించినట్టుగా సుప్తచేతనలో సైతం తమ గుర్తులు చెరిపేసుకున్నట్టు సీమాంధ్ర చరిత్రకారుల చరిత్ర రచన, సీమాంధ్ర పాత్రికేయుల వర్తమాన చరిత్ర రచన, సీమాంధ్ర కళాకారుల, మేధావుల భవిష్యత్తు గానాలు అక్కడి పెట్టుబడిదారుల అడుగులకు మడుగులొత్తినవిగా ఉండడం వల్లనే చివరాఖరకు కళింగాంధ్ర వాసులే కాదు, రాయలసీమ వాసులు సైతం తమ యాస భాషలను ఈసడించు కుంటున్నారు. తమ పిల్లలను సినిమా భాష నేర్చుకొమ్మని ప్రోత్సహిస్తు న్నారు. తమ తిండి పదార్థాలను, వంటలను ఇష్టపడడం కన్నా కోస్తా వంటకాలంటే ఎక్కువ ఇష్టపడతారు. కళింగాంధ్ర ప్రాంతపు మనుగడను మర్చిపోయిన మూలవాసులు దాని భవిష్యత్తుకు పాకులాడతారని భావించడం అత్యాశే. ఇక్కడి సమున్నత చరిత్ర, భౌగోళిక విభిన్నత, భాషా విలక్షణత, సాంస్కృతిక వారసత్వ సంపద తదితరాలన్నింటిని కాలితో తన్ని ఎవడో ఊదిన నాదస్వరాలకు తలలూపే సన్నాయిలు అయిపోయిన కళింగాంధ్ర జాతి పెనునిద్దుర వదిలించడానికి ఎన్ని ఏనుగుల ఘీంకారాలు కావాలి? గోదావరి నీరు శ్రీకాకుళం జిల్లాకు వస్తుందని చెప్పే బడుద్దాయి మాటలు నమ్మి కళ్లనీరు పెట్టుకునే జాతికి జ్ఞానోదయమయ్యేదెన్నడు? హైదరాబాద్ లేకపోతే చదువుకున్న యువతకు బతుకే లేదన్న మిడిమిడి జ్ఞానపు మాటలు నమ్మి ఆవేశపడి ఉన్న చదువులకు ఎగనామం పెట్టుకున్న అజ్ఞానులకు దారిచూపించేదెవరు?

# కరువుల సీమ స్థితి మారేదెన్నడు?

***రాయలసీమ కరువుకు ప్రకృతి కొంత కారణమైతే దాన్ని కొనసాగించింది పాలకులే అనీ, ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర సాధనతోనే ఈ సమస్యలు అంతమవుతాయనీ అంటున్నారు ఎం. భాస్కర్***

**రా**యలసీమ గురించి ఏమి మాట్లాడాలన్నా కరువు దగ్గర మొదలు పెట్టాలి. చివరికి కరువు దగ్గరే ముగించాలి. రాయలసీమ రాజకీయార్థిక సామాజిక పరిస్థితులను కరువు నుండి వేరు చేసి చూడలేము. రాయలసీమకు ఏం కావాలి అంటే 1) నీళ్లు, 2) నీళ్లు, 3) నీళ్లు అంటాడు కథా రచయిత బండి నారాయణస్వామి. నిరంతరం కరువుకాటుకు గురవుతూ, ఆకలితో చచ్చిపోతూ వలసలతో అవమానాలతో దుర్భర జీవితాలను నెట్టుకొస్తున్న రాయలసీమ నుండి తెలుగుజాతి ఐక్యత గురించి వినపడడం ఆశ్చర్యం కలిగిస్తుంది. కాని రాయలసీమ ఎండిన గొంతుల నుండి వినిపిస్తున్న ఈ కేకల వెనక ఉన్న అమాయకత్వంతో పాటు రాయాలసీమ రాజకీయార్థిక కోణం నుండి చూస్తే గుండెలు పగిలే నిజాలు బయటికి వస్తాయి.

దక్షిణ భారతదేశంలోనే అతి తరచుగా, అత్యంత ప్రమాదకరమైన పెద్ద కరువులకు గురవుతూ ఎడారిగా మారిన ప్రాంతం రాయలసీమ. 1990-91లో వచ్చిన కరువులు రాయలసీమ ప్రజలను ఎంతగానో కుంగదీశాయి అని చెప్పడానికి కదిరిలోని నరసింహస్వామి గుడిలో ఉన్న శాసనం ఒక ప్రత్యక్ష సాక్ష్యం. కరవుల బారి నుండి ఆ సంవత్సరం వేలాది మంది మృత్యువాత పడ్డట్టుగా ఆ శాసనం చెబుతున్నది. ఆ తర్వాత చరిత్రలో రికార్డయిన కరువులు రాయలసీమ దయనీయ స్థితిని వినిపిస్తాయి. 1803లో వచ్చిన కరవు వల్ల తిండి గింజల కొరతతో ప్రజలు నరకయాతనకు గురయ్యారు. 1823, 1832, 1834, 1853, 1865లో వచ్చిన కరువులు సీమ ప్రజలను పీల్చి పిప్పి చేశాయి. ఈ కరవుల్లో తిండిగింజల కొరతతో పాటు తాగడానికి నీళ్లు, పశువుల మేత దొరకక సీమ జనజీవనం తల్లడిల్లిపోయింది. ఆ తరువాత పగపట్టిన కరువు 1875 నుండి 1931 వరకు వరుసగా చుట్టుముట్టి సీమ ప్రజల జీవితాలను అతలాకుతలం చేసింది. 1875 నుండి 1931 వరకు 57 సంవత్సరాలలో 36 కరువులు వచ్చాయి. 1875-76లో వచ్చిన అతి భయంకరమైన ధాతు కరువు లక్షలాది ప్రజలను పొట్టనబెట్టుకుంది. ఒక్క ఈ కరువులోనే జనాభా మూడవ వంతు అనగా 15 లక్షల మంది చనిపోయారు. ఊర్లకు ఊర్లు స్మశానాలుగా మారాయి. ఇక చనిపోయిన పశువులకు లెక్కే లేదు. వర్షపు చినుకులతో దాహం తీరక మనుషుల శవాలతో కడుపు నింపుకుంది ఈ నేల. ఆకాశగంగ అలకతో తన బిడ్డలను తానే దిగమింగింది ఈ నేల. 19వ శతాబ్దంలో ప్రతి 4 సంవత్సరాల కొకసారి కరవులొచ్చాయి. ధాతు కరువు తరువాత కూడా 1931 వరకు వచ్చిన కరువులన్నీ ఇలాంటి విషాదాన్నే మిగిల్చాయి. 1931-32, 1935 నుండి వరుసగా నాలుగు సంవత్సరాలు పగబట్టిన ప్రకృతి తన కరువు పాదాలతో సీమ ప్రజల గుండెలపై నాట్యం చేసింది.

---

నూతనంగా ఏర్పడబోతున్న రాష్ట్రంలో కళింగాంధ్ర ప్రాంతం నిర్లక్ష్యపు నీలినీడలలో మరింత నగుబాటుకు గురి కానుంది. ఒకవైపు గిరిజన ప్రాంతపు ప్రజల జీవితాలు అంతే అధ్వానంగా తెల్లవార నున్నాయి. వనాఫ్ సెవంటీ చట్టాన్ని తూట్లు పొడిచే ప్రయత్నాలు చంద్రబాబు నుంచి చిదంబరం వరకు నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నారు. అక్కడి స్థిర, చరాస్తులను గిరిజనేతరులెవ్వరూ కొనుక్కోవడానికి వీల్లేదని చెప్పిన చట్టానికి ప్రభుత్వం మినహాయింపు అన్నట్టుగా దబాయించి ప్రతి ప్రభుత్వ కార్యక్రమానికి గిరిజనులకు చెందిన భూమిని సొంతం చేసుకుంటోంది. ఐటిడిఏ పేరుతో ప్రభుత్వమే గిరిజన భూములను దురాక్రమణకు పాల్పడుతోంది. ఆ భూముల్లో పెట్టిన పరిశ్రమల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో తగినంత విద్యార్హతలు కలిగిన గిరిజనులు దొరకడం లేదన్న సాకుతో గిరిజనేతరులకే ఉద్యోగాలు కల్పిస్తున్నారు. ఇన్ని ప్రయత్నాలు చేస్తున్నట్టు నటించడం వల్లనే ఇప్పటికి ఆరేడు దశాబ్దాలు దాటినా గిరిజనులను అర్హులుగా చేయలేక జావగారి పోతున్నాం.

కేవలం అధికార హోదాలో గిరిజనేతరులు ఉండడం వల్లనే అక్కడి ఫలసాయం, పంటసాయం, పారిశ్రామిక ప్రగతి ఫలాలు మైదాన ప్రాంతానికి ఎలాంటి లాభాపేక్ష లేకుండా చేరిపోవడానికి కారణమని సబాల్టర్నన్ స్టడీస్ వెలుగులో మనందరికీ తెలుస్తున్న సత్యం. ఒకవైపు కళింగాంధ్రలో గిరిజన కొండలలో జరుగుతున్న అక్రమ మైనింగును అరికట్టలేని ప్రభుత్వం, తాను స్వయంగా మద్దతిచ్చి ప్రోత్సహిస్తున్న పారిశ్రామికీకరణను నియంత్రించుకోలేని ప్రభుత్వం మరోవైపు గిరిజనుల ప్రగతి, అభ్యుదయం వంటి బూటకపు మాటలతో వారి కన్నీళ్లు తుడవడానికి కర్చీఫులు సిద్ధం చేస్తే వాటిని నమ్మడమెలాగ? వన సంరక్షణ చట్టాలను, పర్యావరణ పరిరక్షణ చట్టాలను తన అవసరాల మేరకు ప్రతిసారి కొత్త నిర్వచనాలిస్తూ ఇటు ప్రజలను అటు పర్యావరణాన్ని తుంగలో తొక్కుతున్న ప్రభుత్వ ద్వంద్వ విధానాలను, నిజాయితీలేని తనాన్ని నిలదీయడానికి మనమే నడుం బిగించాలి. గిరిజన యువతరం తోటే గిరిజనుల సమస్యల గురించి ఆయా తండాలలో, గూడలలో, పల్లెలలో విస్తృతంగా ప్రచారం చేసి ప్రజలను విద్యావంతు లను చేయాలి. వారికి ఎదురవుతున్న సమస్యలకు వారే సరికొత్త పరిష్కారాలు సూచించ గలిగేటట్లు ప్రోత్సహించాలి.

*(రచయిత ఆంగ్ల విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్,*
*ఆదిత్య ఇంజనీరింగ్ కళాశాల, టెక్కలి)* వీ

అంతటితో ఆగిందా అంటే ఆగలేదు. మళ్లీ 1941 నుండి 1946వరకు వరుసగా 5 సంవత్సరాల పాటు సీమ ప్రజలు కార్చడానికి కన్నీళ్లను కూడా మిగల్చకుండా బీభత్సం సృష్టించింది. ఈ భయానక స్థితి నుండి కాస్తయినా కోలుకోక ముందే అదే దూకుడులో 1951-52 నుండి 1956 వరకు ఏకంగా 18 కరువులు చుట్టు ముట్టాయి. మొత్తంగా 20వ శాతాబ్దంలో ప్రతి 3 సంవత్సరాల కొకసారి కరువుల వారసత్వమే వర్ధిల్లింది. ప్రపంచవ్యాప్తంగా అభివృద్ధి చెందిన శాస్త్ర సాంకేతిక నీటిపారుదల పరిజ్ఞానంతో కరువును తరిమి కొడితే రాయలసీమ మాత్రం కరువుల కాపురానికి అనువైన ప్రాంతంగా నిలిచిపోయింది.

21 శాతాబ్దంలో కూడా 2001 నుండి 2004 వరకు వరుసగా కరవుల చరిత్రే కొనసాగింది. 19వ శతాబ్దంలో ప్రతి నాలుగు సంవత్సరాల కొకసారి కరువులు రాగా అది 20వ శతాబ్దంలో ప్రతి మూడు సంవత్సరాలకొకసారి అయింది. ఇప్పుడు 21వ శతాబ్దంలో ప్రతి రెండు సంవత్సరాల కొకసారి కరువు సంవత్సరంగా కొనసాగు తున్నది. ఇంతటి అమానుషమైన కరువు పీడనలతో సీమ ప్రజలు నలిగిపోతుంటే కోస్తాంధ్ర ప్రాంత పాలకులు కాదు కదా, కనీసం భారత ప్రభుత్వం కూడా దయ తలచలేదు. 1945లో తుంగభద్ర లోలెవల్ హైలెవెల్, కెనాల్‌కు బ్రిటిష్ ప్రభుత్వం స్వీకారం చుట్టడం తప్ప 1985 వరకు భారత ప్రభుత్వం కనీసం ఒక్క పెద్ద తరహా నీటి పారుదల పథకానికి కూడా స్వీకారం చుట్టలేదు. రాయలసీమ వివక్షతకు గురైందని చెప్పడానికి ఇంత కంటే మరో సాక్ష్యం అవసరం లేదు. ఒకవైపు ప్రకృతి, మరొక వైపు పాలకులు పగబట్టి ఉమ్మడిగా సీమ ప్రజల జీవితాలను కుక్కలు చింపిన విస్తరిలా చేశాయి. కోస్తాంధ్ర ఆధిపత్యానికి తలొగ్గిన సీమ దళారీ ముఠానాయకులు కృష్ణా పెన్నార్ వద్దు, నాగార్జున సాగర్ కావాలని సీమ ప్రజలు కోలుకోలేనంతటి ఊబిలోకి నెట్టివేయబడడానికి కారకులైనారు. నాగార్జున సాగర్ నిర్మాణంతో ఇక సీమ ప్రజలు సులువైన మార్గాల ద్వారా కృష్ణానది నీళ్లను తమ బీడుభూముల్లో పారించుకునే అవకాశాలను పూర్తిగా కోల్పోయారు. రాయలసీమలో మొత్తం కోటి ఎకరాలకుపైగా సాగుయోగ్యమైన భూమి ఉండగా సాగులో ఉన్నది 75 లక్షల ఎకరాలు మాత్రమే.

1947లో స్వాతంత్ర్యం వచ్చిందన్నారు కాని అధికారంలోకి వచ్చిన దేశీయ పాలకులు కరువుల నుండి సీమ ప్రజల విముక్తికి శాశ్వత పరిష్కార చర్యలు ఏ మాత్రం చేపట్టలేదు. 1950 దశాబ్దంలో సీమ ప్రజలను మళ్లీ వరుస కరువులు చుట్టుముట్టినా భారత ప్రభుత్వం సీమ ప్రజల మీద కనీస కనికరం కూడా చూపలేదు. కంటి తుడుపు చర్యగా కేవలం గంజి కేంద్రాల ఏర్పాటుతోనే సరిపెట్టింది. ఈ గంజి కేంద్రాల ద్వారా ఎర్రజొన్నలు, గోధుమల పిండిని ఉడకబెట్టి అందులో కొంచెం ఉప్పు వేసి ప్రజలకు ఇచ్చేవారు. ఆ గంజి కేంద్రాలపై కూడా స్థానిక గ్రామ పెత్తందార్లు, కర్ణాలకు ఆధిపత్యం ఉండడం మూలంగా గంజి కోసం వచ్చిన ఎర్రజొన్నలు, గోధుమలను వారే స్వాధీనం చేసుకొని ప్రజలకు గంజిపోస్తూ అందుకు ప్రతిగా తమ ఇళ్లలో పొలాల్లో వెట్టిచాకిరి చేయించుకునే వాళ్లు. కమ్యూనిస్టు పార్టీ బలంగా ఉన్న గ్రామాల్లో మాత్రమే గంజి కేంద్రాలు సక్రమంగా నడిచేవి. ప్రతి రోజూ ఈ రుచిలేని గంజిని తాగడానికి ఇబ్బందిగా ఉన్నా కేవలం ప్రాణాలతో ఉండడం కోసమే తాగేవారు. కుళ్లిపోయిన పురుగులు పట్టి, పశువులకు కూడా పనికి రాని జొన్నలు, గోధుమలు వస్తుండడంతో ఆ గంజి తాగిన ప్రజలు అనారోగ్యం పాలై మృత్యువాత పడ్డారు. అప్పుడు ఘనత వహించిన నెహ్రూ ప్రభుత్వం విటమిన్ మాత్రలు సరఫరా చేస్తూ ప్రజల ప్రాణాలు కాపాడుతున్నామని గొప్పలు చెప్పుకుంది.

ఇక దళితుల, కింది కులాల వారి పరిస్థితి వర్ణణాతీతంగా ఉండేది. కేవలం ఒక ముద్ద సంగటి కోసమే పొలాల్లో కూలికి పోయేవాళ్లు. గ్రామాల్లోని దళితులందరూ ఒక్కపూట తినడానికి కూడా ఏమీ దొరక్కపోవడంతో అగ్రకుల రైతుల ఇళ్లలో కుటుంబం మొత్తం జీవితకాలం జీతగాళ్లుగా ఉండేవాళ్లు. ప్రజా పంపిణీ పథకం వచ్చేవరకు 1980-90ల వరకు అ పరిస్థితే ఉండేది. 1994 నుండి 2004 వరకు కూడా మళ్లీ సీమ ప్రజలను వరుస కరువులే పాలించాయి. అప్పుడు కేవలం ప్రభుత్వం చౌక దుకాణాల్లో ఇచ్చే బియ్యం మీదనే ఆధారపడి ప్రజలు అర్ధాకలితో జీవితాన్ని నెట్టుకొచ్చారు. ఈ సమయంలో కూడా గంజి కేంద్రాలు, సంగటి కేంద్రాలు ఏర్పాటయ్యా యంటే పరిస్థితులలో కొంచెం కూడా మార్పులేదని అర్థం చేసుకోవచ్చు. 2004 నుండి కూడా సగటున ప్రతి రెండున్నర సంవత్సరాలకొకసారి కరువులొస్తూనే ఉన్నాయి. ఇలాంటి కరవుల విజృంభన 2013 వచ్చినా వెంటాడుతోంది. ఉపాధి హామీ పథకం మూలంగా కనీసం రెండు పూటల తినే అవకాశం ఇప్పుడు దొరికింది. పిల్లల చదువుల పట్ల, విద్య వలన కలిగే ప్రయోజనాల పట్ల అవగాహన లేకున్నా కేవలం ఉచితంగా అన్నం పెడుతున్నారని ఇంటి దగ్గర తమతో పాటే అర్ధాకలితో పస్తులతో చూడలేక తమ పిల్లల్ని ఎస్‌సి, ఎస్‌టి, బిసి హాస్టల్స్‌లో చేర్పిస్తారు తల్లిదండ్రులు. రాయలసీమలో అక్షరాస్యత పెరగడానికి ఇదొక ప్రధాన కారణం.

అసలు రాయలసీమలో నిత్యం కరువులెందుకొస్తున్నాయి? ఒకవైపు పశ్చిమ కనుమలు, మరోవైపు వింధ్య పర్వతాలు అడ్డుగా ఉన్నందువల్ల ఈ ప్రాంతం వర్షచ్ఛాయ ప్రదేశంగా ఉంది. గత వందేళ్ల సగటు వర్షపాతం పరిశీలిస్తే రాయలసీమలో కేవలం 600 మి.మీ నమోదైంది. ఇందులో అనంతపురంలో అయితే కేవలం 550 మి.మీ లోపే. ఇదే తెలంగాణలో 900 నుండి 1100 మి.మీ., ఆంధ్రలో 1300 మి.మీ.గా ఉంది. క్రీ.శ.1200 నుండి 1565 వరకు రాయల సీమను పాలించిన విజయనగర రాజులు తక్కువగా ఉన్న ఈ వర్షపాతంతోనే పంటలు పండించడానికి వీలుగా చిన్న, మధ్య తరహా చెరువుల నిర్మాణం, గొలుసు కట్టు చెరువుల నిర్మాణం, కుంటలు, చెరువుల ఆధారిత కాలువలు, తాగునీటి ఊరబావులు లాంటి ఏర్పాట్లు చేశారు. అననుకూల ప్రకృతి పరిస్థితుల్లో అనుకూల పథకాలు చేపట్టి రాయలసీమ వ్యవసాయాభివృద్ధికి కొంతమేరకు దోహదం చేశారు. ఈ కాలంలోనే గ్రామీణ చేతివృత్తులు గ్రామాభివృద్ధిలో కీలక పాత్ర పోషించాయి. 1565లో తల్లికోట యుద్ధంతో విజయనగర పాలకుల పాలన అంతం కావడం ఈ వైభవానికి ముగింపు అయింది.

1858లో బ్రిటిష్ పాలన కింద రాయలసీమ వచ్చేటంతవరకు దాదాపు 300 సంవత్సరాల పాటు స్థిరమైన కేంద్రీకృత పాలన కరువై పరిపాలన శూన్యత ఏర్పడింది. ఈ మూడు శతాబ్దాల కాలంలో పర్యవేక్షణ కరువై చెరువుల్లో పూడిక పేరుకుపోవడం, తెగిపోవడం, మరమ్మత్తులకు నోచుకోకపోవడం, గొలుసుకట్టు చెరువుల వ్యవస్థ విచ్ఛిన్నం కావడం, పర్యవసానంగా భూగర్భ జలాలు అడుగంటి పోవడం, వీటికితోడు అడవులు క్షీణించడం, దీని మూలంగా వర్షపాతం మరింత క్షీణించి రాయలసీమను కరువులు చుట్టుముట్టాయి. ఈ కాలంలోనే

అప్పటికే గ్రామాల్లో ఉన్న పాలెగాళ్ల వ్యవస్థ మరింత అరాచకంగా వేళ్లూనుకొని తీవ్రమైన రాజకీయ ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. ఈ కాలంలోనే గ్రామాల్లో అశాంతి నెలకొని చేతివృత్తులు క్షీణించి వీటిపై ఆధారపడ్డ జనం ఆకలిచావులకు గురయ్యారు. బ్రిటిష్ పాలకుల చేతికి రాయలసీమ వచ్చాక ఈ ప్రాంతం నుండి కరువుల ఆర్థిక వ్యవస్థ మూలంగా పన్నుల ఆదాయం సైతం అతి తక్కువగా ఉండడం వారిని చాలా నిరాశపరిచింది. తమ పన్నుల ఆదాయాన్ని పెంచుకోడానికి బ్రిటిష్ పాలకులు ప్రజలను రకరకాలుగా పీడించారు. బ్రిటిష్ పాలకులు ఈ ప్రాంతం నుండి ఆదాయ వనరులను పెంచుకునే ప్రయత్నాల్లో భాగంగా అనేక నీటిపారుదల పథకాలకు శ్రీకారం చుట్టినా మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాల్లో వారు కూరుకుపోవడంతో ఆ ప్రణాళికలు మరుగున పడిపోయాయి. ఆంధ్రోద్యమం సమయంలో 1937లో ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల మధ్య రాయలసీమ అభివృద్ధి, రక్షణలకై కుదిరిన శ్రీభాగ్ ఒప్పందం ఆంధ్ర నాయకుల కుట్రల, మోసాల కారణంగా సమాధి కట్టబడింది. 1953లో ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు సందర్భంగా ఏర్పడిన కర్నూలు రాజధాని మూణ్ణాళ్ల ముచ్చటే అయింది. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో శ్రీభాగ్ ఒప్పందంతో పాటు రాయలసీమ పరిపాలన, పారిశ్రామిక అభివృద్ధికి ఉండాల్సిన అవకాశాలన్నీ చేజారిపోయాయి. రాయలసీమ కరువు ఆంధ్రప్రదేశ్ నీటి కేటాయింపులకు ఉపయోగపడింది. అయితే చివరికి తక్కువ వర్షపాతం ఉన్న రాయలసీమకు తక్కువ నీళ్లు, ఎక్కువ వర్షపాతం ఉన్న ఆంధ్రకు ఎక్కువ నీళ్లు అన్న ఆంధ్ర జలసూత్రానికి చట్టబద్ధత కల్పించబడింది. విస్తీర్ణం రిత్యా రాష్ట్ర జనాభాలో రాయలసీమ జనాభా మూడు కోట్లు ఉండాల్సి ఉండగా కేవలం అందులో సగం మాత్రమే ఉన్నారు. దానికి బాధ్యత ప్రకృతిదే కాదు, రాయలసీమను దగా చేసిన పాలకులది కూడా.

రాయలసీమ నీటి పారుదల ప్రాజెక్టుల పట్ల బ్రిటిష్‌వారికి ఉన్నంత శ్రద్ధ కూడా స్వతంత్ర్య(?) పాలకులకు లేకపోయింది.

స్వాతంత్ర్యం రాక ముందు 1858 ప్రారంభమైన కెసీ కెనాల్, 1945లో తుంగభద్ర హైలెవెల్, లోలెవెల్ కెనాల్ వంటివి నిర్దేశించుకున్న లక్ష్యాలు కుదించబడినాయి. స్వాతంత్ర్యం వచ్చాక స్వదేశీ పాలన ప్రారంభమైనప్పటికీ మనకంటూ సొంత ప్రణాళికలు తయారు చేసుకుంటున్నప్పటికీ రాయలసీమ నీటి పారుదల రంగంపై తీవ్రమైన నిర్లక్ష్యం చేశారని చెప్పడానికి ఇది సాక్ష్యంగా నిలిచింది.

రాయలసీమ నాయకులు రాష్ట్రాన్నేలినా, దేశాన్నేలినా రాయలసీమ ప్రాజెక్టులు నిర్దేశించుకున్న కనీస సాగు లక్ష్యాలను కూడా చేరుకోలేక చతికిల పడ్డాయి. అందుకు ఉదాహరణలు:

భారతదేశంలోనే అత్యంత తీవ్రమైన కరువు ప్రాంతమైన అనంతపురం జిల్లాలో 1945లో 2లక్షల 36వేల ఎకరాల భూమి సాగు లక్ష్యంగా 32.5 టిఎంసిలు నీరు వాడుకలోకి తేవాలని ప్రారంభమైన తుంగభద్ర హైలెవెల్ కెనాల్ 24 టిఎంసిలకు సరిపెట్టుకొని లక్షా 80వేల ఎకరాలకు మాత్రమే సాగు నీరు అందిస్తోంది. శతాబ్దాలుగా కరువులకు నిలయమైన రాయలసీమ పట్ల స్వాతంత్ర్యానంతర పాలకవర్గాలు మేలు చేయకపోగా కీడునే చేశాయని చెప్పడానికి తుంగభద్ర కాలువ సజీవ సాక్ష్యం.

అదే సంవత్సరం లక్షా 46 వేల ఎకరాల భూమి సాగు లక్ష్యంగా 29.5 టిఎంసిలు నీరు వాడుకలోకి తేవాలని ప్రారంభమైన తుంగభద్ర లోలెవెల్ కెనాల్ 18 టిఎంసిలకు పరిమితమై 90వేల ఎకరాలు మాత్రమే దాని కింద సాగవుతున్నాయి.

1985లో లక్షా 90 వేల ఎకరాల భూమి సాగు లక్ష్యంగా 19 టిఎంసిలు నీరు వాడుకలోకి తేవాలని ప్రారంభమైన శ్రీశైలం కుడిగట్టు కాలువ కింద సాగయ్యేది లక్షా 30 వేల ఎకరాలే.

1985లో మొదలుపెట్టినప్పుడు తెలుగుగంగకు నిర్దేశిత లక్ష్యం 29 టిఎంసిల నీటి వాడకంతో 2.75 లక్షల ఎకరాలు సాగులోకి తేవాలని. అయితే ప్రస్తుతం ఉన్న ఆయకట్టు 1.50ల ఎకరాలు (15 టిఎంసిలు)

1858లో కెసీ కెనాల్ లక్ష్యం 2.78 లక్షల ఎకరాలైతే ఇన్నేళ్ల తర్వాత కూడా ప్రస్తుత ఆయకట్టు 2.30 లక్షల ఎకరాలు.

**అసమానతకు, వివక్షతకు మరో మచ్చుతునక**

| | కోస్తాంధ్ర | తెలంగాణ | రాయలసీమ |
|---|---|---|---|
| వ్యవసాయ సాగుయోగ్యమైన భూమి (లక్షల హెక్టార్లలో) | 51.84 | 73.54 | 42.03 |
| సాగవుతున్న భూమి | 39.54 | 43.32 | 27.72 |
| నీటిపారుదల సౌకర్యం ఉన్న భూమి | 32.41 | 27.21 | 7.79 |

(పెద్దగా ఆధారపడలేని చిన్న నీటి పారుదలతో కూడా కలిపి)

1956 నుండి 2008-2009 నాటికి వివిధ ప్రాంతాలలో పెంపొందిన నీటి పారుదల సౌకర్యం (ఇరిగేషన్ ఇంటెన్సిటీ ఇంప్రూవ్డ్) ఈ విధంగా ఉంది.

కోస్తాంధ్ర - 44.7 శాతం నుండి 60.6 శాతం
తెలంగాణ - 17.2 శాతం నుండి 50.4 శాతం
రాయలసీమ - 14.7 శాతం నుండి 25.3 శాతం

వివిధ ప్రాంతాల్లో విద్యుత్ ఉత్పత్తి(మెగా వ్యాట్లలో) ఈ విధంగా ఉంది

కోస్తాంధ్ర - 5577 (ప్రభుత్వ ప్రైవేటు భాగస్వామ్యంలో ఉన్న సహజవాయి ఆధారిత విద్యుత్ కేంద్రాల ద్వారా వస్తున్న 2747 మెగావాట్లు అదనం)
తెలంగాణ - 4326
రాయలసీమ - 1898

రాయలసీమ ప్రజలు ఒక వైపు కరువుతో యుద్ధం చేస్తు చితికిపోతూ ఉంటే ఈ స్థితిని రాజకీయంగా వాడుకొని రాయలసీమ ఆధునిక పాలెగాళ్లు అంచెలంచలుగా ఎదిగారు. పనులు లేక పస్తులుంటున్న ప్రజలకు ఎంగిలి మెతుకులు వేసి తమ ఫ్యాక్షన్ ముఠాలను తయారుచేసుకున్నారు. రాయలసీమ గర్భంలో ఉన్న లక్షల కోట్ల విలువజేసే బైరైటిస్, ఇనుము, సిలికా, క్వార్ట్జ్, ఎర్రచందనం వంటి అన్ని సహజ సంపదలపై పూర్తి పట్టు సాధించారు. ప్రజల రాజకీయ చైతన్య రాహిత్యాన్ని ఆసరా చేసుకొని సకల రంగాలను శాసిస్తున్నారు. తరతరాలుగా దోచుకుంటున్న సీమ సంపదను హైదరాబాదు, బెంగుళూరు, చెన్నై వంటి నగరాల్లో దాచుకుని తమ ఆర్థిక సామ్రాజ్యా

లను నిర్మించుకున్నారు. హైదరాబాదుపై అధికారంతో తమ నేరసామ్రాజ్యాన్ని, ఫ్యాక్షన్ కారిడార్‌ను విస్తరించుకుంటూ పోయారు. ప్రజలు వరుస కరువులతో వలసలతో ఆత్మహత్యలతో జీవచ్ఛవాల్లా ఉంటే ప్రజా ప్రతినిధులుగా వీరు కరువు నివారణకు ఏ మాత్రం కృషి చేయకుండా ఉన్న అవకాశాలను సైతం అడ్డుకుంటు న్నారు. కరువు నివారణ కోసం ఉపశమనంగా వచ్చే వేల కోట్ల ప్రభుత్వ నిధులను తమ ఆదాయ వనరుగా మార్చుకున్నారు. అందుకే సీమ కరువుకు శాశ్వత పరిష్కారం పక్కన పెట్టి కరువొచ్చిన ప్రతిసారీ పంటనష్ట పరిహారం, ఇన్సూరెన్సు వంటి ఎంగిలి మెతుకుల పథకాలను విదిలిస్తూ వాటిపై ఆధారపడే తప్పని పరిస్థితిని ప్రజలకు అలవాటు చేశారు. తద్వారా ప్రజలను తమకు నమ్మకమైన ఓటు బ్యాంకుగా, తమ కుటుంబాలకు విధేయులుగా మార్చుకున్నారు. ఓట్లు వేయడానికి మాత్రమే ప్రజలుండాలి. కాబట్టి ప్రజలు ప్రాణాలతో ఉండడానికి మాత్రమే ఇలాంటి పథకాలను అలవాటు చేసి తమ కాళ్లపై నిలబడి స్వతంత్రంగా బతకగలిగే వ్యవసాయ పారిశ్రామిక అభివృద్ధులను అడ్డుకుంటున్నారు. వీరు దోచుకున్న సంపదతో, అంగబలంతో రాజకీయ పార్టీలనే నిలువుని కొనేయడం, సీమ నుండే పార్టీలకు ఎన్నికల నిధులు పంపడం, పర్యవసానంగా వీరు మంత్రులు, ముఖ్యమంత్రులు కావడం, ఆ అధికారంతో మరింత దోపిడీ చేయడం మామూలైంది. అన్ని రకాలుగా పరాధీనతలోనే ఉండే రాయలసీమ సమాజం ఎన్ని వివక్షలు ఎదుర్కొంటున్నా తెలంగాణ లాగా ప్రత్యేక రాష్ట్రం కావాలనే బలమైన అస్తిత్వ డిమాండును పెట్టలేకపోతున్నదనేది వాస్తవం.

ఈ రాజకీయార్థిక పునాది నుండి జన్మించిన సామాజిక నిర్మాణం సైతం సీమలో అనాగరికంగా ఉంది. విపరీతమైన కుల అణచివేతకు ఫ్యాక్షన్ ఆధిపత్యం తోడై అది భరించలేని విధంగా ఉంది. గత ఇరవై సంవత్సరాల నుండి విద్యా సౌకర్యాల పెరుగుదల వల్ల విద్యావంతులైన సీమ యువకులు ఇలాంటి సామాజిక నిర్మాణం ఊబి నుండి బయటపడి సుదూర ప్రాంతాలకు వలస పోతున్నారు. అక్కడ సరైన ఉపాధి దొరకకున్నా అక్కడే ఉండటానికి ఇష్టపడుతున్నారు. దీనికి తోడు రాయలసీమలో పారిశ్రామికాభివృద్ధి లేకపోవడం, ఉన్న ప్రభుత్వ, ప్రైవేటు పరిశ్రమలు మూతపడడం వలన సీమ ప్రజల్లో ప్రత్యేకించి విద్యార్థి యువకుల్లో మరింత అభద్రత ఏర్పడింది. పారిపోయి తలదాచుకోడానికి వాళ్లకు హైదరాబాదే కనపడుతుంది. రాష్ట్ర విభజన సందర్భంగా వ్యక్తమయింది అటువంటి అభద్రతే. దీనికి తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి నేతృత్వం వహిస్తున్న నాయకుల ప్రకటనలు 'హైదరాబాదు నుండి సంక్రాంతికి పోయినవాళ్లను తిరిగిరానివ్వం', 'ఉద్యోగులకు ఆప్షన్లు ఉండవు' లాంటి ప్రకటనలు తోడయ్యాయి. ఇక రాయలసీమ నాయకులు, మీడియా వైఖరి ఎంత దుర్మార్గంగా ఉండిందో చెప్పనవసరం లేదు. తెలంగాణ ఉద్యమం నుండైనా 'సీమ ప్రజలారా, మీరు మా కన్నా దరిద్రంగా అధ్వాన్నపు బతుకులు బతుకుతున్నారు, మాలాగే మీరు కూడా సమైక్యాంధ్రలో నీళ్లు, నిధులు, ఉద్యోగ, పారిశ్రామిక రంగాల్లో మోసపోయారు' అనే సందేశం వచ్చి ఉంటే మరోలా ఉండేదేమో. అయితే తెలంగాణ ప్రకటన రావడానికి ముందు, వెనక కూడా ఆ ప్రాంతపు నాయకులు అన్ని ప్రాంతాల పెట్టుబడిదారులతో అనుకూలంగానే ఉంటున్నట్లు తెలంగాణ రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టడానికి ఎర్ర తివాచీలు పరుస్తాం అనైతే అంటూ వచ్చారు. అదట్లా ఉంచితే ఆంధ్ర, తెలంగాణ ప్రజాస్వామిక వాదుల నుండి రాయలసీమ కొంత ఆశించింది. ఎలాగంటే ఆంధ్ర ప్రాంతం కృష్ణా, గోదావరి రెండు నదీ జలాలు వాడుకుంటూ ఉంది. తెలంగాణ సైతం గోదావరి జలాలను ఉపయోగించుకునే అవకాశం ఉంది. ఆ రెండు ప్రాంతాల్లో వర్షపాతం కూడా అనుకూలంగానే ఉంది (మహబూబ్ నగర్, నల్గొండ, ప్రకాశం జిల్లాలు మినహాయిస్తే). తక్కువ వర్షపాతంతో, ప్రకృతి అననుకూల పరిస్థితుల్లో రాయలసీమ ప్రజలు జీవచ్ఛవాల్లా ఉన్నారు. కృష్ణా నది ఒక్కటే నీళ్లు వాడుకోడానికి ఉన్న ఏకైక మార్గం. నీటి పంపకాలు, తదితర విషయాల్లో రాయలసీమ వైపు కాస్తయినా మాట్లాడండని కోరుకుంటోంది. వ్యవసాయం రాయలసీమలో ఎంత దుర్భరంగా ఉంటుందో చెప్పడానికి మరొక వాస్తవం కూడా చెప్పాలి. కరీఫ్‌లో రాయలసీమలో 310 మిల్లీమీటర్ల వర్షపాతం మాత్రమే నమోదవుతుంది. ఇది జొన్న, వేరుశనగకు కూడా సరిపోదు. ఇక్కడ భూగర్భ జలం కూడా తక్కువే. అయినా రైతులు సొంత పెట్టుబడితోనే బోర్ల వ్యవసాయానికి సిద్ధపడ్డారు. అప్పులపాలై ఆత్మహత్యలు నిత్యకృత్యం అయ్యాయి. ఇది అన్ని ప్రాంతాలకన్నా రాయలసీమలో భయం గొలిపేలా ఉంది. కృష్ణా జలాల పంపిణీ జరిగిపోయింది అంటున్నారు. అసమ న్యాయమే చట్టబద్ధమంటున్నారు. దీనిని సవరించే అవకాశమే లేదా. న్యాయబద్ధంగా నీటిని పునః పంపిణీ చేయడం గురించి కూడా ఆలోచించాలి.

రాయలసీమలో కొన్ని చిన్న బృందాలైనా రాయలసీమ సొంత గొంతును వినిపిస్తున్నాయి. శ్రీభాగ్ ఒప్పందం అమలుచేయాలని, కొత్త రాష్ట్రానికి కర్నూలు రాజధాని చేయాలని అడుగుతున్నాయి. ఇది మరింత బలపడకుండా అడ్డుగా ఉన్నది రాయలసీమ నాయకులే. స్థానిక పాలకులే వలస పాలకుల్లాగా ఇక్కడ వ్యవహరిస్తున్నారు. ఇక్కడిదంతా కొల్లగొట్టుకుపోయి మరోచోట పెట్టుబడులు పెడుతూ, అధికారాన్ని తోడుచేసుకొని ఆస్తులు కూడబెడుతున్నారు. హైదరాబాదులో వీళ్లు పెంచి పోషించిన రియలెస్టేట్ మాఫియా తెలంగాణ ప్రజలనే కాదు, రాయలసీమ ప్రజల నెత్తురు పిండుకుని పెరిగిందే. వీళ్లు కోస్తా నాయకులతో అనుకూలంగా కలిసిపోయి, ప్రయోజనాలను పంచుకుంటూ రాయలసీమ సొంత గొంతును లేవనీయకుండా సమైక్యగోల చేస్తున్నారు. ఈ లోపు రాయలసీమకు మరోసారి అన్యాయం జరగబోతోంది. ఎప్పటికైనా రాయసీమకున్న ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా దానికంటూ ఒక ప్రత్యేక అభివృద్ధి ప్రణాళిక రూపొందాలి. అందుకు రాయలసీమ రాష్ట్రమే మార్గమని రాయలసీమ అశేష ప్రజలూ త్వరలోనే అర్థం చేసుకుంటారు.

ఉపయుక్త గ్రంథాలు:


1. Rayalaseema During Colonial Times by Yanadi Raju
2. Ground Water information-Central Ground Water Board, Ministry of Water Resources, Govt of India.
3. Statistical Abstract of Andhra pradesh-2009
4. రాయలసీమ కన్నీటి గాథ- డా. ఎం.వి. రమణారెడ్డి
5. కరువుకాటకాల కన్నీటి కోన నేటి రాయలసీమ (క్రాంతి ప్రచురణలు)
6. ఆరుగాలం కరువు- అనంతపురం వ్యవసాయ సంక్షోభంపై నివేదిక (మానవ హక్కుల వేదిక)
7. ఎడారిలో నందనవనాలు- శ్రీరామిరెడ్డి


*(రచయిత కన్వీనర్, రాయలసీమ విద్యార్థి వేదిక; అర్థశాస్త్ర పరిశోధక విద్యార్థి, యోగి వేమన విశ్వవిద్యాలయం)* వీ

# ఇరుకులో విశాలత - దిద్దుబాటు తప్పదు!

***కోస్తాంధ్రలో ఫైనాన్స్, రియల్ ఎస్టేట్ లాంటి సేవా రంగాలు మాత్రమే వృద్ధి చెందాయనీ, పారిశ్రామికంగా వెనుకబడి ఉంది కాబట్టి వ్యవసాయాధారిత పరిశ్రమలు నెలకొల్పాలనీ అంటున్నారు* జాన్సన్ చోరగుడి**

ఈ వ్యాసం రాసే సమయానికి రాష్ట్ర అసెంబ్లీలో రాష్ట్ర విభజనపై చర్చ మొదలైంది. ప్రత్యేక రాష్ట్రంగా ఇప్పటికే తెలంగాణ 'విడిపోయిన' తర్వాత జరుగుతున్న సాంకేతిక పరమైన సంప్రదాయమిది. బహుశా రచయితలు– తార్కిక ముగింపు అనేది ఇటువంటి సందర్భాలనేమో! ఎందుకంటే తెలంగాణ ప్రజల కోసం – ప్రత్యేక రాష్ట్రం కావాలని, మేధావులు, ఆలోచనాపరులు, కవులు, రచయితలు, కళాకారులు, జర్నలిస్టులు, రాజకీయ నాయకులు ముందు అనుకున్న తర్వాత– ఇప్పుడు ప్రజలు కూడా అదే అనుకుంటున్నారు. కనుక మానసిక విభజన ముందుగా జరిగిన తర్వాత ఇప్పుడు జరుగుతున్నది సాంకేతికపరమైన 'ఫార్మాలిటీ'. ఒక్కోసారి సాంకేతికపరమైన లోపాల వల్ల ఇటువంటివి కొంత ఆలస్యమైనా, ముగింపు మాత్రం అనివార్యం.

ప్రజలు చాలాసార్లు ఇవి తమకోసం 'రాజ్యం' చేస్తున్నవి అనుకునే సందర్భాలలో కూడా వాటి నుంచి ప్రయోజనం పొందే వారు కాకుండా, మరెవరో చేసిన ప్రయత్నం వల్ల అవి జరుగుతూ ఉంటాయి. వి.పి.సింగ్ ప్రధానిగా ఉన్న కాలంలో మండల్ కమీషన్ రిపోర్టు అమలు, ప్రధానిగా రాజీవ్ గాంధీ చేసిన పంచాయతీరాజ్ సంస్కరణలు, అరుణారాయ్, జీన్ డ్రిజ్ చొరవతో అమలులోకి వచ్చిన, గ్రామీణ ఉపాధి హామీ పథకం, తర్వాత చివరిగా ఇప్పటి తెలంగాణ కూడా ఇటువంటివే.

అయితే అటువంటి కసరత్తు ఏదీ కోస్తాంధ్ర కోసం చేసిన వాళ్లు ఎవరూ లేరు. కోస్తాంధ్ర బ్రిటిష్ ఇండియా పాలనలో 200 ఏళ్లు ఉంది. అయితే ఆకాలంలో తెలంగాణ నైజాం నవాబు పాలనలో ఉంది. ఆధునిక పౌర పాలన పరిచయం చేయబడిన తర్వాత కోస్తాంధ్రది – బ్రిటిష్ ఇండియా, యూనియన్ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా పాలనా కాలాలు కలిపి 266 ఏళ్లు. అయితే తెలంగాణది కేవలం 66 ఏళ్లు.

దాంతో ఇప్పుడు తెలంగాణది ముందు నుంచి 'కవర్' చేయలేక పోయిన సిలబస్‌ను మళ్లీ మొదటి నుంచీ చదువుకు రావల్సిన విద్యార్థి చందమైంది. అయితే కోస్తాంధ్రది అందుకు భిన్నమైన స్థితి. కనుక తెలంగాణకు తన గతం గురించి మాట్లాడడం అనివార్యం. కానీ కోస్తాకు కాదు. కోస్తా భవిష్యత్తు గురించి ఆలోచించాలి, మాట్లాడాలి. అయితే ఆ దిశలో ముందు అస్సలు మనకు దృష్టి (విజన్) లేదు. అదే కనుక ఉండి ఉంటే, అప్పుడు కొద్దిమందైనా – బహిరంగంగా దాని గురించి మాట్లాడి, ఎంతో కొంత మందిని ప్రభావితం చేయగలగి ఉండే వారు. అప్పుడు అది ఎంత చిన్న గుంపు అయినా, కోస్తాంధ్ర నుండి కూడా ఈ అంశం మీద ఒక ప్రత్యామ్నాయ అధ్యయనం వారికి కూడా ఉంది అని బయటకు వెల్లడయ్యేది. కాని ఇప్పుడు అదిలేదు. ఫలితంగా ఒకవేళ విభజనకు సంబంధించిన సాంకేతిక ప్రక్రియ పూర్తయి, ఆ ప్రకటన కూడా వెలువడ్డాక 'వాట్ నెక్స్ట్?' అనుకునే పరిస్థితే ఇప్పటికైతే ఉంది.

విభజన తర్వాత రెండూ కూడా కొత్త రాష్ట్రాలే అవుతాయి. కనుక ఇద్దరకీ బాలారిష్టాలు తప్పవు. కానీ, ఎందుకు 'తెలంగాణ' కావాలి అని చాలా విస్తృతమైన అధ్యయనం ఇప్పటికే అక్కడ జరిగి ఉంది. కనుక, అక్కడ ఏర్పడబోయే కొత్త ప్రభుత్వం, ఇక ముందు అమలు చేయబోయే పనుల ఎజెండా వారికి సులభంగానే సిద్ధమవు తుంది. అయితే ఇక్కడ అటువంటిది లేదు. పోని ఎందుకు రాష్ట్రాన్ని విభజించకూడదు, అని ఇప్పటికే తయారు చేసుకున్న ముసాయిదా ప్రతి ఏదైనా ఎవరి దగ్గరయినా ఉండి ఉంటే, అది ఈ అవసరానికి ఎందుకూ పనికిరాదు. వాళ్లు చెప్పేవి అన్ని అబద్దాలు అని, రాసుకున్న పుస్తకాలు కూడా, తరువాత ఏమి చేద్దాం అనేదానికి పనికిరావు. వాళ్లది కావాలి అనే డిమాండ్. మనది వద్దు అనే డిమాండ్. అయినా అది వాళ్లా మనమా అని కాదు గాని, వద్దు అనే వాళ్లకంటే ఎప్పుడు కూడా కావాలనే వాళ్లకు కారణాలు ఎక్కువ ఉంటాయి. కనుక – 'క్రాస్ రోడ్స్'లో నిలబడాల్సిన అనివార్య స్థితి ఇప్పటి కోస్తాంధ్రది. ఏదైనా అద్భుతం జరిగి విభజన ప్రస్తుతానికి ఆగిపోతే, అప్పుడు కూడా అది 'వెంటిలేటర్' మీద ఆయుష్షును పొడిగించుకోవడం అవుతుందే తప్ప గండం తప్పినట్టయితే కాదు.

రాష్ట్రం ఒకటైనా, రెండైనా ఎవరి బతుకులు వాళ్లు బతకాల్సిందే కదా. కొత్తగా ఇప్పుడు ఏమవుతుంది. ఇటువంటి రచ్చబండ మాటల్లో నిజమున్నట్టే అనిపిస్తుంది. అనిపించడమే కాదు అది ఎంతో కొంతమేర నిజం కూడా నేమో. కాని అంతకు మించి ఇంకా ఎంతో ఉండబోతోంది. ముందుగా మనకు 'ఆపరేషనల్ ఏరియా' తగ్గ బోతోంది. అవును, తెలంగాణకు ఆ సమస్య లేదు, గాని మనకు వెంటనే అది మొదలవు తుంది. ఎందుకంటే 'మనం' రాష్ట్రం నలు చెరుగులా వ్యాపించి ఉన్నాం కనుక. అయితే ఇక్కడ ఒక కీలకమైన అంశముంది. 'మనం' అంటే ఎవరు? గత 266 ఏళ్లుగా ఇక్కడ రూపు తీసుకున్న వనరులను సృష్టించే వర్గం. సంస్కరణలు మొదలైన ఈ ఇరవై ఏళ్లలో వీరు ఇప్పటికే 'పాన్ ఇండియన్' రూపు తీసుకొన్నారు. అక్కడా ఇక్కడా అని కాదు, ఇప్పుడు వీళ్లు ఎక్కడి వారైనా – వీరి రంగు రుచి వాసన ఒక్క తీరుగానే ఉంటుంది. కనుక ఇప్పుడు ఉన్నచోట నుండి 'రిట్రీట్' వంటి కొత్త సందర్భాలు వీరి విషయంలో తక్కువగానే ఉంటాయి. కత్తులు దూసుకున్న కార్పొరేట్ వర్గాలు కూడా ఉనికి ప్రశ్నార్థకం అవుతున్నప్పుడు 'విన్–విన్ సిట్యుయేషన్' అంటూ రీగ్రూపింగ్ అవుతున్న కాలమిది. కనుక విభజన తర్వాత కూడా ఇకముందు పెట్టుబడులు ఏ ప్రాంతంలో పెట్టాలి, అనే విషయంలో ఈ వనరులు సృష్టించే వర్గం దృక్పథంలో ఎటువంటి పునరా లోచన కలగకపోతే – కోస్తాంధ్రకు వాటిల్లే నష్టం అపారంగా ఉంటుంది.

ఇప్పటికీ ఈ ప్రాంతంలో తయారీ రంగం (మాన్యుఫ్యాక్చరింగ్ సెక్టార్) విస్తరించకపోవడానికిగాని, స్థానిక అవసరాల ప్రాతిపదికగా మానవ వనరుల అభివృద్ధి దిశలో చొరవ తీసుకోకపోవడానికిగాని

ప్రధాన కారణం – ఇప్పటికీ ఇంకా ఈ ప్రాంతంలో వేళ్లూనుకొని ఉన్న ఫ్యూడల్ ధోరణులే. 'భూమి'ని పరిపరి విధాల 'వాల్యూ ఎడిషన్' వనరుగా మార్చుకోవడం ఇప్పటికీ ఇక్కడ ఇంకా జరుగుతూనే ఉంది. అందుకు మనకున్న 'ఎకానమీ – ప్రొటోకాల్స్' ఉన్న దారులన్నిటినీ 'టైలర్ మేడ్'గా సర్దుబాటు చేయడం కూడా నిరాటంకంగా సాగుతూనే ఉంది. వర్ధమాన సామాజిక వర్గాలను సరళీకరించే దృష్టే కనుక ఈ వనరులు సృష్టించే వర్గానికి ఉండి ఉంటే, స్థానికత ప్రాతిపదికగా పబ్లిక్ – ప్రైవేట్ రంగాల్లో కూడా ముందు నుంచే ప్లానింగ్ జరిగి ఉండేది.

మొదటి నుంచే లోపం ఎక్కడుందో అర్థం కావలిసిన వాళ్లకు తప్ప మిగతా అందరికీ అర్థమవుతూనే ఉంది. కోస్తాకు గుండెకాయ వంటి కృష్ణా జిల్లాలో 2004కు ముందు కాస్త ఎక్కువ కాలమే ఇక్కడ కలెక్టర్‌గా పని చేసిన ఉత్తర భారత దేశానికి చెందిన ఓ ఐఎఎస్ అధికారి ఇప్పటికి పదేళ్ల క్రితం పైనే ఈ ప్రాంత వనరులు సృష్టించే వర్గం గురించి ఒక్కమాటలో తేల్చేశారు. బెజవాడ సబ్ కలెక్టర్ ఆఫీసులో ఓ సాయంత్రం టీ టైంలో సంభాషణ –

'మీరు జిల్లాకు కొన్ని శాశ్వతమైన ప్రయోజనాలు ఉన్న పనులు చేస్తున్నారు కదా, కొన్నైనా కొత్త పరిశ్రమలు వస్తే ఎంతో మందికి ఇక్కడ ఉపాధి దొరుకుతుంది కదా' అడిగాను.

'ఇక్కడ ఏమి చేస్తాం, ఎవరు చూసినా ఫైనాన్స్ వ్యాపారాలు చేసే వాళ్లు తప్ప ఇండస్ట్రీస్ గురించి ఆలోచించే వారే లేరాయె 'మైండ్‌సెట్' సమస్య చాలా ఉంది ఇక్కడ' వాపోయారాయన.

ఇది రాస్తున్న సమయంలో మళ్లీ ఇదే విషయాలు ఓ పబ్లిషర్ స్నేహితుడి వద్ద ప్రస్తావనకు వస్తే, తాను అంటున్నాడు – 'ఇంజనీరింగ్ చదివి, ఫైనాన్స్, రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్న వాళ్లు నాకు తెలిసిన వాళ్లే పదిమందిపైగా ఈ ఊళ్లో ఉన్నారు'.

అంటే గడిచిన 10–15 ఏళ్లలో కూడా మన దృష్టి యథాతథంగా ఉందన్నమాట!

స్థానికత అంటున్నాం, ఏమిటీ స్థానికత? ఇప్పుడు ఇక్కడ నేను కొత్త విషయం ఏమీ చెప్పడం లేదు. మన వద్ద కడప, కరీంనగర్, కాకినాడ – ఈ మూడు చోట్ల కూడా పాలిటెక్నిక్ కళాశాలలో ఒకే రకమైన కోర్సులు ఉంటాయి! మూడు కూడా మూడు భిన్నమైన స్థానిక పరిస్థితులతో వైవిధ్యమున్న ప్రాంతాలు. కాని ఇక్కడ తయారయ్యే సాంకేతిక మానవ వనరుకు ఉండే 'జనరల్' స్వభావం కారణంగా వీరు – మెరుగైన వేతనాలు, నగర వసతుల ప్రలోభాలకు లోనై హైదరాబాద్ చేరుకోవడం జరిగింది. శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకు ఉన్న ఒక్క జిల్లాలో కూడా ఐటిఐలో గాని, పాలిటెక్నిక్‌లో గాని, సముద్ర (మెరైన్) ప్రాతిపదిక కోర్సులు గడిచిన యాభై ఏళ్లలో మనం రూపొందించ లేకపోయాం. అదే కనుక జరిగి ఉండుంటే, చదువులు అయ్యాక వాళ్లు తమ సర్టిఫికేట్లు పట్టుకుని సముద్రం లేని నగరం వైపు వెళ్లి ఉండేవారు కాదు. ఇండియన్ మారిటైమ్ యూనివర్సిటి షిప్పింగ్ మంత్రిత్వ శాఖ పరిధిలో పనిచేసే సెంట్రల్ యూనివర్సిటి 1949లో కలకత్తాలో మొదలైంది. చెన్నైలో 1985 నుండి పనిచేయడం ప్రారంభించింది. 28 ఏళ్ల తరువాత 2009 నుండి విశాఖపట్నంలో పనిచేయడం మొదలైంది. ఇదీ మన వేగం! కనుక కోస్తాంధ్రలో వనరులు సృష్టించే వర్గానికి 'ఆపరేషనల్ ఏరియా' పెరగాలంటే, కేవలం సేవా రంగానికే పరిమితమైన దృష్టిని ఉత్పత్తి రంగం వైపుకు మళ్లించాలి. ఇప్పటికైనా మనకున్న 'మెరైన్' గవాక్షాన్ని తెరిచి కొంత మందినైనా సముద్రం మీదకు పంపించాలి. అభివృద్ధి చెందిన దేశాల్లో సముద్రాన్ని ఆనుకొని ఉన్న ప్రాంతాల ఆర్థిక వృద్ధి వారు సముద్రం మీద ఆధారపడడమే.

విలాసవంతమైన జీవితాలను ఆస్వాదించే సంపన్నవర్గాలు కూడా ఇక్కడ ఇప్పటికీ డిసెంబర్ చివరి వారం వచ్చిందంటే ఫోన్లలో – 'ఎంత పదకొండు ఇరవయ్యా, పదకొండు నలభై అంటున్నారు?' క్లబ్బుల్లో కూర్చుని కూడా ఇవే సంభాషణలు. అర్థం కాలేదా? కళ్లాల్లో ఉన్న ధాన్యం ధరలు గురించిన ఆరా! ఇప్పటికైనా ఇప్పుడున్న సాంప్రదాయ సాగు విధానం నుంచి అగ్రో ఇండస్ట్రీ ప్రాతిపదిక పంటల పద్ధతికి (క్యాష్ క్రాప్స్) బదిలీ కావడం ద్వారా ఉన్న భూమికి 'వాల్యూ ఎడిషన్' పెంచుకోవాలి. అప్పుడు ప్రతి పంటకు అనుసంధా నమైన పరిశ్రమలు విస్తరిస్తాయి. ఇక గిడ్డంగులు, కోల్డ్ స్టోరేజిలు, ప్యాకింగ్, రవాణా, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, ఆడిటింగ్, లీగల్ సర్వీసులు వంటివి వాటితోపాటే అంటిపెట్టుకుని ఉండే అంశాలు. కనుక పెద్ద ఎత్తున ఉపాధి అవకాశాలు పెరుగుతాయి. ఈ దిశలోకి మనం మన దృష్టిని మళ్లించాలి.

వీటన్నిటికంటే ప్రధానమైన అంశం మరొకటి ఉంది. మనకు అవసరం ఉన్నా లేకపోయినా, మనం వెళ్లినా వెళ్లకపోయినా 23 జిల్లాల రాష్ట్రం అంటే ఉండే 'విశాలత' రేపు 13 జిల్లాల రాష్ట్రం అనే పరిస్థితి వచ్చాక ఉండదు. 'ఇరుకు'దనం మొదలవుతుంది. వాళ్ల సంగతి ఏమోగాని, కోస్తాకు మాత్రం అది కచ్చితంగా ఎక్కువవుతుంది. ఇన్నాళ్లు ఉన్న విస్తృతి అప్పుడు తగ్గిపోతుంది. అన్ని సామాజిక వర్గాలు కూడా ఉన్నంతలోనే 'అన్నిటికి' సర్దుకోవాలి. అప్పుడు 'డెమోగ్రఫీ' గురించి మాట్లాడవలసి వస్తుంది. 'డెమోగ్రఫీ'– జనాభాలో ఎవరు ఎంత మంది అనే విషయాలను అధ్యయనం చేస్తుంది. అది 'డెమోక్రసి' గురించి మాట్లాడినంత సౌకర్యవంతంగా ఉండదు మరి. మాట్లాడింది ప్రతిదీకాకపోయిన మాట్లాడిన దాంట్లో ఎంతో కొంత శాతం కార్యాచరణలో పెట్టవలసి ఉంటుంది. అప్పుడు అందరూ సర్దుకోవలసి వస్తుంది. సర్దుకోవడం అంటే పంచుకోవడమే కనుక 'మోనోపలి' తగ్గుతుంది. చిన్న పాలనా యూనిట్లలో ఎక్కువ వికేంద్రీకరణ అనే దానికి ఎన్.టి.రామారావు ప్రవేశపెట్టిన మండల పరిపాలనా వ్యవస్థకు మించిన మరొక ఉదాహరణ మనకు అక్కరలేదు.

ఇక రాష్ట్ర విభజన ప్రతిపాదనకంటే ముందు నుంచే రెండు ప్రధానమైన అపరిష్కృత అంశాలు ఉన్నాయి. మైనార్టీ మతస్తులకు (దళిత క్రైస్తవులకు) ఎస్‌సి రిజర్వేషన్లు వర్తింపచేయడం అనే అంశంపై కేంద్ర ప్రభుత్వం నియమించిన జస్టిస్ రంగనాథ మిశ్రా కమిషన్ నియమించిన నివేదిక అమలు ఇప్పటికీ పెండింగ్‌లోనే ఉంది. విభజన జరిగాక ఈ అంశం ఏమవుతుంది? దీనికి ఏర్పడే సాంకేతిక అవరోధాలు ఏమిటి వాటి పరిష్కారాలు ఏమిటి అనేది ఒక అంశం.

రెండవది ఎస్.సి.రిజర్వేషన్లలో వర్గీకరణ. ఇందుకోసం గతంలో ప్రభుత్వం నియమించిన జస్టిస్ ఉషా మెహ్రా కమీషన్ నివేదిక అమలు ఇప్పటికీ ఇంకా పెండింగ్‌లోనే ఉంది. సంయుక్త రాష్ట్ర అసెంబ్లీ చేసిన తీర్మానాలు, ప్రభుత్వాలు పంపిన ప్రతిపాదనలు, అభ్యర్థనలు, వాటిని పంపిన రాష్ట్రం సాంకేతికంగా ఉనికిలో లేనప్పుడు అవి అన్ని ఏమవుతాయి? ఇటువంటివన్నీ రాబోయే కొత్త సమస్యలకు, జతచేరే పాత సమస్యలు. వెరసి వీటిన్నంటికి పరిష్కారాలు వెతుక్కో వడంలోను, వాటిని కార్యరూపంలో పెట్టడంలోను మనం చూపించే దార్శనికతే మనం గొప్పగా చెప్పుకుంటున్న – రెండు వందల అరవై ఏళ్ల 'ఆధునికత'కు అంతిమంగా గీటురాయి అవుతుంది.

*(జనవరి, 2014లో వెలువడనున్న రచయిత వ్యాస సంకలనం 'సొంత సంతకం' నుంచి)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ అధికారి)* వీ

# ఫుడ్ కారిడార్ - పెట్రో కారిడార్

***తీర ప్రాంతంలో ఏర్పాటు చేయబోతున్న పెట్రో కారిడార్ వల్ల వాతావరణ కాలుష్యం ఏర్పడి ఆహార పంటలు దెబ్బతిని, ఆహార కొరత ఏర్పడే ప్రమాదం ఉందని అంటున్నారు* తుంపాల శ్రీరామమూర్తి**

**భా**రతదేశం జాతీయ, అంతర్జాతీయ బడా పెట్టుబడిదారులకు, బహుళజాతి కంపెనీలకు ఆహ్వానం పలుకుతోంది. వారి దేశాలలో కాలం చెల్లిన, నిషేధించిన పరిశ్రమలను మన దేశంలో స్థాపించడానికి అనుమతులు ఇస్తోంది. వందల సంవత్సరాలుగా భూమిని, సముద్రాన్ని నమ్ముకొని జీవించే ప్రజలను నాశనం చేస్తోంది. రాజ్యాంగంలోని ఆర్టికల్ 21 జీవించే హక్కును ఉల్లంఘిస్తోంది. అందులో భాగంగానే దేశవ్యాప్తంగా ఆరు చోట్ల పెట్రోలియం, కెమికల్, పెట్రో కెమికల్ ఇన్వెస్ట్‌మెంట్ రిజియన్ (పిసిపిఐఆర్)ల ఏర్పాటుకు రంగం సిద్ధం చేసింది. గుజరాత్ (దహెజ్), పశ్చిమ బెంగాల్ (హాల్దియా), ఒడిశా (పారాదీప్), తమిళనాడు (కడలూరు – నాగపట్నం), కర్ణాటక (మంగుళూరు), ఆంధ్రప్రదేశ్ పిసిపిఐఆర్ (విశాఖపట్నం – కాకినాడ) పెట్రో కారిడార్‌ల ఏర్పాటు జరుగుతున్నాయి. ఈ మేరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఒప్పందం జరిగి జిఒ ఎంఎస్ నెం. 373, 2008 మే 24న విశాఖ – కాకినాడ పిసిపిఐఆర్ కొరకు ఉత్తర్వులు జారీ చేసింది. మరల సర్వే జరిపి జిఒ ఎంఎస్ నెం. 214, 2013 మే 25న ఉత్తర్వులు విడుదల చేసింది.

దీనిలో భాగంగా విశాఖలో వికె – పిసిపిఐఆర్ స్పెషల్ డెవలప్‌మెంట్ అథారిటీ రి.క. నెం. 723/2007/ఎల్6, 2013 ఆగస్ట్ 3న ఫారమ్–1 ప్రకటన విడుదల చేసింది. విశాఖ జిల్లా పెద్ద గంట్యాడ మండలం, పరవాడ, అచ్యుతాపురం, రాంబిల్లి, ఎస్. రాయవరం, నక్కపల్లి, పాయకరావుపేట; తూర్పు గోదావరి జిల్లాలో యు. కొత్తపల్లి, తొండంగి, కాకినాడ రూరల్, వాకల పూడి గ్రామం వరకు ఈ పది మండలాల్లో 640 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో 137 కిలోమీటర్ల పొడవునా తీర ప్రాంతంలో పెట్రో కారిడార్ ఏర్పాటు అవుతున్నది. ఈ పెట్రో కారిడార్‌లో కెమికల్, పెట్రోల్, టెక్స్‌టైల్, రబ్బర్, ఆటోమొబైల్స్, ఇతర రసాయనాల పరిశ్రమలు ఏర్పాటు కానున్నాయి. ప్రభుత్వ నివేదికల ప్రకారం ఆరు లక్షల నలభై వేల మందికి ఉద్యోగాలు కల్పిస్తామని, నివాస గృహాలు ఏమి తొలగించమని అంటోంది. ఈ ప్రాంతంలో సుమారు మూడు లక్షల యాభై వేల మంది ప్రజలు నివసిస్తున్నారు. వాస్తవానికి ఐదు లక్షల మంది ఉన్నారు. మత్స్యకారులకు కోల్డ్ స్టోరేజీలు, ఫిషింగ్ జెట్టీలు ఏర్పాటు చేస్తామని చెపుతున్నారు. ఈ పెట్రో కారిడార్‌లో 97 రెవెన్యూ గ్రామాలు ఉన్నాయి. వీటిని ఆనుకొని అనేక చిన్న చిన్న గ్రామాలు కూడా ఉన్నాయి. వీటిని లెక్కల్లో చూపించలేదు. 97 రెవెన్యూ గ్రామాల్లో 55 గ్రామాలలో మత్స్యకారులు నివసిస్తున్నారు. వీరి జనాభా సుమారు రెండున్నర లక్షలు. వీరందరూ చేపల వేటపై ఆధారపడి జీవిస్తున్నారు.

ఇప్పటికే ఎన్‌టిపిసి జవహర్ నెహ్రూ ఫార్మా సిటీలోని పరిశ్రమలు విడుదల చేస్తున్న బూడిద (యాష్ పాండ్), ఇతర వ్యర్థ జలాలు, ఖనిజాల వలన భూగర్భ జలాలు, సముద్ర జలాలు కలుషిత మయ్యాయి. మత్స్య సంపద నాశనమైపోయింది. తాబేళ్లు, చేపలు చనిపోతున్నాయి. మత్స్యకారుల జీవనోపాధికి ముప్పు ఏర్పడింది. కూలీలుగా, వలస కూలీలుగా ఇతర ప్రాంతాలకు తరలి పోతున్నారు. ఉపాధి కోల్పోతున్న మత్స్యకారులకు ఈ పరిశ్రమలలో ఏ ఉపాధి దొరకలేదు.

ఈ తీర ప్రాంతంలో మత్స్యకారులతో పాటు చిన్నా, సన్నకారు రైతులు, చేతివృత్తుల వారు, కూలీలు కూడా జీవనోపాధి కోల్పోతున్నారు. ఈ తీరాన్ని ఆనుకొని ఉన్న లక్షల ఎకరాల వ్యవసాయ భూములు కాలుష్యం కారణంగా నిరుపయోగంగా మారిపోతున్నాయి. ఈ ప్రాంతంలో కొబ్బరి, జీడి, వరి ఇతర ఆహార దినుసులతో పాటు కాయగూరలు బాగా పండుతాయి. పెట్రో కారిడార్ వలన పంటలు నాశనమై ఆహార కొరత తీవ్రంగా ఏర్పడుతుంది. అంతే కాకుండా వాతావరణ కాలుష్యం వలన పర్యావరణానికి ముప్పు ఏర్పడుతుంది. దీనితో పాటు విశాఖ మహానగరానికి నీటికొరత ఏర్పడుతుంది. విశాఖపట్టణానికి ప్రస్తుతం అందుబాటులో ఉన్న ఏలేరు కాలువ, తాటిపూడి, గోస్తని, రైవాడ ఇతర జలాశయాల నీటికి ముప్పు ఏర్పడుతుంది. పాడి పరిశ్రమ, గొర్రెలు, మేకల పెంపకంపై ఆధారపడి జీవిస్తున్న వారు ఉపాధి కోల్పోతారు.

ఈ కోస్టల్ కారిడార్‌లో వస్తున్న పెట్రో కారిడార్ కంటే ముందు థర్మల్ ప్లాంటులకు, ఎస్ఇజెడ్‌లకు, ఇతర కంపెనీలకు భూ సేకరణ జరిగి అనుమతులు కూడా పొందారు. దళితులు సాగు చేసుకుంటున్న అసైన్డ్ భూములు ఈ కంపెనీల కోసం ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. చాలా గ్రామాల ప్రజలు నివాసాలు కోల్పోయే అవకాశం ఉన్నప్పటికీ ప్రభుత్వం స్పష్టంగా ఏ విషయం ప్రకటించడం లేదు. పెట్రో కారిడార్‌కి సంబంధించి గ్రామ సభలు నిర్వహించి ప్రజలకు సమాచారం చెప్పలేదు. ప్రజాభిప్రాయ సేకరణ జరపలేదు. తమ నివేదికలలో జిరాయితీ భూమి, పట్టా భూములు, ప్రభుత్వ భూములు ఎంతెంత సేకరిస్తున్నారో వివరాలు పొందుపరచలేదు. మేము ఒక కమిటీగా ఏర్పడి చాలా గ్రామాలు పర్యటించి ప్రజలను, అధికారులను సంప్రదించగా తమకేమీ తెలియదని చెపుతూ, ప్రజలు పిసిపిఐఆర్‌ను వ్యతిరేకిస్తున్నందున వాటికిచ్చిన అనుమతులు రద్దు చేయాలని, ఫుడ్ కారిడార్‌గా అభివృద్ధి చేయాలని కోరుతున్నాం.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# ఊపందుకుంటున్న రాయలసీమ నినాదం

*రాయలసీమ అన్ని రంగాలలో వెనుకబడి పోయిందనీ, రాయలసీమ ప్రత్యేక రాష్ట్రంతోనే వీటికి పరిష్కారం లభిస్తుందనీ అంటున్నారు* **ఎం.కె. కుమార్**

రాయలసీమలో విజయనగర సామ్రాజ్యం గుప్తులకాలపు స్వర్ణ యుగంగా ప్రసిద్ధి కెక్కింది. అశోకుని కాలంలో కూడా రాయలసీమ ప్రాంతం పేరు వినిపించింది. చిత్తూరు, అనంతపురం, బళ్లారి ప్రాంతాలు పల్లవుల పాలనలో ఉండేవి. కర్నూలు, కడప ప్రాంతాలు రేనాటి చోళుల ఆధీనంలో ఉండేవి. చాళుక్యుల అనంతరం చోళులు మిగిలిన ప్రాంతాలతో పాటు రాయలసీమను ఒక శతాబ్దపు కాలం పరిపాలించారు. క్రీ.శ. 1180 పల్నాటి యుద్ధం తర్వాత, ఆంధ్ర ప్రాంతాన్ని ఒకే రాజకీయ పాలన కిందికి కాకతీయులు తీసుకొచ్చారు. అప్పుడు రాయలసీమ కూడా కాకతీయుల ఏలుబడిలోకి వచ్చింది. కాకతీయరాజులు (1000–1320) పాలనలో శూద్ర కులాలైన రెడ్డి, వెలమ, తెలగ, కమ్మ వర్గాలు ఆధిపత్య వర్గాలుగా, భూస్వామ్య శక్తులుగా చెలమాణి అయ్యాయి. కొండవీటి రెడ్డిరాజులు (1324–1424) కాలంలో పరిపాలన గ్రామకేంద్రంగా అభివృద్ధి చెందింది. గ్రామంలో రెడ్డి, కరణం, పురోహితుడు ప్రముఖ స్థానం వహించి, గ్రామ పెత్తందారులుగా స్థిరీకరించబడ్డారు. విజయనగర సామ్రాజ్య (1336–1678) కాలంలో ఆధిపత్యాన్ని అనుభవిస్తున్న అగ్రవర్ణ శూద్రులలో అనైక్యత ఎక్కువగా ఉండేది. అయినప్పటికీ 1336లోనే ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలను కలిపి విజయనగర సామ్రాజ్య స్థాపన చేయగలిగారు. 1513లో శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రదేశాన్ని అభివృద్ధి పరిచే చర్యలను ప్రారంభించాడు. రాయలసీమలో సుమారు 10 వేలకు పైగా చెరువులను ఆ కాలంలోనే తవ్వించారు. ఈ చెరువుల ద్వారానే రాయలసీమలో వ్యవసాయం అభివృద్ధి చెందింది. బళ్లారిలోని హంపిలో విజయనగర సామ్రాజ్య స్థాపన జరిగినప్పటికీ సామంతరాజులు రాయలసీమ ప్రాంతంలో ఉండడం చేత సంపదను రాయలసీమకు తరలించేవారు. అందువల్లే ఇక్కడ రత్నాలు, వజ్రాలను రాసులు పోసి అమ్మినారని చరిత్రకారులు చెపుతారు. 1565లో జరిగిన తళ్లికోట యుద్ధం తర్వాత విజయనగర సామ్రాజ్యం పతనమైంది. ఆర్వేటి వంశరాజులు పెనుగొండ రాజధానిగా రాయలసీమ, మైసూరు, తమిళదేశంలోని కొంత ప్రాంతాన్ని పరిపాలించారు. వీరి కాలంలో రాజ్యాన్ని మూడు ప్రాంతాలుగా చేశారు. పడమర ప్రాంతానికి పెనుగొండ, తూర్పు భాగానికి చంద్రగిరి, దక్షిణ భాగానికి శ్రీరంగపట్నాన్ని రాజధానులుగా చేశారు. 1675లో రాయలసీమలోని కొన్ని ప్రాంతాలు బీజాపూర్ సుల్తానుల వశమయ్యాయి. మరికొంతభాగం గోల్కొండ నవాబుల ఏలుబడిలోకి వెళ్లింది. ఈ కాలంలో పాలెగాళ్ల వ్యవస్థకు బీజం పడింది. పాలెగాళ్లు, అప్పటికే గ్రామాలలో పెత్తందారీ వ్యవస్థను పెంచిపోషిస్తున్న కరణం, మునసుబులను తమ కిందకి తెచ్చుకున్నారు. పంటలో శిస్తును రెండింతలుగా పెంచడం, సైన్యానికి జీతాలు చెల్లించాల్సి వచ్చినప్పుడల్లా, పాలెగాళ్లు గ్రామాలపై పడి పెద్ద ఎత్తున దోచుకునేవారు. విజయనగర కాలంలోని సామంతరాజులే తదనంతర కాలంలో పాలెగాళ్లుగా స్థిరపడ్డారు. వీళ్ల పాలనలో తీవ్ర అరాచకం, దోపిడీ జరిగింది. 1677–78 కాలంలో ఛత్రపతి శివాజీ పరిపాలనలోను, మైసూరు రాజ్యం రాజు హైదరాలీ క్రింద రాయలసీమ ప్రాంతం ఉంది.

1761లో ఫ్రెంచి ఏలుబడిలో వున్న ప్రాంతాలన్నింటినీ బ్రిటిష్ కంపెనీ వారు తమ చేతిలోకి తీసుకున్నారు. 1792లో టిప్పు సుల్తానుల ఏలుబడిలో రాయలసీమ పరిపాలన సాగింది. 1798లో నైజాం పరిపాలనలో ఉన్న రాయలసీమ ప్రాంతాన్ని దత్తతగా ఇచ్చివేయడంతో ఈ ప్రాంతం దత్తమండలంగా ప్రసిద్ధి పొందింది. 1800లో రాయలసీమ ప్రాంతం మొత్తం ఈస్ట్ ఇండియా కంపెనీ ఏలుబడిలోకి వచ్చింది. సర్ థామస్ మన్రో ఈ ప్రాంతానికి కలెక్టరుగా నియమితుడయ్యాడు. పాలెగాళ్ల వల్ల ప్రభుత్వానికి పన్నుల రాబడి తగ్గిపోతుందని, పాలెగాళ్లను నయానా, భయానా లొంగతీసుకునే ప్రయత్నం చేశాడు. 80 మందికి పైగా ఆ కాలంలో పాలెగాళ్లు ఉండేవారని బ్రిటిష్ గణాంకాలు చెపుతున్నాయి. పన్నుల వసూళ్లకు రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టారు. దత్తమండలాల స్థానే ఈ ప్రాంతాన్ని రాయలసీమ అనే పేరుమీద పిలవాలని గాడిచర్ల హరిసర్వోత్తమరావు, చిలుకూరి నారాయణలు అభిప్రాయబడ్డారు. అయితే రాయల కాలంలోనే ఈ ప్రాంతం రాయలసీమగా పిలువబడేదనే వాదన కూడా ఉంది. 1808లో బళ్లారి, కడప జిల్లాలను పాలనా సౌలభ్యం కోసం ఏర్పర్చారు. 1858లో కర్నూలు జిల్లా, 1882లో అనంతపురం జిల్లా, 1911 చిత్తూరు జిల్లా ప్రత్యేకంగా ఏర్పాటయ్యాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ హయాంలో 1847లో గోదావరిపైన, 1853లో కృష్ణానదిపైన ఆనకట్టలు కట్టి వ్యవసాయాన్ని అభివృద్ధి చేసే ప్రయత్నం చేశారు. దీంతో రాబడిని పెంచవచ్చనేది వారి ఆలోచన. ఈ రెండు ఆనకట్టల నుండి రాయలసీమకు చుక్కనీరు కూడా వచ్చేది కాదు. సర్ ఆర్థర్ కాటన్ నిర్మాణం చేసిన ఈ ఆనకట్టలు కోస్తా ప్రాంతం వారిని వ్యవసాయపరంగా బాగా అభివృద్ధి చేశాయి. 1867–70ల మధ్య కాటన్ రూపొందించిన, కర్నూలు–కడప కాలువ ఫిలిప్ బ్రౌన్‌చే నిర్మించబడింది. రాయలసీమ ప్రాంతంలోని ముడిసరుకులను, అటవీ ఉత్పత్తులను రవాణా చేయుటకే బ్రిటిష్‌వారు ఈ కాలువను నిర్మించారు. తర్వాతి కాలంలో కర్నూలు జిల్లాలో 1 లక్షా 84 వేల ఎకరాలకు, కడప జిల్లాలో 94 వేల ఎకరాలకు వ్యవసాయానికి సాగునీటిని, ఆ రెండు పట్టణాలకు తాగునీటిని ఇదే కాలువ అందించింది.

1880 ప్రాంతంలో రాయలసీమలోని 36 లక్షల ఎకరాలకు సాగునీరు అందించవలెనన్న తలంపుతో కృష్ణా, తుంగభద్ర, పెన్నా నదుల అనుసంధానంతో సర్ మెకంజీ అనే బ్రిటిష్ శాస్త్రవేత్త కృష్ణా–పెన్నేరు అనే పథకాన్ని రూపొందించాడు. రాయలసీమలో వ్యవసాయం వర్షాధారితం కావడం వల్ల వ్యవసాయం దెబ్బతినింది. వ్యవసాయం మీద ఆధారపడ్డ చేతివృత్తుల వారు పనిలేక బర్మా, మలేషియా దేశాలకు కూలీలుగా వలస వెళ్లారు. 1914, 1939లలో వచ్చిన మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలలో తలమునకలై ఉన్న బ్రిటిష్ ప్రభుత్వం మెకంజీ పథకాన్ని తాత్కాలికంగా నిలుపదల చేయవలసి వచ్చింది. తర్వాతి కాలంలో పాలకవర్గాలు ఉద్దేశ్యపూర్వకంగానే దీన్ని పక్కన పెట్టి దీని స్థానంలో 1953లో నాగార్జునసాగర్‌ను రూపొందించి, రాయలసీమ ప్రాంతానికి తీవ్ర అన్యాయం చేశారు.

1953 వరకు రాయలసీమ, కోస్తా ఆంధ్ర ప్రాంతాలు మద్రాసు రాష్ట్రంలో ఉండేవి. తమిళుల ఆధిపత్యం వల్ల, జాతీయోద్యమకాలంలో ఊపొందుకున్న జాతిరాజ్య భావన 1913లో భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా రూపాంతరం చెందింది. 1913లో బాపట్లలో, 1915లో విశాఖలో ప్రత్యేక తెలుగు రాష్ట్ర భావనలు ఊపందుకున్నాయి. తమిళుల ఆధిపత్యం నుండి కోస్తా ఆధిపత్యంలోకి రాయలసీమ ప్రాంతం రావడం వల్ల సీమకు పెద్దగా ఒరిగేదేమి లేదనే తలంపుతో పప్పు రామాచార్యులు, కడప కోటిరెడ్డి, టి.ఎన్.రామకృష్ణారెడ్డి తదితరులు ప్రత్యేక రాయలసీమ రాష్ట్రం అవసరమని అభిప్రాయపడ్డారు. ఇదే స్ఫూర్తితో 1934లో రాయలసీమ మహాసభను కూడా ఏర్పాటు చేశారు. రాయలసీమ వాసుల భయాలను, ఆందోళనలను దృష్టిలో పెట్టుకుని 1937 ఆంధ్ర మహాసభలో చర్చించడం జరిగింది. రాయలసీమ వాసులకు అన్యాయం జరుగకుండా చూస్తామనే కోస్తా నాయకుల ఒత్తిడితో 1931 నవంబరు 16న రాయలసీమ, కోస్తా ప్రాంత నాయకులు మద్రాసులోని కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు స్వగృహమైన శ్రీబాగ్‌లో సమావేశమై ఒక పెద్ద మనుషుల ఒప్పందాన్ని కుదుర్చుకుని అందరూ సంతకాలు చేశారు. ఇదే శ్రీబాగ్ ఒడంబడికగా పేరొందింది. దీని చట్టబద్దతను ఆనాడే కొందరు మేధావులు ప్రశ్నించిన క్రమంలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన వెంటనే దీనికి చట్టబద్ధత తీసుకొస్తామని చెప్పడం జరిగింది. ఈ ఒడంబడిక ప్రకారం ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఒక కేంద్రం వాల్తేరులోను, మరొకటి అనంతపురంలోను ఉండాలని తీర్మానించడం జరిగింది. ఆంధ్రరాష్ట్రంలో ఏర్పడే నీటి ప్రాజెక్టుల నుండి పది సంవత్సరాలు లేదా రాయలసీమలో నీటివనరులు కల్పించబడేంతవరకు రాయలసీమ జిల్లాల అవసరాలకే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తూ నీటిని కేటాయించాలి. కృష్ణా, తుంగభద్ర, పెన్నా నదుల నీటిని ఉపయోగించి కట్టే ఏ ప్రాజెక్టయినా రాయలసీమ ప్రాయోజనార్థమే నిర్మించబడాలి. భవిష్యత్తులో నీటి పంపకాలలో వివాదాలు ఏర్పడిన సందర్భంలో రాయలసీమ అవసరాలనే ముందుగా తీర్చాలి. అలాగే ఆంధ్ర రాష్ట్ర రాజధానిని, హైకోర్టును రాయలసీమ ప్రజలు కోరుకున్న పక్షంలో రాయలసీమ ప్రాంతంలోనే నెలకొల్పాలని తీర్మానించబడింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడి ఇంతకాలం అయినా రాయలసీమ తీవ్ర నిర్లక్ష్యానికి, దగాకు గురికాబడింది.

చిన్న రాష్ట్రాల నినాదం చారిత్రకంగానే బలపడుతున్న తరుణంలో రాయలసీమ వెనుకుబాటుతనం గురించి తప్పక ప్రశ్నించవలసిన అవసరం ఉంది. రాయలసీమ ప్రాంతం మొదటినుండి తనకంటూ ప్రత్యేకమైన స్థానాన్ని భౌగోళిక, చారిత్రక, సాంస్కృతిక, సంప్రదాయాల పరంగాను సంపాదించుకుంది. ఈ నేపథ్యం నుండే రాయలసీమ కూడా ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలనే డిమాండు ముందుకొచ్చింది. అయితే అవకాశవాద రాజకీయనాయకులు తమ ఆధిపత్య విస్తరణ కోసం రాయల తెలంగాణ, గ్రేటర్ రాయలసీమ అనే పసలేని వాదనలను ముందుకు తెస్తున్నారు. తెలంగాణ ఏర్పడితే తప్పనిసరిగా రాయలసీమ రాష్ట్రం ఏర్పడాలనే బ్లాక్ మెయిల్ రాజకీయాలకు కూడా సిద్ధపడు తున్నారు. భిన్నమైన అస్తిత్వాన్ని కలిగి ఉన్న రాయలసీమకు అన్యాయం చేయాలనే తలంపు ఈ ప్రాంత రాజకీయవాసులకే ఉండడం విషాదకర మైన విషయం. ఈ చారిత్రక సందర్భంలో వెనుకబడ్డ రాయలసీమ అభివృద్ధికి స్పష్టమైన కార్యాచరణను, ప్రణాళికలను రూపొందించుకుని ఐక్యంగా ముందుకుపోవలసిన అవసరం ఏంతైనా ఉంది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడుతున్న తరుణంలో, సమైక్యవాదులతోపాటు రాష్ట్ర ముఖ్యమంత్రి రాష్ట్రం విడిపోతే రాయలసీమ ఎడారి అవుతుందని ప్రకటించారు. నిజానికి ఇప్పటికే రాయలసీమ ఎడారిగా మారిపోయే పరిస్థితి ఏర్పడింది. దీనికి పాలకులు కారణంగాని, రాష్ట్రం విడిపోవడం కాదు. తెలంగాణ విడిపోతున్న సందర్భంలోను, రాయలసీమకు రావలసిన, అందవలసిన నీటి వనరుల గురించి ఇప్పటికీ ఒక స్పష్టమైన వైఖరితో రాయలసీమ రాజకీయ నాయకులు ముందుకు కదలడం లేదు. దేశంలో మొత్తం సాగుభూమి 185 మిలియన్ హెక్టార్లు కాగా, సీమలో ఉంది. రాయలసీమలోని ఎక్కువ ప్రాంతాల వాతావారణం ప్రధానంగా పొడిగా ఉంటుంది. సముద్రమట్టం నుండి ఈ ప్రాంతం 250 మీటర్ల నుండి 600 మీటర్ల ఎత్తులో ఉంది. ఆంధ్రప్రదేశ్ సగటు వర్షపాతం 858 మి.మీ కాగా, 67 శాతం నైరుతి రుతుపవనాల ద్వారానే వస్తుంది. ఉత్తరాంధ్రలో వర్షపాతం అత్యధికంగా 1250 మి.మీ ఉంది. రాయలసీమలో 800 మి.మీ కన్నా తక్కువ వర్షపాతమే నమోదవుతోంది. అందువల్లే ఈ ప్రాంతం కరువు ప్రాంతంగా ఉంది. ఈ వర్షపాతం రాయలసీమలో ప్రధానంగా పండిస్తున్న వేరుశనగ, కొర్ర జొన్నల పంటలకు కనీస స్థాయిలో కూడా చాలడం లేదు. సాలీనా 30 శాతానికి మించి పంటలు పండించే స్థితిలో ఇక్కడి ప్రజలు లేరు. రాయలసీమలో ఖరీఫ్ పంటకాలంలో కురిసే వర్షపాతం కేవలం 365.8 మి.మీ మాత్రమే. ఇది కూడా అన్ని ప్రాంతాల్లో ఒకే రకంగా ఉండదు. రాయలసీమలో ఎక్కువ భూమి ఎర్రనేలలుగాను, తక్కువగా నల్లరేగడి భూములున్నాయి. ఎర్రనేలలు తేమను ఎక్కువగా నిలువచేసుకోలేవు. నేల సారం కూడా తక్కువస్థాయిలో ఉంటుంది. రాష్ట్రంలో ఉపరితల నీటి వనరులు 2746 టిఎంసిల గాను, భూగర్భ జల వనరులు 1140 టిఎంసిల గాను ఉందని అంచనా వేయబడింది. ఇందులో ఉపరితల నీటి వనరుల్లో గోదావరి నుండి 1495, కృష్ణా నుండి 811 టిఎంసిలు వస్తుందని అంచనా. రాష్ట్రంలో 113.4 లక్షల హెక్టార్ల (284 లక్షల ఎకరాలు) భూమి సాగులో ఉండొచ్చని అంచనా వేస్తున్నారు. నిజానికి పై నీటి వనరులు మూడు ప్రాంతాల వారికీ సమానంగా అందుబాటులోకి తీసుకు రాగలిగితే 118 లక్షల హెక్టార్ల భూమికి సాగునీరు అందించవచ్చని నిపుణులు పేర్కొంటున్నారు. 5వ పంచవర్ష ప్రణాళిక నాటికి నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి కోస్తాలో 26.79 లక్షల

హెక్టార్లకుంటే, తెలంగాణలో 15.25 ల.హె, రాయలసీమలో 6.50 ల.హెకే ఉంది. ఇది కూడా ఈ మధ్య కాలంలో 30 శాతానికి పైగా తగ్గింది. దీన్ని బట్టి రాష్ట్రంలో నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి అసమానతలు ప్రస్ఫుటంగా తెలుస్తాయి. రాయలసీమ పట్ల వివక్ష ఇప్పటికే కొనసాగుతోంది. నీటి వనరుల అభివృద్ధి జరగనంత కాలం ఆ ప్రాంతం అభివృద్ధి చెందదనేది చారిత్రక సత్యం.

ఇజ్రాయెల్‌లో నెగేవ్ ఎడారిలో, అమెరికాలోని కాలిఫోర్నియా ఎడారిలో ఆ దేశాల వారు పచ్చని పంటలను పండించి వ్యవసాయాన్ని అభివృద్ధి చేశారు. మన దేశంలో థార్ ఎడారిలో అతి తక్కువ వర్షపాతం 220 మి.మీ. భాక్రానంగల్ ప్రాజెక్టులో నీటిని, సట్లేజ్ నదీ జలాలను రాజస్థాన్ కాలువ ద్వారా ఈ ఎడారికి మళ్లించే ప్రయత్నం వల్ల 31.5 లక్షల ఎకరాలకు సాగునీరు అందించబోతున్నారు. కరువులసీమగా ప్రసిద్ధిగాంచిన రాయలసీమలో 1876–78 లో వచ్చిన ధాతు కరువువల్ల ఈ ప్రాంతంలో 1/3వ వంతు ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. 1952–53లో వచ్చిన కరువుకు వేలల్లో ప్రజలు చనిపోయారు. రాష్ట్రంలోని 61 కరువు ప్రాంతాల్లో 39 రాయలసీమలోనే ఉన్నాయి.

రాయలసీమలో ప్రధానంగా పెన్నా, తుంగభద్ర, కృష్ణా నదుల పరివాహక ప్రాంతాలలో ఉంది. పెన్నా పరివాహక ప్రాంతం 56,750 చ.కి.మీ ఉండగా రాయలసీమలో 47,140 చ.కి.మీ, నెల్లూరు జిల్లాలో 4,500 చ.కి.మీ ఉంది. పెన్నాలో లభ్యమయ్యే 75 శాతం విశ్వసనీయ నీటి లభ్యత ప్రకారం 123 టిఎంసిలు లభిస్తే, అందులో 33 టిఎంసిలు రాయలసీమ, 90 టిఎంసిలు నెల్లూరు జిల్లాకు కేటాయించబడ్డాయి. అయితే గత 8 సంవత్సరాలుగా పెన్నాలో నీటి లభ్యత గణనీయంగా తగ్గింది. తుంగభద్ర పరివాహక ప్రాంత విస్తీర్ణం 28,179 చ.కి.మీ. కర్నాటకలో 19,142, ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమలో 9,037 చ.కి.మీ ఉంది. 75 శాతం వార్షిక నీటి లభ్యత ఆధారంగా 480 టిఎంసిలు తుంగభద్ర నుండి వస్తే, దాన్ని కృష్ణా నీటి వివాదం ట్రిబ్యునల్ రాయలసీమకు 122.7 టిఎంసిలను కేటాయించింది. కృష్ణానదీ పరివాహక ప్రాంతం మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లో ఉంది. బచావత్ ట్రిబ్యునల్ 1973, 1976 లలో తన తొలి, తుది నివేదికలను సమర్పించాయి. దీని ప్రకారం కృష్ణానదిలో వున్న నికర జలాలు 2060 టిఎంసిలేనని పేర్కొంటూ, మహారాష్ట్రకు 560, కర్ణాటకకు 700, ఆంధ్రప్రదేశ్‌కు 800 టిఎంసిల నీటిని కేటాయించాలని పేర్కొంది. మన రాష్ట్రంలో రాయలసీమకు 122.7, కోస్తాంధ్రకు 377.44, తెలంగాణకు 266.86 టిఎంసిలను కేటాయించారు. రాయలసీమకు 110 టిఎంసిలు మాత్రమే అందుతున్నాయి. ఇది 1937 నాటి శ్రీబాగ్ ఒప్పందానికి పూర్తి వ్యతిరేకమైనది. మొత్తంగా కృష్ణ, తుంగభద్ర, పెన్న, ఇతర చిన్న నదుల ద్వారా రాయలసీమకు 167 టిఎంసిల ఉపరితల జలాలు లభ్యమవుతున్నాయి. రాయలసీమలో భూగర్భజలం 216 టిఎంసిల వరకు ఉండొచ్చని భూగర్భజల విభాగం అంచనా వేసింది. ఇందులో 50 శాతం(108 టిఎంసి)ల మాత్రమే వినియోగంలోకి తీసుకురావచ్చని అభిప్రాయపడింది. ఉపరితల, భూగర్భజలాల నుంచి వస్తున్న 275 టిఎంసిల వల్ల 75 లక్షల ఎకరాల సాగుభూమి అవసరాలకు మాత్రమే ఉపయోగపడుతుంది. అది కూడా ఈ మధ్య కాలంలో 35 శాతం తగ్గిపోయింది.

రాయలసీమలో కరువు సమస్యను తీర్చడానికి 1901 లో సర్‌కోలిన్ సి.స్కాట్ ఇరిగేషన్ కమీషన్ కృష్ణా, పెన్నా బేసిన్లను కలిపి కాల్వలను తవ్వాలని సిఫార్సు చేసింది. మెకంజీ పథకాన్ని అసలు అమలు చేయలేదు. 1927లో దత్తమండల జిల్లాల నీటిపారుదల సంఘం సంగమేశ్వరం వద్ద కృష్ణా నది మీద ఒక రిజర్వాయర్ నిర్మించి, ఆ నీళ్లను పెన్నా నది ద్వారా రాయలసీమకు తరలించి 13 లక్షల ఎకరాలకు సేద్యపు నీరందించాలని ప్రతిపాదించారు. అలాగే 1952 సంయుక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం కృష్ణానది మీద సిద్దేశ్వరం రిజర్వాయర్‌ను నిర్మించి 7 లక్షల ఎకరాలకు సాగునీరందించాలని కృష్ణా–పెన్నేరు పథకంలో సూచించారు. 1953లో భోస్లా కమిటీ కూడా కె.సి.కెనాల్‌ను 6000 క్యుసెక్కుల నీరు సరిపోయేటట్టు మార్చి కృష్ణా మీద సిద్దేశ్వరం డ్యామ్ నిర్మించాలని సిఫార్సు చేసింది. శ్రీబాగ్ ఒప్పందం ప్రకారం రాయలసీమకు నీటి మళ్లింపు విషయంలో ప్రథమ ప్రాధాన్యతనివ్వాలని పేర్కొనడం జరిగింది. ఈ పథకాలన్నీ బుట్టదాఖలయినాయి. మరి ఇన్ని సంవత్సరాలు తెలుగు ప్రజలు సమైక్య రాష్ట్రంలో ఉన్నప్పటికీ రాయలసీమకు ఎందుకు తీరని అన్యాయం జరిగిందో సమైక్యవాదులు జవాబు చెప్పాలి.

గోదావరి జలాలు సుమారు 1480 టిఎంసిలుంటే అందులో రాయలసీమకు 200 టిఎంసిల నికర జలాల కేటాయింపు కూడా లేదు. జూరాల ప్రాజెక్టుపై హక్కును కూడా రాయలసీమ పోగొట్టుకోవలసి వస్తోంది. రాయలసీమలోని కరువు ప్రాంతం దృష్టిలో పెట్టుకునే బచావత్ ట్రిబ్యునల్ ఆంధ్రప్రదేశ్‌కు ఎక్కువ టిఎంసిలను కేటాయించిందనే వాదన ఉంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందరే నిర్మించిన కర్నూలు–కడప కాలువ వాటా 40 టిఎంసిలు, తుంగభద్ర కాలువల ద్వారా వచ్చిన వాటా 62 టిఎంసిలు కూడా బచావత్ అవార్డు ప్రకారం ఇచ్చిన 122.70 టిఎంసిలలో కలిసివున్నాయి. మరి రాయలసీమకు ఒరిగిందేమిటో రాయలసీమ రాజకీయ నాయకులు సమాధానం చెప్పాలి. 1983లో ప్రారంభమైన తెలుగుగంగ పథకం ద్వారా చెన్నై నగరానికి 5 టిఎంసిలు (ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్రల వాటా ప్రకారం) 3.21లక్షల ఎకరాలకు రాయలసీమలోని పంటలకు సాగునీరు కల్పించాలని ఉద్దేశించబడింది. తెలుగు గంగ కాలువ శ్రీశైలం జలాశయం నుండి 29, కృష్ణానది నికర జలాల నుండి 15 టిఎంసిలను తీసుకుంటుంది. ఈ కాలువ పొడవు 408 కి.మీగా ఉంది.

1989లో ప్రారంభమైన హంద్రి–నీవా పథకం ఇంతవరకు ఆచరణకు నోచుకోలేదు. శ్రీశైలం జలాశయం ఉపరితల భాగంలో కర్నూలు జిల్లాలోని మాల్యాల గ్రామం వద్ద ప్రధాన కాలువగా ప్రారంభమై 740 కి.మీ ప్రవహించి చిత్తూరు జిల్లాలోని నీవా నదిలో కలుస్తుంది. శ్రీశైలం రిజర్వాయర్‌లోని వరదనీటి నుండి 40 టిఎంసిలను కేటాయించారు. దీని ద్వారా 6 లక్షల ఎకరాలకు సాగునీరు అందుతుందని అంచనా వేశారు. 1989లో ప్రారంభించబడిన మరో పథకం గాలేరు– నగరి సుజల స్రవంతి. శ్రీశైలం రిజర్వాయరు నుంచి 38 టిఎంసిల వరద నీటిని కేటాయించారు. మొదట్లో 18 బ్యాలన్సింగ్ రిజర్వాయర్లకు రూపకల్పన చేసి, తర్వాత 8కే కుదించారు. గోరుకల్లు వద్ద ప్రారంభమై నగరి వద్ద కుశస్థలి నదిలో కలుస్తుంది. అలాగే శ్రీశైలం రిజర్వాయర్ ఎగువ ప్రాంతంలో నందికొట్కూరు దగ్గరలోని పోతిరెడ్డిపాడు

అనే గ్రామం పోతిరెడ్డిపాడు హెడ్‌రెగ్యులేటర్ నిర్మాణం జరిగింది. దీన్నుండే తెలుగు గంగ, గాలేరు - నగరి, హంద్రీ - నీవాల నుండి రాయలసీమకు కేటాయించిన 102 టిఎంసిలు రావలసి ఉంది. దీని నిర్మాణం 11,500 క్యూసెక్కులుగా నిర్ధారించారు. అన్ని పథకాలకు శ్రీశైలం రిజర్వాయర్ నుండే నీటిని తీసుకురావలసి ఉన్నందువల్ల పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ సామర్థ్యం పెంచవలసి ఉంది. పోతిరెడ్డిపాడు రెగ్యులేటర్ అడుగుభాగ మట్టం 841 అడుగుల వద్ద, ఉంది. శ్రీశైలం రిజర్వాయర్ నిండితే, లెవల్ 885 అడుగుల వద్ద ఉంటుంది. నిజానికి కనీస డ్రాడౌన్ లెవల్ 834 అడుగులు ఉండాలని జి.ఒ 69 చెప్తుంది. రెగ్యులేటరు సామర్థ్యాన్ని పెంచడానికి కోస్తా, తెలంగాణ నాయకులు ఒప్పుకోవడం లేదు. తెలంగాణ విడిపోతున్న చారిత్రక సందర్భంలో, సమైక్య రాష్ట్రంలో మన నీటి వాటాను కోల్పోయిన నేపథ్యంలో రాయలసీమ నీటి వాటా గురించి కృతంగా అడగవలసిన అవసరం రాయలసీమ ప్రజలకు ఎంతైనా ఉంది.

రాయలసీమలో సగటు వార్షిక వర్షపాతం 644 మిల్లీ మీటర్లుగా ఉంటే, అనంతపురంలో అది 496 మి.మీగా ఉంది. దేశ వార్షిక సగటు వర్షపాతం కన్నా ఇది చాలా తక్కువ. రాష్ట్రంలో ఉపరితల నీటి లభ్యత 2746 టిఎంసిలుగా ఉంటే భూగర్భ నీటి లభ్యత 1146 టిఎంసిలుగా ఉంది. మొత్తం 3886 టిఎంసిల నీటి లభ్యతలో రాష్ట్రంలోని 271 లక్షల హెక్టార్ల భూమిలో వ్యవసాయం చెయ్యొచ్చు. సీమ ప్రాంతానికి కనీసంగానైనా 300 టిఎంసిల నీటిని కృష్ణా నది నుండి ఇవ్వాల్సిన అవసరం ఉంది. సాగు, తాగు నీళ్లకు అల్లల్లాడుతున్న ప్రజలకు కొంత మేరకు ఇది ఊరటనిస్తుంది. ఈ ప్రాంతంలో ఏకైక విద్యుత్ ఉత్పాదన కేంద్రం ఉంది. అదే 1050 మె.వా సామర్థ్యం గల కడప జిల్లాలోని రాయలసీమ థర్మల్ పవర్ ప్రాజెక్టు. మూడు ప్రాంతాలలో నెలకొనివున్న విద్యుత్ ఉత్పాదనలలో ఉన్న అసమానతనలను పరిగణలోకి తీసుకుని కేంద్రం సమగ్రమైన విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలను (థర్మల్, హైడల్, పవన) నెలకొల్పడానికి కావలసిన నిధులను, సాంకేతికతను ఇవ్వాలి. చిత్తూరు జిల్లాలోని మన్నవరంలో 600 మెగావాట్ల సామర్థ్యం గల ఒక థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని ఏర్పర్చాలి. రాయలసీమ థర్మల్ విద్యుత్ కేంద్ర సామర్థ్యాన్ని మరో 600 మెగావాట్లకు పెంచాలి. కడప జిల్లాలో బ్రాహ్మిణి స్టీల్ కర్మాగారాన్ని ప్రభుత్వమే నడుపుతూ, మిలియన్ టన్నుల ఐరన్ ఓర్ భూ నిక్షేపాలను ప్రైవేటుపరం చేయకుండా, వాటిని ఈ కర్మాగానికి ప్రభుత్వం వినియోగించాలి. 15 మిలియన్ల రాయలసీమ ప్రజలకు నీటిపారుదల, విద్యుత్, పారిశ్రామిక రంగాలలో జాతీయ ప్రాజెక్టులను కేటాయించాల్సిన అవసరం ఉంది.

2006-2009 సంవత్సరాలలో సాగు విస్తీర్ణం తెలంగాణ 25, కోస్తాలో 20 శాతం వృద్ధి చెందితే, రాయలసీమలో కనీసవృద్ధి జరగకపోగా 6 శాతం తగ్గిపోయింది. 2008 సంవత్సరంలో సాగునీటి పారుదల తెలంగాణలో 17.2, కోస్తాలో 44.7 శాతం వృద్ధి చెందితే సాగు నీటి పారుదల రాయలసీమలో 14.7 శాతమే పెరిగింది. మానవ అభివృద్ధి సూచికలో రాయలసీమ ప్రాంతం చాలా వెనుకబడిఉంది. వ్యవసాయయోగ్యమైన ప్రాంతం ఎక్కువ ఉన్నప్పటికీ నీళ్లు, విద్యుత్, ప్రభుత్వం వ్యవసాయం పట్ల చూపుతున్న వివక్ష వల్ల సాగు విస్తీర్ణం 38 శాతం పడిపోయినట్లు శ్రీకృష్ణ కమిటీ పేర్కొంది. ఖరీఫ్ కాలంలో వర్షపాతం నమోదు 310 మి.మీ ఉంది. 1876-78 కాలంలో ఏర్పడ్డ ధాతు కరువులో మూడవ వంతు జనాభా మరణించినట్లు బ్రిటిష్ ప్రభుత్వ గణాంకాలు చెప్తున్నాయి. అప్పట్లో కరువు ప్రతి 5 సంవత్సరాలకి ఒకసారి వస్తుంటే, 20వ శతాబ్దంలో ప్రతి 3 సంవత్సరాలకి ఒకసారి వస్తున్నట్లు అధికారిక గణాంకాలు చెప్తున్నాయి. 1972లో ఇరిగేషన్ కమీషన్ నివేదిక ప్రకారం రాయలసీమలోని 39 తాలూకాలు కరువుకోరల్లో చిక్కుక్కున్నట్లు తెల్పారు. 1858లో బ్రిటిష్ వారు నిర్మించిన కర్నూలు-కడప కాలువ (కెసి కెనాల్), 1944-45 కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రారంభించిన తుంగభద్ర ప్రాజెక్టు తప్పితే 1947 నుండి 1985 వరకు పాలకవర్గాలు ఎటువంటి సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణాన్ని చేపట్టలేదు. 19 టిఎంసిల సామర్థ్యంతో శ్రీశైలం కుడి కాలువ (ఎస్ఆర్‌బిసి), 15 టిఎంసిల సామర్థ్యంతో తెలుగు గంగ కాలువల నిర్మాణాలను కృష్ణానది లోని మిగులు జలాల (29 టిఎంసి) నుండి పంపిణీ చేయాలని చేపట్టారు. ఇప్పటికీ ఇవి పూర్తిచేయబడలేదు. ఇప్పటివరకు అందుబాటులో ఉన్న వివిధ కాలువల నుండి 115.90 టిఎంసిల నీళ్లు మాత్రమే రాయలసీమకు అందుతున్నాయి. నిజానికి 600 టిఎంసిల నీళ్లు రాయలసీమకు అవసరం. కరువు బారిన పడకుండా రాయలసీమ ప్రజానీకాన్ని కాపాడాలంటే 300 టిఎంసిలు కచ్చితంగా అవసరమౌతుంది.

రాష్ట్రంలో ప్రధానమైన కృష్ణా, గోదావరి నదుల నుండే నీళ్లను ప్రజలు వాడుకుంటున్నారు. కృష్ణా నుండి 2130 టిఎంసిలు, గోదావరి నుండి 3000 టిఎంసిలు నికర జలాల నీటి లభ్యత ఉంది. అంతేగాకుండా కృష్ణా, గోదావరి నదుల మిగులు జలాల నుండి 450, 3000 టిఎంసిల నీటిని పొందవచ్చని నిపుణులు చెపుతున్నారు. కృష్ణా డెల్టాను ఆధునీకరించడం వల్ల 29 టిఎంసిలను ఆదా చేయవచ్చు. దీన్ని రాయలసీమ ప్రాంతానికి కేటాయించవచ్చు. 1988లో మూడు స్కీములు గాలేరు-నగరి సుజల స్రవంతి, హంద్రీ-నీవా, వెలిగొండ ప్రాజెక్టులు కృష్ణా నదిలోని మిగులు జలాల ప్రాతిపదికన నిర్మించ తలపెట్టారు. ఇప్పటివరకు ఇవి పూర్తి కాలేదు. క్యారీ ఓవర్ వల్ల నాగార్జునసాగర్, శ్రీశైలం జలాశయాల నుండి 90 టిఎంసిలను పొందవచ్చు. దీన్ని పులిచింతల ప్రాజెక్టుకు కేటాయించవచ్చు. గోదావరి జలాలను లింకు కాలువల ద్వారా కృష్ణాకి మళ్లించవచ్చు. ఆ మేరకు కృష్ణాజలాలను లింకు కాలువల ద్వారా రాయలసీమకు మళ్లించవచ్చు. అయితే ఈ మళ్లింపు గోదావరి నదిపై చిన్న, చిన్న ప్రాజెక్టులు నిర్మించడం ద్వారానే జరగాలి. ఆదివాసీలకు తీవ్ర నష్టం కల్గించే పోలవరం ప్రాజెక్టును వ్యతిరేకించాలి. గోదావరి ద్వారా లభించే 1495 టిఎంసిలలో కేవలం 700 టిఎంసిలను మాత్రమే ప్రస్తుతం వాడుకుంటున్నారు. మిగిలినదంతా సముద్రంలో కలిసిపోతుంది. అలాగే వరద జలాలను కూడా కలుపుకుంటే గోదావరి నీరు సుమారు 3000 టిఎంసిల వరకు సముద్రంలో కలుస్తోందని గోదావరి జలాల వివాద ట్రిబ్యునల్ పేర్కొంది. మున్నేరు-పులిచింతల రిజర్వాయర్ ఏర్పాటు గావించడంలోను 30 టిఎంసిల మున్నేరు నది జలాలను పులిచింతల ప్రాజెక్టుకు మళ్లించాలనే ఉద్దేశ్యం ఉంది. దమ్ముగూడెం - నాగార్జున సాగర్ టైల్‌పాండ్ ప్రాజెక్టులోను 165 టిఎంసిల గోదావరి నీళ్లను మళ్లించాలని ప్రతిపాదించబడింది. ఇందులో 100 టిఎంసిలను రాయలసీమకు శ్రీశైలం రిజర్యాయర్ ద్వారా కేటాయించాలనే డిమాండ్ ఉంది. 50 టిఎంసిల గోదావరి నీళ్లను

కంతనపల్లి నుండి శ్రీశైలం ద్వారా రాయలసీమకు తరలించాలనే డిమాండ్ ఉంది. వీటన్నిటికి 20,000 కోట్ల రూపాయల ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది. మొత్తంగా 300 టిఎంసిల నీటిని రాయలసీమ ప్రాంతానికి ఇవ్వవలసిన అవసరం ఉంది. గోదావరి జలాలను క్రిష్ణకు అటునుండి పెన్నాకు తరలించాలని, ఆ మేరకు జాతీయస్థాయి స్కీమును ఒకటి అమలుచేసి దాన్ని కేంద్రమే నిర్మించాలనే డిమాండ్ రాయలసీమ వాసుల నుండి వస్తోంది.

రాయలసీమలో తలసరి సగటు విద్యుత్ వినియోగం 748 యూనిట్లు గా ఉంది. 1898 మెగావాట్ల విద్యుచ్ఛక్తి మాత్రమే రాయలసీమకు అందుబాటులో ఉండగా, 4326 మెగావాట్లు తెలంగాణకు, 5577 మెగావాట్లు కోస్తాకు అందుబాటులో ఉంది. కోస్తాకు గ్యాసు ద్వారా మరో 2747 మెగావాట్లు అందుబాటులోకి వస్తోంది. 2018 నాటికి రాష్ట్రంలో విద్యుశ్చక్తి ఉత్పాదన పెంపుదలలో భాగంగా రాయలసీమకు 4 శాతం కేటాయిస్తే, తెలంగాణకు 47 శాతం, కోస్తా ఆంధ్రకు 49 శాతం కేటాయించారు. అలాగే ప్రైవేటు విద్యుచ్ఛక్తి ఉత్పాదనను వైజాగ్ (1040 మె.వా), రామగుండం (600 మె.వా)లో అందుబాటులోకి తెస్తున్నా రాయలసీమలో ఎటువంటి కేటాయింపులు జరపలేదు. 2005 జలయజ్ఞంలో భాగంగా ప్రతిపాదించిన హంద్రీనీవా, గాలేరు నగరి, వెలిగొండ ప్రాజెక్టులలో 60 మీటర్ల నుండి 300 మీటర్ల వరకు నీళ్లను లిఫ్ట్ చేయాల్సి వస్తుంది. దీనికి కనీసం 800 మె.వా విద్యుచ్ఛక్తి అవసర మవుతుంది. రాయలసీమ విద్యుత్ అవసరాల కోసం కొన్ని ప్రతిపాదన లను వివిధ వర్గాల వారు ప్రభుత్వం ముందర ఉంచారు. అందులో చిత్తూరు జిల్లాలోని మన్నవరం ప్రాంతంలో 800 మె.వా సామర్థ్యంతో 4 యూనిట్లను ప్రారంభించాలని, దీనికి దగ్గరగా కృష్ణపట్నం ఓడరేవు ఉండడం వల్ల రవాణాకు సులభంగా ఉంటుందని భావిస్తున్నారు. రాయలసీమ థర్మల్ పవర్ ప్రాజెక్టులో అదనంగా 600 మె.వా మరో యూనిట్‌ను నెలకొల్పాలని డిమాండు చేస్తున్నారు. వీటికి సూమారు 19,000 కోట్ల రూపాయల ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది. రాష్ట్రంలో 48.5 మె.వా పవన విద్యుత్ సామర్థ్యం గల ఉత్పత్తిని చేస్తున్నారు. 2016 నాటికి దీన్ని 600 మె.వా వరకు పెంచాలని యోచిస్తున్నారు. ఇందులో 60 శాతం అంటే 360 మె.వా సామర్థ్యంతో పవన విద్యుత్‌ను రాయలసీమలో నెలకొల్పాల్సి ఉంది. ప్రస్తుతం రాయలసీమలో సోలార్ విద్యుచ్ఛక్తి 50 మె.వాకే ఉంది. 2016 నాటికి అదనంగా 500 మె.వా సోలార్ విద్యుత్ ప్లాంట్లను రాయలసీమలో ఏర్పాటు చేయాలి.

రాయలసీమలో ప్రభుత్వ గణాంకాల మేరకు ఆస్‌బెస్టాస్-2.5 లక్షల టన్నులు, బైరటీస్ - 6.5 మిలియన్ టన్నులు, చైనా క్లే -39.92 టన్నులు, డోలమైట్-1.7 మిలియన్ టన్నులు, డైమండ్-1 లక్ష మిలియన్ టన్నులు, గ్రీన్ క్వార్ట్జ - 50,000 టన్నులు, ఐరన్ ఓర్ -263 మిలియన్ టన్నులు, లైమ్‌స్టోన్-20 వేల మిలియన్ టన్నులు, సిలికా శాండ్-10 మిలియన్ టన్నులు, స్టీలైట్-4 మిలియన్ టన్నులు ఉన్నట్లు తెలిపారు. దీన్ని బట్టి ప్రభుత్వం వందల సంఖ్యలో తన ఆధ్వర్యంలో కర్మాగారాలను నిర్మించి పెద్ద ఎత్తున ఉపాధిని కల్పించవచ్చు. వీటిని ప్రైవేటు పరం చేయకుండా ప్రభుత్వం ఆధ్వర్యంలోనే కర్మాగారా లను నెలకొల్పాలి. ప్రస్తుతం 1,22,897 మందే చిన్న, మధ్యతరహా పరిశ్రమలలో ఉపాధి పొందుతున్నారు. చేనేత రంగాన్ని పెద్ద ఎత్తున విస్తరించాలి. సిమెంట్, టైల్స్, గ్రానైట్, కాల్షియం, ఆటోమొబైల్స్ తదితర పరిశ్రమలు సీమలో 300 మించిలేవు. రైల్వే లైన్లు, నాలుగులైన్ల రహదారులు సీమలో ఏర్పాటు చేయాలి. వ్యవసాయ, వైద్య, ఆయుర్వేద, ఫైన్ ఆర్ట్స్ యూనివర్శిటీలను ఏర్పాటు చేయాలి. రైతులకు, చేనేత కార్మికులకు ఉచితంగా పది సంవత్సరాల పాటు మౌలిక సౌకర్యాలను కల్పించాలి. పౌరహక్కులకు హామీ ఇవ్వడానికి రాజ్యహింసను తగ్గించే విధంగా ఒక స్వతంత్ర కమిటీని ఏర్పాటి చేయాలి. సీమలోని మేధావులు కూడా విభజన సందర్భంలో సీమ ప్రాంతాన్ని అభివృద్ధి చేయడానికి తగిన సూచనలు, ప్రణాళికలను సిద్ధం చేయాల్సిన అవసరం ఉంది. కోస్తాతో పాటు రాయలసీమకు ఒక రాజధానిని ఏర్పాటు చేయాలి. ఈ సందర్భాన్ని రాయలసీమ ప్రయోజనం కోసం ఉపయో గించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. లేనిపక్షంలో మేధావుల మౌనం సీమకు శాపంగా మారక తప్పదు. ఈ సందర్భంగా సీమవాసులు పెడ్తున్న కింది డిమాండ్లను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పరిగణలోనికి తీసుకొని పరిష్కరించాల్సిన అవసరం ఉంది.

1. శ్రీబాగ్ ఒడంబడిక (16.11.1937)ను వెంటనే అమలు చేయాలి.
2. చిత్తూరు జిల్లా మన్నవరంలో 800 మెగావాట్ల సామర్థ్యం గల విద్యుత్ కేంద్రాన్ని ప్రభుత్వం ఆధ్వర్యంలో నెలకొల్పాలి. (థర్మల్ విద్యుత్ కేంద్రాలను చాలామంది వ్యతిరేకిస్తున్నారు. దానికి ప్రత్యామ్నాయ పద్ధతిలో విద్యుత్ ఉత్పత్తిని తయారు చేయాల్సిన అవసరం ఉంది. నిర్వాసితుల్ని చేసే ఎటువంటి అభివృద్ధినైనా వ్యతిరేకించవల్సిందే).
3. కడపలో మరో 600 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తికి యూనిట్లను నెలకొల్పాలి.
4. కడప జిల్లాలోని బ్రాహ్మిణి స్టీల్ కర్మాగారాన్ని ప్రభుత్వమే నడిపి, ఇక్కడ లభించే మిలియన్ టన్నుల ఐరన్ ఓర్‌ను ప్రభుత్వ కర్మాగారాలకు వినియోగించాలి.
5. 1.5 కోట్ల జనాభా గల రాయలసీమకు జాతీయస్థాయిలో నీటి పారుదల, విద్యుత్, పారిశ్రామిక ప్రాజెక్టులను కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో వెంటనే ఏర్పాటు చేయాలి.
6. కృష్ణా జలాల నుండి మొత్తం 300 టిఎంసిల నీళ్లను రాయలసీమ కు కేటాయించాలి. ప్రస్తుతం 115.90 టిఎంసిల నీళ్లనే కేటాయిస్తున్నారు.
7. పాలమూరు-కర్నూలు మధ్య ఉన్న ఆర్‌డిఎస్ వివాదాన్ని పరిష్కరించే దిశగా కృష్ణా ఇంప్లిమెంటేషన్ బోర్డు చిత్తశుద్ధితో పనిచేయాలి.
8. పోతిరెడ్డిపాడు రెగ్యులేటరును 44,500 క్యూసెక్కుల నీటిని తీసుకునే విధంగా ఏర్పాటు చేశారు. వరద ప్రవాహం వచ్చే 30 రోజుల్లో 120 టిఎంసిల నీటిని తీసుకోవాలనే ఉద్దేశ్యంతో పోతిరెడ్డిపాడుని వెడల్పు చేశారు. కాని దీన్ని తెలంగాణ, కోస్తా రాజకీయ నాయకులు అడ్డగిస్తున్నారు. పోతిరెడ్డిపాడుకు నీరు అందాలంటే శ్రీశైలం రిజర్వాయర్ నీటి మట్టం కనీసం 854 అడుగులు ఉండాలి. ఆ మేరకు జీవో 107ను ప్రభుత్వం విడుదల చేసినా, దాన్ని జివో. 233 ద్వారా రద్దు చేశారు. రాయలసీమను ఎడారి చేసే జివో233ని రద్దు చేసి, జీవో 107ని అమలు చేయాలి.

9. శ్రీశైలం పై భాగంలో రెండు రిజర్వాయర్‌లు నిర్మించాలి. కృష్ణా నీటిని డెల్టా ప్రాంతానికి 54 టిఎంసిలు ఇస్తున్నారు. ఇందులో వృథా అవుతున్న 20 టిఎంసిల నీటిని వాడుకునేందుకు భావనాసి నదిపై ప్రాజెక్టు నిర్మించాలి. అలాగే 50 టిఎంసిల సామర్థ్యంతో సిద్ధేశ్వరం వద్ద ఒక ప్రాజెక్టును నిర్మించాలి. ఇందులో 30 టిఎంసిలను కోస్తా, తెలంగాణకు వాడుకున్నా, మిగిలిన 20 టిఎంసిల నీటిని రాయలసీమకు తరలించొచ్చు.
10. హంద్రీ-నీవా సుజల స్రవంతికి 40 టిఎంసిల మిగులు జలాలను కేటాయించారు. కాని దానికి నికర జలాలను కేటాయించాలి.
11. కృష్ణా డెల్టాను ఆధునీకరించి 29 టిఎంసిలను ఆదా చేయవచ్చు. ఈ నీటిని రాయలసీమకు కేటాయించాలి.
12. క్యారీఓవర్‌తో నాగార్జునసాగర్, శ్రీశైలం జలాశయాల నుండి 90 టిఎంసిలను పొందవచ్చు. ఈ నీటిని రాయలసీమకు కేటాయించాలి.
13. ఆదివాసీ ప్రాంతాలను కనుమరుగు చేసే పోలవరం ప్రాజెక్టు నిర్మాణాన్ని వెంటనే ఆపివేయాలి.
14. బచావత్ అవార్డు ప్రకారం రాష్ట్రంలో నీటిని తిరిగి పంపిణీ చేయాలి.
15. పులిచింతల ప్రాజెక్టులో వరద జలాలను నిలువ చేసుకుని, తద్వారా మిగిలే నికర జలాలలో 54 టిఎంసిల నీటిని సీమకు కేటాయించాలి.
16. కృష్ణా డెల్టా, నాగార్జునసాగర్ కుడి, ఎడమ కాలువల నీటిని పొదుపు చేయడం ద్వారా 131 టిఎంసిల నీటిని సీమకు ఇవ్వాలి.
17. వరద జలాల ఆధారంగా నిర్మించ తలపెట్టిన ప్రాజెక్టులు, హంద్రీ-నీవా(40 టిఎంసిలు), గాలేరు-నగరి(38 టిఎంసిలు), కెసి.కెనాల్ సప్లిమెంటు (10 టిఎంసిలు), వెలిగొండ ప్రాజెక్టు (43.5 టిఎంసిలు), అనగా మొత్తం 131.5 టిఎంసిల నికర జలాలను తక్షణమే కేటాయించాలి.
18. కె.సి.కెనాల్ స్థిరీకరణకు 20 టిఎంసిల సామర్థ్యంతో గుండ్రేవుల రిజర్వాయర్ నిర్మాణంను చేపట్టాలి.
19. రాయలసీమలో వున్న వేల చెరువులను పునరుద్ధరించాలి. ఆక్రమణకు గురైన చెరువులను ప్రభుత్వం తమ అధీనంలోకి తీసుకుని వాటి పూడిక తీయించాలి.
20. సీమలో మూతపడిన అనేక కర్మాగారాలను ప్రభుత్వం చొరవ చూపి తెరిపించాలి.
21. పరిపాలనా సౌలభ్యం కొరకు, అధికార వికేంద్రీకరణకు రాయలసీమలోని 4 జిల్లాలను పది జిల్లాలుగా ఏర్పాటు చేయాలి.
22. విశ్వవిద్యాలయాలను, పశు, వ్యవసాయ, వైద్య విశ్వవిద్యాలయాలను జనాభా ప్రాతిపదికన ఏర్పాటు చేయాలి.
23. ఎర్ర చందనం అభివృద్ధికై జాతీయ స్థాయి పరిశోధనా కేంద్రాన్ని సీమలో ఏర్పాటు చేయాలి. ఎర్ర చందనాన్ని ప్రభుత్వమే మార్కెట్ చేసి, ఆ నగదును సీమ అభివృద్ధికి వాడాలి.
24. రాయలసీమలో 400 మెగావాట్ల సామర్థ్యంతో పవన విద్యుత్‌ను నెలకొల్పాలి.
25. 2016 నాటికి అదనంగా 500 మెగావాట్ల సోలార్ విద్యుత్ ప్లాంట్లను రాయలసీమలో ఏర్పాటు చేయాలి.
26. సీమలో ప్రస్తుతం కొనసాగుతున్న చిన్న, మధ్య, భారీ పరిశ్రమలు 300 మాత్రమే ఉన్నాయి. వీటిని మరో 400 వరకు పెంచే విధంగా సీమలో లభ్యమవుతున్న బైరటీస్, చైనా క్లే, డైమండ్, డోలమైట్, సున్నపురాయి, గ్రీన్ క్వార్ట్జ, ఐరన్‌ఓర్, లైమ్‌స్టోన్, సిలికా శాండ్, స్టీటైట్, ఆస్‌బెస్టాస్ ఖనిజాలను ఆధారంగా చేసుకుని పరిశ్రమలు నిర్వహించే విధంగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి.
27. పలు రైల్వేలైన్లు, నాలుగు లైన్ల రహదారులను ఏర్పాటు చేయాలి.
28. రైతులకు, చేనేత కార్మికులకు మౌలిక సౌకర్యాలను ఉచితంగా 10 సంవత్సరాలు పాటు ప్రభుత్వం కల్పించాలి.
29. రైతుల వద్ద ధాన్యాన్ని ప్రభుత్వమే కొని, వారికి గిట్టుబాటు ధరను కల్పిస్తూ, 70 శాతం సబ్సిడీలను ఇవ్వాలి.
30. సీమలోని నాలుగు కేంద్రాలను రాజధాని స్థాయిలో అభివృద్ధి చేయాలి. సీమలోనే రాష్ట్ర రాజధానిని ఏర్పాటు చేయాలి.
31. ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీ విద్యార్థులకు ఉచిత విద్యను ఎల్‌కేజీ నుండి పిజీ వరకు ఇవ్వాలి.
32. సీమలోని ఉద్యోగ అవకాశాలను సీమ ప్రజలకే ఇవ్వాలి.
33. రైతు ఆత్మహత్యలకు పరోక్షంగా కారకులైన వారిపై 302 కింద హత్యానేరం మోపాలి.
34. ఎస్‌సి, ఎస్‌టి, బిసి సబ్‌ప్లాన్‌లకు చట్టబద్ధతను కల్పించి, వాటికి తగినమేరకు నిధులు కల్పించి, ఆ నిధులను వాటికే ఖర్చు చేయాలి.
35. రాజకీయ నాయకులు, ఫ్యాక్షన్ నాయకులు అక్రమంగా ఆక్రమించిన లక్షల ఎకరాలను ప్రభుత్వం స్వాధీనపర్చుకుని భూమిలేని నిరుపేదలకు కేటాయించాలి.
36. మావోయిస్టులపై నిషేధాన్ని ఎత్తివేయాలి.
37. భూసంస్కరణలను అమలు జరపాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# తెలంగాణ పునర్నిర్మాణ సమస్యలు

***నాలుగు దశాబ్దాలు ఉద్యమం చేసి సాధించుకున్న తెలంగాణ రాష్ట్రంలో మళ్లీ అసమ అభివృద్ధి, హక్కుల హననం జరిగినా, అవే సమస్యలు పునరావృతం అయినా ప్రజలు తిరిగి ఉద్యమ బాట పడతారని పాలకులను హెచ్చరిస్తున్నారు ఎల్. అరణ్య***

గతితర్కం ప్రకారం అంతిమంగా న్యాయమే గెలుస్తుంది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఒక న్యాయబద్ధమైన డిమాండ్ అవడం వల్ల తప్పకుండా ఆ డిమాండ్ నెరవేరి తీరుతుంది. నాలుగేళ్ల దోబూచులాటలు, ఇంకా చెప్పాలంటే నలభై నాలుగేళ్ల మోసాల తర్వాత కాంగ్రెస్ తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా చేయాలనుకుంటున్న చిత్తశుద్ధిని కాంగ్రెస్ గత చరిత్ర తెలిసిన వాళ్లెవరూ ఈ రోజు నమ్మలేరు. ఆ డిమాండ్‌కున్న న్యాయ లక్షణం రీత్యా తెలంగాణ రాష్ట్రం ఏర్పడక మానదు. అయితే ఏర్పడబోయే తెలంగాణ రాష్ట్రంలో అధికారంలో ఉండే పార్టీ కాంగ్రెస్ అయినా, టిఆర్ఎస్ అయినా, మరేదైనా సమైక్యపాలన కంటే మెరుగైన పాలన అందిస్తే గాని, ప్రజల సమస్యలకు గుణాత్మక పరిష్కారాలు చూపితేనే గాని తెలంగాణ రాష్ట్రం సాధించుకున్న సంతృప్తి ప్రజలకు కలగబోదు.

అయితే ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజకీయ పార్టీలు ప్రజల సమస్యలకు సంపూర్ణ పరిష్కారాలు చూపిస్తాయని ఆశించే వారి పట్ల తర్వాత జాలిపడదాం. కానీ, ఆ వ్యవస్థలోనే ఉండే ప్రజలు, ఆ వ్యవస్థలో భాగంగానే ఒక రాష్ట్రాన్ని ఆ వ్యవస్థ సరిహద్దులు చెదరకుండా చేసిన ఉద్యమాల ద్వారానే సాధించుకున్నప్పుడు, ఏర్పడ్డ కొత్త రాష్ట్రం ఆ వ్యవస్థనే తన పరిపాలనా వ్యవస్థ స్వీకరించబోతున్నప్పుడు, కనీసం ఆ వ్యవస్థ గీసిన హద్దులకు లోబడైనా సరే ప్రజల సమస్యలకు పరిష్కారం దొరకడం అనే మార్పు కనీసంగానైనా జరగకపోతే పాత కొత్తలకు ఏమీ తేడా ఉండని పరిస్థితి ఏర్పడుతుంది. అది ఒక దీర్ఘకాలంలో అతి పెద్ద ప్రజా బాహుళ్యాలు తమ భవిష్యత్ నిరసనలను ఉద్యమాల రూపంలోకి మార్చడానికి సుముఖత చూపని నిరాశా పరిస్థితిని సృష్టించే ప్రమాదాన్ని తెచ్చి పెడుతుంది.

అందుకే అసలు తెలంగాణ రాష్ట్రంలో కొత్తగా ఏర్పడబోయే సమస్యలేమిటి? లేదా ఇప్పటికే అవిభాజ్య రాష్ట్రంలో ఉన్న సమస్యలు తెలంగాణ రాష్ట్రంలో ఏ విధంగా కొనసాగబోతున్నాయి? వాటిని పాలకులు ఎలా పరిష్కరిస్తారు? ఆ పరిష్కారాల కోసమై ప్రజలు తమ డిమాండ్లను ఏ విధంగా ప్రభుత్వాల ముందుంచుతారు? అనేవి తెలంగాణ పునర్నిర్మాణ సందర్భంలో చాలా మౌలికంగా ఎదురయ్యే ప్రశ్నలు. వీటికి సమాధానాలు వెతికితే గాని పునర్నిర్మాణ ప్రక్రియను అర్థం చేసుకోలేం.

తెలంగాణ రాష్ట్రానికి సంబంధించిన తక్షణ భౌతిక సమస్యల గురించి చూస్తే భూమి సమస్య అతి ప్రధానమైనది. తెలంగాణలోని వేల, లక్షల ఎకరాలు ఇవాళ అన్యాక్రాంతమైపోయి ఉన్నాయి. భూస్వాములు, పెట్టుబడిదారులతో పాటు సామ్రాజ్యవాద ఏజెంట్ల దాకా అనేకులు ఈ భూముల యజమానులై ఉన్నారు. పీపుల్స్‌వార్ పార్టీ శాంతి చర్చల సందర్భంగా పేర్లతో సహా ఈ భూ ఆక్రమణలను సవివరంగా బయట పెట్టింది. భూ యజమాన్యాలను మార్చాలని డిమాండ్ చేసింది. భూసంస్కరణలను, చట్టాలను అతిక్రమించి మరీ ఇప్పటికీ వందలాది ఎకరాల భూములను కలిగి ఉన్న వాళ్లున్నారు. ఆ వివరాలన్నీ సులువుగానే తెలుసుకోవచ్చు. ఇప్పుడు ఆ భూము లన్నింటినీ పేదలకు పంచాల్సిన అవసరముంది. అసలు ఎవరికి భూమి అవసరమనే మౌలిక ప్రశ్నకు సమాధానం వెతికి ఆ ప్రాతిపదికన భూపంపిణీ చేయాలి. సంపన్నులను, పేదలను ఒకే గాటనకట్టి సమన్యాయం అంటూ చేసే భూపంపిణీ సరైంది కాదు. పేదవానికి, దున్నే వానికి భూమి అనేది భూ పంపిణీకి న్యాయబద్ధమైన ప్రాతిపదిక అంశం. ఈ పని జరగడానికి గాను భూ సమస్యపై ఉద్యమిస్తూ వస్తున్న సంస్థల, వ్యక్తుల మార్గదర్శకాల మేరకు శాస్త్రీయమైన, నిష్పాక్షికమైన మౌలిక భూసంస్కరణల చట్టాన్ని తేవాల్సిన అవసరముంది.

ఇక మరో ప్రధాన సమస్య నీటి సమస్య. అవిభాజ్య రాష్ట్రంలో నీటి దోపిడీ జరిగిందనీ, ప్రాజెక్టుల నిర్మాణం జరగలేదనీ ఎలాగైతే ఆరోపిస్తున్నామో ఆ లోపాలు తెలంగాణ రాష్ట్రంలో ఎలా పూడ్చు కుంటారో ఒక ప్రణాళిక తప్పనిసరిగా ఏర్పాటు చేసుకోవాలి. ఎందుకంటే నీరు మానవ జీవితంలో అతి ప్రధానమైన అభివృద్ధి వనరుగా మారిపోయింది కనుక. ట్రిబ్యునల్ అవార్డులకు లోబడే అయినా ఇక్కడి పది జిల్లాలలో నీటిని సమానంగా పంపిణీ చేయాలి. లేకుంటే అతి తక్కువ కాలంలోనే ఈ పది జిల్లాల్లోనే కొన్ని అసంతృప్తి దిశగా వెళ్లే ప్రమాదముండవచ్చు. అలాగే వీలైనంత త్వరగా అవసరమున్న చోట్ల ప్రాజెక్టులు కట్టాల్సిన అవసరముంది. శ్రీరాంసాగర్, ఇచ్చంపల్లి, ఎల్లంపల్లి తదితర ప్రాజెక్టులను వెంటనే పూర్తి చేయాలి. ఎత్తిపోతల పథకాలను కూడా వెంటనే చేపట్టాలి. తాగు, సాగు నీరు ప్రజలకు చేకూరే విధంగా అవసరమైన నీటి సంరక్షణ, నిర్వహణల కోసం అత్యావశ్యక ప్రణాళికలను వెంటనే సిద్ధం చేసుకోవాల్సి ఉంది. అలాగే ప్రత్యామ్నాయ నీటి వనరులనూ పునరుద్ధరించాలి.

1969 ఉద్యమం తర్వాత 1972 నుంచీ వలస వచ్చిన వాళ్లు పరిశ్రమల పేరిట హైదరాబాద్‌లో పెట్టుబడులు పెట్టిన వాళ్లు దాని చుట్టూరా ఉన్న అనేక చెరువులను పూడ్చి భవనాలు కట్టారు. అలాగే నూతన ఆర్థిక విధానాల పుణ్యమా అని తెలంగాణ అంతటా చెరువులు, కుంటలు, బావులు ధ్వంసం చేయబడ్డాయి. వాటిని కనీసం ఇప్పుడైనా పునర్నిర్మించుకోవాలి. అలాగే సాగునీరు అందని అనేక మంది రైతులు బోరు బావుల మీద ఆధారపడి, అవి ఎండిపోతే, మోటర్లు కాలిపోతే దిక్కుతోచక ఆత్మహత్యలు చేసుకున్నారు. జల విద్యుత్ కేంద్రాలున్న తెలంగాణలో అమలైన రైతు వ్యతిరేక విధానాలను సరిచేసుకోవడం పెద్ద కష్టమేమీ కాదు.

వ్యవసాయం విషయానికి వస్తే తెలంగాణలో నూతన వ్యవసాయ విధానాన్ని అమలు పరచాల్సిన అవసరముంది. కనీస గిట్టుబాటు ధరలకు కూడా నోచుకోని తెలంగాణ రైతాంగం తెలంగాణలో వ్యవసాయం పేరిట చేసిన విఫల ప్రయోగాలకు లెక్కలేదు. ఒక ప్రాంతానికి వ్యవసాయం కాసులు సంపాదించి పెడితే, తెలంగాణ రైతులకు పురుగు మందును నోటికందించింది. ఈ అసమ వ్యవసాయ విధానం కొత్త రాష్ట్రంలో అమలు కాకుండా, నూతన శాస్త్రీయ వ్యవసాయ విధానాన్ని కొత్త పాలకవర్గాలు ప్రకటించాల్సి ఉంది. అన్నింటికంటే ముఖ్యంగా పంట భద్రత భరోసాను రైతుకు అందించాలి. దున్నే వారికే భూమిని అప్పగించి వ్యవసాయాన్ని వ్యాపారంగా కాకుండా సామాజిక బాధ్యతగా నిర్వహించే విధంగా భూ-వ్యవసాయ సంబంధాలను మార్చివేయాలి.

పారిశ్రామిక రంగంలో కూడా తెలంగాణ చాలా అన్యాయానికి గురైంది. తెలంగాణకు ఆదాయం, ఉద్యోగాలు, ఉత్పత్తులు సమ కూర్చిన అనేక పరిశ్రమలు మూతపడ్డాయి. వరంగల్ అజంజాహి స్పిన్నింగ్ మిల్స్, హైదరాబాద్ ఆల్విన్, సిర్పూర్ సర్‌సిల్క్ వంటి పరిశ్రమలు మూతపడి ఎందరో రోడ్డున పడ్డారు. ఒక్క ఆల్విన్ మూతవల్ల పదిహేను వేల మంది కార్మికులు ఉపాధి కోల్పోయారు. పేద కార్మికులు పనిచేసే ఇలాంటి పరిశ్రమలను మూసేసి, యంత్రాలతో నడిచే, లాభాలు తెచ్చే అనేక పరిశ్రమలకు గాను ఆంధ్ర వలస పెట్టుబడిదారులకు మాత్రం నీరు, కరెంటులను దాదాపు ఉచితంగా ఇచ్చి మరీ అనుమతులిచ్చిన అన్యాయాన్ని మనం చూసే ఉన్నాం. కనుక పరిశ్రమల విషయంలో కూడా ఒక నూతన విధానం అవసరం. పాత పరిశ్రమలను ఇపుడు కొత్త పాలకులు తెరిపించాల్సి ఉంది. తమ పరిధిలో ఉన్న వాటిని నేరుగా తెరిచి, లేని వాటిని తెరిపించడం కోసం ముమ్మర ప్రయత్నాలు చేయాల్సి ఉంది. ఇక ముందు నిర్వహించబోయే పారిశ్రామిక విధానం లోపరహితంగా ఉండాలి. ఎందుకంటే తెలంగాణ అనేక ఖనిజాలతో కూడిన ప్రాంతం. ఇప్పటికే ఆ ఖనిజాలను అనేక రకాల దొంగ అనుమతులతో ఎవరెవరో దోచి ఉన్నారు. ఇంకా దోచుకుపోతున్నారు. కరీంనగర్ జిల్లాలో గ్రానైట్ దోపిడీ దీనికి మంచి ఉదాహరణ. తెలంగాణ అంతా మైనింగ్‌తో బొందల గడ్డగా మారుతోంది. మరోవైపు ఓపెన్ కాస్ట్‌తో బొగ్గు తీయడం వల్ల అనేక గిరిజన, పేదల గ్రామాలు ఖాళీ అవుతున్నాయి. కొత్త పాలకులు ఓపెన్‌కాస్ట్‌ను ఆపి, పాత పద్ధతిన బొగ్గు తీసేలాగా ఒత్తిడి తేవాలి. అలాగే ఇసుక అక్రమ రవాణాను, అక్రమ మైనింగ్‌ను నిలిపివేసి కఠిన నిబంధనలు అమలు చేయాల్సి ఉంది. ఇందుకు గాను నూతన పారిశ్రామిక విధానమే శరణ్యం.

ఇక తెలంగాణలో వైద్యాన్ని కూడా అభివృద్ధి చేయాల్సిన అవసర ముంది. ఈ రోజు చిన్న జ్వరానికి కూడా ప్రభుత్వ ఆసుపత్రులలో మందులు దొరకని పరిస్థితి ఉంది. ప్రభుత్వం తనంత తానుగా ప్రభుత్వ రంగంలో వైద్యాన్ని నాశనం చేసి ప్రైవేట్ వైద్యానికి, కార్పొరేట్ మల్టీ, సూపర్ స్పెషాలిటీ తరహా వైద్యానికి రాయితీలిచ్చి పోషిస్తోంది. పేద ప్రజలకు వైద్యం అందకుండా చేస్తోంది. కనుక రేపటి తెలంగాణ పాలకులు మొదట ప్రభుత్వ రంగంలో వైద్యాన్ని పునరుద్ధరించాలి. ప్రతి ప్రభుత్వ ఆసుపత్రిని ఏకబిగిన అనేక రెట్లు అభివృద్ధి చేస్తే గాని పేదలకు వైద్యం అందదు. అన్ని రంగాల వైద్య నిపుణులు స్థానికంగా ఆసుపత్రిలోనే ఉండేలా ప్రతి గ్రామ పంచాయితీకి, కనీసం మండల కేంద్రానికైనా అన్ని వసతులతో కూడిన ఒక ప్రభుత్వాసుపత్రిని ఏర్పాటు చేయాలి. ఆరోగ్యశ్రీ లాంటి నిర్లక్ష్య విధానాల అమలు కాకుండా విలువైన ప్రాణాన్ని కాపాడడం అనే బాధ్యతాయుతమైన సేవలు ప్రభుత్వాసుపత్రులలో అందిస్తే చాలు.

అలాగే విద్యా వ్యవస్థను చూస్తే పరిస్థితి చాలా దయనీయంగా ఉంది. ఇప్పుడున్న ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రభుత్వాల తప్పుడు విధానాలతో ప్రభుత్వ రంగంలోని వేలాది పాఠశాలలు మూతపడే దశలో ఉన్నాయి. లోపభూయిష్టమైన పాఠ్య ప్రణాళికలు అమలులో ఉన్నాయి. యాంత్రిక బోధనలతో కూడిన, స్పష్టమైన ప్రణాళికలు లేని, పిల్లలకు స్వావలంబన, స్వయం పోషకత్వం అందించలేని, ఒక మనిషిగా నిలబెట్టలేని విద్యా వ్యవస్థ అమలవు తోంది. ఒకడుగు ముందుకు వేసి చెప్పాలంటే ప్రభుత్వం విద్య నుంచి తప్పుకుంది. పథకాల పేర్లతో ఊదరగొడుతూ తప్పుకోలేదన్నట్లు నటిస్తున్నదంతే. తాను తప్పుకుని ప్రైవేట్, కార్పొరేట్ విద్యా సంస్థలకు విద్యారంగాన్ని అప్పగించింది. అవి ఇవాళ ప్రభుత్వాన్ని నిలబెట్టే, పడగొట్టే శక్తిని సమకూర్చుకున్నాయి. ఒక మాఫియాగా ఎదిగాయి. చివరికి ఇంత శక్తిమంతమైన తెలంగాణ ఉద్యమాన్ని కూడా పంథా మారనివ్వకుండా చేసి ఒకానొక రాజకీయ పక్షం చేతిలో, అధికారపక్షం చేతిలో నిర్ణయాధికారం ఉంచేలాగా తెరవెనుక ఆర్థిక శక్తిగా, ప్రచార శక్తిగా అవి పనిచేశాయంటే బహుశా చాలా మందికి నమ్మశక్యం కాకపోవచ్చు.

ఒక అసాంఘిక శక్తిగా కార్పొరేట్, ప్రైవేట్ విద్యారంగం ఎదిగింది. వాటికనుకూలంగా ఉండే విధానాలతో ప్రభుత్వం అనేకంగా ఇంజనీరింగ్, బిఇడి, డిఇడి కళాశాలలు తెరిచి నిరుద్యోగాన్ని పెంచింది. విద్యారంగాన్ని అస్తవ్యస్తంగా మార్చివేసింది. రేపు తెలంగాణలో ఈ సమస్యలను ఎలా అధిగమించాలి? అనే ప్రశ్నకు సమాధానం వెతుక్కోవాలి. కార్పొరేట్, ప్రైవేట్ విద్యా వ్యవస్థను మొత్తంగా రద్దు పరిచేంత సాహసంతో నూతన పాలక వర్గాలు వ్యవహరిస్తే గాని మళ్లీ విద్యారంగం ఒక గాడిలో పడదు. ఆలోపు ప్రభుత్వం తానే విద్యారంగాన్ని నిర్వహించేలా ఒక్కో అడుగూ వేయాలి. కామన్ పాఠ్య ప్రణాళిక, కామన్ స్కూల్ వ్యవస్థలు ఉన్నతాదర్శాలే కాదు ఆవశ్యకాదర్శాలు. శ్రమతో కూడిన, అసమానతలు తొలగించే ఒక అత్యున్నత విద్యా విధానాన్ని అందించడం చాలా సులువు. చెప్పాలంటే అంతటి సులువైన పనిని నిర్వహించాలనే సంకల్పాన్ని ఏర్పరచుకోవడమే పాలకులకు కష్టతరమైన పని.

ఈ సమస్యలన్నింటితో పాటు జిల్లా వారిగా ఉన్న ప్రత్యేక సమస్యలనూ పరిష్కరించవలసి ఉంది. ఆదిలాబాద్‌లో విషజ్వరాలు, కరీంనగర్‌లో సిరిసిల్ల చేనేతల దుస్థితి, వరంగల్‌లో మాఫియాలు, నిజామాబాద్ గల్ఫ్ వలసలు, మహబూబ్‌నగర్ వలసలు, తాగునీటి కొరత, నల్గొండ ఫ్లోరోసిస్, ఖమ్మంలో గిరిజనుల సమస్యలు, మెదక్‌లో రైతు సమస్యలు, రంగారెడ్డి, హైదరాబాద్‌లలో అక్రమ భూ ఆక్రమణల సమస్యల వంటి ఎన్నో సమస్యలు తీర్చడానికి పూనుకోవాల్సి ఉంది.

ఇక సాంస్కృతిక సమస్యలను చూద్దాం. తెలంగాణ ఉద్యమం ప్రధానంగా ముందుకు తెచ్చిన సమస్య తెలంగాణ భాష, మాండలికం, యాసలు కనుమరుగవడం. ఇప్పటికే మాధ్యమాల ద్వారా, పాఠ్యాంశాల ద్వారా కోస్తాంధ్ర జిల్లాల మాండలికమే ప్రామాణిక తెలుగుగా తెలంగాణ ప్రజలపై ముద్రవేసి ఉన్న నేపథ్యంలో తెలంగాణ భాషను కాపాడుకోవాల్సిన అవసరముంది. అలా జరగాలంటే వాగ్రూపంగా దాన్ని చలామణీలోకి తేవాలి. అలాగే సాహిత్యం, పాఠ్యాంశాలను కూడా ఆ దిశగా మార్పు చేయాలి. ప్రామాణిక భాషలో కూడా ఆంధ్రవాసనలు

ఉన్నాయనే సాక్ష్యాలు కూడా ఉన్నందున ప్రామాణిక భాషనూ సంస్కరించాలి. అయితే దీనికన్నా ముఖ్యంగా తెలంగాణలోని ఆదిలాబాద్, వరంగల్, ఖమ్మం, కరీంనగర్ జిల్లాలలోని అనేక గిరిజన జాతుల భాషలు అంతరించి పోతున్నాయి. లిపి లేకపోవడం ఒక కారణమైతే, ఆయా జాతులు వాహక అవసరం రీత్యా తెలుగును ఎక్కువగా వాడడం మరో కారణం. ఇప్పుడు తెలంగాణ పాలకులపై ఉన్న ప్రధాన బాధ్యత ఏమిటంటే ఆ గిరిజన భాషలను సంరక్షించడం. వాటికి లిపి తయారు చేయడం. ఆ ప్రాంతాలలో ఆ భాషల్లోనే పాలనా వ్యవహారాలు, విద్యా బోధన, సమాచార ప్రక్రియలు జరగడం. ఆ దిశగా ప్రభుత్వాలు చర్యలు చేపట్టాలి.

తెలంగాణ ఉద్యమంలో భాగంగా కొన్ని అశాస్త్రీయ భావనలు ముందుకు వచ్చాయి. ఆచార వ్యవహారాల ఆత్మపరిరక్షణ పేరిట మన పండుగలు, మన దేవతలు అనే భావనలు ముందుకు వచ్చాయి. అయితే పండుగలు, దేవతలు పూర్తిగా అశాస్త్రీయమైన అంశాలు. వాటికి చారిత్రక ఆధారాలు ఎక్కడా లేవు. పైగా అలాంటి ఆలోచనలు సమాజాన్ని తిరోగమింప చేస్తాయి. పూజలు అవి దేవతల పూజలైనా, వ్యక్తి పూజలైనా ప్రగతిని నిరోధిస్తాయి. చక్కని పూల అలంకరణగా, స్త్రీల సంతోష సమయంలో బతుకమ్మను చూస్తే పర్వాలేదు గానీ దానికి మహిమలు ఆపాదించి, దేవతగా కొలవడమైనా, అందరూ కలిసి గడిపే సందర్భంగా దసరాను చూడడం వరకైతే ఏం లేదు గానీ ఆరోజుకో పవిత్రతను, మహిమను అంటించడమైనా, సమ్మక్క సారలమ్మల వీరోచిత పోరాటాలు, వారి స్ఫూర్తిని పక్కన బెట్టి వారికి మహిమలున్నాయని కొలిచి జాతర్లు చేయడమైనా అలాంటి సంస్కృతులు రేపటి తెలంగాణ రాష్ట్రంలో కూడా కొనసాగితే మాత్రం భావజాల పరంగా అది ప్రమాదకరం. కనుక అలాంటి ఆచార వ్యవహారాల స్థానంలో కొమురం భీము, బందగీ వంటి ఎందరో వీరుల పోరాట గాథలను, త్యాగాలను, బాలగోపాల్ లాంటి ఎందరో స్ఫూర్తిదాయకుల జీవితాలను ప్రచారంలోకి తేవడం ఉపయోగకరంగా ఉంటుంది. అలాగే ట్యాంక్‌బండ్ మీద తెలంగాణ వాళ్ల విగ్రహాలు పెట్టాలని వాదించే వారున్నారు. అసలు విగ్రహాలు పెట్టడమే ఒక తప్పుడు భూస్వామ్య సంస్కృతి. పోరాటాలతో భూస్వాములను తరిమిన తెలంగాణ ఇంకా ఆ సంస్కృతి జాడ్యాన్ని మాత్రం ఎందుకు వదిలించుకోకూడదు? విగ్రహ సంస్కృతిని వదిలించుకోవాలి. పది జిల్లాల వ్యాప్తంగా ఎవరి విగ్రహం లేని తెలంగాణను చూడాలి. వచ్చే పాలకవర్గాలు పండుగలు, విగ్రహాల విషయంలో ఇంత శాస్త్రీయంగా ఉండరు కనుక వారిపై ఆ దిశగా ఒత్తిడి తేవాల్సిన బాధ్యత ప్రజలపైనే ఉంటుంది.

రాజకీయ సమస్యలు కూడా తెలంగాణ రాష్ట్రంలో ముఖ్యంగా పరిష్కరించాల్సినవి చాలానే ఉన్నాయి. మొదటగా సామాజిక కోణంలో చూస్తే తెలంగాణ రాష్ట్రంలో గిరిజనులు, దళితులు, ముస్లింలు, మహిళల పరిస్థితి ఎలా ఉండబోతున్నదనేది సమస్య. గిరిజనుల ప్రాంతాలలో అడవి మీద, భూమి మీద వారికి హక్కు లేదు. వారి అటవీ ఉత్పత్తులకు బయట గిరాకి లేదు. ప్రభుత్వం మద్దతు ధరలూ అందించడం లేదు. పోడు నేరమైపోయింది. మైనింగ్, ఓపెన్ కాస్ట్‌ల పేరిట ఖనిజాలను తవ్వడం కోసం వారిని అడవి నుంచి తరిమేసి బిచ్చగాళ్లను చేశారు. 1/70తో పాటు అన్ని గిరిజన చట్టాలు అమలు జరిగేలా చూస్తేనే గానీ, మరిన్ని కొత్త చట్టాల ద్వారా వారికి రక్షణలు కల్పిస్తే గాని వారి జీవితాలలో వెలుగులు నింపడం సాధ్యం కాదు. అలాగే దళితులపై కుల అణిచివేత, ముస్లింలలో పేదరికం, మహిళలపై లైంగిక, భౌతిక దాడులు వంటి సమస్యలు తెలంగాణ రాష్ట్రంలో పరిష్కరించాలి. అందుకు సంబంధించిన ఒక లక్ష్యం, ప్రణాళిక ఉండాలి.

తర్వాత సమస్య ఏమిటంటే అవిభాజ్య రాష్ట్రంలో పది జిల్లాలను ఒకే గాటన అభివృద్ధి పరచలేదనే కారణం ఎలాగైతే తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి ఒకానొక కారణమైందో, రేపు తెలంగాణ పది జిల్లాలలోని కొన్ని జిల్లాలో, ప్రాంతాలో మళ్లీ అదే కారణంగా అసంతృప్తులకు లోను కాకుండా చేయాల్సి ఉంది. ఉత్తర తెలంగాణ జిల్లాల్లో మిగతా వాటితో పోల్చినప్పుడు వెనకబాటుతనం, పేదరికం, అస్పృశ్యత, భూస్వామ్యం, అణచివేతలు ఎక్కువగా ఉన్నాయి. అభివృద్ధి సమయంలో ఆ జిల్లాలను మిగతా జిల్లాలతో సమానపరిచేలా నమూనాలు రూపొందించుకోవాలి. డబ్బు కేటాయింపు అనేదే కాదు, గుణాత్మకంగా జరిగే అభివృద్ధి సంబంధిత అంశాలలో ఆయా ప్రాంతాలకు ప్రధాన ప్రాధాన్యతలు ఇవ్వాల్సి ఉంటుంది. అలా కాకుంటే ఒక దీర్ఘకాలం తర్వాత అసమ అభివృద్ధి నిరసనలు మరోసారి వెల్లువెత్తితే నూతన తెలంగాణ రాష్ట్ర పాలకులే వారి ముందు దోషులుగా నిల్చోవాల్సి ఉంది.

ఇక మరో సమస్య – తెలంగాణ వ్యాప్తంగా అమలు జరగాల్సిన నూతన అభివృద్ధి నమూనా ఎలా ఉండాలి అనేది. ఇప్పటికే ప్రపంచ బ్యాంక్ విధానాలకు, నూతన ఆర్థిక విధానాల అమలుకు, ప్రపంచీకరణకు ప్రయోగశాలగా తెలంగాణ నష్టపోయినంతగా దేశంలోనే మరే ప్రాంతమూ నష్టపోలేదు. వాటిని ప్రయోగించిన వారి ఏజెంట్లంతా ఆంధ్ర వలస పాలకులే అని ఇప్పటివరకూ సమాధానం చెప్పుకుని తృప్తిపడిన పరిస్థితిని కొత్త రాష్ట్రంలో పాలకులు దాటాల్సి ఉంటుంది. ఆయా విధానాల పుణ్యమా అని తెలంగాణ భూములన్నీ పెద్ద పెద్ద కంపెనీలకు ధారాదత్తం చేయబడ్డాయి. ఫామ్‌హౌజ్‌ల పేరిట వేల ఎకరాల భూములు కారుచౌకగా అమ్మబడ్డాయి. చివరకు అడవులనూ వదలకుండా కవ్వాల్ అభయారణ్యంలో టైగర్‌జోన్ పేరిట గిరిజన చట్టాలను అతిక్రమించి గిరిజనులను నిర్వాసితులను చేసే కుట్రకు ప్రభుత్వాలు పాల్పడడం వెనక ఉన్నవి ఈ విధానాలే. కనుక ఆయా విధానాలు మౌలికంగానే అసమ అభివృద్ధి, పేదరికం, అసమానతలను మరింత ఎక్కువ చేస్తాయనే చైతన్యంతో వ్యవహరించి పాలకులు ఆ విషవలయాల్లోంచి బయటపడితే గాని రేపటి తెలంగాణ అనేక మౌలిక సమస్యల నుంచి గట్టెక్కే దిశగా పోలేదు. అవి ధ్వంసం చేసిన వృత్తులు, వ్యవసాయం, విలువలు, సంస్కృతుల పునర్నిర్మాణం సాధ్యం కాదు.

అలాగే మరో సమస్య – తెలంగాణలో 1956 నుంచీ పౌర హక్కులు, రాజకీయ హక్కులు దారుణంగా అణిచివేయబడ్డాయి. ప్రభుత్వాలూ, వాటి యంత్రాంగాలూ తీవ్రంగా హక్కుల హననానికి పాల్పడ్డాయి. తమకు నచ్చని వారినెవరినైనా ఏదో ఒక పేరుతో చంపి వేసేలాగా చట్టాలు చేసుకున్నాయి. ఇప్పటికీ అవి అమలవుతూనే ఉన్నాయి. ప్రజల హక్కులను కాలరాసే ఏ పార్టీ, ఏ వ్యక్తీ ప్రజల శ్రేయస్సు గురించి ఆలోచించలేరు. ఈ రోజు తెలంగాణ ప్రజల శ్రేయస్సు గురించి ఆలోచించి తెలంగాణ రాష్ట్రాన్ని వారు చెప్పు కుంటున్నట్లు వారే సాధించారనుకుంటే, వారి రాజకీయ పార్టీలు రేపు పాలనలో ఆ శ్రేయస్సుకు ఆధారభూతమైన పౌరహక్కులను ప్రజలకు అందించాల్సి ఉంటుంది. నిజానికి తెలంగాణ ఉద్యమం నుంచి ఇప్పటికే ఈ పాఠాన్ని ఆ పార్టీలు నేర్చుకోవాల్సి ఉండింది. కనుక ప్రజల హక్కుల పునరుద్ధరణ

# తెలంగాణ ప్రజా ఫ్రంట్ అధ్యక్షుడు ఆకుల భూమయ్య

తెలంగాణ ప్రజా ఫ్రంట్ అధ్యక్షుడూ, ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడూ ఆకుల భూమయ్య డిసెంబర్ 24 రాత్రి ప్రమాదంలో మరణించారు. కరీంనగర్ జిల్లా జూలపల్లి మండలం కాచాపూర్ గ్రామంలో 1948లో వ్యవసాయ కుటుంబంలో జన్మించిన భూమయ్య జమ్మికుంట ఆదర్శ కళాశాలలో డిగ్రీ చదువుతున్న రోజులలో తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలోకి, విప్లవ రాజకీయాలవైపు ఆకర్షితులయ్యారు. కంది లచ్చిరెడ్డి, నల్లా ఆదిరెడ్డి, మల్లోజుల కోటేశ్వరరావు, మల్లా రాజిరెడ్డి లతో పాటు పెద్దపల్లి ప్రాంతంలో 1970లలో సాగిన విద్యార్థి, యువజన, రైతాంగ ఉద్యమాలలో పాలుపంచుకున్నారు. ఉపాధ్యాయుడిగా ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్‌ను తెలంగాణ ప్రాంతానికి పరిచయం చేసి ఎపిటిఎఫ్ నాయకుడిగా, అధ్యక్షుడిగా ఎదిగారు. తీవ్రమైన నిర్బంధ పరిస్థితులలో ప్రగతిశీల భావాలను ప్రజలలోకి తీసుకువెళ్లేందుకు ఎపిటిఎఫ్ పక్షాన విద్యా సదస్సులు అనే కొత్త ప్రక్రియను ప్రారంభించారు. ఎపిటిఎఫ్ నుంచి డెమోక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్ ఏర్పడినప్పుడు నాయకత్వ బాధ్యతలు స్వీకరించారు. 1990ల మధ్య నుంచి ప్రారంభమైన మలిదశ తెలంగాణ ఉద్యమానికి నాయకత్వం వహించడంతో పాటు 1998లో ఏర్పడిన తెలంగాణ జనసభకు కన్వీనర్ బాధ్యతలు నిర్వహించారు. 2010లో తెలంగాణ ప్రజా ఫ్రంట్ స్థాపకులలో ఒకరుగా ఉంటూ అధ్యక్షుడు గద్దర్ రాజీనామా చేసిన తరువాత అధ్యక్ష బాధ్యతలు స్వీకరించారు. తత్వశాస్త్రం, రాజకీయార్థశాస్త్రం పాఠాలు చెప్పే అధ్యాపకుడిగానే కాక, వక్తగా, రచయితగా తెలంగాణ భావ వ్యాప్తికీ, విప్లవ భావజాల ప్రచారానికీ ఎంతో కృషి చేశారు.



**వీక్షణంలో అచ్చయిన భూమయ్య వ్యాసాలు**

1. ఎన్నికల అంశంగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం (డిసెంబర్ 2008)
2. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – ఒక పరిశీలన (మే 2009)
3. పరిశోధనకు ఉపయోగపడే వ్యాసాలు (పుస్తక పరిచయం) (జూన్ 2009)
4. స్వయం నిర్ణయాధికారమే పరిష్కారం (ఆగస్ట్ 2010)
5. తెలంగాణ ప్రజా ఫ్రంట్ ఆవిర్భావం (నవంబర్ 2010)
6. తెలుగు ఆలోచనాపరుల అభిప్రాయాలు (మార్చ్ 2011)
7. భగత్‌సింగ్ నుంచి వేలాడుతున్న ఉరితాడు (మే 2013) వీ

జరగకపోతే కొత్త రాష్ట్రం వల్ల ప్రజలకు ఒరిగేదేమీ ఉండకపోవచ్చు.

అలాగే నలభై ఐదేళ్ల నక్సల్బరీ ఉద్యమం తెలంగాణను చాలా ప్రభావితం చేసింది. ఆ స్ఫూర్తితో, ఆ ఉద్యమ ఆవాహనతో ఎందరో చరిత్రను మార్చారు. ఆ మార్పుల కోసం ఎందరో త్యాగాలు చేశారు. ప్రభుత్వాలు మాత్రం వారిని వేటాడుతూ, వారి పేరిట ప్రజలను హింసిస్తూ, తెలంగాణలో శాంతి లేకుండా చేశాయి. ఆ శాంతి నెలకొల్పడం కోసం జరిగిన శాంతి చర్చల ప్రయత్నాలనూ వమ్ము చేశాయి. కనుక నూతన తెలంగాణలో ప్రభుత్వాలు మావోయిస్టు పార్టీపై ఏ వైఖరి తీసుకోబోతున్నాయి? శాంతి చర్చలను కొనసాగిస్తాయా? ఏ వ్యక్తినీ నిషేధించడం సాధ్యం కాదు. వ్యక్తిని వ్యక్తిగా గానీ, పౌరునిగా గానీ నిషేధించే అధికారం ఎవ్వరికీ లేదు. ఫిలాసఫికల్‌గా ఇది ఒప్పుకుని తీరాల్సిన విషయం. కనుక నిషేధాలతో కాకుండా భావజాలాల వాద ప్రతివాదాలతో, చూపిస్తున్న సమస్యలకు పరిష్కారాలతో, పరివర్తనల దిశగా ప్రయత్నించడం ద్వారా ఎదుర్కోవడం సరైన పద్ధతి. ఆలోపు సాధారణ ప్రజానీకం హక్కులను రక్షించేందుకు, అలాగే సమస్యలను తెలుసుకునేందుకు శాంతి చర్చల ఘట్టాన్ని మరల ప్రారంభించి కొనసాగించాల్సిన అవసరం ఉంది. మానవీయ తెలంగాణను నిర్మించుకోవాల్సి ఉంది.

చాలా సంక్షిప్తంగా చెప్తే ఇవీ తెలంగాణ పునర్నిర్మాణంలో ఎదురయ్యే సమస్యలు. నిజానికి ఇవన్నీ చాలా తక్కువ పరిధిలోని సమస్యలు. ఇవి తీరినంత మాత్రానే ప్రజల జీవితాలు మారతాయనే ఆశ ఉండడం అత్యాశే అవుతుంది. అయితే ఒక పరిమిత డిమాండ్ ద్వారా ఏర్పడిన, పాలనా వ్యవస్థ మూలాధారం ఏ మాత్రం మారకుండా కేవలం సరిహద్దులు, పాలించే వ్యక్తులు మాత్రమే మారిన ప్రాంతానికి సంబంధించి పాలించబోయే వ్యక్తులు ఈ మాత్రం సమస్యలు, డిమాండ్లనైనా పరిష్కరిస్తారా? ఆ దిశగానైనా ఆలోచిస్తారా? అనేది కూడా సందేహమే.

ప్రజలు ఉద్యమ పంథా వీడకుండా, చైతన్యంతో ఎప్పటికప్పుడు పోరాడితే గాని పాలకులు ఆ సమస్యలను పరిష్కరించరు. అయితే అవన్నీ తీరినా ఏర్పడే భౌగోళిక తెలంగాణలో ప్రజల జీవితాలు కొంత వరకు మెరుగు పడవచ్చేమో గానీ మౌలికంగా ప్రజా జీవితాలలో మార్పులేమీ రావు. ప్రజల జీవితాలలో మార్పు రావాలంటే పునాదుల్లోంచి, మూలాల్లోంచి మార్పులు రావాలి. దోపిడీ ఆర్థిక సంబంధాలు మారిపోవాలి. అసమానతలు తొలగిపోయే దిశగా ఉద్యమాలు, పోరాటాలు సాగాలి. ఆ పోరాటాల వల్ల ఏర్పడబోయే నూతన వ్యవస్థలో కులమత వర్గ భేదాలు లేని, కట్నాలు, బాల్య వివాహాలు వంటి మౌఢ్యాలు లేని, పేదరికం, మనిషిని మనిషి దోచుకోవడం లేని నూతన సమాజాలు అవతరిస్తాయి. ఇప్పటి పరిమిత డిమాండ్‌లో ఏర్పడే తెలంగాణ రాష్ట్రంలో ఇలాంటి సుదీర్ఘ లక్ష్యాన్ని ఆశించలేం గానీ కనీసం పైన పేర్కొన్న సమస్యల పరిష్కారాలనైనా పాలకులు ప్రజలకు అందించకపోతే పరాయి దొరల బదులు సొంత దొరల మార్పుగా వచ్చిన భారతదేశ స్వాతంత్ర్యాన్ని చీకటి లోంచి చీకటిలోకి అని నిర్వచించుకుంటున్నట్లుగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును కూడా ప్రజలు అలాగే అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. ఆ చైతన్యమే 'పరాయి వాడు దోపిడీ చేస్తే తరిమి కొడతాం, మావాడే దోపిడీ చేస్తే మా దగ్గరే పాతరేస్తాం' అన్న కాళోజీ మాటలను నిజం చేసే దిశగా ప్రజలను మళ్లీ కదిలిస్తుంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# వ్యవసాయ సంక్షోభం - ఆత్మహత్యలు

*దేశంలో అన్నదాతల ఆత్మహత్యల కేంద్రంగా మారిన ఆదిలాబాద్ జిల్లా వ్యవసాయ సంక్షోభాన్ని రూపు మాపాలనీ, ఆదిలాబాద్ జిల్లాను తెలంగాణ ధాన్యాగారంగా మార్చాలనీ అంటున్నారు* **నైనాల గోవర్ధన్, టి. సారయ్య**

ఆదిలాబాద్ జిల్లాలో 2013 డిసెంబర్ 10 వరకు, వరుసగా పదకొండు రోజుల్లో, సూర్యవంశీ నారాయణరావు పటేల్ (55), గుగ్లావత్ మోతీలాల్ నాయక్ (45), కాలేవార్ లక్ష్మణ్ (45), సందూర్ సుదర్శన్ (36), రాథోడ్ రాము (40), నడిపికోట మల్లయ్య (32), కామ్లె నాగోరావు (52), తౌటి హన్మండ్లు (42), అల్లిబిల్లి దత్తు (53), చిర్ర ఎర్రన్న (28) అనే పది మంది అన్నధాతలు ఆత్మహత్యలు చేసుకున్నారు. జిల్లాలో జూలై 7 నుండి డిసెంబర్ 10, 2013 వరకు 61 మంది (ఇందులో ఇద్దరు మహిళలు) అన్నధాతలు ఆత్మహత్యలు చేసుకున్నారు. 2013 జనవరి నుండి నేటి వరకు ఎంతమంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారనేది ప్రభుత్వం బాధ్యతతో ప్రకటించాలి. రెట్టింపు సంఖ్యలో ఉండవచ్చు. 2012లో పోలీసులు ఎఫ్ఐఆర్ నమోదు చేసిన రైతు ఆత్మహత్యలు 85. వాస్తవానికి అంతకంటే చాలా ఎక్కువే. 2011లో 113 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. అన్నధాతల ఆత్మహత్యలు లేని శుభోదయం ఆదిలాబాద్ జిల్లాలో ఉండడం అదృష్టపు, ఆశ్చర్యపు రోజే. దేశంలో ఆదిలాబాద్ జిల్లా అన్నధాతల ఆత్మహత్యలకు కేంద్రం అయింది. కేవలం జూన్–సెప్టెంబర్, 4 నెలలో కురిసిన 1500 మి.మీ.ల అత్యధిక వర్షపాతం వల్ల పత్తి, సోయాబీన్ పంట అంతా మునిగి, జౌకు పట్టి, పెట్టుబడులు బాగా పెరిగి, దిగుబడులు గణనీయంగా తగ్గి, పంటలకు ధరలులేక, అప్పులు పెరిగి, ఆదిలాబాద్ జిల్లా అన్నధాతలు అధిక సంఖ్యలో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. లక్షా 50 వేల ఎక్స్‌గ్రేషియా జి.వో.421 అమలులో అన్ని జిల్లాల కంటే ఆదిలాబాద్ జిల్లా అధ్వాన్నమైన స్థితిలో ఉంది. బాధిత కుటుంబాలు మరణవేదనను అనుభవిస్తున్నాయి. బోత్ ప్రాంతంలో యశ్వంత్‌రావు అనే రైతు అప్పులతో గత సంవత్సరం బలవన్మరణానికి పాల్పడ్డాడు. ఈ సంవత్సరం అధిక వర్షాలతో పంట నష్టపోయి, నెలక్రితం బతుకు బండి సాగించలేక, చేసిన అప్పులు తీర్చలేక, పిల్లలను పోషించలేక ఆయన భార్య చేండ్లోనే ఆత్మహత్యకు పాల్పడింది. ఆత్మహత్యలు చేసుకున్న అన్నదాతల భాదితుల కుటుంబాలలో మళ్లీ 2వసారి బలవన్మరణాలకు పాల్పడే దుస్థితి, జిల్లాలో వ్యవసాయ సంక్షోభపు తీవ్రతకు అద్దం పడుతోంది. ఆదుకోకపోతే ఇంకా జరుగుతాయి.

**సాగునీరు లేదు, వర్షాధార సాగే ప్రధానం – అధిక వర్షాలు, అప్పులు – కరువులు– గిట్టుబాటు ధరలు, – రైతు ఆత్మహత్యలకు కారణం**

జిల్లాలోని పంట భూములకు అన్ని వనరుల ద్వారా, సాగు నీటి కాలువల సౌకర్యం ఉన్న భూమి 2 లక్షల 50 వేల ఎకరాలు మాత్రమే ఉంది. రాష్ట్రంలో, దేశంలో ఎక్కడాలేని విధంగా పత్తిసాగు విస్తీర్ణం ప్రమాదకర స్థాయికి పెరిగింది. అన్నిరకాల ఆహార పంటలను పత్తి పంట తుడిచిపెట్టింది. పత్తిసాగే ఏకైక (మోనో) పంట అయికూర్చుంది. ఆదిలాబాద్ జిల్లాలో వర్షాధారంపై ఆధార పడిన పత్తిసాగు ఏ రాష్ట్రం, దేశంలో లేనంతగా 10 లక్షల ఎకరాలకు పైగా ఉండడం ఈరైతు ఆత్మహత్యలకు ప్రధాన కారణం అయింది. సాగు నీటి మౌలిక సదుపాయాలు, కాలువల అభివృద్ధి లేక, ఉన్న ప్రాజెక్టులు ఆయకట్టు చివరి భూములకు నీరందించక, వరిమడ్లు చెడగొట్టి అనేక సంవత్సరాల నుంచి పత్తి చేన్లు సాగు చేస్తున్నారు. ఈ సంవత్సరం కురిసిన అతి భారీ వర్షాలకు జౌకు పట్టిన పత్తి చేన్లు చెడగొట్టి మళ్లీ వరి పొలాలకు ప్రకృతి బలవంతంగా మళ్లించింది. దీనికి కడెం పాత ప్రాజెక్టే ప్రభల ఉదాహరణ. ఆదిలాబాద్ జిల్లా అన్ని జల వనరుల దుస్థితి ఇంతే. పత్తి పంట అనేక ఇతర ఆహార, ఆదాయన్నిచ్చే పంటలను దాదాపు పూర్తిగా తుడిచిపెట్టడం ఈ ఆత్మహత్యలకు ప్రధాన కారణమైంది.

జిల్లాలో అనేక ప్రాజెక్టులు ప్రారంభించినా, ప్రకటించిన నాటి వాటి సాగునీరు అందించే లక్ష్యాలను ఏ ఒక్క ప్రాజెక్టు ఈనాటికి చేరుకోలేదు. అతిశయోక్తి కాదు కాని, 12 వేల ఎకరాలకు సాగునీరు అందించే లక్ష్యంతో, సుద్దవాగు (బైంసా) గడ్డెన్న ప్రాజెక్టును నాటి ముఖ్యమంత్రి ప్రారంభించి సుమారు దశాబ్దం గడుస్తున్నా ప్రస్తుతం రెండు వేల ఎకరాలకు కూడా సాగునీరు అందించడంలేదు. కాలువలు నిర్మాణం కాకముందే ఆసిఫాబాద్‌లో రు. 450 కోట్లు వెచ్చించి ఆర్భాటంగా ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి 'కొమురం బీం ప్రాజెక్టు' ప్రారంభించారు. నేటికీ ఒక్క అడుగు దూరం కూడా కాలువల నిర్మాణం కాలేదు. ఒక్క ఎకరానికి నీరందించడం లేదు. ఆరు వేల ఎకరాల లక్ష్యం గల ర్యాలి వ్యాగు అరవై ఎకరాలకు నీరందించడం లేదు. నాలుగు వేల ఎకరాల లక్ష్యం గల చెల్లంపెట ఇలా అనేక ప్రాజెక్టులు నిర్మించారు. నాయకుల, అధికారుల డబ్బు సంచులు నిండినయి కాని, ఎండుతున్న ప్రజల భూములకు నీళ్లు రానేరాలేదు. కడెం ఆయకట్టు సగానికి తగ్గింది. వివక్ష వల్ల అందవలసిన శ్రీరాంసాగర్ నీరందదు. ఏనూతన ప్రాజెక్టు ప్రారంభించిన పూర్తిస్థాయి ఆయకట్టుకు నీరందించిన పాపాన పోలేదు. ఖరీఫ్‌లో అధిక వర్షాలకు పంటలు నాశనం కావడం, వేసవిలో పంటలకు అసలు నీరేలేకపోవడం అన్నదాతల ఆత్మహత్యలకు ప్రధాన కారణాలు.

ఆదిలాబాద్ జిల్లా వర్షాపాతం రాష్ట్రంలో అన్ని జిల్లాల కన్నా ఎక్కువ. ఈ సంవత్సరం జూన్ 2013లో సాధారణ వర్షపాతం 200 మి.మీ కాగా, 344.3 మి.మీ అత్యధిక వర్షపాతం పడింది. 72 శాతం అధనంగా పడింది.

వేలాది ఎకరాల్లో సోయాబీన్ చేండ్లో మొక్కలపైనే మొలకలు వచ్చినయి. అతి ఎక్కువ కాలంలో పండే సోయాబీన్ వంగడానికి బదులు, అతితక్కువ కాలంలో పంటనిచ్చే సోయాబీన్ విత్తనాలే విపత్తుకు కారణం. విత్తనం పాలుపోసే సమయానికి వర్షపు నష్టం ఉండదు. అధిక వర్షాల జిల్లా అని తెలిసి ఇలాంటి వంగడాన్ని ఇవ్వడం వ్యవసాయ శాఖ నిర్లక్ష్యాన్ని రుజువు చేస్తోంది. గత సీజన్‌లలో లక్షల ఎకరాల పత్తిపంట జౌకు పట్టి దెబ్బతినగా, తర్వాత వర్షాలు అసలే లేక ఉన్న పత్తిపంట ఎండిపోవడం వల్ల రైతాంగం తీవ్రంగా నష్టపోయింది. ఎడతెరిపిలేని వర్షాల వల్ల గడ్డి పోవడానికి చేసే దౌర కొట్టడానికి వీలులేకుండా పోయింది. గడ్డి పెరిగి అనేక కలుపులు తీయడం వల్ల ఆర్థికంగా రైతాంగం వెన్నువిరిగింది. కూలీ 100, 150 రూపాయల చొప్పున ఒక్క ఎకరాకు వేల రూపాయల ఖర్చులు, పెట్టుబడులు పెరిగాయి. సాధారణ సందర్భాల కంటే అనేక రెట్లు గడ్డి కలుపుల ఖర్చులు పెరిగి చేన్లు చేయలేక వదిలేశారు.

దానికి భిన్నంగా రైతులకు సహకరించి, వ్యవసాయ ఖర్చులు తగ్గించాల్సిన గ్రామీణ ఉపాధి హామీ పథకం, కూలీల కొరతను సృష్టించి, కూలీరేట్ల పెరుగుదలతో రైతుల వ్యవసాయానికి భారమయ్యి పెట్టుబడులను పెంచింది. అలా అని రైతులిచ్చే కూలీ డబ్బులు వారి జీవితావసరాలను తీర్చలేవు. ఎంత మాత్రం సరిసమానం కాదు. ఏ ప్రభుత్వ పథకమైనా వ్యవసాయం రైతుకూలీల అభివృద్ధికి తోడ్పడాలి. అది నెరవేరడంలేదు. ఉపాధిహామిని వ్యవసాయానికి అనుబంధం చేయాలి. అతివృష్టి వల్ల పత్తి తదితర పంటలు తీవ్రంగా నష్టపోతుంటే, అనావృష్టి వల్ల, సాగు నీరు ప్రాజెక్టులు లేక లక్షల ఎకరాల్లో పంటలు ఎండిపోతున్నాయి.

బలవన్మరణం పాలైన రైతు తండ్రీ కొడుకులు బర్ల శంకర్, బీమన్నలు 15 ఎకరాల కౌలు భూమిలో ప్రతి కలుపుకు 30 నుంచి 35 వేల రూపాయలు, 3 నుంచి 4 సార్లు గడ్డి కలుపులు తీశారు. గడ్డి పత్తి కంటె అనేక రెట్లు ఏపుగా పెరిగింది. నిజనిర్ధాణలో 'మేం సాగు చేస్తుంది గడ్డా పత్తా అన్నట్టుగా ఉంది' అన్నారు. లక్షల ఎకరాల్లో కలుపుల ఖర్చు భరించలేక గడ్డితో నిండిపోయి పంట చేండ్లన్నీ రైతులు వదిలేశారు. పెనుగంగ, ప్రాణహిత, గోదావరి దాని ఉపనదుల పరివాహంలో, మధ్యలో జిల్లాలో ఐదు లక్షల ఎకరాల్లో పంటలు నిలువునా మునిగాయి. ఆదిలాబాద్ జిల్లాలో ఉన్నన్ని నదులు, ఉపనదులు, వాగులు, నీళ్లు దక్షిణ భారతదేశంలో మరెక్కడాలేవంటే అతిశయోక్తి కాదు. అతి ఎక్కువ సాగునీరుండి, చివరికి మహబూబ్ నగర్ కంటే అతి తక్కువ సాగునీరు, భూములకు అందుతున్న జిల్లా ఆదిలాబాద్ కావడం, ఈ అభాగ్య జీవుల దురదృష్టానికి, అన్నదాతల ఆత్మహత్యలకు కారణం.

ఇంత పెట్టుబడుల ఖర్చులతో ఏ వ్యవసాయ కుటుంబాలు నిలబడ లేవు. మహాత్మగాంధీ గ్రామీణ ఉపాధి హామీ పథకానికి ఎంతమాత్రం వ్యతిరేకం కాదు. కానీ అది అమలు జరుగుతున్న తీరు మార్చుకోవాలి. సన్న చిన్నకారు రైతుల పొలాల్లో, ఎస్.సి, ఎస్.టి.లు ఆర్థికంగా వెనుకబడ్డ అన్ని వర్గాల ప్రజల వ్యవసాయ క్షేత్రాలలో ఇంకా అధిక ఉపాధి కూలీలకు పనియిచ్చి వారి జీవన స్థితిని మార్చేలా మార్పులు చేయాలి. ఆ వర్గాల వ్యవసాయ కూలీ ఖర్చులను సగం ఉపాధి హామీ భరించాలి. పని దొరకని అనేక రెట్ల జనాబాకు ఉపాధి, భారీ పనిదినాలను కల్పించాలి. ఖచ్చితంగా వ్యవసాయ ఉత్పాదకతను, అందరి సంపదను పెంచేలా ఉపాధి హామీని మార్చాలి.

అతివృష్టి, అనావృష్టి కలిసి పంట దిగుబడిపై తీవ్ర ప్రభావాన్ని చూపుతున్నాయి. విశాల వర్షాధార ప్రాంతంలో పత్తి, సోయాబీన్ దిగుబడి గణనీయంగా తగ్గింది. వేలాది ఎకరాల్లో సోయాబీన్ పంట చేండ్లోనే మొలకలొచ్చినయి. లక్షల ఎకరాలలో పత్తి సాగవుతోంది. ఎకరాకు 2, 3, 4, క్వింటా లోపే పత్తి దిగుబడి వస్తోంది.'పత్తి సాగు చరిత్రలో ఎన్నడూ లేనంత పెరిగినా, దిగుబడి గణనీయంగా తగ్గింది.' తమ వ్యాపార చరిత్రలో ఎన్నడూ ఇంత తక్కువ (60శాతం) స్థాయిలో రాలేదని పత్తి వ్యాపారులు కూడా వెల్లడి చేస్తున్నారు. వచ్చిన పత్తిపంట దిగుబడి కొన్ని చోట్ల పత్తి తెంపిన కూలీలకే సరిపోతోంది. వేల ఎకరాల్లో, వందల గ్రామాల్లో, తెంపే కూలీలకు కూడా పంట సరిపోదని, పత్తి పంటను చేనులోనే వదిలేశారు. అలా దక్షిణ భారత దేశంలో అతి ఎక్కువగా నీరుండి అతి తక్కువ సాగునీరందుతున్న జిల్లా ఆదిలాబాదే. అన్నధాతలు అసువులు బాయడం ఒక ప్రత్యేకత.

పెరిగిన రసాయన ఎరువులు, పురుగు మందుల ధరలు– ప్రభుత్వ రుణసౌకర్యం అసలే లేని కౌలుదార్లు – పంటలకు గిట్టుబాటు ధరలు లేక నిండా మునుగుతున్న రైతులు, పెరుగుతున్న రసాయన ఎరువులు, పురుగు మందుల ధరలు రైతాంగం నడ్డివిరుస్తున్నాయి. కేంద్రం ఏటా ఉపసంహరిస్తున్న ఎరువుల సబ్సిడీలు, రైతాంగాన్ని పెనం నుంచి పొయ్యిలో పడవేసి, సాగు ఖర్చులు అప్పులను అధికంగా పెంచినయి. 'పత్తి పంట', అన్ని రకాల పంటల ధరలు రైతుల చేతుల్లోంచి పంటలు వ్యాపారుల చేతుల్లోకి పోయిన తర్వాత అమాంతం పెరుగుతున్నాయి. 'విదేశాలకు పత్తి ఎగుమతి నిలిపివేస్తు ఇచ్చిన కేంద్ర ప్రభుత్వ ఉత్తర్వుల వల్ల, దేశీయ మార్కెట్‌లో పత్తి మండె పడి, కృత్రిమంగా ఒత్తిడితో కూడిన ధరల తగ్గుదలకు, తిరోగమనానికి దోహదం చేస్తుంది. దేశ అవసరాలను మించేదిగా పండించిన పత్తి పంటకు గిట్టుబాటు ధరలు లేకుండా పోయాయి. ధరలు పెరిగి, విదేశీ మార్కెట్‌కు వెళ్లే దేశీయ పత్తిని కట్టడి చేయడం ద్వారా, అతి తక్కువ ధరకే పత్తిని రైతాంగం అమ్ముకునేటట్లు వ్యాపారులు పాలకులు కుమ్మక్కై ప్రతి ఏటా కుట్రలు చేస్తున్నారు.

జూలై 2013లో సాధారణ వర్షపాతం 329 మి.మీ. కాగా 602 మి.మీ.లు అంటే 83 శాతం అధనంగా కురిసింది. జూన్ నుండి అక్టోబర్ 5 వరకు సాధారణ వర్షపాతం 1004 మి.మీ కాగా 1483 మి.మీ. అతి భారీవర్షం కురిసింది. నాలుగు నెలల పాటు వర్షం కురువని రోజు లేదు. ఆదిలాబాద్ జిల్లాలో నాలుగు నెలలు సూర్యుదు మబ్బులను చీల్చుకొని రాలేదు. ప్రజలు సూర్యున్ని చూడలేదు. జూన్ నుండి సెప్టెంబర్ 25 వరకు గోదావరి ద్వారా సముద్రంలో కలిసిన నీరు 4650 టి.ఎం.సి.లు అయితే. అందులో 1500 టి.ఎం.సి.లకు పైగా నీరు ఆదిలాబాద్ జిల్లా ప్రాణహిత, పెనుగంగా, గోదావరి, దాని ఉపనదులదే అంటే అతిశయోక్తి కాదు. సాగునీటి సౌకర్యం లేక ఈ నీరే రైతుల పంటలను ముంచుతుంది. రబీకి ఎండబెడతుంది.

కౌలు రైతుల ఆత్మహత్యలకు ప్రధాన కారణాలు: 1) స్వంత భూమి లేకపోవడం, 2) భూమికి భారీ కౌలు రేట్లు చెల్లించడం, 3) భూమి

యజమాని కాకపోవడం వల్ల రుణానికి ఎవరు నమ్మకపోవడం, 4) 5–10 రూపాయల అతి భారమైన ప్రైవేట్ వడ్డీలపై ఆధారపడడం, 5) ఉచిత, తక్కువ బ్యాంకు వడ్డీ రుణ సౌకర్యం అసలే లేకపోవడం, 6) వారసత్వ ఆస్తులు సంపద నగదు నిలువలు అసలే లేకపోవడం, 7) ప్రభుత్వం ఇచ్చిన కౌలు రైతుల రుణ అర్హతా పత్రాలకు ఒక్క పైసా ఇవ్వకపోవడం, బి.టి. పత్తి పంటకు ఈ భారీ వర్షం ఎక్కువై పంట చేలు మునిగిపోయాయి. అందులో (లోతట్టు) పత్తి, సోయాబీన్, మెట్ట పంటలు నీళ్లలో మునిగి జౌకు పట్టి వేర్లు కుళ్లిపోయి, పైకాండం ఆకులు ఎరుపు రంగుకు మారి మొక్కలు ఎండిపోవడం, 8) అన్ని అవసరాలకు ప్రైవేట్ (బయటి వారి)పై ఆధారపడడం, 9) భరించలేని అధిక కూలీలు, కలుపుల వ్యయం, 10) అనూహ్యంగా పెరిగిన వ్యవసాయ ఉత్పాదకాల రేట్లు, 11) రసాయన ఎరువుల వాడకంతో పంటల పెట్టుబడులు ఆకాశాన్నంటడం, పంటలకు గిట్టుబాటు ధరలు పాతాలంలో ఉండడం కౌలు రైతుల ఆత్మహత్యలకు ప్రధాన కారణం.

**గిరిజనుల మరణాలు - బి.టి. పత్తి (జి.ఎం.)విత్తనాలు, వ్యవసాయ సంక్షోభం**

బి.టి. పత్తి విత్తనాలు ప్రవేశించక ముందు, ఆదిలాబాద్ జిల్లా ఆదివాసి గిరిజన వ్యవసాయ జీవనం, విత్తన జీవవైవిధ్యంతో విలసిల్లేది. సంపూర్ణ ఆరోగ్యానికి అవసరమైన శక్తివంతమైన విత్తనా లన్నింటిని ఎంపిక చేసుకుని, ప్రతి గిరిజన ఇల్లు ఒక విత్తన బ్యాంకుగా ఉండేది. ఆధునికత లేకపోయినా ఆయురారోగ్యాలతో, శారీరక ధృడత్వానికి గిరిజనులు, ఆదివాసీలు పెట్టింది పేరు. ఎంతటి శారీరక శ్రమనైనా, ఎంత దూరమైనా అవలీలగా కాలి నడకనే వెళ్లేవారు. శారీరక ధృడత్వానికి ఈ విత్తన వైవిధ్యానికి, ఆనాటి సహజ పోషకాహార పంటలకు ధృడమైన సంబంధం ఉంది. జొన్నలు, మక్కలు, కొర్రలు, సామలు, కందులు, పెసరు, మినుము, బబ్బర్లు, అనుములు, అనేక తీరొక్క అడవి పళ్లకు అలావాలమైన అద్భుతమైన జీవితం గిరిజన జీవనం. వారి విత్తన వైవిధ్యం సంపూర్ణ ఆయురారోగ్యాన్నిచ్చింది. ఏజెన్సీలో పాలకుల మౌలిక సదుపాయాలు మృగ్యమైనా, నాటి గిరిజనుల విత్తన వైవిధ్యం విశిష్టమైనది. మైదాన ప్రాంతాల ప్రజలకంటే, గిరిజన ప్రాంతాల ప్రజలు అన్ని విధాల ఆయురారోగ్య వంతులు నాడు. నేడది పూర్తి తలకిందు లైంది. అందరికంటే అత్యంత అనారోగ్యవంతులు ఎవరంటే ఆదిలాబాద్ జిల్లా ఆదివాసులు, గిరిజనులు. అందుకే ఈ రక్తహీనత, పోషకాహార లోపంతో అనేక మంది మరణిస్తున్నారు. ఇటీవలే పూలబాయి (23) అనే ఆదివాసీ మహిళ తొలుసూరు కాన్పులోనే తల్లి మరణించింది. బతికిన పాప బక్క చిక్కిన బొక్కలగూడుతో సోమాలియా పిల్లలను తలపిస్తుంది. రక్తం మూడున్నర శాతానికి పడిపోయింది. ఇంటి ముందే ప్రభుత్వ ఆసుపత్రి ఉన్నా పూలాబాయి ప్రాణం కాపాడలేక పోయింది. నాలుగు వారాల్లో అయ్యూబాపు, లేతుబాయి, దయారాం, అర్గపూల బాయి, శీతల్ అనే గిరిజనులు రక్తహీనత, పోషకాహార లోపంతో చనిపోయారు. ఈ గిరిజనుల, ఆదివాసీల మరణాలకు, అన్నదాతల ఆత్మహత్యలకు, రక్తహీనతకు పోషకాహార లోపానికి, ఆరోగ్యానికి ఆయుశ్శునిచ్చే ఆహార పంటల అదృశ్యానికి, పత్తి పంట ప్రధానమై పట్టాలెక్కడానికి మధ్య ప్రాణప్రదమైన సంబంధం ఉంది. రేపటి తెలంగాణ పాలకులైనా ఈ వ్యవసాయ సంక్షోభాన్ని నిర్మూలించాలి.

భారీ లాభాలనిచ్చే విదేశీ కంపెనీల బి.టి. పత్తి, వివిద విత్తనాలను తిష్ట వేయించడంకై, గిరిజన సమస్త జనుల, విత్తన వైవిద్యాన్ని మన పాలకులు విధ్వంసం చేయించారు. శక్తినిచ్చే పంటలను సర్వ నాశనం చేశారు. విలువైన కలప కొరకు గిరిజనుల అడవిని దొంగిలించడంతో పాటు, ప్రకృతి పండ్లు జీవులతో గిరిజనులకు ఉన్న సహ సంబంధాన్ని చంపేశారు ఆధునిక పాలక ఆసాములు. జీవవైవిద్యం, గిరిజన వైవిద్యం, అడవి వైవిద్యం మధ్య ఉన్న సంబందాన్ని చంపి. జి.ఎం. పత్తి, సోయ సాగుకు జీవం పోశారు. ప్రతి అడుగు భూమిలో స్థానిక పంటల వైవిద్యాన్ని విద్వంసం చేసి, బహులజాతి పత్తి ప్రధానమై పాగా వేయించారు పాలకులు.

గిరిజనుల ఆహార పంటలన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. ఆహార పంటల పోకతో ఆరోగ్యమూ, ఆయుశ్శూ, వైవిద్య జీవనమూ అన్నీ పోయాయి. అన్ని రకాల అనారోగ్యాలు, అశాంతి తిష్టవేశాయి. పండ్లు, లెక్కకు మిక్కిలి బహువిత్తన పంటలు జీవవైవిద్య విద్వంసంతో గిరిజనుల సమస్త జీవితం పరాధీనం అయింది. 'నాడు గిరిజనుల వ్యవసాయం సంక్షోభంలో ఉన్నా, పంటలకు ధరలు లేకున్నా, గతంలో ఆహార సంక్షోభం, ఆరోగ్య సంక్షోభం ఉండేవి కాదు.' మనుషుల మరణాలు, అన్నదాతల ఆత్మహత్యలు అంతకంటే ఉండేవి కావు. శక్తిని ఆరోగ్యాన్నిచ్చే ఆహారం వారికుండేది. నేడు మద్దతు ధరలు లేని వ్యవసాయ సంక్షోభం పెట్టుబడులను పెంచి, తమవి కాని బి.టి. పంటలతో ఆహార సంక్షోభం పెరిగి గిరిజనుల జీవితాలకు తమ చేన్లోనే ఉరితాళ్లు బిగుసుకునేటట్టు చేసింది. బి.టి. పత్తి తుడిచి పెట్టిన గిరిజన పౌష్టికాహార విత్తన సాగు సంక్షోభం, ఎజెన్సీలో రక్తహీనతతో ఎప్పుడు మనుషులు మరణిస్తారో తెలియని దౌర్భాగ్య పరిస్థితులను నేటి వ్యవసాయ విధానం, పత్తిసాగు సృష్టించాయి. ప్రసూతి మరణాలు, పోషకాహార కొరతతో రక్తహీనత మరణాలు సర్వసాధారణ మయ్యాయి. ఇది అన్నిరకాల ఆహార పంటలను నాశనం చేసిన వ్యవసాయ సంక్షోభపు జీవన విద్వంసాన్ని వెల్లడిస్తోంది. ఆహార పంటలు పోయి, అన్నింటికి పత్తి పంట ప్రత్యామ్నాయం అనే ప్రమాదకర పరిస్థితులు రూపుదిద్దు కోవడమే ఈవిషాదాలు.

రైతు చేతుల్లోంచి పత్తి పంట పోయిన తర్వాత ధరలు అమాంతం పెంచి, వ్యాపారులు ప్రతి ఏటా రైతాంగాన్ని భారీగా దోచుకుంటు న్నారు. బడా వ్యాపారులు, రాజకీయ నాయకులు, అధికారులు కోట్లు గడిస్తున్నారు. లక్షల కోట్ల కర్షకుల కష్టార్జితాన్ని ఆధునిక దోపిడిదారుల త్రయం చట్టబద్దంగా దొంగిలిస్తున్నారు. రుణ సౌకర్యం లేక అనేక మంది కౌలు రైతులు, స్వంత భూమి గల రైతులు, ప్రైవేటు రుణాల భారం భరించలేక నిండు ప్రాణాలు బలి తీసుకుంటున్నారు. బ్యాంకులు రుణాలివ్వవు. అవసరాన్ని బట్టి 5 నుంచి 6, 7 రూపాయల ప్రైవేటు వడ్డీలకు రుణం తోడు నడ్డి విరిగేలా ఎకరాకు 10, 12, 15, వేల రూపాయల కౌలు చెల్లిస్తున్నారు. ఆత్మహత్యలు చేసుకుంటున్న వారిలో స్వంత భూమి కల వారితో పాటు, ఎక్కువ మంది కౌలు రైతులే.

ఆదిలాబాద్ జిల్లా సారంగాపూర్ (మం), కౌట్ల (బి) గ్రామం తండ్రీ కొడుకులైన రైతు కుటుంబాన్ని మా నిజనిర్ధాన కమిటీ బృందం కలిసింది. 2012 జూన్ 10న బర్ల శంకర్ (35), ఐదు లక్షల రూపాయల అప్పుల

## బలవన్మరణాల నివేదిక

వరుస పంట నష్టాలు, అప్పులతో ఆత్మహత్యలకు పాల్పడ్డ దళిత అన్నదాత జనగామ నారాయణ, తన చిన్న కొడుకు రామ్‌చరణ్‌ల మొదటి వర్ధంతిని వారి సొంత గ్రామంలో అశ్రునయనాల మధ్య జరుపుకున్నారు. కన్నీళ్ల మధ్య మొదటి వర్ధంతి పూర్తి చేసుకున్నా ఆ దళిత కుటుంబానికి నేటికీ నయా పైసా సహాయం అందని దుస్థితి, పేదల పట్ల ప్రభుత్వ పక్షపాతాన్ని తెలియ జేస్తుంది. ఆ కుటుంబ దీనస్థితిని ప్రజల ముందుంచుతున్నాం.

జనగామ నారాయణ కిష్టాపూర్ గ్రా, జైపూర్ మం, ఆదిలాబాద్ జిల్లా నేతకాని (ఎస్.సి.) కులానికి చెందిన దళిత రైతు. జనవరి 5, 2013న, వ్యవసాయంలో అప్పులు, పంట నష్టాల వల్ల నారాయణ తన కొడుకు రామ్‌చరణ్ (1 సంవత్సరాలు) పురుగుల మందు త్రాగించి తనూ తాగి ఇంటి వద్దే ఆత్మహత్యలు చేసుకొన్నారు. 6 ఎకరాల స్వంత ఉమ్మడి భూమి ఉంది. ఇది 7గురు అన్నదమ్ముల ఉమ్మడి భూమి. జనగామ నారాయణ రెండవ వాడు. ఒక్కొక్కరు పంచుకుంటే 0 – 34 గుంటల భూమి మాత్రమే వస్తుంది. జనగామ నారాయణ ఆత్మహత్యకు ముందు 3 సంవత్సరాల నుంచి వ్యవసాయం చేస్తున్నాడు. 3 సంవత్సరాల నుంచి నారాయణ 8 ఎకరాల భూమి కౌలుకు తీసుకొని సాగు చేస్తున్నాడు. 4 ఎకరాలు విద్యాసాగర్ రెడ్డిది. అన్నదమ్ములకు చెందిన భూమి 4 ఎకరాలు కౌలుకు తీసుకొని చేస్తున్నాడు. ఎకరా కౌలు 8వేల రూపాయలు మొత్తం సంవత్సరాలు కౌలు 32 వేలు. 3 సంవత్సరాలకు 96వేల రూపాయలు. ఇది కేవలం అన్నదమ్ముల బాపతుది మాత్రమే. మిగతా 4 ఎకరాల వరి పొలానికి ఎకరం ఒక్కంటికి 40 (70 కిలోలు) బస్తాలు. 4 ఎకరాలకు 3 సంవత్సరాలకు 120 బస్తాల కౌలు చెల్లించాలి. ఈ దాన్యం మొత్తం విలువ 1లక్ష రూపాయలు కౌలు క్రింద విద్యాసాగర్ రెడ్డికి చెల్లించడం జరిగింది.

4 ఎకరాల పత్తికి పంట కాలం వరకు 15 సంచులు వేసారు. ఒక్కసారికి యూరియా2, డి.ఏ.పి.3 వేస్తారు. ఈవిధంగా మొత్తం పంట కాలంలో రసాయన ఎరువులు 3 సార్లు వేస్తారు. డిఎపి ఒక్క సంవత్సరానికి రు. 10,800. 3 సంవత్సరాలకు రు. 32,400. యూరియా ఒక సంవత్సరాలునికి రు. 2,400 3 సంవత్సరాలకు కలిపి రు. 7,200. మొత్తం 3 సంవత్సరాల రసాయన ఎరువుల పెట్టుబడి రు. 39,600.

మొదటి సంవత్సరాలు కలుపుకే సరిపోలేదు. వచ్చిన కొంత పంట కూలీలకు కూడా సరిపోలేదు. నారాయణ చనిపోయిన సంవత్సరం పంట కోతకు వచ్చే సమయంలో వర్షం తీవ్రంగా పడి నల్లపడింది. కోతకు వచ్చిన వరి పొలం వర్షానికి నేలపాలైంది. కోపియ్యగా వచ్చిన వరిపంట కూలీలకు కూడా సరిపోలేదు. 2, 3 రోజుల నుంచి ఇవ్వన్ని అప్పులు ఎట్లగడుతాం అంటున్నాడు. సంవత్సరానికిన్ని కష్టంచేసి కడదాం. 10 మంది మహిళలు గ్రూప్ అయ్యి 30 వేల రూపాయల అప్పు తీసున్నారు. ఈ అప్పు భయం ఇద్దరికి ఉంది. 'అప్పు తీర్చడానికి నేను పత్తి ఏరడానికి కూలికి పోయిన.

మధ్యాహ్నం 12 గంటలకు ఇంటిలో ఎవరూ లేని సమయంలో తన చిన్న కొడుకు రామ్‌చరణ్ (ఒక సంవత్సరం)కు మోనోక్రోటోపాస్ అనే పురుగుమందు పోసి, తను కూడా తాగాడు. మాతాత (సమ్మయ్య) కోపని బియ్యం కొరకు బండి గట్టుకొనిపోతుండు. ఇద్దరు పిల్లలు సంబురానికి బండి ఎక్కిండ్రు. బండి మీది నుంచి తండ్రి జనగామ నారాయణ కిందికి గుంజుకున్నాడు. పెద్దోడు తండ్రి నారాయణ చేతులోంచి తప్పించుకొని మళ్లీ తాత బండి ఎక్కడం మూలంగా అదృష్టవశాత్తు చావునుండి బతికి బయట పడ్డాడు.

పురుగుల మందు తాగి గిలగిలా కొట్టుకుంటున్న సమయంలో మేమందరం అనగా నేను రమేష్, అన్నయ్య రాజబాపు, ఇరుగు పొరుగు అందరం కలిసి మంచిర్యాల హాస్పటల్‌కు తరలిస్తుండగా మార్గమధ్యంలో చనిపోయిండు.'

పోస్ట్‌మార్టమ్ అనంతరం రెండు శవాలను ఇంటికి తెచ్చారు. ఒకే పాడెలో తండ్రీ కొడుకుల శవాలను తీసుకెళ్లి, గోదావరి నదిలో, ఒకే బొందలో రెండు శవాలను పూడ్చి వేస్తే ఆ కుటుంబం అనుభవించిన దుఃఖం క్షోభ ఎంత దుర్భరంగా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు.

బాధ తాళలేక అడవిలోకి వెళ్లి ఆత్మహత్య చేసుకున్నాడు. అడవిలో వెతుకుతూ ఉంటే వారం రోజుల తర్వాత శవం కనిపించింది. శవంపై ఒక్క మాంసం ముద్ద కూడా లేకుండా భయంకరమైన బొక్కల గూడులా ఉంది. నక్కలు పీక్కు తింటే శవంపై మాంసం పోయి అస్థిపంజరంగా మారింది. ఆత్మహత్య స్థలం నుంచి అడవి జంతువులు ఆ శవాన్ని 200 మీటర్లు లాక్కు పోయాయి. కొడుకు మరణవార్త తెలిసి భరించలేక మరుక్షణమే ఆయన తండ్రి బర్ల బీమన్న (75) థైమెట్ అనే విషం సేవించి ఆసుపత్రికి పోతూ మార్గమధ్యలో మరణించాడు. 'ముక్కు పచ్చలారని బిడ్డలుండి, భర్త పోయి, ఉన్న పిల్లలను ఎలా బతికించాలో తెలియని, ఎన్నడూ బయటకెళ్లని భార్య ఉండి, అమ్మ ఎప్పుడో ముందే చనిపోయి, రైతులైన తండ్రీ కొడుకుల శవాలను ఒక్కరోజే పక్కపక్కనే దహనం చేస్తుంటే ఆ కుటుంబం ఎంత దహించుకు పోయుంటుంది.' ఆ రోజు ఆకొట్ల అనే ఊళ్లో కన్నీళ్లు కార్చని వాళ్లు లేరు. ఊహిస్తేనే భయం వేస్తుంది.

ఆరోగ్యాన్ని, ఆయుశ్శును హరిస్తూ, పెట్టుబడులు పెంచి, అన్నదాతల ఆర్థిక జీవనాన్ని అతలాకుతలం చేసే, ఈ ప్రకృతి వ్యతిరేక ఫర్టిలైజర్, పెస్టిసైడ్స్ వ్యవసాయ సాగు శిథిల శరీరాలను అనారోగ్యా లను భారీ సేద్యం చేస్తోంది. పర్యావరణాన్ని పాడు చేస్తోంది. ఏజెన్సీ వ్యవసాయం అన్నదాతల ఆత్మహత్యలను, ఆదివాసీ గిరిజన మరణాల సాగువృద్ధిలో అపార ప్రగతిని దినదిన వృద్ధిని సాధిస్తోంది. తెలంగాణ లో ముఖ్యంగా ఆదిలాబాద్ జిల్లా అన్నదాతల ఆత్మహత్యలకు, ఆదివాసీ గిరిజన మరణాలకు నేడు దేశంలోనే కేంద్రం అయ్యింది. వ్యవసాయం చేసే వారి మరణాలను గ్యారంటీ చేసే ఈ విధానాలను పాలకులు అతి జాగ్రత్తగా రూపొందిస్తుండడమే, సాగుదారుల చావులకు కారణం. నడుస్తున్న ఈ చరిత్రను తిరగ రాయడమే మన ముందున్న తిరుగులేని కర్తవ్యం. అధిక పెట్టుబడులను, ఖర్చులను తగ్గించి, ఆరోగ్యాన్ని, ప్రకృతిని అన్ని విధాల పరిరక్షించే, వ్యవసాయ సంక్షోభాన్ని సమగ్రంగా పరిష్కరించే వ్యవసాయ విధానాలనూ, వ్యవసాయ బడ్జెట్‌ను ప్రవేశపెట్టాలి.

*(రచయితలు వ్యవసాయ సంక్షోభ – రైతు ఆత్మహత్యల నివారణ కమిటీ, కన్వీనర్, జిల్లా నాయకులు)*

వీ

# భవిష్యత్తు తెలంగాణ - కొన్ని ఆలోచనలు

***తెలంగాణ పునర్నిర్మాణం అంటే తెలంగాణ సమస్యల పరిష్కారమేననీ, అందుకోసం పాలకవర్గాల మెడలు వంచే ప్రజా ఉద్యమాలు జరగవలసిందేననీ అంటున్నారు* ఎన్. వేణుగోపాల్**

రానున్న తెలంగాణ ఎలా ఉండాలనే చర్చలు చాలకాలంగానే జరుగుతున్నాయి. ఆ చర్చలలో భాగంగా భౌగోళిక తెలంగాణ, ప్రజా తెలంగాణ, సామాజిక తెలంగాణ, ప్రజాస్వామిక తెలంగాణ వంటి భావనలు, వాదవివాదాలు కూడ జరిగాయి. ఇప్పుడిక పార్లమెంటులో ప్రవేశపెట్టే బిల్లు కూడ తయారయి, తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు కావడం తథ్యమని తేలిన తర్వాత ఆ ఆలోచనలు మరింత తీవ్రంగా జరగడం సహజమే.

తెలంగాణ ఒక రాష్ట్రంగా ఏర్పాటు కావడం దానికదే తెలంగాణ సమస్యలన్నిటినీ పరిష్కరించదు. కనీసం తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ క్రమంలో వెలికివచ్చిన సమస్యలన్నిటినీ అయినా రానున్న తెలంగాణ ప్రభుత్వాలు పరిష్కరించగలవా అనుమానమే. కాని తమ సమస్యలలో అత్యధికభాగం ప్రత్యేక రాష్ట్ర సాధనతో పరిష్కారం అయిపోతాయని తెలంగాణ ప్రజలు అనుకునే, ఆశపడే స్థితి ఉద్యమక్రమంలో బలపడింది. నిజానికి రాజ్యాంగబద్ధంగా జరగబోయే ఒక మార్పు వల్ల మౌలికమైన, వ్యవస్థాగతమైన సమస్యలకు సమాధానం దొరకడం సాధ్యం కాదు. ఆంధ్రప్రదేశ్ విభజన జరిగిన తర్వాత ఏర్పడబోయే తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలలోను ప్రజల మౌలిక సమస్యలు అలాగే ఉంటాయని, కొత్త రాష్ట్రాల్లో పాత సమస్యల పరిష్కారం కొరకు కూడ ప్రజా ఉద్యమాలు జరగవలసిందేనని అనుకోవడంలో తప్పు లేదు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తెలంగాణ సమాజం ముందర ఉండిన ప్రధానమైన సమస్యలలో ఒకటయిన ఆంధ్ర పాలకవర్గాల దోపిడీ, పీడనలను, ఆ పాలకవర్గ విధానాలను కొంతవరకు మారుస్తుందేమో గాని, మొత్తంగా వ్యవస్థను మార్చజాలదు. అట్లని ప్రజలలో ఉన్న ఆ ఆశలను, ఆకాంక్షలను తప్పు పట్టనక్కరలేదు. ఆ మౌలిక ఆకాంక్షల పరిష్కారం వ్యవస్థ పరివర్తనతో మాత్రమే సాధ్యమవుతుందనే చైతన్యాన్ని కలిగిస్తూ, వారిని దీర్ఘకాలిక పోరాటానికి సిద్ధపరచడం ఒక ఎత్తు. ప్రత్యేక రాష్ట్ర సాధన ద్వారా పరిష్కరించగలిగే సమస్యలేమిటో వివరించి, వాటి పరిష్కారానికైనా పాలకవర్గాలను నిలదీసేలా చైతన్యవంతులను చేయడం, సంఘటిత పోరాటాలకు సిద్ధం చేయడం మరొక ఎత్తు. ఈ రెండూ ఇవాళ తెలంగాణ బుద్ధిజీవుల కర్తవ్యాలే.

ఈ అవగాహనతో తెలంగాణ పునర్నిర్మాణంలో కీలకమైన అంశాలను, తెలంగాణ పాలకవర్గాల ముందర ఉంచవలసిన ప్రజల డిమాండ్లను, తెలంగాణలో ప్రస్తుత స్థితిలో రూపొందవలసిన ప్రజా ఉద్యమాన్ని సూచించడం ఈ వ్యాస లక్ష్యం.

తెలంగాణ పునర్నిర్మాణమంటే కొత్తగా ఏదో అన్వేషించడం కాదు. తెలంగాణ ప్రజల సమస్యల పరిష్కారమే తెలంగాణ పునర్నిర్మాణానికి నిజమైన అర్థం. తెలంగాణ సమాజం దశాబ్దాలుగా, ఆ మాటకొస్తే 1850ల నుంచీ పడుతున్న తండ్లాటను పరిష్కరించడమే, తెలంగాణ సమాజాన్ని సమానత్వంతో, సామాజిక న్యాయంతో, అర్థవంతమైన శాంతితో ఉన్నతీకరించడమే తెలంగాణ పునర్నిర్మాణం. ఏ సమస్యలైనా హఠాత్తుగా రాత్రికి రాత్రి తలెత్తినవి కావు, ఏ పరిష్కారమైనా హఠాత్తుగా రాత్రికి రాత్రి జరిగిపోయేదీ కాదు. తెలంగాణలో ప్రస్తుతం ప్రారంభం కావలసిన పరిష్కార క్రమం గురించి చర్చించేటప్పుడు ఏ సమస్యలు ఎలా పరిష్కరించవచ్చునో జాగ్రత్తగా ఆలోచించవలసి ఉంటుంది.

తెలంగాణ సమస్యలను నాలుగు రకాలుగా చూడవచ్చు. అవి 1. చరిత్ర వల్ల, చరిత్ర క్రమంలో తెలంగాణకు ఏర్పడిన సమస్యలు, 2. వర్తమానంలో తెలంగాణ ఎదుర్కొంటున్న సమస్యలు. 3. సమాజ ఆదర్శాల వల్ల పరిష్కరించవలసిన సమస్యలు. 4. ఈ అన్ని రకాల సమస్యలలోను ప్రస్తుత వ్యవస్థలో ఆచరణ సాధ్యమైన పరిష్కారాలున్న సమస్యలు. ఇలా విడదీసి చూడడం విశ్లేషణా సౌలభ్యం కోసం మాత్రమే గాని ఆయా సమస్యలు ఒకదానిలో ఒకటి కలిసిపోయి కూడ ఉంటాయి. సమస్యలు ఇలా భిన్నంగా ఉన్నందువల్ల వాటి పరిష్కారాలు, ఆ పరిష్కారాలు సాధించేందుకు జరగవలసిన ప్రజా ఉద్యమాలు కూడ విభిన్నమైన పద్ధతులను అనుసరించక తప్పదు.

తెలంగాణ సమాజపు చరిత్ర వల్ల ఏర్పడిన సమస్యలు ఎన్నో ఉన్నాయి. ఆ చరిత్ర వందల సంవత్సరాలు సాగిన భూస్వామ్య నిరంకుశ రాచరికానిదీ కావచ్చు, 1948 నుంచి 51 దాకా సాగిన భారత సైన్యపు దాడిదీ కావచ్చు, 1956 నుంచి ఇప్పటిదాకా సాగుతున్న కోస్తాంధ్ర, రాయలసీమ పాలకవర్గ విధానాలదీ కావచ్చు. రాజరిక చరిత్ర వల్ల భూసంబంధాల అసమానతలు, కుల అసమానతలు, మత విభేదాలు, సాంస్కృతిక ప్రత్యేకతలు, అభివృద్ధి రాహిత్యం, ప్రజలను బలవంతంగా లొంగదీసినందువల్ల ఆలోచనలలో బానిసత్వం వంటి సమస్యలు తలెత్తి వాటి కొనసాగింపు ఇవాల్టికీ ఉంది. ఇక భారత సైన్యం ఆ మూడు సంవత్సరాలలో తెలంగాణ సమాజం మీద భయానకమైన హింసా దౌర్జన్యాలు సాగించి ప్రజలలో రాజ్య వ్యతిరేకత ఒక సామూహిక జ్ఞాపకంగా నిలిచిపోయేలా చేసింది. అంతకుముందరి తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో ఏ సమస్యలను ప్రజలు పరిష్కరించుకోవడం ప్రారంభించారో ఆ సమస్యలను సైనిక పాలన మరింత జటిలం చేసింది. ఆ తర్వాత మొదలైన సమైక్యాంధ్ర ప్రదేశ్ రాష్ట్రాన్ని పాలించిన పాలకవర్గ విధానాలు తెలంగాణ సమాజపు పాత సమస్యలను పరిష్కరించకపోగా, అంతకు మించిన సమస్యలను సృష్టించాయి. అభివృద్ధి రాహిత్యాన్ని కొనసాగించాయి. వాగ్దానాలను ఉల్లంఘించాయి. నీటి పారుదలలో, నిధుల కేటాయింపులో, నియామకాలలో, విద్యలో, పారిశ్రామికాభివృద్ధిలో, సాంస్కృతికాభివృద్ధిలో న్యాయమైన వాటా అందకుండా చేశాయి. న్యాయమైన వాటా ఇస్తామని చేసిన వాగ్దానాలను పదే పదే ఉల్లంఘించాయి. ప్రశ్నలను అణచివేసి ప్రాథమిక హక్కులను కాలరాశాయి. ఇటువంటి ఎన్నో సమస్యలతో తెలంగాణ సమాజం ఆరు దశాబ్దాలు ధ్వంసమైపోయింది. ఇవాళ తెలంగాణ తనంతతానే ఒక

రాష్ట్రంగా మారిన తర్వాత, 1956కు ముందరి సమస్యలనూ పరిష్కరించవలసి ఉంది. ఆ తర్వాతి అరవై ఏళ్లలో పుట్టి పెరిగిన సమస్యల సవరణ ప్రక్రియనూ ప్రారంభించవలసి ఉంది.

ఇది సులభమేనా, ఒకవేళ సులభమైనా ఆ పని చేయడానికి కొత్త తెలంగాణ పాలకవర్గాలకు చిత్తశుద్ధి ఉందా వంటి ప్రశ్నలకు అవకాశం ఉంది. కాని కొత్త తెలంగాణ పాలకవర్గాలు ఈ సమస్యల పరిష్కారానికి పూనుకోకపోతే మళ్లీ వారి మెడలు వంచి వారిచేత ఆ పని చేయించవలసింది తెలంగాణ ప్రజా ఉద్యమమే.

అలాగే, గత చరిత్ర పునాది మీద పెరిగినవే అయినప్పటికీ, ఇవాళ్టికివాళ తెలంగాణ సమాజాన్ని అతలాకుతలం చేస్తున్న వర్తమాన సమస్యలు కూడ ఎన్నో ఉన్నాయి. తెలంగాణలో బతుకుదెరువు లేక దేశవ్యాప్తంగానూ, గల్ఫ్ దేశాలకూ సాగుతున్న కష్టజీవుల వలసలు, వ్యవసాయ సంక్షోభంతో రైతాంగం ఆత్మహత్యలు, సమాజం నుంచీ, ప్రభుత్వాల నుంచీ ఆదరణ కరువై ఆత్మహత్యల పాలవుతున్న చేనేత కార్మికులు, వనరులు పుష్కలంగా ఉండి కూడ తగిన పారిశ్రామికాభివృద్ధి లేకపోవడం వల్ల పెరిగిపోతున్న నిరుద్యోగం, పాలక విధానాల వల్ల నిర్లక్ష్యానికి గురైన ప్రాథమిక విద్యా, వైద్య, ఆరోగ్య రంగాలు, తరతరాలుగా ప్రజాస్వామిక, ఉద్యమ చైతన్యానికి భూమిక అయినప్పటికీ, కనీస ప్రాథమిక హక్కులు అమలు కాని దుష్పరిపాలన వంటి తెలంగాణకే ప్రత్యేకమైన సమస్యలు ఎన్నో ఉన్నాయి. నూతన ఆర్థిక విధానాల వల్ల, దగాకోరు పాలక విధానాల వల్ల దేశవ్యాప్తంగా కూడ ఉన్న ధరల పెరుగుదల, అవినీతి వంటి సమస్యలూ తెలంగాణను చుట్టుముడుతున్నాయి. రేపటి తెలంగాణలో అధికారానికి వచ్చేది నిజమైన ప్రజాశక్తులేమీ కాదు, పాలకవర్గాలలోనే ఒక ముఠా దిగిపోయి, మరొక ముఠా గద్దెనెక్కుతుందనే మాట నిజమే. అయినా, గొప్ప చైతన్యమూ, పోరాటశీలమూ గల తెలంగాణ సమాజం ఈ సమకాలీన సమస్యలను పరిష్కరించమని పాలకవర్గాల మీద నిరంతర ఒత్తిడి తేవాలి. బహుశా తెలంగాణ సాధించడానికి జరిగిన ప్రజా ఉద్యమం కన్న విశాలమైన, తీవ్రమైన ప్రజా ఉద్యమం ఈ సమస్యల పరిష్కారం కొరకు, తెలంగాణ పునర్నిర్మాణం కొరకు జరగవలసి ఉంటుంది.

ఇక తెలంగాణలో అటు రాజ్యాంగ ఆదర్శాలను బట్టి గాని, ఇటు చిరకాలపు ప్రజా ఉద్యమాల ఆదర్శాలను బట్టి గాని పరిష్కరించవలసిన సమస్యలు కూడ ఉన్నాయి. రాజ్యాంగ ప్రవేశికలో చెప్పుకున్న ప్రజాస్వామిక, లౌకిక, సర్వసత్తాక, సమసమాజ ఆదర్శాలు, ఆదేశిక సూత్రాలలో చెప్పుకున్న ఆదర్శాలు తెలంగాణ సమాజం కూడ కోరుకుంటున్నవే. తెలంగాణలో కనీసం ఆంధ్ర జన సంఘం (1921) నాటినుంచి, ఆంధ్ర మహాసభ, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలు, విప్లవోద్యమం దాకా అన్ని ప్రజా ఉద్యమాలూ తెలంగాణ సమాజపు స్వప్నాలలో, ఆకాంక్షలలో అనేక ఆదర్శాలను చేర్చాయి. భూమి, భుక్తి, విముక్తి, ప్రాథమిక హక్కులు, మాతృభాష, వనరులమీద అధికారం, స్వావలంబన, స్వాభిమానం వంటి ఎన్నో రూపాలలో ఆ ఆదర్శాలు వ్యక్తమయ్యాయి. ఆరు దశాబ్దాలకు పైగా రాజ్యాంగ ఆదర్శాలన్నిటినీ తుంగలో తొక్కి పాలన జరుపుతున్న పాలకవర్గాల నీడలో, ఒకానొక రాష్ట్రంలో ఇవి అమలు చేయడానికి అవకాశం ఉందా అనేది లోతైన ప్రశ్నే. కాని చైతన్యవంతమైన తెలంగాణ సమాజం ఈ ఆదర్శాలను అమలు చేయాలని సాగించే ఉద్యమమే మొత్తం దేశానికే రాజ్యాంగ ఆదర్శాలను అమలు చేయగల ఉదాహరణను ఇవ్వగలదు.

ఎంత చెప్పుకున్నా చరిత్ర సమస్యలు గాని, వర్తమాన సమస్యలు గాని, ఆదర్శాల సమస్యలు గాని పరిష్కరించడానికి ప్రస్తుత వ్యవస్థలో ఆటంకాలు ఉంటాయి. ప్రధానంగా పాలకవర్గాల ముఠాలన్నిటికీ ఉమ్మడిగా ఈ సమస్యలను పరిష్కరించాలనే కోరిక ఉండదు. అందువల్ల ఈ వ్యవస్థలోనే, ఈ పాలకవర్గాల పాలనలోనే ఏయే సమస్యలకు పరిష్కారాలు అమలు చేయడం ఆచరణ సాధ్యమో ఆలోచించవచ్చు. ఆ పరిష్కారాల ద్వారా ప్రజల జీవితాలు మెరుగుపడి, ప్రజా చైతన్యం విస్తరించి, సమాజం ఇంకా విశాలమైన పరిష్కారాల వైపు చూసే అవకాశం రావచ్చు.

ఆచరణ సాధ్యమైన పరిష్కారాలు కూడ మళ్లీ ఒకే రకంగా ఉండవు. ఆచరణ సాధ్యత గురించి ఆలోచించినప్పుడే అది తక్షణమే, స్వల్పకాలికంగా సాధ్యమా, మధ్యంతర కాలంలో సాధ్యమా, దీర్ఘకాలికంగా సాధ్యమా కూడ ఆలోచించవలసి ఉంటుంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోసం పోరాడిన, సాధించిన ఫలితం దక్కాలంటే ఒక పథకం ప్రకారం ఈ తక్షణ, మధ్యంతర, దీర్ఘకాలిక ప్రణాళికలు రచించి, అమలు చేయవలసి ఉంటుంది.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడగానే తక్షణమే, స్వల్పకాలిక వ్యవధిలో పరిష్కరించగలిగిన సమస్యలు విద్య, వైద్యం, ఆరోగ్యం, పౌరసౌకర్యాలు, సంస్కృతి, సామాజిక న్యాయం, పాలన, శాంతి భద్రతలు మొదలైన రంగాలకు సంబంధించినవి. ప్రభుత్వం వెంటనే విద్యారంగంలో మార్పులు ప్రవేశపెట్టవచ్చు. విద్యారంగాన్ని పూర్తిగా ప్రభుత్వ అధీనంలోకి తీసుకువచ్చి, ఏకీకృత విద్యావిధానం ద్వారా, ప్రాథమిక విద్యకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం ద్వారా, గత ఆరు దశాబ్దాలలో తెలంగాణ కోల్పోయిన విద్యావకాశాలను సాధించవచ్చు. విద్యారంగాన్ని విస్తరించడం, విద్యా ప్రణాళికలను తెలంగాణ చరిత్ర, భాష, సాహిత్య, సంస్కృతులకు అనుగుణంగా మార్చడం, కళాశాల, విశ్వవిద్యాలయ విద్యను మెరుగుపరచడం సాధించాలి. గత ప్రభుత్వాల చేతుల్లో ధ్వంసమైపోయిన ప్రాథమిక వైద్య, ఆరోగ్య రంగాలను పునర్నిర్మించాలి. కింది, గ్రామీణ స్థాయి నుంచి ప్రభుత్వ ఆస్పత్రులను బలోపేతం చేసి, వైద్య ఆరోగ్య సేవలను మెరుగుపరచాలి. తాగునీరు, రవాణా, సమాచార సంబంధాలు, పారిశుధ్య సౌకర్యాలు వంటి పౌర సౌకర్యాల కల్పనకు దశాబ్దాలు అవసరం లేదు. తక్షణ, స్వల్పకాలిక ప్రణాళికలతో ఒకటి రెండు సంవత్సరాలలో సాధించగలిగిన అవకాశాలు ఉన్నాయి. తెలంగాణ సంస్కృతీ చిహ్నాలకు, సంస్కృతికి సమైక్యాంధ్ర ప్రదేశ్ లో సముచిత గౌరవం దక్కలేదనే ఫిర్యాదుల నేపథ్యంలో తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం తక్షణమే తన సాంస్కృతిక విధానాన్ని ప్రకటించి, పది జిల్లాల సాంస్కృతిక వారసత్వ సంపదను అన్వేషించే, సంరక్షించే, పునరుద్ధరించే, అభివృద్ధి చేసే పథకాలు రూపొందించవచ్చు.

తెలంగాణ ఉద్యమ క్రమంలో న్యాయమైన, ప్రజాస్వామిక డిమాండ్ గా ఆదివాసుల, దళితుల, వెనుకబడిన కులాల, మైనారిటీల, మహిళల అభ్యున్నతి గురించి ఆలోచనలు వెల్లువెత్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే సామాజిక న్యాయ భావనలు, ఆకాంక్షలు విస్తృతంగా తలెత్తాయి. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం తక్షణమే పరిష్కరించవలసిన ముఖ్యమైన సమస్య ఇది. నిజానికి ఈ పరిష్కారం తక్షణమే ప్రారంభమై, మధ్యంతరంగానూ, దీర్ఘకాలికంగానూ కూడ కొనసాగవలసి ఉంటుంది.

తెలంగాణ ప్రభుత్వం తక్షణమే పరిష్కారం ప్రారంభించవలసిన మరి రెండు సమస్యలు పాలనకూ, శాంతి భద్రతలకూ సంబంధించినవి. నిజానికి ఇవి తెలంగాణకు మాత్రమే పరిమితమైనవి కావు. దేశం మొత్తంగానే బ్రిటిష్ వలస పాలన అంతమైన తర్వాత బ్రిటిష్ పాలన నాటి పాలనా యంత్రాంగం, శాంతి భద్రతల యంత్రాంగం యథాతథంగా కొనసాగాయి. వలసపాలకులు ఈ రెండు యంత్రాంగాలకూ ప్రజలను శత్రువులుగా చూసే ధోరణిలో శిక్షణ ఇచ్చారు. 1947

తర్వాత కూడ అదే శిక్షణ కొనసాగుతోంది. తెలంగాణ ఉద్యమ క్రమంలో ఈ రెండు యంత్రాంగాల ఉద్యోగులు కూడ ఉద్యమంలో పాల్గొనడమో, లేదా తెలంగాణ బిడ్డలు ఈ యంత్రాంగంలో ఉంటే తమ మీద హింస సాగేది కాదని తెలంగాణ ఉద్యమకారులు అనుకోవడమో జరిగింది. ఇవాళ ఏర్పడబోయే తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వానికి ఇది ఒక సవాల్. ఇప్పుడిక తెలంగాణకే చెందిన పాలనా యంత్రాంగం ఏర్పడింది గనుక అది తెలంగాణ ప్రజల మీద అవినీతిమయమైన, దాష్టీకపు పాలన నెరపకుండా ఉంటుందా చూడాలి. తెలంగాణ శాంతిభద్రతల యంత్రాంగం తెలంగాణ ప్రజల ప్రాథమిక హక్కులను కాపాడుతుందా, తెలంగాణ పోలీసులు తెలంగాణ ప్రజలను కొట్టకుండా, చిత్రహింసలు పెట్టకుండా, తప్పుడు కేసులలో ఇరికించకుండా, ఎన్ కౌంటర్ల పేరిట చంపకుండా ఉంటారా చూడాలి.

తెలంగాణ ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉంటే ఈ పనులన్నీ తక్షణమే, ఉత్తర్వులద్వారా, శిక్షణ ద్వారా, ఉత్తర్వులను ఉల్లంఘించినవారిని శిక్షించడం ద్వారా అమలు లోకి తేవడానికి అవకాశం ఉంది.

అంత తక్షణమే కాకపోయినా, ఐదేళ్లలో, పదేళ్లలో పరిష్కరించ గలిగినవి నిరుద్యోగం, వ్యవసాయం, చేనేత, పరిశ్రమలు వంటి సమస్యలు. సమైక్య రాష్ట్రపు గణాంకాలను బట్టి తెలంగాణలో నమోదైన విద్యావంతులైన నిరుద్యోగుల సంఖ్య పన్నెండు లక్షల పైనే. నమోదు కాని నిరుద్యోగులు, వ్యవసాయ రంగంలో నిరుద్యోగంలో, అల్పోద్యోగం లో ఉన్నవారి సంఖ్య అంతకన్న ఎక్కువే ఉంటుంది. వీరందరికీ తక్షణమే ఉద్యోగ కల్పన కష్టసాధ్యం కావచ్చు గాని ఐదు, పది సంవత్సరాల మధ్యంతర ప్రణాళికలతో వ్యవసాయ, పారిశ్రామిక, సేవా రంగ అభివృద్ధి చేపడితే, స్వయం ఉపాధి అవకాశాలకు ప్రభుత్వం సహకరిస్తే ఈ నిరుద్యోగాన్ని రూపుమాపడం సమస్య కాదు. వ్యవసాయ రంగాన్ని పునరుద్ధరించకుండా, వ్యవసాయ సంక్షోభాన్ని తొలగించకుండా తెలంగాణ రాష్ట్రంలో నిరుద్యోగ సమస్యను పరిష్కరించడం సాధ్యం కాదు. ఒకవైపు ఆ పని చేస్తూనే, తెలంగాణలోని భూ, జల, అటవీ, ఖనిజ వనరులను వాడుకుని పారిశ్రామికాభివృద్ధి సాధించడం ద్వారా మరికొంత నిరుద్యోగ సమస్యను పరిష్కరించవచ్చు. ఈ రెండు మౌలికమైన పనులూ చేస్తే, సేవారంగ అభివృద్ధి ప్రభుత్వ ప్రోత్సాహం లేకపోయినా దానంతటదే సాగుతుంది. ఈ మూడు రంగాల సమతౌల్యపు అభివృద్ధి మాత్రమే తెలంగాణ పురోగతికి బాటలు వేస్తుంది.

అలాగే తెలంగాణలోని ప్రతి జిల్లాకూ వాటివైన ప్రత్యేక సమస్యలు ఉన్నాయి. అవి అభివృద్ధి ఆకాంక్షలు కావచ్చు, స్థానిక వనరులను వాడుకుని అభివృద్ధి, ఉద్యోగ కల్పన సాధించాలని కోరిక కావచ్చు, స్థానికంగా సముచితమైన సాంకేతిక నైపుణ్యాన్ని ఉపయోగించకపోవడం కావచ్చు. మధ్యంతర దశలో తెలంగాణ ప్రభుత్వం ఇందుకు తగిన అధ్యయనాలు సాగించి ప్రతి జిల్లానూ స్వయం సమృద్ధి దిశగా నడిపించగలిగినప్పుడే, పాత ప్రభుత్వపు హైదరాబాద్ కేంద్రీకరణకు వ్యతిరేక దిశలో సాగినప్పుడే, కొత్త అభివృద్ధి నమూనాను అమలుచేసినప్పుడే తెలంగాణ సమాన సర్వతోముఖాభివృద్ధి సాధ్యమవుతుంది.

ఇక ఐదు, పది సంవత్సరాలలో కూడ సాధ్యం కానివీ, దీర్ఘకాలిక ప్రణాళికలతో, ప్రత్యేకమైన శ్రద్ధతో మాత్రమే అమలు కావలసినవీ అయిన పరిష్కారాలు భూమికీ, నీటి పారుదలకూ, వనరుల అభివృద్ధికీ, విధాన నిర్ణయాలకూ సంబంధించినవి. తెలంగాణలో తరతరాలుగా ప్రధానమైనది భూమి సమస్య. భూపంపిణీలో అసమానత తెలంగాణలో సుదీర్ఘకాలంగా ఉన్న సమస్య. ఆ సమస్య పరిష్కారం కోసమే తెలంగాణ రైతాంగం సాయుధ పోరాటం జరిపింది. ఆ తర్వాత ఆ సమస్య పరిష్కారానికే విప్లవోద్యమం ప్రారంభమై కొనసాగుతోంది. భూమి సమస్య ప్రధానమైనదని పాలకవర్గాలు కూడ గుర్తించినందువల్లనే సైనిక పాలనలోనే సర్ఫ్ ఎ ఖాస్ రద్దు చట్టం, జాగీర్దారీ రద్దు చట్టం వచ్చాయి. హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడగానే కౌలుదారీ సంస్కరణల చట్టం వచ్చింది. 1956లో పెద్ద మనుషుల ఒప్పందంలో భూమి క్రయవిక్రయాలపై ఆంక్షలు వచ్చాయి. 1973లో భూగరిష్ట పరిమితి చట్టం వచ్చింది. అయినా భూమిసమస్యను ఈ పాలకవర్గాలు నిజంగా పరిష్కరించాలని అనుకోకపోవడం వల్ల అది యథాతథంగానే ఉండిపోయింది. భూస్వాములు మారారు గాని భూ అసమానత తొలగిపోలేదు. భూమిలేని నిరుపేదల్లో భూదాహం తీరలేదు. అందువల్ల తెలంగాణ తండ్లాట తీరాలంటే, తెలంగాణలో శాశ్వతమైన, అర్థవంతమైన శాంతి ఏర్పడాలంటే ఈ భూమి సమస్య పరిష్కారం కావాలి. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం దీర్ఘకాలంలోనైనా, కనీసం గత ఆరు దశాబ్దాల చట్టాలలో రాసుకున్న మేరకైనా ఈ సమస్యను పరిష్కరించ గలుగుతుందా అని తెలంగాణ సమాజం ప్రశ్నించవలసి ఉంది.

అలాగే కాకతీయుల కాలం నుంచీ తెలంగాణ వ్యవసాయ సౌభాగ్యానికి కారణమైనది గొలుసుకట్టు చెరువుల, గ్రామీణ చిన్న తరహా నీటి వనరుల వ్యవస్థ. తెలంగాణ భౌగోళిక స్థితికి తగినది ఆ వ్యవస్థ మాత్రమే. భారీ నీటి పారుదల ప్రాజెక్టులు కాంట్రాక్టర్లకే తప్ప తెలంగాణ భూమికీ, రైతుకూ సరిపోయినవి కావు. గొలుసుకట్టు చెరువులను పునరుద్ధరించి, వాటిని అవసరమైన చోట్ల మధ్యతరహా నీటి పారుదల సౌకర్యాలతో సమన్వయించి, తెలంగాణ వ్యాప్తంగా వాగుల, సెలయేళ్ల పునరుద్ధరణ జరిపినప్పుడే తెలంగాణ వ్యవసాయానికి భవిష్యత్తు ఉంటుంది. అలాగే వనరుల వినియోగం, వనరుల పునరుత్పత్తి వంటి రంగాలలో కొత్త ఆలోచనలు, పర్యావరణ అనుకూల, ప్రజానుకూల ఆలోచనలు చేయకుండా తెలంగాణ సర్వతోముఖాభివృద్ధి సాధ్యం కాదు. ఇదంతా ఒక రకంగా మౌలిక అవగాహనలలోనే రావలసిన మార్పు. అటువంటి మౌలిక అవగాహనల మార్పులు ప్రస్తుత వ్యవస్థలో కూడ సాధ్యమేనని పర్యావరణ ఉద్యమం చూపుతున్నది. తెలంగాణ పాలకవర్గాలు ఈ వివేకాన్ని ప్రదర్శిస్తాయా చూడాలి.

తెలంగాణ జాతీయ గీతంలో పాడుకుంటున్నట్టుగా 'సుఖశాంతుల తెలంగాణ, సుభిక్షమైన తెలంగాణ' సాధించాలనే కోరిక తెలంగాణ పాలకవర్గాలకు ఉందా లేక, అది కేవలం ఒక నినాదంగా, వాగ్దానంగా మాత్రమే తలకెత్తుకున్నారా, అసలు కోరిక తమ అధికారం కోసం తపన మాత్రమేనా ప్రస్తుతం బయటపడబోతున్నది.

హైదరాబాద్ మీద సైనిక చర్య జరిగిన తర్వాత 1950లో వార్తాసేకరణ కోసం వచ్చిన ఎకానమిస్ట్, గార్డియన్ ల విలేఖరి తాయా జింకిన్ సైనికాధికారులతో కలిసి వరంగల్ జిల్లా అడవుల్లో పర్యటించి నప్పుడు, అక్కడ ఒక జీపు డ్రైవర్ ఏమన్నాడో రాసింది. 'నువ్వే ప్రభుత్వమైతే ఏం చేస్తావు' అని ఆమె అడిగిందట. 'జనానికి బాగా అప్పులిస్తాను. బోలెడన్ని బళ్లూ ఆస్పత్రులూ కట్టిస్తాను. దున్నేవాడికే భూమి పంపిణీ చేస్తాను.... గ్రామాల రక్షణకు స్వచ్ఛంద సాయుధ దళాలను ఏర్పాటు చేస్తాను' అని ఆ డ్రైవర్ అన్నాడట. 1950లో అయినా, 2013లో అయినా తెలంగాణ కోరుతున్నదదే. తెలంగాణ సమాజ ఆకాంక్షలు అవే. మరొక సందర్భంలో చెరబండరాజు రాసినట్టు, 'ఇంటింట చీకటె, ప్రతి కంట కన్నీరె, రాజ్యమెవరికి వచ్చెనో రాజన్న' అనుకోకుండా ఉండాలనేదే తెలంగాణ కోరిక. ఆ కోరిక నెరవేరకపోతే పాలకులెవరైనా సరే, పోరాడడమే తెలంగాణ ప్రజలకు తెలుసు.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# విశాఖ మన్యంలో పోలీసుల రాజ్యం

*బాక్సైట్ ఖనిజం తవ్వకాల కొరకు ఏజెన్సీ ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజలపై పోలీసు బలగాలు పెద్ద ఎత్తున దాడులు చేస్తూ భయభ్రాంతులకు గురిచేస్తున్నాయనీ, ఆదివాసులు చైతన్యవంతులై తిరగబడాలనీ అంటున్నారు* **కొర్ర జ్యోతి**

విశాఖ మన్యంలో గత మూడు సంవత్సరాల నుండి పోలీసుల రాజ్యం నడుస్తోంది. ఏజెన్సీ ప్రాంతంలోని కొయ్యూరు, గూడేం, చింతపల్లి, పెద్దబయలు, జి.మాడుగుల మండల పరిధిలోని గ్రామాలను పోలీసులు దాడులతో భయభ్రాంతులకు గురిచేస్తున్నారు. ఈ ఐదు మండలాల పరిధిలోని గ్రామాలు బాక్సైట్, కాష్ ఖనిజాలు ఉన్నాయి. ఒక చింతపల్లి మండలం పరిధిలో 224 మిలియన్ టన్నుల బాక్సైట్ ఖనిజం ఉంది. ఇలా మండలాల వారిగా చూసినా, గ్రామాల వారిగా చూసిన ఏదో ఒక ఖనిజంతో ఉంటుంది. దీని ఫలితంగానే రాజ్యం కన్ను ఏజెన్సీ గ్రామాలపై పడింది. ముఖ్యంగా కొండ కోనల మధ్యలో చాలా ఆహ్లాదంగా కనిపిస్తున్న గ్రామాలు ఎన్నో పంటలకు నిలయంగా ఉంటూ వస్తున్నాయి. ఆదివాసులు ఈ మన్యం కొండలపై ఆధారపడి జీవనం సాగిస్తున్నారు. 1980ల నుండి ఆదివాసి ప్రాంతంలో ప్లాంటేషన్ పేరుతో (సిల్వర్ మొక్కలు నాటి) ఎపిఎఫ్‌డిసి అధికారులు ఈ ప్రాంతాలకు ప్రవేశించారు. ఏజెన్సీ ప్రాంతంలో ఎపిఎఫ్‌డిసి అధికారులు సుమారు 4000 హెక్టార్లకు పైగా కాఫీ మొక్కలని నాటి ఆదివాసుల శ్రమను దోపిడి చేయడం ప్రారంభించారు. దీని ద్వారా వందల కోట్ల రూపాయలు ఎపిఎఫ్‌డిసి అధికారులు ప్రతి సంవత్సరం అర్జిస్తున్నారు.

ఈ ప్రాంతంలో 1980కి ముందు నుంచే ఎపిఎఫ్‌డిసి అధికారులు దోపిడీ, అరాచకానికి పాల్పడుతున్నారు. 1980ల నాటికి ఎపిఎఫ్‌డిసితో ఆదివాసులు తీవ్రమైన సమస్యను అనుభవిస్తున్నారు. ఆనాటికి ఏజెన్సీ ప్రాంతంలోకి పీపుల్స్‌వార్ పార్టీ ప్రవేశించడంతో ఎపిఎఫ్‌డిసి అధికారుల దోపిడికి కళ్లెం వేసినట్లుగా అయ్యింది. దీన్ని గమనించిన పీపుల్స్‌వార్ పార్టీ (ప్రస్తుతం మావోయిస్టు పార్టీ) ఆదివాసులను ఐక్యం చేసి ఎపిఎఫ్‌డిసి అధికారులను మన్యం నుండి తరిమికొట్టాలి అని 'జల్–జంగల్–జమీన్' పై హక్కు ఆదివాసులదే అనే నినాదం ఇవ్వడంతో ఆదివాసులు కదం తొక్కారు. ఈ పిలుపుతో పీపుల్స్‌వార్ పార్టీకి ఆదివాసులలో మరింత బలం చేకూరింది. దీన్ని చూసి మింగుడుపడని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆదివాసి ప్రాంతాలలో సిఆర్‌పిఎఫ్, బిఎస్ఎఫ్ పోలీసు బలగాలను నింపి మన్యం ప్రజలను నిర్బంధానికి గురిచేశారు. ఈ నిర్బంధం ద్వారా ప్రజల్లో మరింత ఐక్యత పెరిగి ప్రభుత్వాన్ని అసహ్యించుకొనే పరిస్థితి ఏర్పడింది.

'జల్–జంగల్–జమీన్' పై హక్కు ఆదివాసులదే అనే నినాదాన్ని మావోయిస్టులు ప్రచారం చేయడంతో కూలీ రేట్ల కోసం మొదలైన పోరాటం కాఫీ తోటలు స్వాధీనం చేసుకొనే వరకు ఆదివాసులు వచ్చారు. ఇలా ప్రజా పోరాటాలు రోజురోజుకు మరింత పదునెక్కుతుంది చూసిన ప్రభుత్వాలు ఒక్కసారిగా ఉలికిపడ్డాయి.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆదివాసులపై 2009 ఆగస్టు నుండి ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడిని ప్రారంభించాయి. ఈ దాడిని దేశ వ్యాప్తంగా వ్యతిరేకించినా మన దేశ పాలకులు వెనక్కి తగ్గలేదు. 2010 నుండి ఏజెన్సీ ఐదు మండలాల పరిధిలో బాక్సైట్ సమస్య ముందుకు రావడంతో సాధారణ రాస్తారోకో నుండి ఈ మధ్య జరిగిన స్థానిక ఎన్నికలను బహిష్కరించే వరకు ఆదివాసుల పోరాటాలు చేరుకున్నాయి.

ఆదివాసుల పట్ల బూర్జువా పార్టీల నాయకులు నిమ్మకు నీరెత్తినట్లుగా ఉన్నారు. ప్రజల జీవన మరణ సమస్యని గాలికి వదిలి తెలంగాణ విడిపోతే ఆంధ్ర నాయకుల ఆస్తులకు, పదవులకు తూట్లు పడుతాయి. కాబట్టి చాలా తొందరగా రాజీనామా నాటకం ముందుకు వచ్చింది. అదే ఆదివాసుల జీవన మరణ సమస్య ముందుకొస్తే పెదవులు మెదపకుండా ఉన్నారు. రాష్ట్రం విడిపోతే ప్రజల సమస్యగా పాలకులు సృష్టిస్తున్నారు తప్ప, అది ఎంత మాత్రం ప్రజల సమస్య కాదు. రాజకీయ నాయకుల ఆస్తులను, పదవులను సమస్యగా చూడాలి. ప్రజల సమస్యలు జీవన మరణ సమస్యలు, భారీ ప్రాజెక్టులు, బాక్సైట్, ఎస్ఈఆర్. కంపెనీ వీటికి అనుబంధంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ లాంటి దాడులను, పాలకులు పక్కన పెట్టి ప్రజలకు సంబంధం లేని పోరాటాలను ప్రధానం చేస్తున్నారు. ఈ ఐదు సంవత్సరాల కాలంలో ఏజెన్సీ ఐదు మండలాల పరిధిలో ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడుల కారణంగా భయంతో 25 గ్రామాలకు పైగా చెందిన ఖాళీ చేసి పోయారు. వందల మంది ఆదివాసి యువకులను అక్రమంగా అరెస్టులు చేసి తీవ్రమైన చిత్రహింసలకు గురిచేశారు. ఈ ఐదు సంవత్సరాల కాలంలో వందల కుటుంబాలు వీధిన పడ్డాయి.

ఇక బూటకపు ఎన్‌కౌంటర్లలో పదుల సంఖ్యలో అమాయక ఆదివాసులను పొట్టనపెట్టుకుంది సరిపడక, రాజ్యం ప్రత్యేక పోలీసు బలగాలను మన్యం ప్రాంతంలో కూంబింగ్ పేరుతోని ఆదివాసి మహిళలపై అత్యాచారాలు చేయిస్తుంది. ఇలాంటి ప్రజల సమస్యలను పక్కనపెట్టి ప్రజలకు సంబంధం లేని పోరాటాల వైపు మళ్లిస్తున్నారు. మరో పక్క ఆదివాసులను ప్రజా పోరాటాల నుండి పక్క దారి పట్టించడానికి, శవాలపై చిల్లర డబ్బుల లాంటి సంస్కరణలను గుప్పిస్తూ రాజ్యం సామ, దాన, భేద, దండోపాయం అనే ఎల్ఐసి దాడిని అవలంభిస్తోంది. గూడేం, కొయ్యూరు, పెద్దబయలు, జి.మాడుగుల, చింతపల్లి మండలాల గ్రామాలపై పడి సాయుధ దాడులు చేసి అక్రమంగా అరెస్టులు చేస్తున్న క్రమంలో అడ్డుపడ్డ (తోటి ఆదివాసుల సహాయం కోసం) ఆదివాసులపై కాల్పులు జరుపుతూ, ఆదివాసులను భయభ్రాంతులకు గురి చేస్తున్నారు. ఈ మధ్యకాలంలోనే 2013 నవంబర్ 8న దిగుజనభ గ్రామంపై ఒడిషా పోలీసులు (ఆంధ్రప్రదేశ్ గ్రామంపై)

# నిత్యజీవితంలో సోషలిజం' పుస్తకావిష్కరణ సభ - సదస్సు

- భూసారం

**2013**, డిసెంబర్ 8న హైదరాబాద్‌లోని ఆంధ్ర సారస్వత పరిషత్ హాల్లో 'నిత్యజీవితంలో సోషలిజం' పుస్తకావిష్కరణ సభ – సదస్సు జరిగింది. సభను 'వీక్షణం' కరస్పాండెంట్ వై. రామచంద్రం ప్రారంభించారు. తన ప్రారంభ ఉపన్యాసంలో ఈ పుస్తక రచనకు ప్రేరణ ఇచ్చిన అమరుడు ప్రొ. ఆర్.ఎస్. రావు నిబద్ధతను, పట్టుదలను వివరించారు.

అమరుల బంధుమిత్రుల సంఘం బాధ్యురాలు పద్మ 'నిత్యజీవితంలో సోషలిజం' పుస్తకాన్ని ఆవిష్కరించి మొదటి ప్రతిని రచయిత తల్లి సీతమ్మకి, మలి ప్రతులు వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు, వి.హనుమంత రావుకు, రచయితకు తొలినాళ్లలో సోషలిస్ట్ జ్ఞానం పరిచయం చేసిన ఎస్. నారాయణ రాజుకు అందించారు. ప్రపంచంలోనే మొదటిసారి సోషలిజం నిర్మాణంలో సోవియెట్ ప్రజలు ప్రదర్శించిన కార్యదీక్షను, వారు సాధించిన విప్లవ సామాజిక విజయాలను రచయిత 'నిత్య జీవితంలో సోషలిజం' పుస్తకం ద్వారా చెప్పడం బాగుందనీ, ఇప్పుడు దీని అవసరం కూడా చాలా ఉందని పుస్తకావిష్కర్త క్లుప్తంగా సభకు వివరించారు.

రచయిత భూసారం శివన్న పుస్తక రచనా సందర్భాన్ని చెప్పారు. తన జీవన గమనంలో సోషలిజం ఆవశ్యకతను తను ఎలా ఎంచుకుని కొనసాగినదీ వివరించారు. క్లుప్తంగా తను రాసిన 'నిత్య జీవితంలో సోషలిజం –అవును మాకు సోషలిజమే కావాలి' పుస్తకాన్ని పరిచయం చేశారు. వరవరరావు 'సోషలిజం ఆవశ్యకత' గురించి అధ్యక్షోపన్యాసం చేశారు. గత సోవియెట్ రష్యా, విప్లవ జన చైనా సోషలిజపు నిర్మాణ అనుభవాలతో పాటు ఇప్పుడు దండకారణ్యంలో బీజరూపంలో ఉన్న ప్రజా ప్రత్యామ్నాయ సోషలిస్టు నిర్మాణాన్ని కూడా అర్థం చేసుకోవాలనీ, అధ్యయనం చేసి సమాజానికి చెప్పాల్సి ఉందనీ అన్నారు. వక్త నరసింహారెడ్డి 'సోషలిజం–విద్య' అనే అంశంపై మాట్లాడారు. భారతదేశంలో ఇప్పుడు విద్య ఎలా వ్యాపారమయమై పోయిందో, గత సోవియెట్ రష్యాలో తొలినాళ్లలోనే విద్యా–విజ్ఞానమూ ఓ సామాజిక ఉద్యమంగా ఎలా కొనసాగి ఓ ప్రజాభ్యుదయ అంశంగా చరిత్ర కెక్కిందో వివరించారు. డప్పు రమేష్ బృందం తమ పాటలతో సభను ఉత్తేజ పరిచారు.

భోజన విరామం తరువాత మధ్యాహ్న సభా కార్యక్రమానికి రచయిత భూసారం శివన్న అధ్యక్షత వహించారు. వక్త డా. నళిని, సోషలిజం: 'వైద్యం–ఆరోగ్యం' అనే అంశం పై మాట్లాడారు. ఇప్పటి మన భారత దేశ పరిస్థితుల్లో వైద్య – ఆరోగ్య రంగం పాలకుల్లో, వైద్యుల్లో, వైద్య విధానంలో చిత్త శుద్ధి కరువై, ప్రజలకు సేవ చెయ్యాలనే అంశం కొరవడి వనరులు, నిధులూ ఉన్నప్పటికీ కూడా అవి ప్రజలకు ఎలా అందకుండా పోతున్నాయో, అవినీతిమయం అవుతున్నాయో సోదాహరణంగా తన అనుభావాల నుండి వివరించారు. గత సోషలిస్ట్ జన చైనాలో ఒట్టికాళ్ల (బేర్ ఫుట్) వైద్య ఆరోగ్య కార్యకర్తలు ప్రజలకు ఎలా సేవలను అందించారో వివరించారు. నిబద్ధత–ప్రజలకు సేవ చేయాలనే చిత్తశుద్ధి కరువైన సమాజాలలో వైద్య–ఆరోగ్య వ్యవస్థల పని విధానానికి మన దేశమే ఓ పెద్ద ఉదాహరణ అని అన్నారు.

విరసం కార్యదర్శి వరలక్ష్మి 'సోషలిజం – మహిళ' అనే అంశం పై ప్రసంగ పత్రం పంపించారు. ఆ పత్రాన్ని రచయిత భూసారం సభకు చదివి వినిపించారు. రాంకి, అరుణతార వర్కింగ్ ఎడిటర్, 'సోషలిజం–వ్యవసాయం' అనే అంశంపై క్లుప్తంగా మాట్లాడేరు. 'నిత్యజీవితంలో సోషలిజం' పుస్తకం నుండి కొన్ని వివరాలను ఉదాహరిస్తూ ప్రసంగించారు. భారత దేశంలోని ప్రస్తుత వ్యవసాయ సంక్షోభాన్ని, విస్థాపనను, రైతుల ఆత్మహత్యల పర్వాన్ని తడుముతూ వీటి నుండి విముక్తి పొందడానికి సోషలిస్ట్ దృక్పథపు ఆవశ్యకతను నొక్కి చెప్పారు. చివరిగా వీక్షణం సంపాదకులు ఎన్. వేణుగోపాల్ 'సోషలిజం–జాతుల సహజీవనం' అనే అంశంపై తన ఉపన్యాసాన్ని కేంద్రీకరించి, సోషలిస్టు సమాజపు తొలి నిర్మాణ దశలోనే సోవియెట్ యూనియన్లో చప్పన్నారు జాతులను, ఉప జాతులను సమసమాజ స్పృహతో, తాత్వికతతో ఎంత అద్భుతంగా అక్కున చేర్చుకుని, ఎంతో వెనుకబడి, చదువనూ, రాయనూ చేతగాని, అసలు భాషా లిపులే లేని అనేక కొండ, సంచార జాతుల వారిని అభివృద్ధి పరచారో వివరించారు. స్వాతంత్ర్యానంతర భారతంలో 66 ఏళ్లు గడుస్తున్నప్పటికీ, జాతుల పట్ల పాలకుల విద్వేషపూరిత, అణచివేత విధానాలు అప్పటి సోషలిస్ట్ విధానాలతో పోల్చి చూసుకోవాల్సిన అవసరాన్ని వివరించారు. రచయిత భూసారం శివన్న ఈ పుస్తకం రాయడానికి చేసిన ప్రయత్నాన్ని, పడ్డ శ్రమను, కృషిని అభినందించారు. అలాగే, రచయిత పుస్తకానికి రాసిన ముగింపు వాక్యాలలో చెప్పిన విషయాలను ఉటంకిస్తూ ఇంకా ఆయన సోషలిజంపై ఇంకా రెండు పుస్తకాలు రాయవలసి ఉందనీ, తప్పక రాయాలని కోరుకుంటున్నానని అంటూ తన ప్రసంగాన్ని ముగించారు.

వి. హనుమంతరావు మాట్లాడుతూ 'అక్టోబర్ విప్లవం' రాబోయే నాలుగేళ్లలో 100 సంవత్సరాలు పూర్తి చేసుకునే సందర్భంలో వామపక్ష వాదుల ఐక్య సంఘటనతో, కార్యాచరణతో ఒక బ్రహ్మాండమైన సభ నిర్వహించడానికి ప్రణాళిక ఇప్పటి నుండే రూపొందించుకోవాలని, దానికి దోహదంగా వారు కొన్ని సలహాల పట్టిక తయారుచేసి రచయిత భూసారం శివన్న ఇందుకు పూనుకోవాలనీ, నడుం కట్టాలనీ సూచిస్తూ ఆ పట్టికను ఇచ్చారు.

డప్పు రమేష్ కళా బృందం విప్లవ గీతాలను పాడి ఆహుతులను ఉత్తేజ పరిచారు. వీ

---

దాడిచేయడం ఎంత వరకు సమంజసమో ? అర్ధరాత్రి గ్రామంపై దాడి చేసి గ్రామస్తులను చితకబాది పది మంది ఆదివాసులను గాయపర్చారు.

ఈ విషయంలో ఏ ఒక్క రాజకీయ నాయకుడు జోక్యం చేసుకోలేదు. పైగా ప్రభుత్వాలు హద్దుల కోసం, చట్టాల కోసం ప్రజలకు ఊకదంపుడు ఉపన్యాసాలు ఇస్తుంటారు. మరి ప్రభుత్వం చట్టాలను, హద్దులను ఉలంఘించినప్పుడు వారిపై ఏ చర్యలు తీసుకుంటారు? అవి ఏవి మన ప్రభుత్వాలకు వర్తించవు. ప్రజలకు మాత్రమే పాలకులు వర్తింప చేస్తున్నారు. మన్యం ఆదివాసులు ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడులను ఎందుకు ఎదుర్కోవాల్సి వస్తుంది. మన్యం ప్రాంతంలో ఉన్న విలువైన ఖనిజాన్ని కాపాడుకోవడం కోసం ఆదివాసులకు తప్పని పరిస్థితి ఏర్పడింది. జల్–జంగల్–జమీన్‌పై హక్కు కోసం గ్రీన్‌హంట్ ఆపరేషన్ లాంటి దాడులను ఎదుర్కొంటున్నారు. అంటే ఆదివాసులంతా ఐక్యంగా ఉద్యమించాల్సిన అవసరం రోజు రోజుకు మరింత బలపడుతోంది. గ్రీన్‌హంట్ లాంటి దాడులను ఎదుర్కోవాలి అంటే సాయుధంగా మాత్రమే ఎదుర్కోగలం. మన్యం ప్రజలారా! మనం వేర్పాటువాదం లాంటి పోరాటాల వైపు కాదు మన ప్రయాణం. గ్రీన్‌హంట్ దాడులను ఎదుర్కొనే లక్ష్యంతో ఉద్యమిద్దాం!

*(రచయిత ఆదివాసి మహిళా సంఘం సభ్యులు)* వీ

# సరండాలో గ్రీన్‌హంట్ మార్క్ అభివృద్ధి

**ప్రభుత్వం సరండా ప్రాంతంలో గ్రీన్‌హంట్ పేరుతో ఆదివాసులను నిర్వాసితులను చేస్తూ, మైనింగ్ కంపెనీలను ఆహ్వానిస్తూ, అనివార్యంగా ఆదివాసి ప్రజలు తమ మనుగడకోసం పోరాడాల్సిన పరిస్థితిని కల్పిస్తుందంటున్నారు ఎన్. రవి**

చిదంబరం 'క్లియర్, హోల్డ్, బిల్డ్' అనే వ్యూహంతో మావోయిస్టు ఉద్యమాన్ని తుదముట్టించడానికి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలుపెట్టి నాలుగేళ్లు పూర్తయింది. 'క్లియర్, హోల్డ్, బిల్డ్' అంటే ఒక ప్రాంతంలో పెద్ద ఎత్తున దమనకాండ జరిపి, బలగాలను మోహరించి మావోయిస్టులు లేకుండా (క్లియర్) చేయడం, ఆ తదుపరి ఆ ప్రాంతాన్ని తమ అదుపులో ఉంచుకోవడం (హోల్డ్), ఆ సమయంలో ఆ ప్రాంతాన్ని అభివృద్ధి (బిల్డ్) చేసి మావోయిస్టులు మళ్లీ తలెత్తని పరిస్థితులను కల్పించి మావోయిస్టు ఉద్యమాన్ని అంతం చేయడం.

అయితే ఈ 'క్లియర్, హోల్డ్, బిల్డ్' మావోయిస్టు ఉద్యమమున్న ప్రాంతమంతటా ఒకేసారి అమలు పరచడం సాధ్యం కాదు కాబట్టి 'క్లియర్' చేసే లక్ష్యంతో మొత్తం దండకారణ్య ప్రాంతం, ఒడిశా, జార్ఖండ్‌లో రెండున్నర లక్షల దాకా వివిధ కేంద్ర, రాష్ట్ర పోలీసు బలగాలను మోహరించినా మిగిలిన రెండు ఉద్దేశ్యాలు కూడా పూర్తి చేసేందుకు మాత్రం కొన్ని ప్రాంతాలనే ఎంచుకున్నారు. అందులో జార్ఖండ్‌లో మూడు ప్రాంతాలు ఉన్నాయి. ఒకటి సరండా గ్రామం, రెండవది లాతేహార్ జిల్లాలోని సరయు (సర్జు అని వాడుక పిలుపు), మూడవది బొకారో జిల్లాలోని ఝుమ్రా పహాడ్ ప్రాంతం.

ఈ మూడు ప్రాంతాల నుండి మావోయిస్టులను తరిమివేస్తామని ప్రకటించి అక్కడ పెద్ద ఎత్తున పోలీసు క్యాంపులు ఏర్పాటు చేసి మొదటి రెండు లక్ష్యాలు పూర్తి చేసుకున్నామనీ – ఇక మూడవ లక్ష్యమైన అభివృద్ధిపై కేంద్రీకరిస్తామని ప్రభుత్వం ప్రకటిస్తోంది. ఈ గ్రీన్‌హంట్ నాణానికి చిదంబరం ఒకవైపు నిర్బంధపు బొమ్మ అయితే, జైరాం రమేష్ 'అభివృద్ధి' అనే బొరుసు (చిదంబరం ప్రస్తుతం గృహమంత్రి కాకపోవచ్చు కానీ, గ్రీన్‌హంట్ వ్యూహరూపకర్త అతనే). సరండా ఏక్షన్ ప్లాను, సరయూ డెవలప్‌మెంట్ ఏక్షన్ ప్లానులకు రూపకల్పన చేసి వాటి అమలు కోసం కాలికి బలపం కట్టుకొని సరండా, సరయూ ఆ తర్వాత ఝుమ్రా పహాడ్ ప్రాంతాలను చుట్టబెడుతున్నది రమేష్.

సరండా ప్రాంతం జార్ఖండ్‌లోని పశ్చిమ సింగ్‌భూం జిల్లాలోని ఒడిషా సరిహద్దు ప్రాంతం, ఒడిషాలోని సుందర్‌గఢ్ జిల్లాలోని ఉత్తర ప్రాంతంలో వ్యాపించి ఉన్న ఆసియాలోనే అతిపెద్ద సాళవృక్ష అడవి ప్రాంతం. ఏనుగులకు శరణస్థలి. ఖనిజాలకు కాణాచి. ముఖ్యంగా ఇనుప ఖనిజం విస్తారంగా ఉన్న ప్రాంతం. దట్టమైన అడవి. అతికొద్ది గ్రామాలు (56 గ్రామాలు, 36,500 జనాభా). ప్రధానంగా హో తెగ ప్రజలు ఉన్నారు. ఎటువంటి అభివృద్ధికీ నోచుకోని ప్రాంతం. 90వ దశకంలో మావోయిస్టు విప్లవకారులు అక్కడికి ప్రవేశించాక అతికొద్ది కాలంలోనే విప్లవోద్యమం వేళ్లూనుకుంది. దట్టమైన అటవీ ప్రాంతంతో కూడుకొని ఉండడం వల్ల సైనిక కోణంలో గెరిల్లా యుద్ధానికి చాలా అనుకూలమైన ప్రదేశం కావడంతో అక్కడ గెరిల్లా ఆధార ప్రాంతాన్ని నెలకొల్పడానికి మావోయిస్టు పార్టీ ప్రత్యేకమైన శ్రద్ధతో పనిచేసినట్టు పత్రికా కథనాలను బట్టి అర్థమవుతుంది. (గెరిల్లా ఆధార ప్రాంతం అంటే చైనాలోని ఏనాన్ వంటి సువిశాలమైన సుస్థిర స్థావర ప్రాంతం కాదు. సాపేక్షికంగా తక్కువ భౌగోళిక ప్రాంతంలో అంత స్థిరత్వం సంపాదించని ఆధార ప్రాంతం మాత్రమే. భవిష్యత్తులో స్థిరమైన ఆధార ప్రాంతం నెలకొల్పడానికి ప్రారంభపు భూమికగా లేదా కొన్నిసార్లు కేంద్రంగా మాత్రమే ఇది పనిచేస్తుంది.) ఈ ప్రాంతంలోనే 2004 సెప్టెంబర్ 21న ఎం.సి.సి., పీపుల్స్‌వార్ పార్టీలు విలీనమై సిపిఐ (మావోయిస్టు) పార్టీగా అవతరించిన కీలక సమావేశం జరిగిందని పోలీసుల అభియోగం. అంటే భారత విప్లవోద్యమంలో సరండా ప్రాంతం ఒక గొప్ప చారిత్రక ప్రాముఖ్యత సంతరించుకున్నది.

విప్లవోద్యమానికి, ప్రజా విముక్తి సైన్యానికి ఒక బలమైన స్థావర ప్రాంతంగా ఎదగగల ఈ ప్రాంతంపై సహజంగానే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆరు నూరైనా తమ పట్టు సంపాదించడానికి నడుం కట్టుకున్నాయి. దీనికి తోడు మన దేశంలోని సకల ఖనిజ సంపదను ఎంఎన్‌సిలకు, దళారీ పెట్టుబడిదారులకు ధారాదత్తం చేయబూనుకున్న దళారీ మన్మోహన్ సింగ్ – చిదంబరాలకు సరండా ఖనిజ సంపదపై కన్నుపడడంలో ఆశ్చర్యమేముంది?

2004 తర్వాత జార్ఖండ్‌లో విదేశీ, దేశీ బడా కంపెనీలతో ఇక్కడి ప్రభుత్వం 107 ఒప్పందాలను (ఎం.ఒ.యు.లను) కుదుర్చుకుంది. అందులో 19 ప్రత్యేకంగా సరండా ప్రాంతాన్ని కొల్లగొట్టడానికే. అక్కడ విప్లవోద్యమం సరండా ప్రాంతంలోని గ్రామాలన్నింటా ప్రజా రాజ్యాధికార సంస్థలైన 'క్రాంతికారీ జన సమితి'లను (దండకారణ్యం లో జనతన సర్కార్ వంటివి) నెలకొల్పి అంతకు పైస్థాయి విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించే దిశలో ముందడుగు వేస్తున్నది కాబట్టి, సామ్రాజ్యవాదాన్ని సమూలంగా నాశనం చేసేందుకు ఉదయిస్తున్న ఈ నూతన విప్లవ ప్రభుత్వాన్ని అంతం చేయకుండా సామ్రాజ్యవాద కంపెనీలకు ఊడిగం చేసే ఒప్పందాలను అమలు పరచడం అసాధ్యమే కాక, అసలుకే ఎసరు వచ్చే ప్రమాద ముందని సరండాపై ఉక్కుపాదం మోపడానికి రంగం సిద్ధమైంది.

సరండాలో అనకొండ అంటే దట్టమైన అటవీ ప్రాంతం కాబట్టి అనకొండ పాముకు ఆశ్రయ స్థలమే అనుకుంటే తప్పే. అనకొండ అంటే సరండాలో చేపట్టిన తొలి అతిపెద్ద గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరు. అనకొండ–1, అనకొండ–2 అని అక్కడ చేపట్టిన ఆపరేషన్ల పేర్లు. ఈ అనకొండ సరండాలోని వృక్ష సంపదను, వన్య ప్రాణులను, ఖనిజ సంపదను, 'హో' ఆదివాసులను భక్షించే, పచ్చదనాన్ని వేటాడే సర్పం.

ఈ ఆపరేషన్ అనకొండ–1ని 2011 జూలై 28 నుండి ప్రారంభించారు. దాదాపు 35 రోజుల పాటు 13,000 సిఆర్‌పిఎఫ్, కోబ్రా, జార్ఖండ్ జాగువర్ వంటి బలగాలను మోహరించారు. ఉత్తరాన, ఈశాన్యంలో మనోహర్‌పూర్ నుండి దక్షిణాన కరిబురు వరకు దాదాపు 80 కిలోమీటర్లు, తూర్పున మనోహర్‌పూర్ – ఛోటా వగ్రా పక్కా రోడ్డు

నుండి పశ్చిమాన పశ్చిమసింగ్ భూం, సుందర్‌గఢ్ సరిహద్దు వరకు, ఇంకా ఒడిశాలోని ప్రాంతం కూడా కలిపి 50 కిమీ, అట్లా మొత్తం దాదాపు 4000 చదరపు కిలోమీటర్లు ఈ అనకొండ వేట ప్రాంతం.

ఈ ఆపరేషన్ కోసం హెలిపాడ్లు నిర్మించి, హెలికాప్టర్లను, మానవ రహిత విమానాలను ఉపయోగించారు. ఐజి, డిఐజి, ఎస్‌పి స్థాయి ఉన్నతాధికారులు ప్రత్యక్షంగా పాల్గొని కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో యూనిఫైడ్ కమాండ్ నిర్దేశంతో ఈ ఆపరేషన్‌ను నడిపారు.

ఆచితూచి అడుగు వేస్తూ రోజుకు కొద్ది కిలోమీటర్లు మాత్రమే కదులుతూ నిరంతరం హెడ్‌క్వార్టర్‌తో సంబంధంలో ఉంటూ ఈ ఏరియా డామినేషన్ ఎక్సర్‌సైజు నడిచింది. కవర్ చేసిన ప్రాంతంలో తాత్కాలిక క్యాంపులు నిర్మిస్తూ పూర్తి లోతట్టు ప్రాంతంలోకి ప్రవేశించారు.

మావోయిస్టులతో ఒకటి, రెండు చోట్ల పోరాటాలు జరిగాయి. కాని, బలగాల సంఖ్య చాలా ఎక్కువ ఉన్నందువల్ల గెరిల్లా యుద్ధ నీతికి అనుగుణంగా మావోయిస్టు బలగాలు అక్కడి నుంచి ఆ సమయంలో తప్పుకున్నాయి. కాబట్టి పోలీసు బలగాలు మావోయిస్టు బలగాలనేరి దెబ్బతీయ లేకపోయాయి. దాంతో వాళ్లు తమ ప్రతాపాన్ని సాధారణ ప్రజల మీద ప్రయోగించారు.

తిరిల్‌పోసి, కుమ్‌డీహ్, హత్నాబురు, బలిబా, నగర్‌కటా, తొల్కా బాద్, గుండిజోడి, రతామాటి వంటి గ్రామాలన్నీ తీవ్ర నిర్బంధాన్ని చవిచూశాయి. సిఆర్‌పిఎఫ్ సహాయ కమాండెంట్ శంభు విశ్వాస్ బలిబా గ్రామానికి చెందిన మంగల్‌హోన్ హగ్గాను అందరు చూస్తుండగానే పాయింట్ బ్లాంక్ రేంజిలో కాల్చి చంపాడు. ఆగస్ట్ 7న బలిబాకు చెందిన ఒక గర్భవతి మహిళపై అత్యాచారం జరిపారు. ఆ తర్వాత ఆమె చనిపోయింది. అదే రోజు హత్నాబురులో ఒకరిపై సామూహిక అత్యాచారం జరిపారు. ఈ ఆపరేషన్ ముందు జూలై 18న తొల్కాబాద్‌కు చెందిన సొంబారిపై అత్యాచారం జరిపి వదిలేస్తే రక్తస్రావంతో చనిపోయింది. ఒక చిన్నపిల్లను కాల్చిచంపారు. తొల్కాబాద్‌లోనే 72 ఏళ్ల తూసాహోన్ హగ్గాను కొడితే వెన్నువిరిగింది. తరువాత క్యాంపులో వైద్యం లేకుండా వదిలేస్తే అతను చనిపోయాడు. నగర్‌కటాకు చెందిన సోనా గుడియాను స్పృహ తప్పేలా కొట్టి తర్వాత కాల్చి చంపారు. ఆగస్ట్ 11న జూజోపీని నగ్నంగా చేసి అత్యాచారం జరిపారు.

సరండా ప్రాంతంలోని 25 గ్రామాల్లో ఇల్లిల్లూ సోదా చేసి, గ్రామస్తులను కొడుతూ, వారి పంట చేలను ధ్వంసం చేస్తూ తమ స్వాధీనంలోకి తెచ్చుకున్నారు. భవిష్యత్తులో కూడా తమ కార్పెట్ సెక్యూరిటీ సిస్టంను (ఒక ప్రాంతమంతా పెద్ద ఎత్తున బలగాలను నింపివేయడం) పటిష్టంగా అమలు జరపడం కోసం యాభై ఆరు గ్రామాల కోసం కోటల్లాంటి 17 ఆధునిక పోలీస్ స్టేషన్లను నిర్మించడం ప్రారంభించారు. అంటే దాదాపు మూడు చిన్న గ్రామాలకు ఒక పోలీస్ స్టేషన్.

ఒక నెలరోజుల పాటు దాదాపు ప్రతి గ్రామంలో క్యాంపు వేసి ఈ నిర్బంధకాండ అమలు జరిపి కొన్ని డజన్ల మందిని అరెస్టు చేసి బైబాస జైల్లో వేశారు. ఆస్తిని ధ్వంసం చేసి గ్రామస్తులు ఆరు గాలం కష్టపడి సంపాయించి దాచుకున్న డబ్బులను దొంగలించారు. ఇట్లా చిదంబరపు 'క్లియర్, హోల్డ్' అమలవుతుంటే ఇక అభివృద్ధి వీరుడు జైరాం రమేష్ 'బిల్డ్' కార్యక్రమాన్ని పూర్తి చేయడానికి నడుం కట్టాడు. ఈ కార్యక్రమానికి జైరాం రమేష్ పెట్టిన పేరే 'సరండా ఏక్షన్ ప్లాన్'. ఇది కూడా సైనిక కార్యక్రమం లాగా ధ్వనిస్తున్నదని ఒక మానవ హక్కుల కార్యకర్త జైరాం రమేష్ దృష్టికి తీసుకెళ్తే సరయూ ప్రాంతంలో – 'సరయూ డెవలప్‌మెంట్ ఏక్షన్ ప్లాన్' అని పేరు మార్చాడు – కత్తికి తేనె పూసినట్టు. ఈ పథకం ప్రకారం సరండాలోని 56 గ్రామాల కోసం రు. 250 కోట్లు గుమ్మరించి అభివృద్ధి చేసేసి మావోయిస్టులు మళ్లీ అడుగు పెట్టకుండా చేస్తామని ప్రచారంతో ఊదరగొట్టాడు. శ్రీనగర్‌లో లాల్‌చౌక్‌లో అద్వానీ మువ్వన్నెల జెండా ఎగురవేసిన స్థాయిలో సరండాలోని దీఘాలో జెండా ఎగురవేశాడు. పదేళ్ల నుంచి అక్కడ జెండా ఎగరనే లేదనీ ఇప్పుడు ఎగరెయ్యడమంటే మావోయిస్టులను తుడిచిపెట్టినదానికి నిదర్శనమని మీడియా ప్రచారానికి లంకించు కున్నది. అయితే గత అరవై ఆరేళ్లలో ఎన్నడైనా, మావోయిస్టులు ప్రవేశించక ముందు కూడా జెండా ఎగిరిందో లేదో పట్టించుకున్న వాడే లేడనేది వేరే సంగతి.

జైరాం రమేష్ అభివృద్ధి పథకంలో 17 పోలీస్‌స్టేషన్ల నిర్మాణం మాత్రం శరవేగంతో జరిగిపోతోంది. దానికోసం పర్యావరణ చట్టంలో కూడా మార్పులు తెచ్చి అడవులను కొట్టివేయడానికి ఉన్న పరిమితులకు వెంట వెంటనే మినహాయింపులతో ఆజ్ఞలు జారీ అవుతున్నాయి. రోడ్లు, మొబైల్ టవర్ల నిర్మాణం సాగుతోంది.

అయితే ప్రజలకు ఉపయోగపడే వాటి సంగతి చూస్తే – పది ఆశ్రమ పాఠశాలలు నెలకొల్పుతామని మొదట ప్రకటించారు, కానీ అది రద్దు చేసి ఒక్కటే నెలకొల్పుతున్నారు. పది సమీకృత అభివృద్ధి కేంద్రాలను నెలకొల్పడం ఈ పథకంలో ఒక భాగం. ప్రతి కేంద్రంలో ఒక ఆసుపత్రి, ఒక అంగన్‌వాడి, ఒక రేషన్ దుకాణం, ఒక బ్యాంకు ఉంటాయి. అయితే ఇది కూడా దీఘాలో మాత్రం ఒక్కటి పూర్తయ్యింది.

ప్రైవేట్ క్లబ్బుల సాయంతో జైరాం రమేష్ ఇక్కడ ఒకటి, రెండు సార్లు కంటి చికిత్సా శిబిరాలు కూడా నడిపాడు. అయితే అసలు కళ్ల చికిత్స అవసరమైన వాళ్లలో మూడు వంతుల మంది టెరీజియం అనే జబ్బుతో బాధపడుతున్నారు. ఈ జబ్బుకు కారణం ఖనిజపు దుమ్ము. ఈ జబ్బు అంధత్వానికి దారితీయవచ్చు. ప్రైవేట్ కంపెనీల మైనింగ్‌తో కళ్లు పోగొట్టి, అవి విదిల్చే డబ్బుతో కళ్ల చికిత్స. ఇదీ ఈ ప్రభుత్వపు అభివృద్ధి నమూనా. ఈ అభివృద్ధి పేరుతో ప్రజలను మభ్యపెట్టి మైనింగ్ సంస్థలకు మార్గం సుగమం చేయడమే అసలు లక్ష్యమనేది జైరాం రమేష్ ప్రకటనలతోనే స్పష్టమవుతుంది. 'మావోయిస్టులు, వారి అనుబంధ సంస్థలు సరండా అభివృద్ధి పథకం ప్రైవేట్ మైనింగ్‌కు దారి తెరవడానికే అని ప్రచారం చేస్తారు కాబట్టి పథకాన్ని పూర్తిగా అమలుపరచి స్థానిక ఆదివాసి ప్రజలకు స్థానిక అధికార యంత్రాంగంపై నమ్మకం కుదిరి అభివృద్ధి ఫలితాలు కనిపించేవరకైనా ప్రభుత్వ సంస్థ అయిన ఎస్ఎఐఎల్‌ను తప్ప వేరే ప్రైవేట్ మైనింగ్‌కు పరిమితినివ్వద్ద'ని జైరాం రమేష్, కిశోర్ చంద్రదేవ్‌లు ప్రధానమంత్రికొక లేఖ రాశారు.

అయితే పెట్టుబడిదారులకు లాభాలు కావలసింది వెంటనే కదా, నమ్మించడానికి కొంత టైం పడుతుందేమో, ఈలోగా ఎంత టైం వృథా అయిపోతుందనీ వందలు, వేల కోట్ల రూపాయల లాభాలు కళ్ల ముందు మెర మెరలాడుతుంటే అంత ఓపిక ఎవడికుందనీ. ఒకవైపు జైరాం రమేష్ ప్రైవేట్ కంపెనీల మైనింగ్ లీజులు రద్దు చేయాలని తాను సిఫారసు చేశాననీ, ఒకవేళ ప్రభుత్వం ప్రైవేట్ కంపెనీలకు కొత్త లైసెన్సులు మంజూరు చేస్తే తాను వెంటనే ఏక్షన్ ప్లానును ఉపసంహరిస్తానని ప్రగల్భాలు పలికాడు.

మరోవైపు ప్రధానమంత్రి నాయకత్వంలోని ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌కు సంబంధించిన కాబినేట్ కమిటీ సరండాలో ఓపెన్ కాస్టింగ్‌కు ఈ సంవత్సరం ప్రారంభంలోనే అనుమతినిచ్చింది. దాంతో అడవికి సంబంధించిన క్లియరెన్స్ ఇవ్వాల్సిన ఫారెస్ట్ అడ్వయిజరీ కమిటీ సింగ్ భూమ్ ఏనుగుల రిజర్వ్ అడవిలో మూడు ప్రైవేట్ కంపెనీలకు అనుమతినిచ్చింది. సజ్జన్ జిందాల్‌కు చెందిన జిందాల్ స్టీల్ వర్క్స్

# సామ్రాజ్యవాదం: పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యున్నత దశ

*రచించి వంద సంవత్సరాలు గడిచినా ఇవాళ్టికీ సామ్రాజ్యవాదాన్ని అర్థం చేసుకోవడానికి ప్రామాణికమైన లెనిన్ గ్రంథాన్ని పరిచయం చేస్తున్నారు* **ఎన్.వి. ఎస్. నాగభూషణ్**

ఈ గ్రంథాన్ని రాయడంలో లెనిన్ ముఖ్య ఉద్దేశం ఏమంటే – మొదటి ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధ ప్రాంగణంలో – ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ, దాని అంతర్జాతీయ సంబంధాల సమగ్ర చిత్రాన్ని కార్మికవర్గం ముందుంచడం!

1914–18ల మధ్య జరిగిన ఈ యుద్ధం రెండు పక్షాల విషయంలోనూ సామ్రాజ్యవాద యుద్ధమేనని లెనిన్ విశ్లేషించాడు. ఈ యుద్ధాన్ని ఆ రాజ్యాలు ఎందుకు ప్రారంభించాయంటే– అదివరకే తమ తమ భాగాల్ని పంచుకుంటూ విభజించిన ప్రపంచాన్ని తిరిగి పంచుకోవడం కోసం, ఇదివరకు ఇతరుల పరమైన ముక్కల్ని లాక్కోవడం కోసం, ఆ ముక్కల్లో వలసల్నీ, ఫైనాన్స్ పెట్టుబడి పలుకుబడి కలిగిన ప్రాంతాల్ని ఏర్పరచుకోవడం కోసం. ఈ యుద్ధానికి దిగిన కొద్దిపాటి పురోగామి దేశాలు – ప్రపంచ ప్రజానీకంలో గల అత్యధికుల మీద వలస పీడననీ, ఫైనాన్స్‌గా గొంతునొక్కడాన్నీ సాగించే ప్రపంచ వ్యవస్థగా పెట్టుబడిదారీ వ్యవస్థ పెరిగిపోయిందనీ విమర్శించిన లెనిన్, ఆపాదమస్తకం ఆయుధాలు ధరించిన కొద్దిమంది తమ దోపిడి సొత్తు పంపకాల కోసం జరుపుతున్న ఈ తమ యుద్ధంలోకి ప్రపంచాన్నంతటినీ లాగుతున్నారనీ చెబుతూ, కొంతమంది స్వార్థపరులైన శ్రామిక వర్గనాయకులు ప్రచారం చేస్తున్నట్లు ఈ యుద్ధం దురాక్రమణదారులైన శత్రువుల నుండి రక్షించుకోవడానికి చేసే దేశ భక్తితో కూడిన యుద్ధంకాదని చెబుతాడు. అలాంటి స్వార్థపరులకు కొమ్ముకాసే కీట్స్కీయిజంలోని....? దాగున్న వాస్తవాల్ని బయట పెట్టడం కోసం కూడా ఈ గ్రంథం ప్రయత్నించిందని లెనిన్ చెప్పాడు.

సామ్రాజ్యవాదపు అంతర్ వైరుధ్యాల్ని తెలుసుకొని, ఆధోరణులతో పోరాడడం కార్మిక వర్గ పార్టీకి విధ్యుక్త ధర్మం కాబట్టి, ఆ పార్టీ బూర్జువా వర్గంచేత దగా చెయ్యబడిన చిన్న ఆస్తిపరుల్నీ, దాదాపు పెటీబూర్జువా జీవిత పరిస్థితుల్ని అనుభవిస్తున్న లక్షలాది శ్రామిక ప్రజల్ని బూర్జువా వర్గం నుండి తన వైపుకు తిప్పుకునేందుకు ఇది అవసరమనీ లెనిన్ ఉద్ఘాటించాడు. ఇంతటి ప్రాముఖ్యం ఉన్న ఈ గ్రంథంలో లెనిన్ ఆయా అంశాల్ని ఎలా రుజువుచేశాడో గమనిద్దాం.

మొత్తం పది ప్రకరణాలుగా విభజించబడ్డ ఈ గ్రంథంలో గుత్తా సంస్థలు ఎలా ఏర్పడేదీ, వాటి ఫలితాలేమిటి అనే విషయాల్ని మొదటి ప్రకరణం 'ఉత్పత్తి సాంద్రీకరణా, గుత్త సంస్థలు'లో చెప్పబడింది. పెద్ద పారిశ్రామిక సంస్థల్లో ఉత్పత్తి అసాధారణ వేగంతో సాంద్రీకరించబడుతుందని, ఈ సాంద్రీకరణలో కార్మికుల సంఖ్య పెరగడం కన్నా, ఉత్పత్తి సాంద్రీకరణే అధికంగా ఉంటుందనీ సోదాహరణగా లెనిన్ చూపిస్తాడు. సాంద్రీకరణ అనేదే ఒకానొక దశలో నేరుగా గుత్తాధిపత్యానికి దారితీస్తుందని, ఎందుకంటే సంస్థల బ్రహ్మాండమైన పరిమాణమే పోటీకి ఆటంకంగనుక, కొద్దిపాటి పెద్దసంస్థలు తేలిగ్గా ఒక ఒప్పందానికి వస్తాయని, గుత్తాధిపత్యానికి జరిగే

---

(జెఎస్‌డబ్ల్యు)కు అంకువా అటవీ డివిజన్‌లో దాదాపు వెయ్యి హెక్టార్లు, నవీన్ జిందాల్‌కు చెందిన జిందాల్ స్టీల్ అండ్ పవర్ లిమిటెడ్ (జెఎస్‌పిఎల్) కు ఘట్‌కురి అడవిలో 512 హెక్టార్లు, అక్కడే రంగ్టా మైన్స్ లిమిటెడ్‌కు 139 హెక్టార్లలో మైనింగ్‌కు అనుమతినిచ్చింది.

అంతకు ముందు జైరాం రమేష్ పర్యావరణ శాఖ మంత్రిగా ఉన్నప్పుడు ఎస్ఎఐఎల్‌కు బిరియాలోనూ, జిలింగ్‌బురు డివిజన్‌లోనూ 242 హెక్టార్లలో మైనింగ్‌కు అనుమతినిచ్చాడు.

మైనింగ్ కోసం చట్ట ప్రకారం గ్రామసభల అనుమతి కావాలి కాబట్టి ఏ ఫుట్‌బాల్ మ్యాచ్‌నో ప్రైవేట్ కంపెనీలు ఏర్పాటు చేసి తెల్ల కాగితాల మీద సంతకాలు పెట్టించుకునో, మరో రకంగా తిమ్మిని బమ్మి చేసో గ్రామసభల అనుమతి అనే తూతూ మంత్రాన్ని పూర్తి చేస్తున్నారు. ఉదాహరణకు కుదిలాబాద్ మైన్స్ కోసం ఎలక్ట్రో స్టీల్ కంపెనీ ఏర్పాటు చేసిన గ్రామసభ సమావేశాన్ని ప్రజలు బహిష్కరించి గ్రామంలో ప్రదర్శన చేస్తే, ఆ తదుపరి సమావేశం ఆ గ్రామానికి ఇరవై కిలోమీటర్ల దూరంలోని బహిహతులో కంపెనీ ఏర్పాటు చేసింది. ఇట్లా చట్టాల ఉల్లంఘన నిరాటంకంగా సాగుతోంది.

ఈ క్రమంలో కొంతమంది తెగ పెద్దలు మాత్రం దళారులుగా మారి స్కార్పియోలలో తిరుగుతుంటే, అంత పెద్దగా బలం లేని తెగ పెద్దలకు రంగ్టామైన్స్, ఉషా మార్టిన్ ఇండస్ట్రీస్, టాటా స్టీల్ వంటి కంపెనీలు సోలార్ లైట్ల వంటి వాటితో కూడా సరిపెట్టేస్తున్నాయి.

ఇదే జైరాం రమేష్, చిదంబరం, మన్మోహన్‌సింగ్‌ల, టాటాలు, జిందాల్, మిట్టల్‌ల గ్రీన్‌హంట్ మార్క్ అభివృద్ధి.

సువర్ణ రేఖ, దక్షిణ కోయల్, కారో వంటి నదులు, ఎన్నో వాగులు, వంకలు ఉన్నా సరండా గ్రామాల ప్రజలకు తాగునీరుకు సమస్యగా ఉంది. అది రానురాను మరింత భయంకరంగా మారబోతోంది. కొత్త గనుల ఓపెన్ కాస్టింగ్ పెరిగే కొద్దీ నదులు, వాగులన్నీ ఇనుప దుమ్ము మయమై ఎర్రగా మారిపోతాయి. ఇప్పటికే ఈ సమస్యను తీవ్రంగా ఎదుర్కొంటు న్నారు. నిజానికి 2011 అక్టోబర్‌లో తయారు చేసిన సరండా పథకపు ఔట్‌లైన్‌లోనే ఈ సమస్యను గుర్తించారు. '56 గ్రామాలన్నీ తాగునీటి సమస్యను ఎదుర్కొంటున్నాయి. నీటిలో ఇనుము మాత్రం చాలా ఎక్కువగా ఉంది' అని ఆ ఔట్‌లైన్‌లో ఉంది.

నోవాముండి వద్ద గనుల వల్ల కలుషితమై, నీళ్లు ఎర్రగా మారడానికి వ్యతిరేకంగా 1978లోనే మొదటిసారి హో తెగ ప్రజలు 'లాల్‌పానీ ఆందోలన్' ప్రారంభించారు. ఆ ప్రతిఘటన కొనసాగుతూనే ఉంది. నీటిలో ఎర్రదుమ్ము, గాలిలో ఎర్రదుమ్ముతో కళ్లరోగాలు – వీటన్నింటికి వ్యతిరేకంగా 1978లో మొదలైన 'ఎర్రనీళ్ల ఉద్యమం', ఎర్ర రాజ్యాధికార ఉద్యమంగా మళ్లీ పదునెక్కడం తథ్యం. గ్రీన్‌హంట్ మార్క్ అభివృద్ధి దాన్ని ఆపలేకపోవడమే కాక, ఆ 'అభివృద్ధే' సరండా ప్రజలను అందుకు పురికొల్పడం అనివార్యం.

*(రచయిత మావోయిస్టు రాజకీయ ఖైదీ)* వీ

ఈ పరివర్తన పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రస్తుత ఆర్థిక సంఘటనల్లో ఒక ముఖ్య సంఘటన అని లెనిన్ అంటాడు.

ఈ పెట్టుబడిదారీ వ్యవస్థలోని అత్యున్నత దశలో ఒక ముఖ్య లక్షణం ఉత్పత్తి సంయోజనం, అంటే భిన్న పరిశ్రమ శాఖలను ఒకే సంస్థలో బృందీకరించడం అంటూ, ఈ సంయోజనం వల్ల వర్తక ఆటుపోటులను, చదును చేసి, లాభాల్ని నిస్సందేహంచేస్తుందన్న ఆస్ట్రియన్ మార్క్సిస్టు రుడోల్ఫ్ హిల్ఫెర్‌డింగ్ 'ఫైనాన్స్ పెట్టుబడి' అనే గ్రంథాన్ని ఉదాహరిస్తాడు.

మార్క్స్ 'పెట్టుబడి' రాస్తున్నప్పుడే నిర్నిబంధపోటీ ఉత్పత్తి సాంద్రీకరణను ఉత్పన్నం చేస్తుందని, అదిమళ్లీ గుత్తాధిపత్యానికి దారితీస్తుందని చెప్పగా, నాటి అర్థ శాస్త్రజ్ఞులు అది తప్పని చెప్పారనీ, కాని మార్క్స్ చెప్పిందే సరైందని రుజువైందని చెబుతూ లెనిన్, కార్టెళ్లు, ట్రస్టులూ వగైరా గుత్త సంస్థలు అమ్మకం షరతుల్నీ చెల్లింపు తేదీల్నీ, ఉత్పత్తి సరుకుల పరిమాణాల్నీ, ధరల్నీ నిర్ణయించడమేగాక, లాభాల్ని కూడా వివిధ సంస్థల మధ్య పంచుతాయనీ, వీటి సాంద్రీకరణ ఏస్థాయికి చేరిందంటే ఒక దేశంలోనే కాదు, మొత్తం ప్రపంచంలోని ముడి సరుకుల మూలాలన్నింటినీ బ్రహ్మాండమైన గుత్త సంస్థలు చేజిక్కించుకుంటున్నాయంటాడు లెనిన్. మార్కెట్లను కూడా గుత్త సంస్థలు పంచుకుని, నిపుణుల శ్రమని కూడా గుత్త కొనబడుతుంది.

కెస్ట్నర్ అనే జర్మనీ అర్థశాస్త్రజ్ఞుడు గుత్త సంస్థలు బయటి సంస్థలతో ఎలా పోరాడేదీ వివరిస్తూ, అవి ముడిసరుకుల సరఫరాను, కార్మికుల సరఫరాను (ట్రేడ్ యూనియన్లతో పొత్తు ద్వారా), సరుకుల సరఫరాను నిలిపేయడం ద్వారా ఖాతాలు ఆపెయ్యడం, బహిష్కరణ వగైరా పన్నాగాల ద్వారా తమ పెత్తనానికి లొంగనివాటి గొంతు నొక్కేస్తాయంటాడు. ఆధిపత్యమూ, దాంతో పాటు దౌర్జన్యమూ, ఇవి పెట్టుబడిదారీ అభివృద్ధి తొలి దశ విలక్షణ సంబంధాలు. కార్టెళ్లు, ట్రస్టు ద్వారా ఆర్థిక సంక్షోభం నివారింపబడుతుందని కొందరు బూర్జువా అర్థ శాస్త్రజ్ఞులు చెపుతారుగానీ, అది కట్టు కథ తప్ప వేరుకాదంటాడు లెనిన్. ఈ సందర్భంగా లీఫ్మన్ అనే అర్థ శాస్త్రజ్ఞుని వాక్యాల్ని ఉదాహరిస్తాడు. 'ఆర్థిక వ్యవస్థ ఎంతగా అభివృద్ధి అయితే, అది అంతగా ప్రమాదభరితం అయిన వ్యాపారాలను, ఇతర దేశాలకు, అభివృద్ధి చేయడానికి చాలాకాలం పట్టే వాటికి, ఆఖరుగా స్థానిక ప్రాముఖ్యం కల వాటికి పూనుకుంటుంది. పెట్టుబడి అంచులు పొంగి విదేశాలకు ప్రవహిస్తుంది. అదే సమయంలో సాంకేతిక ప్రగతి అపారమైన వేగం అరాచకత్వాన్నీ, సంక్షోభాల్నీ ఉత్పత్తి చేస్తుంది' అంటాడు లిఫ్మన్. చివరికి ఇది ఆర్థిక వ్యవస్థ నిర్మాణాల్ని కూడ మార్చవచ్చునని లిఫ్మన్ ఒప్పుకున్న సంగతిని గుర్తు చేస్తాడు లెనిన్.

పెట్టుబడిదారీ అభివృద్ధి ప్రస్తుత దశకు పరిపూర్ణత్వం గుత్తాధిపత్యం! అయితే ఇందులో బ్యాంకులు నిర్వహించే పాత్రను లెక్కలోకి తీసుకోక పోతే, ఆధునిక గుత్తా సంస్థల నిజమైన శక్తిని మనం తెలుసుకోలేమంటాడు లెనిన్.

డబ్బు చెల్లించడంలో మధ్యవర్తులుగా వ్యవహరించే బ్యాంకులు, రకరకాల డబ్బు ఆదాయాల్ని పోగుచేసి పెట్టుబడిదారీ వర్గం వశంలో ఉంచడమేగాక, తాము అభివృద్ధి అయ్యే క్రమంలో స్వయంగా గుత్తసంస్థలుగా మారతాయని అంటాడు లెనిన్. 'బ్యాంకులూ, వాటి కొత్త పాత్ర' అనే రెండో ప్రకరణంలో, పెద్ద బ్యాంకులు చిన్న బ్యాంకులను చిన్న బ్యాంకులను విలీనం చేసుకోవడంతో పాటు, వాటి పెట్టుబడిలో హోల్డింగులు, షేర్లు కొనడం వగైరాల ద్వారా వాటిని లోబరుచుకొని సొంత బృందంలోకి తెచ్చుకుంటాయి. ఈ విధంగా ఇవి మధ్యవర్తి పాత్రను అధిగమించి గుత్తాధిపతుల సంఘం అవుతుంది. ఈ విధంగా చెల్లాచెదురుగా ఉన్న పెట్టుబడిదార్లు ఒకే ఒక సమిష్టి పెట్టుబడిదారుగా మారిపోతారు.

పెట్టుబడిదారుల కరెంటు అకౌంట్లను నిర్వహించేటప్పుడు ఒక బ్యాంక్ శుద్ధ సాంకేతిక సహాయ చర్య నిర్వహిస్తున్నదని అనవచ్చు. కానీ ఈ చర్య అపార ప్రమాణాలకు పెరిగినప్పుడు, కొద్ది మంది గుత్తాధిపతులు మొత్తం పెట్టుబడిదారీ సమాజపు వాణిజ్య, పారిశ్రామిక చర్యలన్నింటినీ తమ ఇచ్ఛకు లోబర్చుకోవడం కనబడుతోంది. వారు తమ బ్యాంకింగ్ లంకెల ద్వారా, కరెంట్ అకౌంట్ల, ఇతర ఫైనాన్షియల్ చర్యల ద్వారా, వివిధ పెట్టుబడిదార్ల ఫైనాన్షియల్ పరిస్థితి కచ్చితంగా తెలుసుకోవడానికి, ఆ తర్వాత వాళ్లను అజమాయిషీ చెయ్యడానికి, వారి ఖాతాలను నియంత్రించడానికి, తద్వారా వాటిని ప్రభావితం చేసె వారి తలరాతను పూర్తిగా నిర్ణయించడానికి సమర్థులవుతారు. ఇలాంటి చర్యలతో లాభపడుతూ జర్మనీలో బ్యాంక్ ట్రస్టులు పెరిగిపోవడం గురించి 'ది బ్యాంక్' అనే పత్రిక రాసిన వ్యాఖ్యను ప్రస్తావిస్తాడు లెనిన్. 'ఒక సూర్యోదయాన లేచి చూసుకుంటే, ఆశ్చర్యంగా మనకు కనబడేది ట్రస్టులు మాత్రమే. సొంత గుత్తసంస్థల స్థానంలో ప్రభుత్వ గుత్త సంస్థలు పెట్టే అవసరం ఎదురవుతోంది' అని ఆ పత్రిక రాసింది. ఏమైనా బ్యాంకులు అన్ని పెట్టుబడిదారీ దేశాల్లోనూ, వాటి బ్యాంకింగ్ చట్టాల్లో ఎన్ని భేదాలున్నప్పటికీ, గుత్తసంస్థల నిర్మాణ ప్రక్రియను చాలా తీవ్రపరిచి త్వరపరుస్తాయంటాడు లెనిన్.

బ్యాంకులు పెట్టుబడిదారులవి మాత్రమే కావు. ఎందుకంటే అవి రకరకాల ఆదాయాల్ని – వ్యాపారస్తుల, గుమస్తాల, పై పొర కార్మికుల ఆదాయాల్ని పోగేస్తాయి. రూపం దృష్ట్యా ఇవి ఉత్పత్తి సాధనాల సార్వత్రిక పంపకం, కానీ సారం దృష్ట్యా బడాపెట్టుబడి ప్రయోజనాలకు, ప్రధానంగా బ్రహ్మాండమైన గుత్తా పెట్టుబడికి అనుకూలంగా ఉంది. అంతేగాక ఈ గుత్తాధిపత్యం ఏర్పడే క్రమంలో స్టాక్ ఎక్స్చేంజీ ప్రాముఖ్యత తగ్గిపోయి, ఆ పనిని బ్యాంకులే నిర్వహిస్తున్నాయి.

పాత పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యాపారస్తులు స్వేచ్ఛగా పోటీపడుతూ, తమ వ్యాపారానికి చెందిన పనిలో, శరీర శ్రమ తప్ప తక్కిన పనిలో పదింట తొమ్మిదివంతులు చేసేవారు. ప్రస్తుతం ఈ ఆర్థిక మెదడు పనిలో పదింట తొమ్మిది వంతులు ఉద్యోగులు చేస్తున్నారు. ఈ పరిమాణంలో బ్యాంకింగ్ అగ్రభాగంలో ఉంది. మరి ఈ సామ్రాజ్యదశలోని పెట్టుబడిదారీ వ్యవస్థ ఏమిగా అభివృద్ధి అవుతున్నది అని ప్రశ్నిస్తాడు లెనిన్.

సాంద్రీకరణ ప్రక్రియ ఫలితంగా అన్ని బ్యాంకులూ గుత్త ఒప్పందాలవైపు వెళ్తున్నాయని, బ్యాంకుల సాంద్రీకరణ పెరిగే కొద్దీ, ఏ సంస్థల నుండి రుణాలు పొందడానికి వీలుందో ఆ సంస్థల బృందాన్ని కుదిస్తుందని, ఇందువల్ల స్వల్ప సంఖ్యలో ఉన్న బ్యాంకింగ్ బృందాల మీద పెద్ద పరిశ్రమలు ఆధారపడడం ఎక్కువవడంతో, వాటి గమన స్వేచ్ఛ కుదింప బడుతుందనీ చెబుతూ లెనిన్, దీనివల్ల తేలేది గుత్తాధిపత్యమేనంటాడు.

బ్యాంకుల గుత్తాధిపత్యం వల్ల, ఒక పారిశ్రామిక పెట్టుబడిదారుడు కరెంట్ ఖాతాను ప్రారంభించినప్పుడు, ఆ పెట్టుబడిదారుని సవివరమైన సమాచారాన్ని సంపాదించే సామర్థ్యం బ్యాంకుకు ఉన్నప్పుడు, ఆ పెట్టుబడిదారుడు పూర్తిగా బ్యాంకుకు అధీనుడవుతాడు. అదే సమయంలో బ్యాంకులకూ, పెద్ద పారిశ్రామిక సంస్థలకూ మధ్య వ్యక్తిగత అనుబంధం పెరిగిపోతుంది–షేర్లను స్వాయత్తం చేసుకోవడం ద్వారా పారిశ్రామిక సంస్థల్లోని బోర్డుల్లో బ్యాంకు డైరెక్టర్లు, బ్యాంక్ డైరెక్టర్ల బోర్డులో పారిశ్రామిక డైరెక్టర్లూ నియమింప బడుతుంటారు. అలా ఒకరిలో ఒకరు విలీనమవుతారు. ఇది ప్రభుత్వాలకు విస్తరిస్తుంది. సూపర్వైజరీ బోర్డుల్లోని సీట్లు మాజీ ప్రభుత్వోద్యోగులకు ఇస్తారు. వాళ్లు ప్రభుత్వ అధికార్లతో సంబంధాల్ని సుకరం చెయ్యడానికి తోడ్పడతారు. ఆ విధంగా ఆ గుత్త సంస్థలు పురోగమిస్తుంటా యంటాడు లెనిన్.

బ్యాంకుల్లో మరో కొత్త ధోరణి ఏమంటే పెద్ద బ్యాంకుల డైరెక్టర్లకు పరిశ్రమలపై తనిఖీ చేసే బాధ్యత అప్పగించడం. బ్యాంకుల పరిధి పెరిగే కొద్దీ, ఈ పరిశ్రమల తనిఖీ బాధ్యత ఇతర దేశాల మీది పరిశ్రమలకూ విస్తరించడం. ఫ్రెంచి బ్యాంకింగ్‌లోనైతే ఒక ఫైనాన్షియల్ పరిశోధన శాఖను ఏర్పాటు చేసి, అందులో ఇంజనీర్లు, గణాంక నిపుణులూ, అర్థ శాస్త్రజ్ఞులూ, లాయర్లనూ వగైరాలను నియమించారు.

బ్యాంకుల టెర్రరిజం గురించి తరచు పారిశ్రామిక, వాణిజ్య బృందాలు ఫిర్యాదులు చేస్తాయి. పెద్ద బ్యాంకులు హుకుం ఇస్తాయి. వాస్తవంలో ఇది పెద్ద పెట్టుబడి పీడన గురించి చిన్న పెట్టుబడి చేసే పాత ఫిర్యాదేనంటాడు

లెనిన్. ఈ విధంగా 20వ శతాబ్ది పాత పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి కొత్తదానికి, పెట్టుబడి పెత్తనం నుండి ఫైనాన్స్ పెట్టుబడికి మలుపు తిరిగిందని వివరించాడు లెనిన్.

ఫైనాన్స్ పెట్టుబడిదారులు చేసే మోసాలు, సమాజంపై, ప్రపంచంపై వారు చలాయించే అధికారం గురించి 'ఫైనాన్స్ పెట్టుబడి, ఫైనాన్షియల్ ప్రభుమండలీ' అనే మూడో ప్రకరణంలో వివరించాడు. బ్యాంకులు తమ నిధులలో ఎక్కువ భాగాన్ని పరిశ్రమలలో పెట్టాల్సి వస్తోంది. పరిశ్రమలలో వినియోగించే ఆ నిధులకు పారిశ్రామికులు కాదు యజమానులు. వారు బ్యాంకుల ద్వారా మాత్రమే దాని ఉపయోగాన్ని పొందుతారు. ఆ పెట్టుబడికి నిజమైన సొంతదారులు బ్యాంకులే. ఈ విధంగా బ్యాంక్ పెట్టుబడిని, డబ్బు రూపంలో ఉండి, వాస్తవంగా పారిశ్రామిక పెట్టుబడిగా మారిన పెట్టుబడినే హిల్ఫర్‌డింగ్ 'ఫైనాన్స్ పెట్టుబడి' అని పేరు పెట్టాడు. ఈ ఫైనాన్స్ పెట్టుబడి బ్యాంకుల చేత అజమాయిషీ చేయబడి, పారిశ్రామికుల చేత వినియోగించే పెట్టుబడి.

ఈ ఫైనాన్షియల్ పెట్టుబడిలో 'హోల్డింగ్ పద్ధతి'కి అధిక ప్రాధాన్యం ఉంది. దీని ద్వారా ఫైనాన్షియల్ ప్రభుమండలి చేసే అరాచకాలకు ఎన్నో దృష్టాంతాలు కనిపిస్తాయి. జర్మన్ అర్థశాస్త్రజ్ఞుడు 'హైమన్' దీని సారాన్ని ఇలా వర్ణిస్తాడు. సంస్థ అధిపతి కంపెనీని (తల్లి కంపెనీని) అజమాయిషీ చేస్తాడు. ఇది అనుబంధ (కూతురు) కంపెనీల మీద రాజ్యం చేస్తుంది. ఈ కూతురు కంపెనీలు ఇతర అనుబంధ (మనవరాలు) కంపెనీలను అజమాయిషీ చేస్తుంది. దీనివల్ల ఒక లక్ష రూపాయల పెట్టుబడితో పదహారు లేదా ముప్పై రెండు లక్షల రూపాయల అజమాయిషీ చేయవచ్చు. ఈ హోల్డింగ్ పద్ధతి గుత్తాధిపతుల శక్తిని అపారంగా పెంచడమే గాక, శిక్షకు గురికాకుండా మోసగించడానికి రకరకాల జిత్తులకు దిగడానికి వీలుకల్పిస్తుంది. ఎందుకంటే తల్లి కంపెనీ, కూతురు కంపెనీ విషయంలో చట్టరీత్యా బాధ్యరాలు కాదు. కూతురు కంపెనీ స్వతంత్రమైనదిగా ఊహించబడుతుంది. దాని మధ్యస్థం ద్వారా వాళ్లు ఏ ఆట అయినా ఆడగలరు. ఈ విధంగా బ్యాలన్స్ షీట్లను దుర్గ్రాహ్యం చేసే సాధారణ సూక్ష్మపద్ధతి కూతురు కంపెనీని నెలకొల్పడమే, లేదా కలుపుకోవడమే. ఈ సౌకర్యాన్ని ఉపయోగించని పెద్దకంపెనీలు అపవాదం మాత్రమే. ఇదే పద్ధతిలో బ్యాంకులు హోల్డింగ్ ద్వారా విపరీత లాభాల్ని తీస్తున్నాయి.

ఫైనాన్స్ పెట్టుబడి ప్రధాన కర్తవ్యాలలో ఒకటైన బాండ్ల జారీ ద్వారా విపరీత లాభాలు పొందుతారు. ఇక పారిశ్రామిక వికాస కాలంలో ఫైనాన్స్ పెట్టుబడి లాభాలు విపరీతంగా ఉండడం సరే. అయితే మాంద్య కాలంలో కూడా ఇవి లాభాలు సంపాదిస్తాయి. ఎలా అంటే చిన్న అసౌష్టవ వ్యాపారాలు నశించినప్పుడు, పెద్ద బ్యాంకులు వాటిని నామకార్థపు ధరకు కొనేసి, వాటిలో హోల్డింగులు సంపాదిస్తాయి. ఇంకా వాటి పునర్నిర్మాణానికి, పునర్వికాసానికి లాభదాయకమైన పథకాలలో పాల్గొనడమే గాక, ఆ కంపెనీల మీద అజమాయిషీ సంపాదిస్తాయి.

ఒక గుత్తసంస్థ ఒకసారి ఏర్పడి వందల కోట్లను అజమాయిషీ చేస్తున్నప్పుడు, అది పౌరజీవనపు అన్ని రంగాల్లోకీ అనివార్యంగా చొచ్చుకుపోయి, ప్రభుత్వ నిబంధనలకు వ్యతిరేకంగా ఉన్నా లంచగొండి తనంతో అనుకూలంగా మార్చుకుంటుంది. అలా సహకరించిన ప్రభుత్వోద్యోగుల్ని తర్వాత కాలంలో అధిక లాభదాయక జీతాలతో ఫైనాన్స్ పెట్టుబడి సంస్థలలో ఉద్యోగాలు పొందడం ఎన్నో దేశాల్లో కనబడుతోంది. రష్యాలో కూడా ఇది మామూలే.

ఇక పెట్టుబడిదారీ విశిష్ట లక్షణం ఏమంటే–పెట్టుబడిని ఉత్పత్తికి ప్రయోగించడం నుండి విడివడి ఉండడమేనంటాడు లెనిన్. దీన్ని వివరిస్తూ ఆయన డబ్బు పెట్టుబడి పారిశ్రామిక లేదా ఉత్పాదక పెట్టుబడి నుండి విడివడి ఉండడం, పూర్తిగా డబ్బు పెట్టుబడి మీద వచ్చే ఆదాయంలో జీవించే వడ్డీ జీవి వ్యాపారస్తుని నుండి, పెట్టుబడి నిర్వహణలో ప్రత్యక్ష సంబంధం ఉన్న వాళ్లందరిని నుండి విడివడి ఉండడం అంటాడాయన.

సామ్రాజ్యవాదం, లేక ఫైనాన్స్ పెట్టుబడి పెత్తనం అనేది ఈ ఏర్పాటు అపార ప్రమాణాలను అందుకునే పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యున్నత దశ. ఇతర పెట్టుబడి రూపాలన్నిటి మీదా ఫైనాన్స్ పెట్టుబడి పెత్తనమంటే, వడ్డీ జీవి, ఫైనాన్స్ ప్రభుమండలి ఆధిక్యం అన్నమాట! ఫైనాన్షియల్‌గా శక్తివంతమైన స్వల్ప సంఖ్యాక రాజ్యాలు అన్ని దేశాలకన్నా మిన్నగా ఉండడమన్న మాట.

ప్రపంచంలో 1910 నాటికి జారీ చేయబడిన మొత్తం సెక్యూరిటీలను పరిశీలిస్తే – పాత పెట్టుబడిదారీ దేశాలైన బ్రిటన్, ఫ్రాన్స్‌లకు అన్నింటికన్నా ఎక్కువ వలసలున్నాయి. తక్కిన రెండూ–అమెరికా, జర్మనీలకు–అభివృద్ధి వేగంలో, పరిశ్రమలలో, గుత్త సంస్థల విస్తరణ ప్రమాణాలలో అగ్రేసరంగా ఉన్నాయి. ప్రపంచ ఫైనాన్స్ పెట్టుబడిలో 80 శాతాన్ని ఈ నాలుగు దేశాలే కలిగి ఉన్నాయి. తక్కిన ప్రపంచమంతా ఈ అంతర్జాతీయ బ్యాంకర్ దేశాలకు, ప్రపంచ ఫైనాన్స్ పెట్టుబడి ఈ నాలుగు స్తంభాలకు రుణగ్రస్తంగానూ, కప్పం కట్టేదిగానూ ఉందని లెనిన్, సరిగ్గా ఈ కారణం వల్ల ఫైనాన్స్ పెట్టుబడి పరాధీనతా, ఫైనాన్స్ పెట్టుబడి లంకెలూ అనే అంతర్జాతీయ సమాహారాన్ని సృష్టించడంలో 'పెట్టుబడి ఎగుమతి' నిర్వహించే పాత్ర గురించి నాలుగో ప్రకరణంలో పరిశీలనకు ఉపక్రమిస్తాడు.

పెట్టుబడిదారీ వ్యవస్థకు విలక్షణమైన సరుకుల ఎగుమతి కాగా, గుత్తా సంస్థల ప్రస్తుత దశకు విలక్షణమైనది పెట్టుబడి ఎగుమతి అంటాడు లెనిన్. మొట్టమొదటి పెట్టుబడిదారీ దేశమైన ఇంగ్లండ్, తాను సకల దేశాలకు పారిశ్రామిక సరఫరాదారుగా ఉన్నందున, ఆ సరుకులకు సరిగా ఆ దేశాలు తనకు ముడి సరుకులు సమకూర్చాలని చెప్పింది. అటు తర్వాత 19వ శతాబ్ది చివరి పాదం నాటికి ఇంగ్లండ్ గుత్తాధిపత్యం బలహీనపడింది. కారణం, ఇతర దేశాలు రక్షణ సుంకాల చాటున స్వతంత్ర పెట్టుబడిదారీ దేశాలుగా అభివృద్ధి కావడం, ఆపై పెట్టుబడిదారీ దేశాలన్నింటిలోనూ పెట్టుబడిదార్ల గుత్తా సంఘాలు ఏర్పడగా, పెట్టుబడి బ్రహ్మాండమైన ప్రమాణంలో పోగుపడిన కొద్దిపాటి ధనిక దేశాలు గుత్తస్థానం పొందాయి.

పెట్టుబడిదారీ దేశాల్లో ఆ వ్యవస్థ కొనసాగినంత కాలం పోగుపడిన అదనపు పెట్టుబడిని తమదేశాల్లోని ప్రజల జీవన ప్రమాణాల్ని పెంచడానికి ఉపయోగించే బదులు, వెనకబడిన దేశాల్లోకి పెట్టుబడిని ఎగుమతి చేయడం ద్వారా లాభాల్ని పెంచుకుంటాయి. వెనుకబడిన దేశాల్లో లాభాలు ఎక్కువ ఎందుకు వస్తాయంటే, అక్కడ పెట్టుబడి అరుదు, భూమి, శ్రమ, ముడి సరుకులు చౌక కాబట్టి.

ఈ పెట్టుబడి దిగుమతి 20వ శతాబ్ది ప్రారంభం నాటికి అపార ప్రమాణాల్ని అందుకుంది. ప్రపంచంలోని అధిక భాగం దేశాల మీద జాతుల మీదా సామ్రాజ్యవాద పీడనకు దోపిడీకి కొద్దిపాటి సంపన్న దేశాల పెట్టుబడిదారీ పరరక్తోపజీవనానికి ఆది నుంచి ఆధారమైంది. (అప్పటికి సుమారు 20 వేల కోట్ల (ఫ్రాంకులపై 1000 కోట్ల లాభం) ఈ పెట్టుబడిలో అధికభాగం బ్రిటన్ తన వలసలపై, ప్రధానంగా ఆసియా, అమెరికాలలో పెట్టగా, ఫ్రెంచ్ పెట్టుబడి యూరప్‌లో ప్రధానంగా రష్యాలో. ఇది ప్రధానంగా రుణం పెట్టుబడి. జర్మనీది మూడో రకం. దానికి వలసలు తక్కువ. అది యూరప్, అమెరికాలలో సమానంగా పెట్టుబడి పెట్టింది.

పెట్టుబడి ఎగుమతుల వల్ల జరిగే పరిణామాలు ఏమిటంటే–అది ఎగుమతి చేయబడిన దేశాల్లో పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధిపై ప్రభావం నెరపుతుంది. అంతేకాక అలా ఎగుమతి చేసే దేశాలు దీర్ఘకాలంపాటు కొన్ని సౌకర్యాలు పొందుతాయి. ఇచ్చిన రుణంలో కొంత భాగం రుణదాత దేశంలో కొనుగోళ్ల మీద ఖర్చు పెట్టాలని షరతుపెట్టడం, ఉదాహరణకు, యుద్ధ సామాగ్రి, ఓడలు వగైరాల మీద – అత్యంత మామూలు విషయం. ఈ పద్ధతిలో ఫ్రాన్స్ ఎక్కువ పెట్టింది రష్యాలో. అది 1917 దాకా కొన్ని కన్సెషన్లు కొనసాగాలని 1905లో షరతుపెట్టి పిండింది. ఈ విధంగా అవి రెండు రకాల లాభాలు పొందుతాయి – పెట్టుబడి మీద, సరుకు కొనుగోలు మీద.

ఈ విధంగా ఫైనాన్స్ పెట్టుబడి వాస్తవంగా ప్రపంచ దేశాలన్నింటి మీదా తన వలను పన్నుతుందని చెప్పవచ్చు. ఇందులో ముఖ్యపాత్రను వలసల్లోని బ్యాంకులు నిర్వహిస్తాయంటాడు లెనిన్. 1904లో బ్రిటన్‌కు 50 వలస

బ్యాంకులు 2279 శాఖలతో ఉండగా, ఫ్రాన్స్‌కు 20 బ్యాంకులు 136 శాఖలతోనూ, హాలండ్‌కు 16 బ్యాంకుల 68 శాఖలతో ఉండగా, తనకు 13 బ్యాంకులు 70 శాఖలతో మాత్రమే ఉండడాన్ని జర్మనీకి తీవ్ర అసూయజనకానికి కారణమైంది.

ఇక అయిదో ప్రకరణంగా పెట్టుబడిదారీ సంఘాల మధ్య ప్రపంచ విభజన ఎలా జరిగిందో వివరిస్తూ, పెట్టుబడి ఎగుమతులు పెరిగే కొద్దీ, పలుకుబడి గల ప్రాంతాలు విస్తరించే కొద్దీ, పరిస్థితులు ఈ సంఘాల మధ్య అంతర్జాతీయ కార్టెల్ల నిర్మాణం వైపు దారితీస్తాయని చెపుతాడు లెనిన్. ఇది పెట్టుబడి, ఉత్పత్తుల ప్రపంచ సాంద్రీకరణలో కొత్త దశ అని, గుత్త దశ అని అంటాడు. దీన్ని అర్థం చేసుకోవడానికి విద్యుత్ ట్రస్టుని ఉదాహరించాడాయన. విద్యుత్ ట్రస్ట్‌నే ఎందుకంటే ఆ పరిశ్రమ ప్రస్తుత సాంకేతిక విజయాలకు మహా విలక్షణమైంది కాబట్టి. ఈ పరిశ్రమ కొత్త పెట్టుబడిదారీ దేశాలయిన అమెరికా, జర్మనీలతో అభివృద్ధి అయింది.

జర్మనీలో 1900 నాటి పారిశ్రామిక సంక్షోభం దీని సాంద్రీకరణకు బలమైన ఊపునివ్వడం వల్ల ఇది గొప్ప అంగలతో పురోగమించింది. 1900 వరకూ ఈ పరిశ్రమలో ఏడెనిమిది బృందాలు, ప్రతి బృందంలోనూ పలు కంపెనీలు (మెత్తం 28 కంపెనీలు) ఉండగా, ఇవన్నీ 1912 నాటికి రెండుగానో ఒకటిగానో సంలీనం చెంది చివరికి ప్రసిద్ధ ఎ.ఇ.జి (జనరల్ ఎలక్ట్రికల్ కంపెనీ) గా రూపొందింది. ఇది 175 నుండి 200 కంపెనీలను (హోల్డింగ్ పద్ధతి ద్వారా), 150 కోట్ల మార్కులపై అజమాయిషీ చేస్తోంది. ఇది కేబుళ్ల నుండి, కార్లు, విమానాల వరకూ తయారు చేస్తుంది. అలాగే అమెరికాలోనూ జనరల్ ఎలక్ట్రికల్ కంపెనీ ఏర్పడి, రెండు మహా శక్తులయ్యాయి. వీటి నుండి సంపూర్ణంగా స్వతంత్రమైన కంపెనీలు ప్రపంచంలోనే లేవంటే, వీటి శక్తి, ఏమిటో గ్రహించవచ్చు. ఈ రెండూ 1907లో ఒప్పందం చేసుకుని, ప్రపంచాన్ని తమ మధ్య పంచుకున్నాయి. దాంతో వీటి మధ్య పోటీ ఆగిపోయింది. రెండూ ట్రస్ట్‌లూ సృజనలు, ప్రయోగాలు ఇచ్చి పుచ్చుకోవాలి. ఇలా పలు వందల కోట్ల పెట్టుబడిని అజమాయిషీ చేస్తూ, ప్రపంచం ప్రతి మూలా ఏజన్సీలు, లంకెలు కలిగి, వాస్తవంగా ఒకే ఒక ప్రపంచ ట్రస్ట్ అయిన దీంతో పోటీ చేయడం ఎంతకష్టమో వేరే చెప్పనక్కరలేదు. ఈ రెండు ట్రస్టుల మధ్య ప్రపంచ పంపకం – యుద్ధం, దివాలా వగైరాల ఫలితంగా బలాబలాలు మారితే – పునః పంపకాన్ని కాదనవు.

పెట్టుబడిదారులు ప్రపంచాన్ని పంచుకునేది ద్వేషంతో కాదు, లాభాలు పొందడానికే. సాంద్రీకరణే వారినిలా నిర్బంధిస్తుంది కాబట్టి. అయితే వారు పంచుకునేది పెట్టుబడి, బలాల నిష్పత్తిలో. ఆర్థిక రాజకీయ స్థాయి మారినప్పుడు బలం మారుతుంది. ఏం జరుగుతుందో అర్థం చేసుకోవడానికి, బలం మార్పుతో ఏ సమస్యలు పరిష్కరించబడతాయనేది నిర్ణయిస్తుంది. ఈ మార్పులు శుద్ధ ఆర్థికమైనవా, ఆర్థికేతరమా (సైనిక్) అనే సమస్య ప్రధానం.

దీనివల్ల మనకు తెలిసేదేమంటే ప్రపంచ ఆర్థిక పంపకం కోసం పెట్టుబడిదారీ సంఘాల మధ్య కొన్ని సంబంధాలు కుదురుతాయని. అయితే దీనికి సమాంతరంగా వలసలూ, పలుకుబడి ప్రాంతాలకోసం జరిగే పోరాటం ఆధారంగా కూటాల మధ్య, రాజ్యాల మధ్య కూడా కొన్ని సంబంధాలు కుదురుతాయని చెబుతూ లెనిన్, ఆ విషయాలను ఆరోప్రకరణమైన 'గొప్ప రాజ్యాల మధ్య ప్రపంచ విభజన'లో తెలియజేశాడు.

ఎ. సుపాన్ అనే భూగోళ శాస్త్రజ్ఞుడు యూరపియన్ వలసల ప్రాదేశికాభివృద్ధి గురించి వివరిస్తూ, 19వ శతాబ్దాంతంలో గల విలక్షణ గుణం ఆఫ్రికాను, పాలినీషియాను పంచుకోవడం అని చెప్పాడు. ఆసియాలోనూ, అమెరికాలోనూ ఆక్రమించుకోకుండా ఉన్న ప్రాంతాలు లేవు గనుక, దీని అర్థం భూమండలం అంతిమ విభజన పొందిందని. అందువల్ల భవిష్యత్తులో జరిగేది పునర్విభజనే. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రస్తుత దశలో, అనగా ఫైనాన్స్ పెట్టుబడి యుగంలో గల విలక్షణ గుణం వలసల కోసం పోరాటం తీవ్రం కావడం.

1860కి పూర్వమే ఇంగ్లండ్, ఫ్రాన్స్‌లకు వలసలున్నప్పటికీ, 1860–80కి మధ్య, అలాగే 1880–1900 మధ్య వలసలు బాగా పెరిగాయి. ఫ్రాన్స్‌కూ, జర్మనీకీ ఈ చివరి 20 సంవత్సరాల్లోనే విస్తరణలు పెరిగాయి. అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ గుత్తా పెట్టుబడిదారీ దశకు, అంటే ఫైనాన్స్ పెట్టుబడి పరివర్తన చెందడం అనేది ప్రపంచాన్ని పంచుకోవడానికి జరిగే పోరాటం తీవ్రం కావడానికి దారితీసిందని చెప్పాల్సి ఉంది. 1876లో మూడు రాజ్యాలు (అమెరికా, జర్మనీ, జపాన్) లకు వలసలు లేవు. ఫ్రాన్స్‌కు దాదాపు లేవు. 1914 నాటికి ఈ నాలుగు రాజ్యాలు 10 కోట్ల జనాభాను, 14 కోట్ల చదరపు కిలో మీటర్ల భూమి సంపాదించారు. వేగంలో అసమానత్వం ఎక్కువ ఉంది. జపాన్, జర్మనీల కంటే, ఫ్రాన్స్ మూడు రెట్లు ఎక్కువ సంపాదించింది. ఫైనాన్స్ పెట్టుబడి కూడా ఎక్కువే. ఇక వలస రాజ్యాలు మూడు రకాలున్నాయి. అవి 1. యువపెట్టుబడిదారీ దేశాలు : అమెరికా, జర్మనీ, జపాన్. ఇవి అసాధారణ వేగంతో పురోగమించాయి. 2. పాత పెట్టుబడిదారీ దేశాలు. బ్రిటన్, ఫ్రాన్స్ మొదటి వాటికంటే వీటి అభివృద్ధి మందం. 3. ఆర్థికంగా అత్యంత వెనకబడిన రష్యా దేశం. ఇది పెట్టుబడిదారీ పూర్వ సంబంధాల వలలో ఆధునిక పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదం చిక్కుకుందని చెప్పవచ్చు ఈ దేశంలో.

ఇక వలసల పునర్విభజనకు గురికాబడేవి గొప్ప రాజ్యాల వలసల పక్కనున్న చిన్నరాజ్యాల చిన్న వలసలు. అయితే గొప్ప రాజ్యాల మధ్య ఘర్షణ ఉంది గనుక, కొల్ల సొమ్ము విభజించుకోవడంలో అవి ఒక ఒప్పందానికి రాలేకపోతున్నందున, చిన్న రాజ్యాలు తమ వలసల్ని నిలుపుకో గలుగుతున్నాయి. ఇక 'అర్ధవలస' రాజ్యాలు–పర్షియా, చైనా, టర్కీలు ఉన్నాయి. ఫైనాన్స్ పెట్టుబడి ఎంత గొప్ప నిర్ణాయక శక్తి అంటే, సంపూర్ణ స్వాతంత్ర్యం గల రాజ్యాల్ని కూడా తనకు అనుకూలంగా లోబరుచుకోగలదు. వాస్తవంగా లోబరుచుకున్నాయి కూడా.

పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రస్తుత దశలోని లక్షణం–ముడి సరుకుల వనరులన్నిటినీ ఇప్పటివీ, భవిష్యత్తువీ ఒక బృందం స్వాధీనం చేసుకోవడం. అలా ఒక బృందం స్వాధీనం చేసుకున్నప్పుడు ఆ గుత్త సంస్థ స్థిరపడినట్లే. అలా అవి వనరులన్నింటినీ కొనేసి తమ పోటీదారులను తమతో పోటీ చేయడం అసాధ్యమయ్యేట్లు చేసుకుంటాయి. అలా స్వాధీనం చేసుకోవడానికి తమ శక్తియుక్తులన్నింటినీ వినియోగిస్తాయి. ఇలాంటి పోటీలో ఎట్టి పరిస్థితుల్లోనైనా వాటికి పూర్తి హామీనిచ్చేది వలస యాజమాన్యాలు మాత్రమే. పోటీదారులు ప్రభుత్వ గుత్త సంస్థల్ని నిర్మించే శాసనం ద్వారా ఆత్మరక్షణకు ప్రయత్నించినా, ఆ యత్నాలనూ వలస యాజమాన్యాలు ఎదుర్కొగలవు. ముడి సరుకుల కొరత ఎంత తీవ్రమైతే, పోటీ గానీ, వేటగానీ అంత తీవ్రమవుతుంది.

ఇలాంటి వాస్తవాల్ని బూర్జువా సంస్కరణ వాదాలు తగ్గించడానికి ప్రయత్నిస్తాయి. వ్యవసాయ పరిస్థితుల్ని మెరుగుపరచడం వల్ల సరఫరా అధికమై, ధరలు తగ్గుతాయని వీరంటారు. ఇలాంటి వాదాలు సామ్రాజ్య వాదానికి సమర్థనలు, అలంకరించడం తప్ప మరేం కాదు. సామాన్య ప్రజల్ని పట్టించుకునే ట్రస్టులు ఎక్కడున్నాయి?

వలసల వల్ల మార్కెట్‌లో పోటీని తొలగించుకోవడానికీ, కాంట్రాక్టులకు హామీ ఉండడానికీ తగు సంబంధాలు నెలకొల్పుకోవడం గుత్తా పద్ధతులకు సులభం. హిల్ఫెర్ డింగ్ చెప్పినట్లు ఫైనాన్స్ పెట్టుబడికి కావలసింది స్వేచ్ఛ కాదు, ఆధిపత్యం. గుత్త సంస్థల దోపిడీ వల్ల, కార్మికుల్లోనే గాక, మధ్య తరగతికీ భారం అధికం కావడం వల్ల, వారిలో అసహనం, ద్వేషం పేరుకుంటూ ప్రజా శాంతికి భంగం ఏర్పడి స్వదేశంలో పేలుడు జరగకుండా చూడ్డానికి కూడా విదేశాల్లో, వలసల్లో పని కల్పించడం అవసరమంటాడు 'వాల్' అనే బూర్జువా రచయిత.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# 'మేం మళ్లీ వస్తాం' విమర్శలకు వివరణ

- తోలేటి జగన్మోహనరావు

నా పుస్తకం,'మేం మళ్లీ వస్తాం', మీద రంగనాయకమ్మగారి సీరియల్ సమీక్షా వ్యాసం, 'వీక్షణం', సెప్టెంబర్ నుంచి డిసెంబరు 2013 వరకూ, నాలుగు సంచికల్లో వచ్చింది. ఈ పుస్తకం మార్క్సిజానికి సంబంధించినది కనుక, సమీక్షలో రంగనాయకమ్మ గారు చేసిన వ్యాఖ్యలకు, పాఠకులకువివరణలు ఇవ్వాల్సిన బాధ్యత నామీద ఉందనుకుంటున్నాను. వ్యాసాల నిడివి గురించివీక్షణం సంపాదకులు చేసిన సూచనలు దృష్టిలో పెట్టుకుని, ముఖ్యమైన అంశాలకు మాత్రమే పరిమితమై, నా వివరణ చాలా క్లుప్తంగా ఉంచడానికి ప్రయత్నిస్తాను. రంగనాయకమ్మగారి వ్యాఖ్యలన్నింటికీ సమాధానం ఇవ్వాలంటే నేను మరో సీరియల్ వ్యాసం రాయాలి.

1. ఈ పుస్తకంలో ప్రధానంగా చర్చించిన విషయం, సోషలిస్టు శిబిరం ఎందుకు, ఎలా కూలిపోయింది, అన్నది; ఈ తీవ్ర పరాజయం తర్వాత సోషలిజానికి భవిష్యత్తు ఉందా, లేదా అన్నది. ఎవరైనా ఈ పుస్తకం మీద విమర్శ చెయ్యదలుచుకుంటే, పుస్తకంలోంచి అక్కడ ఒక వాక్యం, ఇక్కడ ఒక పదం తీసుకుని వ్యాఖ్యానించకుండా, సమగ్రంగా మొత్తం ఈ విషయాన్ని అర్థం చేసుకుని విమర్శించాలి.

2. ఈ పుస్తకం అర్థం చేసుకోవాలంటే గతి తార్కికం గురించీ, భౌతిక వాదం గురించీ కొంత అవగాహన ఉండాలి. గతి తార్కికం గురించి సరియైన అవగాహన ఏమీ లేక, కేవలం కామన్ సెన్స్ మీద ఆధారపడి వ్యాఖ్యానించే వారికి మార్క్సిజం గురించి ఏమీ తెలియదు అనుకోవలసి వస్తుంది. అలాగే భౌతికవాద దృక్పథం గల మార్క్సిస్టులు సమాజం ఏ నిర్దిష్ట పరిస్థితులలో ఎలా మారుతోందో గమనిస్తూ, దానికి అనుగుణంగా తమ వ్యూహం, ఎత్తుగడలు నిర్ణయించుకుంటారు కాని అమూర్త ఆదర్శాల కనుగుణంగా సమాజాన్ని మార్చడానికి ప్రయత్నించరు. ఇది అర్థం కాకపోతే సోషలిస్టు చరిత్ర అంతా తప్పుల తడకలా కనిపిస్తుంది.

3. రంగనాయకమ్మ గారి సమీక్ష, ఈ వాక్యంతో ప్రారంభమైంది – 'రష్యా, చైనాల్లో క్రమక్రమంగా అపజయాలు పొందుతూ నిశ్శబ్దం అయిపోయిన సోషలిస్టు విప్లవకారులు ఇప్పుడు, 'మేం మళ్లీ వస్తాం' అని కేక పెడితే, 'ఎక్కణ్ణించీ?' అనే ప్రశ్న రాదూ? …

పుస్తకం పేరు సామాన్య పాఠకులందరికీ చాలా స్పష్టంగా అర్థమైంది. ఒక పాఠకుడికి అయితే కమ్యూనిస్టులు 'తొడగొట్టి సవాలు చేసినట్లుంది' అనిపించింది. కాని, అందరూ అర్థం చేసుకున్నట్లు అర్థం చేసుకుంటే రంగనాయకమ్మగారి ప్రత్యేకత ఏముంది?

'రష్యా వాళ్లు రష్యాలోనే, చైనా వాళ్లు చైనాలోనే ఉంటారు కదా? అక్కణ్ణించి ఎక్కడికి వస్తారు? ఉన్న చోటే ఉన్న వాళ్లు 'మళ్లీ వస్తాం' ఏమిటి?' అని ఒక గొప్ప సందేహం కలిగింది ఆవిడకి. మొదటి వాక్యంతో ప్రారంభమైన ఈ కుతర్కం చివరి దాకా అలాగే సాగింది.

4. మార్క్సిజం ఒక శాస్త్రం. నేను రాసిన దానిలో తప్పులుంటే, ఈ శాస్త్రం ఆధారంగా నా తప్పులు నిరూపించాలి. విమర్శకు ప్రమాణాలు చూపించాలి. రంగనాయకమ్మగారు తమ సుదీర్ఘ వ్యాసంలో నేను రాసిన దాని మీద తన విమర్శకు గాని, వివిధ అంశాల మీద తను వెల్లడించిన అభిప్రాయలకు గాని, మార్క్సిస్టు ప్రామాణిక సిద్ధాంత గ్రంథాల నుంచి ఎక్కడా, ఏ ప్రమాణాలూ చూపించలేదన్న విషయం పాఠకులు గుర్తించే ఉంటారు. రంగనాయకమ్మగారు తనకు తోచినదేదో, స్పష్టత లేకుండా, పేజీలకు పేజీలు రాసి పడేస్తే అది ఆవిడ 'ఆలోచన' మాత్రమే అవుతుంది కాని మార్క్సిజం అవదు.

5. 'కొట్టని పిండి కూడా ఉంది…' స్టాలిన్ మరణం కూడా హత్య వల్లే' అనే వార్త ఈ పుస్తకంలో గాక, ఇంతకు ముందు ఎక్కడైనా చదివారా?' అని ప్రశ్నించారు రంగనాయకమ్మగారు. స్టాలిన్ మరణించినప్పటినుంచీ, స్టాలిన్ హత్య చెయ్యబడ్డాడు అన్న వార్తలు వస్తూనే ఉన్నాయి. ఈ విషయం గురించి పుస్తకాలూ ఉన్నాయి. రంగనాయకమ్మగారికి ఈ విషయాలేమీ తెలిసి ఉండవు. ఆవిడ 'పిండి మర'కు చేరని చరిత్ర అంతా 'కొట్టని పిండే' అవుతుంది కదా!

6. రంగనాయకమ్మగారు లెనిన్ వీలునామా గురించి ప్రస్తావించారు. పైన చెప్పినట్లు, ఈ పుస్తకం ప్రధానంగా సోషలిస్టు ఉద్యమం ప్రపంచ వ్యాపితంగా ఎలా, ఎందుకు కూలిపోయిందీ అన్న విషయం గురించి చర్చించింది. లెనిన్ వీలునామా లాంటివి ఈ పుస్తకం పరిధిలోకి రావు. వివాదాస్పదమైన ఈ పత్రాల గురించి ఇక్కడ చర్చించడం అసలు సమస్యను పక్కదారి పట్టించడమవుతుందే తప్ప ప్రయోజనం లేదు.

7. అలాగే వ్యక్తి పూజ గురించి. నాలుగు వందల పేజీల పుస్తకంలో నేను వ్యక్తి పూజ గురించి రాసినది కేవలం రెండు పేజీలు మాత్రమే. అప్రధాన సమస్యలు తీసుకుని సాగదీసి, అస్పష్టంగా సుదీర్ఘ చర్చలు చెయ్యడం అసలు సమస్యను తప్పుదారి పట్టించడమే అవుతుంది. ఆ కారణంగా నేను ఇక్కడ ఈ సమస్య గురించి చర్చించను, రంగనాయకమ్మగారి విమర్శకు సమాధానం ఇవ్వను. రంగనాయకమ్మ గారు వ్యక్తి పూజ గురించి రాసినదీ, నేను నా పుస్తకంలో రాసినదీ ఒకసారి చదివి, ఈ విషయం గురించి పాఠకులు తమ అభిప్రాయాలు ఏర్పరుచుకోవచ్చు.

8. 'లెనిన్ కరెంటుతోనే సోషలిజం అన్నాడు. అది కరెంటు పెరుగుదల కోసం చెప్పడమే కానీ, కరెంటే సోషలిజం తెస్తుందని చెప్పడం కాదు' అంటున్నారు రంగనాయకమ్మగారు. కరెంటుతోనే సోషలిజం అని లెనిన్ ఎక్కడా చెప్పలేదు. *"Soviet power + electrification is communism"* అన్నది లెనిన్ సూత్రీకరణ. లెనిన్ విద్యుదీకరణ మీద ఆధారపడిన భారీ పరిశ్రమ, సోషలిజానికి భౌతిక, సాంకేతిక పునాది, అని నొక్కి చెప్పాడు. రంగనాయకమ్మగారు భావిస్తున్నట్లు ఈ మాటలు ఉత్పత్తి శక్తులు అతి తక్కువగా ఉన్న కాలంలో, పెరుగుదల కోసం చెప్పిన మాటలు కావు.

*"… Communism is the higher productivity of labour - compared with that existing under capitalism - of voluntary, class-conscious and united workers employing advanced techniques.." Lenin, A Great Beginning.*

సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ఎప్పుడూ అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం మీద ఆధారపడి పని చెయ్యాలనీ, ఆ విధంగానే కేపిటలిజంలో కంటే అధికంగా ఉత్పాదకత పెంచగలమనీ, సోషలిజం దిశగా పురోగమించగలమనీ, అన్నది మార్క్సిస్టు అవగాహన.

9. ఉత్పత్తి శక్తుల దుర్వినియోగం వల్లనే కాని రంగనాయకమ్మగారు భావిస్తున్నట్లు, పెరుగుదల వలన ప్రమాదాలు సంభవించవు. నిప్పుని వంటకూ ఉపయోగించవచ్చు, పక్కవాడి కొంప కాల్చడానికీ ఉపయోగించవచ్చు. తప్పు నిప్పుది కాదు. ఉత్పత్తి శక్తులు సద్వినియోగమవుతాయా, దుర్వినియోగమవుతాయా అన్నది, నిర్దిష్ట ఉత్పత్తి విధానం మీద ఆధారపడి ఉంటుంది.

'… కేపిటలిస్టు ఉత్పత్తి, సమస్త సంపదలకూ మూలాధారాలైన, భూమి యొక్క, శ్రామికుడి, సారం పిండడం ద్వారా, సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేస్తుంది…' – మార్క్స్ (కేపిటల్).

'… సమాజ విషయంలో చేస్తున్నట్లుగానే, ప్రకృతి విషయంలో కూడా, ప్రస్తుత ఉత్పత్తి విధానం (కేపిటలిస్టు ఉత్పత్తి విధానం), ప్రధానంగా, తక్షణ ఫలితాల గురించి మాత్రమే ఆలోచిస్తుంది..' –ఏంగెల్స్ *(The part played by labour in the transition from Ape to Man).*

కేపిటలిస్టు ఉత్పత్తి విధాన ప్రధాన లక్ష్యం తక్షణ లాభార్జన. ఉత్పత్తి కారణంగా సంభవించే ద్వితీయ, తృతీయ ఫలితాల గురించి అది పట్టించుకోదు. పర్యావరణానికి సంభవిస్తున్న ప్రమాదాలను నివారించగల, తగ్గించగల సాంకేతిక పరిజ్ఞానం ప్రస్తుత సమాజానికి ఉన్నప్పటికీ, తక్షణ లాభార్జనే లక్ష్యంగా గల పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం మరో కాలంలో, మరో ప్రాంతంలో పర్యావరణానికి జరిగే నష్టాన్ని నివారించడానికి 'వృథా' ఖర్చు చేసి లాభాన్ని తగ్గించుకోవడానికి ఇష్టపడదు.

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం అంతమై ప్రపంచ వ్యాపితంగా సోషలిస్టు ఉత్పత్తి విధానం ఏర్పడినప్పుడు ప్రపంచ ప్రజలందరికీ ఆరోగ్యకరమైన, ఆనందకరమైన జీవితాన్ని అందించడం ఆ వ్యవస్థ లక్ష్యంగా ఉంటుంది. అటువంటి వ్యవస్థ ప్రపంచం మొత్తం మీద వనరులను అంచనా వేస్తూ, వాతావరణం మీద ఉత్పత్తి కార్యక్రమాల ప్రభావాన్ని ఎప్పటికప్పుడు పరిశీలిస్తూ, నివారణ చర్యలు తీసుకుంటూ భూమినీ, శ్రామికుడినీ కాపాడుతుంది.

10. 'ఉత్పత్తి శక్తులు పెరగడానికి సోషలిజంలో ఒక హద్దు ఉండాలా, అక్కరలేదా

– అనేది ఒక ప్రశ్న... సోషలిస్టు సంబంధాల్లో అయితే ప్రతీ ఉత్పత్తి శక్తీ ఒక హద్దు దగ్గర ఆగిపోవలసిందే...' అంటున్నారు రంగనాయకమ్మగారు. ఏ వాస్తవాల ఆధారంగా ఆవిడ అంత కచ్చితంగా చెబుతున్నారో నాకు అర్థం కావడం లేదు.

అసలు ఉత్పత్తి శక్తుల పెరుగుదలకు ఒక హద్దు ఉంటుందా?

'ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి పరిమితులు ఏమిటి? ఎటువంటి పరిమితులూ లేవు... గతి తార్కిక భౌతిక వాదులు (ఉత్పత్తి శక్తులలో) అడ్డూ ఆపూ లేని ప్రగతిని సమర్థిస్తారు...' ప్లెఖనోవ్, *A Critique of our Critique.*

మానవ సమాజ చరిత్ర పరిశీలించినప్పుడు ఉత్పత్తి శక్తులు నిరంతరం పెరుగుతూనే ఉండడం మనం గమనిస్తాం. *'The satisfaction of the first need (the action of satisfying, and the instrument of satisfaction which has been acquired) leads to new needs...' (The German Ideology).* మొదటి అవసరం, ఆ అవసరం తీర్చడానికి మనిషి అందుబాటులోకి వచ్చిన పరికరం కొత్త అవసరాలకు దారితీస్తాయి. మనిషి కూడూ, గూడూ ఏర్పరుచుకోవడంతో సంతృప్తి చెంది ఆగిపోలేదు. నిరంతరం తన జీవితాన్ని మరింత సౌఖ్యవంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అడవుల నుంచి ఆధునిక నగరాలలోకి అడుగుపెట్టాడు. కాలినడక నుంచి అంతరిక్షయానం దాకా పురోగమించాడు. మనిషి ఆర్థిక, సాంస్కృతిక స్థాయి పెరిగిన కొద్దీ కొత్త అవసరాలు పుట్టుకొస్తూనే ఉంటాయి. ఆ అవసరాలు మరిన్ని అవసరాలను సృష్టిస్తాయి. ఆ అవసరాలను తీర్చడానికి మరింత ఉత్పత్తి సంభవిస్తుంది. ఇది మానవ సమాజం ఉన్నంతవరకూ అనంతంగా సాగుతూనే ఉంటుంది, ఏ ఘోర విపత్తో సంభవిస్తే తప్ప.

ఉత్పత్తి శక్తులలో పెరుగుదల అంటే మానవ సమాజ పురోగమనమన్నమాట. ప్రకృతి గురించీ, మానవ సమాజం గురించీ మనిషి జ్ఞానంలో పెరుగుదల అన్నమాట. మానవ సమాజం ఒక ఆదర్శ సమాజ స్థితికి చేరి నిలిచిపోవడం కానీ, జ్ఞానం ఒక పరిమితికి చేరి నిలిచిపోవడం కానీ ఎన్నటికీ సంభవించదు. తత్వశాస్త్రంలోకి వెడితేనే కాని ఇదేమిటో అర్థం కాదు.

'జ్ఞానం దిగువ నుంచి ఎగువకు అభివృద్ధి చెందుతూనే ఉంటుంది. కాని, పరమ సత్యం (absolute truth) అన్నది తెలుసుకుని, తను కనుగొన్న ఆ పరమ సత్యాన్ని సంభ్రమంతో తిలకిస్తూ, ఇంక చేతులు ముడుచుకు కూర్చోవడం తప్ప తెలుసుకోవలసినదేమీ లేదు అంటూ ఇంక ముందుకు వెళ్లలేని పరిస్థితి ఎన్నడూ చేరుకోదు. తత్వశాస్త్ర జ్ఞానానికి సంబంధించిన ఈ విషయం అన్ని రకాల జ్ఞానాలకు, ఆచరణాత్మక క్రియలకు కూడా వర్తిస్తుంది......' – ఏంగెల్స్ *(Fuerbach and the end of classical German philosophy).*

ఉత్పత్తి శక్తులు ఒక స్థాయికి పెరిగి, ఇంక మనిషి చెయ్యవలసినదేమీ లేదు అని చేతులు ముడుచుకు కూర్చునే స్థితి ఎప్పటికీ రాదు. ఉత్పత్తి శక్తుల పెరుగుదలకు ఆకాశమే – అక్షరాలా ఆకాశమే – హద్దు.

పూర్వకాలంలో మనిషి సముద్రం ఒడ్డున నిలబడి సముద్రానికి అవతల ఏముందా అని ఆలోచించినట్లుగా నేడు మనిషి భూమి మీద నిలబడి విశ్వాంతరాళం గురించి ఆలోచిస్తున్నాడు. మనిషి ఈ భూమిని వదిలి అంతరిక్షంలోకి అడుగుపెట్టే సమయం వచ్చింది. మధ్యయుగాలలో, ఖండాంతరయానమూ, కేపిటలిస్టు విధానమూ ఉత్పత్తి శక్తులను బ్రహ్మాండంగా అభివృద్ధి చేసినట్లు; సోషలిజంలో, ఈ గ్రహాంతర యానమూ, రోదసీ విజయాలూ ఉత్పత్తి శక్తులను కనీవినీ ఎరుగని విధంగా అభివృద్ధి చెయ్యబోతున్నాయి. భవిష్యత్తు తరాలు, మన నాగరికతను 'పాత రాతియుగ నాగరికత'గా చూస్తాయి. భవిష్యత్తులో మనిషి సాధించబోయే సాంకేతిక విజయాలు భూమిని కంటికి రెప్పలాగా కాపాడుకోవడంలో సహాయపడతాయి.

10. '... ఉత్పత్తి శక్తుల విషయాలు చర్చించేటప్పుడు, అతి జాగ్రత్తలు గల సోషలిస్టు దృష్టి కావాలి. ఈ విషయంలో లెనిన్, స్టాలిన్లు ఈ జాగ్రత్తలు చెప్పలేదు కాబట్టి, ఈ రచయిత పుస్తకం కూడా దాన్ని చెప్పలేదు...' అని విమర్శించారు రంగనాయకమ్మగారు.

నేను ఈ పుస్తకంలో ప్రధానంగా, ఉత్పత్తి, మానవ సమాజ వికాసం మీద ఏ విధంగా ప్రభావం చూపుతోందీ అన్న విషయం *(Social aspect of production)* గురించి మాత్రమే చెప్పాను. పుస్తకానికున్న పరిమితుల దృష్ట్యా వివరంగా చర్చించక పోయినా, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో అరాచకంగా జరుగుతున్న ఉత్పత్తి కార్యక్రమం ప్రపంచం ఉనికికే ప్రమాదకరంగా తయారయ్యిందనీ, ఈ అరాచకాన్ని అంతం చేసి, ప్రపంచ స్థాయిలో ఉత్పత్తి శక్తులను సంఘటితం చేసి, అజమాయిషీ చేసే వ్యవస్థ ఏర్పడితే కాని మానవ సమాజానికి విముక్తి లేదనీ చెప్పాను (పే. 408–409). సమస్య ఏమిటంటే, రంగనాయకమ్మగారు పుస్తకం చదవకుండా, విషయాన్ని సమగ్రంగా అర్థం చేసుకోకుండా, తనకు ఏం తోస్తే అది రాసి పడేశారు. రంగనాయకమ్మగారు ఈ విషయం ప్రస్తావించారు కాబట్టి, మనిషికి–ప్రకృతికి మధ్య సంబంధం గురించి మార్క్సిజం ఏం చెబుతుందో వివరిస్తాను.

'ప్రకృతి మీద మనిషి సాధించిన విజయాలు చూసి మనం చంకలు గుద్దుకో కూడదు. మనం సాధించే ప్రతీ విజయానికీ ప్రకృతి మన మీద పగ తీర్చుకుంటుంది. ప్రతీ విజయం మొట్టమొదట మనం ఆశించిన ఫలితాలు ఇస్తుందనేది నిజం. కాని, ద్వితీయ, తృతీయ ఫలితాలలో ప్రకృతి చాలా భిన్నమైన, ఊహించని ప్రభావం చూపిస్తుంది. తరచు ఈ ద్వితీయ, తృతీయ ఫలితాలు మొదటి విజయాన్ని రద్దు చేస్తాయి. ఒక విజేత తను జయించిన దేశ ప్రజలను పాలించినట్లు, మనం ప్రకృతికి వెలుపల నిలబడి ప్రకృతిని పాలించలేమనీ, రక్తమాంసాలు, మెదడు గల మనం ప్రకృతికి చెందినవారమనీ, ప్రకృతిలో జీవిస్తామనీ, అన్య జీవులకంటే, మనం ప్రకృతి సూత్రాలను నేర్చుకోగల, సరిగా అన్వయించుకోగల అవకాశం కలిగి ఉండడంలో ప్రకృతి మీద మనం విజయం ఉందనీ ప్రతీ దశా మనకు గుర్తు చేస్తూ ఉంటుంది...' *(Engels, The part played by labour in the transition from ape to man)*

'... ప్రకృతి మనిషి నిరింద్రియ శరీరం – అంటే మానవ శరీరం కాని శరీరమన్నమాట. ప్రకృతి ద్వారానే మనిషి జీవిస్తాడు. అంటే ప్రకృతి అతని శరీరం. తను మరణించకుండా ఉండాలంటే ప్రకృతితో మనిషి నిరంతరం సంభాషిస్తూ ఉండాలి. మనిషి శారీరక, చైతన్య (spiritual) జీవితం ప్రకృతితో ముడిపడి ఉంది అంటే అర్థం, ప్రకృతి తనతో తాను ముడిపడి ఉందని. ఎందుకంటే మనిషి ప్రకృతిలో ఒక భాగం...' – మార్క్స్ *(Economic and Philosophical Manuscripts).*

రంగనాయకమ్మగారు చెప్పే 'అతి జాగ్రత్తలు గల సోషలిస్టు దృష్టి' అంటే ఏమిటో నాకు తెలియదు. కాని, మనిషి ప్రకృతిలో ఒక భాగమనీ, మనిషి తను నశించిపోకుండా ఉండాలంటే ప్రకృతిని కంటికి రెప్పలాగా కాపాడుకోవాలనీ అన్నది మార్క్స్, ఏంగెల్స్‌ల దృక్పథం. లెనిన్, స్టాలిన్‌లతో సహా మార్క్సిస్టులందరి దృక్పథం. ఈ విషయంలో లెనిన్, స్టాలిన్లు జాగ్రత్తలు చెప్పలేదనీ, వారు చెప్పలేదు కాబట్టి నేను చెప్పలేదనీ – రంగనాయకమ్మగారి కుతర్కానికి హద్దులు లేవనిపిస్తోంది.

11. ఉత్పత్తి సంబంధాలను ఆస్తి సంబంధాలు అన్నందుకు నన్ను తప్పు పట్టారు రంగనాయకమ్మగారు. 'ఉత్పత్తి సంబంధాలు అనేవి ఉత్పత్తి తయారయ్యే, శ్రమలు జరిగే క్రమాల్లో యజమానీ–శ్రామికుల మధ్యా, శ్రామికులకూ, శ్రామికులకూ మధ్యా ఉండేవి' అనీ, 'ఆస్తి సంబంధాలు అనేవి, ఉత్పత్తి సాధనాలకు (భూమికీ, ఇతర సాధనాలకూ) సంబంధించినవి' అనీ రంగనాయకమ్మగారు,'ఉత్పత్తి సంబంధాలు' అనే మార్క్సిస్టు భావనను రెండు భిన్న రకాల సంబంధాలుగా విడగొట్టారు.

అసలు, ఉత్పత్తి సంబంధాలు అన్న పదం ఎప్పుడు, ఎలా వాడుకలోకి వచ్చింది?

1845లో మార్క్స్–ఏంగెల్స్‌లు, జర్మన్ ఐడియాలజీలో 'సంపర్క సంబంధాలు', 'సంపర్క విధానాలు', 'ఉత్పత్తి, సంపర్క సంబంధాలు' అన్న పదాలను ఉత్పత్తి సంబంధాలను వివరించడానికి వాడారు. ఆ సమయంలో ఇంకా వారి ఆలోచనలు ఒక స్పష్టమైన రూపు దిద్దుకోలేదు.

1847–48లో రాసిన కమ్యూనిష్టు మేనిఫెస్టోలో, ఉత్పత్తి సంబంధాలు అన్న అర్థంలో ఆస్తి సంబంధాలు అన్న పదాన్ని ప్రయోగించారు.

*'.. At a certain stage in the development... the feudal relations of property became no longer compatible with the already developed productive forces; they became so many fetters. They had to be burst asunder; they were burst asunder..." (Communist Manifesto).*

ఆస్తి సంబంధాలు, ఉత్పత్తి సంబంధాలు అన్న పదాలను పర్యాయ పదాలుగా మార్క్స్ ఇతర రచనలలో కూడా వాడారు.

ఆ తర్వాత 1859లో, *A Contribution to the critique of Political Economy* వెలువడింది. *Property Relations* అని కమ్యూనిష్టు మేనిఫెస్టోలో చెప్పినది, ఈ పుస్తకంలో *Relations of Production*గా స్పష్టంగా రూపుదిద్దుకొంది. అప్పటి నుంచీ ఉత్పత్తి సంబంధాలు *(Relations of Production)* అన్న పదం మార్క్సిజంలో ప్రాచుర్యంలోకి వచ్చింది.

*'... At a certain stage of their development, the material productive forces of society come in conflict with the existing relations of production -- what is but a legal expression for the same -- with the property relations. ...' Marx, A contribution to the critique of Political Economy.*

'ఉత్పత్తి సంబంధాలు అంటే అర్థం ఏమిటి? న్యాయశాస్త్ర పరిభాషలో ఆస్తి సంబంధాలు అని చెప్పబడేవి...' ప్లెఖనోవ్ *(Essays on the History of Materialism).*

ఉత్పత్తి సంబంధాలూ, ఆస్తి సంబంధాలూ ఒకటే అని పై కొటేషన్లు స్పష్టం చేయడం లేదా?

'ఉత్పత్తి సంబంధాలు' అన్న పదానికి రాజకీయార్థిక శాస్త్ర పాఠ్య గ్రంథం ఈ కింది నిర్వచనం ఇచ్చింది.

'ఉత్పత్తి సంబంధాలలో – 1) ఉత్పత్తి సాధనాల యాజమాన్య రూపాలూ 2) ఈ యాజమాన్యం కారణంగా, ఉత్పత్తిలో వివిధ సామాజిక సమూహాల స్తానం, ఆ సమూహాల మధ్య పరస్పర సంబంధాలూ 3) ఉత్పత్తి సాధనాల యాజమాన్యం కారణంగానూ, ఉత్పత్తిలో ప్రజల స్తానాన్ని బట్టీ, ఏర్పడే పంపిణీ రూపాలూ, ఉంటాయి.' *(Political Economy, A Textbook issued by the Institute of Economics, The Academy of the Sciences of the USSR (1954),*

ఉత్పత్తి సాధనాల యాజమాన్యం (ఆస్తి యాజమాన్యం) అన్నది ఉత్పత్తి సంబంధాలకు పునాది. ఈ యాజమాన్యాన్ని అనుసరించే, యజమాని–శ్రామికుల మధ్య సంబంధాలు ఏర్పడుతాయి కాని యజమాని–శ్రామికుల మధ్య సంబంధం ఒక స్వతంత్ర అంశం కాదు. రంగనాయకమ్మగారు ఉత్పత్తి సంబంధాలకు పునాది అయిన ఉత్పత్తి సాధనాల యాజమాన్యాన్ని, ఉత్పత్తి సంబంధాలనుంచి విడగొట్టి, యజమాని–శ్రామికుల మధ్య, శ్రామికులకూ శ్రామికులకూ మధ్య సంబంధాలను మాత్రమే ఉత్పత్తి సంబంధాలుగా ఒక తప్పుడు నిర్వచనం ఇస్తున్నారు. ఉత్పత్తి సంబంధాలకు ఇలా తప్పుడు నిర్వచనం ఇవ్వడం వలన, మార్క్సిజం చెప్పే వర్గ పోరాట అర్థమే మారిపోతోందన్న సంగతి ఆవిడకు అర్థమైనట్లు లేదు.

కేపిటల్ పరిచయం చేసిన రంగనాయకమ్మగారికి మార్క్సిజంలో ఒక కీలక పదం – ఉత్పత్తి సంబంధాలు – అర్థం తెలియకపోవడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. 'ఇది మార్క్సిజాన్ని నేర్చుకోవడంలో మొట్టమొదటి పాఠం, ఒకటో క్లాసు పాఠం' అంటున్నారు కాబట్టి, తను ఏ క్లాసులో, ఏ పాఠం నేర్చుకుంటున్నారో రంగనాయకమ్మగారే సెలవివ్వాలి.

12. 'ఈ పుస్తకంలో చెప్పిన విషయాల్లో ప్రధానమైనది, స్టాలిన్ కాలం అంతా సోషలిజంగా గడుస్తోంటే, దాన్ని కృశ్చేవ్ పాడు చేసి, దాన్ని ప్రైవేటు పెట్టుబడిదారీగా మార్చాడు' అని తన అవగాహన మేరకు వ్యాఖ్యానించారు రంగనాయకమ్మగారు. 'సోవియట్ సమాజంలో, కార్మికులు, కర్షకులు, మేధావులు, కలిసి మెలిసి జీవిస్తున్నారు... దోపిడీ నుంచి విముక్తి చెందిన సోవియట్ యూనియన్‌లో వైరుధ్యాలు లేవు, వర్గ సంఘర్షణలు లేవు' అని స్టాలిన్ అన్నట్లు, నేను పే. 331లో రాశానని రంగనాయకమ్మగారు అంటున్నారు. ఆ పేజీలో నేను కోట్ చేసిన స్టాలిన్ వాక్యాలు వాస్తవంగా ఇవి:

'సోవియట్ సమాజంలో నేడు వైరుధ్య పూరితమైన, శత్రు వర్గాలు లేవు. దోపిడీ వర్గాలు నిర్మూలించబడ్డాయి. సోవియట్ సమాజంలో భాగస్తులైన కార్మికులు, కర్షకులు, మేధావులు కలిసిమెలసి జీవిస్తున్నారు. స్నేహపూర్వకంగా సహకరించు కుంటున్నారు... కేపిటలిస్టు సమాజంలో, శ్రామికులకూ, కేపిటలిస్టులకూ మధ్య, రైతులకూ, భూస్వాములకూ మధ్య రాజీ కుదర్చడానికి వీలులేని వైరుధ్యాలుంటాయి. ఈ వైరుధ్యాలు ఆ సమాజాన్ని అల్లకల్లోలం చేస్తుంటాయి. దోపిడీ నుంచి విముక్తి చెందిన సోవియట్ యూనియన్‌లో అటువంటి వైరుధ్యాలు లేవు, వర్గ సంఘర్షణలు లేవు...' అన్నవి స్టాలిన్ వాక్యాలు. 'అటువంటి', అంటే – కేపిటలిస్టు సమాజాన్ని అల్లకల్లోలం చేసే, రాజీ కుదర్చడానికి వీలులేని వైషమ్యపూరితమైన వైరుధ్యాలు, వర్గ సంఘర్షణలు, శత్రు వర్గాలు అని – ఏ సామాన్య పాఠకుడికైనా అర్థం అవుతుంది. రంగనాయకమ్మగారు పై వాక్యాలను తన ఇష్టం వచ్చినట్లు మార్చి పడేసి, 'దోపిడీ నుంచి విముక్తి చెందిన సోవియట్ యూనియన్‌లో వైరుధ్యాలు లేవు, వర్గ సంఘర్షణలు లేవు' అని స్టాలిన్ అన్నట్లు నేను రాశానని చెబుతున్నారు. ఎంత వక్రీకరణ? ఎంత బాధ్యతారహిత విమర్శ?

'స్టాలిన్ కాలంలో వర్గాలు పోయాయి అని ఈ పుస్తకం ఎంత చెప్పినా, మళ్లీ ఈ పుస్తకమే ఇచ్చే సమాచారం చూస్తే, మొదటి మాట రద్దయిపోతుంది. ' అంటున్నారు రంగనాయకమ్మగారు. స్టాలిన్ కాలంలో వర్గాలు పోయాయి అని ఎక్కడ ఈ పుస్తకం చెప్పిందో రంగనాయకమ్మగారు చెప్పగలరా?అసలు రంగనాయకమ్మగారు ఈ పుస్తకం చదివే తమ సమీక్ష రాశారా?

13. 'కృశ్చేవ్ సోషలిజం స్థానంలో పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరణ అడుగులు వేశాడు (పే. 360) అన్నారు. అంటే, అప్పటిదాకా ఉన్నది సోషలిజం అనీ, స్టాలిన్ కాలంలో పెట్టుబడిదారీ విధానం అంతరించిందనీ, కృశ్చేవ్ కొత్తగా అది ప్రారంభించాడనీ, పదే పదే చెప్తారు...' అని రంగనాయకమ్మగారి ఆరోపణ. స్టాలిన్ కాలంలో ఉన్న వ్యవస్థ గురించి నా పుస్తకంలోనుంచి ఈ కొటేషన్ చూస్తే పాఠకులకు అర్థమవుతుంది:

'సోషలిస్టు శిబిరం అని మనం అన్న దానిలో వాస్తవానికి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ లేదనీ, రష్యాలో కూడా సోషలిస్టు సమాజ స్థాపనకు పునాది వెయ్యపడిందే కాని సోషలిజం అన్నది పూర్తి అర్థంలో లేదనీ....' (పే. 301) – ఇదీ నేను చెప్పినది. అసలు పరివర్తనలో ఉండే సోషలిస్టు సమాజం గురించి రంగనాయకమ్మగారికి ఏ మాత్రం అవగాహన ఉన్నట్లు లేదు.

పరివర్తన అంటే పాతనుంచి క్రమంగా మార్పు. అంటే పాత పూర్తిగా నశించి పోదు. *'The existence of two mutually contradictory aspects, their conflict, and their flowing together into a new category, comprises the essence of the dialectical movement...' Marx.* అక్టోబరు విప్లవం సామాజిక విప్లవానికి నాంది మాత్రమే. ఈ రాజకీయ విప్లవం తర్వాత శ్రామిక వర్గం, పాలక వర్గమైంది, బూర్జువా వర్గం, పాలిత వర్గమైంది. ఈ రెండింటి స్థానాలు మారాయి. కాని పెట్టుబడికి–శ్రమకు మధ్య సంఘర్షణ అంతం కాలేదు. పెట్టుబడిదారీ శక్తులూ, నూతనంగా మొలకెత్తుతున్న సోషలిస్టు శక్తులూ కలిసికట్టుగా నూతన సమాజంలోకి ప్రవేశించాయి. మార్క్స్ చెప్పిన గతితార్కిక చలనం అర్థం ఇది. సోషలిస్టు విప్లవం తర్వాత సోషలిజమే ఉండాలి. పెట్టుబడిదారీ విధానం ఎక్కడా ఉండకూడదు. వెంటనే అది అంతం చేయాలి అని ఎవరైనా భావిస్తే అది సాధ్యం కాదు. సోషలిస్టు వ్యవస్థలోకి ఈ రెండూ కలిసికట్టుగా ప్రవేశిస్తాయి. ఈ రెండింటి మధ్య సంఘర్షణ జరుగుతూ ఉంటుంది. ఈ జీవన్మరణ సంఘర్షణ ఎంత కాలం, ఎలా సాగుతుంది? అన్నదీ సోషలిజం నిలదొక్కుకుంటుందా, లేదా, అన్నదీ అనేక విషయాల మీద ఆధారపడి ఉంటుంది. సోషలిజం అంతిమ విజయం ప్రపంచ వ్యాపితంగా మాత్రమే సాధ్యమన్నది మార్క్సిస్టుల అవగాహన.

సోవియట్ యూనియన్‌లో, స్టాలిన్ యుగంలో పెట్టుబడిదారీ అవశేషాలు ఉండడం వలన అది కేపిటలిస్టు వ్యవస్థే కాని సోషలిస్టు వ్యవస్థ కాదు అని రంగనాయకమ్మగారు భావిస్తున్నట్లు నాకు అర్థం అవుతోంది. ఒక నిర్దిష్ట కాలంలో సమాజం ఏ దిశగా ప్రయాణిస్తోందీ అన్నది చూడాలి కాని గతి తార్కిక చలనంలో ఉన్న అంశాలలో సోషలిస్టు అంశాన్ని విస్మరించి పెట్టుబడిదారీ విధాన అంశాన్ని మాత్రమే చూసి, ఆ వ్యవస్థ కేపిటలిస్టు వ్యవస్థే కాని సోషలిస్టు వ్యవస్థ కాదు అని చెప్పడం తప్పు.

14 'శ్రమ శక్తి విలువను' బట్టి నిర్ణయమయ్యేది వేతనాలు మాత్రమే, వస్తువు విలువ కాదు. వస్తువు విలువ నిర్ణయమయ్యేది వస్తువు తయారీకి అవసరమైన శ్రమ విలువను బట్టే, శ్రమ శక్తి విలువని బట్టి కాదు అని రంగనాయకమ్మగారు చెప్పినది కరెక్టే. 'శ్రమ విలువ' అన్న పదానికి బదులు 'శ్రమ శక్తి విలువ' అన్న పదం పొరపాటున పడింది. పుస్తకం వెలువడగానే కొంతమంది మిత్రులు కూడా ఈ తప్పు ఎత్తి చూపారు. ఈ పొరపాటు దొర్లినందుకు చింతిస్తున్నాను. తప్పు సరిదిద్దినందుకు రంగనాయకమ్మగారికి కృతజ్ఞతలు.

15 'ఈ రచయిత 'తోలేటి' వారే గానీ, మావో మీద ఈగల్ని తోలరు, 'తోలేటి' వారు కారు' అంటున్నారు రంగనాయకమ్మగారు. నా పుస్తకంలో, మావో ఆలోచనలో వివిధ అంశాల గురించి, అరవై పేజీలకు పైగా చర్చ ఉంది. రంగనాయకమ్మగారికి విషయం అర్థమై ఉంటే, ఈగలు, దోమలు అంటూ వెకిలి రాతలు రాయకుండా, పై అంశాల మీద తమ విమర్శ ఏమిటో సూటిగా చెప్పేవారు. నా తప్పులు ఎత్తి చూపేవారు. అది నాకూ, పాఠకులకూ ప్రయోజనకరంగా ఉండేది.

16. నేను మార్క్సిజం గురించి తెలుసుకుంటున్నానని నా పుస్తకంలో రాశాను. 'ఈ నాడు కూడా నాకు మార్క్సిజం పుర్తిగా అర్థమైందని చెప్పలేను' అని చెప్పాను (పే. 11). నాకు మార్క్సిజం పూర్తిగా తెలియకపోయినా మార్క్సిజం పేరిట ఎవరైనా అవాకులూ చవాకులూ రాస్తే, గుర్తించగలిగినంత మార్క్సిజం తెలుసు. నేను సర్వజ్ఞుడిని కాననీ, నేను నేర్చుకోవలసినది చాలా ఉందనే స్పృహ నాకుంది. నాకు అహం లేదు. ఎవరైనా నేను చెప్పినది తప్పు అని సహేతుకంగా వివరిస్తే, నా తప్పును బహిరంగంగా అంగీకరించడానికి సందేహించను. నలుగురూ నాలుగు కోణాల నుంచీ, సోషలిస్టు ఉద్యమ పతన సమస్య గురించి ఆలోచించినప్పుడు మాత్రమే వాస్తవం స్పష్టమవుతుందని నా నమ్మకం.

చివరగా సైద్ధాంతిక విమర్శలు చేసేవారు, మొదట రచయిత ఏం చెబుతున్నాడో స్పష్టంగా, సమగ్రంగా అర్థం చేసుకుని, ఆ తర్వాత సహేతుకంగా విమర్శించాలని నేను విన్నవిస్తున్నాను. చర్చలు సూటిగా, స్పష్టంగా, హుందాగా ఉండాలి. వికారం కలిగించే వెటకారాలు, వెకిలి వ్యాఖ్యలు, కుతర్కాలు, సీరియస్ సైద్ధాంతిక చర్చలకు ఏ మాత్రం ఉపయోగపడవన్న విషయం విమర్శకులు గుర్తించాలి. వీ

### కంచి స్వాములకు విముక్తి !

శంకర్ రామన్ హత్యకేసులో కంచి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి, ఉప పీఠాధిపతి విజయేంద్ర సరస్వతి, ఆయన సోదరుడు రఘు సహా 24 మందిని నిర్దోషులుగా ప్రకటిస్తూ పుదుచ్చేరి ప్రిన్సిపల్ సెషన్స్ కోర్టు నవంబర్ 27న తీర్పు వెలువరించింది. నిందితులపై మోపిన అభియోగాలకు పోలీసులు సరైన ఆధారాలు చూపించలేకపోయారని న్యాయమూర్తి మురుగన్ పేర్కొన్నారు. కాంచీపురం వరదరాజ పెరుమాళ్ ఆలయ మేనేజర్ శంకర్ రామన్ 2004 సెప్టెంబర్ 3న తన కార్యాలయంలోనే హత్యకు గురయ్యారు. ఈ కేసులో జయేంద్ర సరస్వతిని 2004 నవంబర్ 11న అరెస్టు చేశారు.

### బ్రిజేష్ ట్రిబ్యునల్ తీర్పు

కృష్ణా నదీ మిగులు జలాల పరిష్కార ట్రిబ్యునల్ చైర్మన్ జస్టిస్ బ్రిజేష్ కుమార్ తన తుది తీర్పును నవంబర్ 29 ప్రకటించారు. బ్రిజేష్ ట్రిబ్యునల్ ఆంధ్రప్రదేశ్‌కు 145 టిఎంసిల మిగులు జలాలను, 65 శాతం నీటి లభ్యత ఆధారంగా మరో 43 టిఎంసిలను, నదిలో కనీస ప్రవాహం కింద 6 టిఎంసిలను కేటాయించింది. దీంతో మొత్తం 194కు చేరింది. బచావత్ ట్రిబ్యునల్ 811 టిఎంసిలతో కలిపి 1005కి చేరింది. కర్ణాటకకు 105 టిఎంసిల మిగులు జలాలను 65 శాతం నీటి లభ్యత ఆధారంగా మరో 61 టిఎంసిలను నదిలో ప్రవాహం కింద మరో 7 టిఎంసిలను కేటాయించింది. దీంతో కర్ణాటక మొత్తం వాటా 907కు చేరింది. మహారాష్ట్రకు బచావత్ ట్రిబ్యునల్ 585 టిఎంసిలను కేటాయించింది. బ్రిజేష్ ట్రిబ్యునల్ 35 టిఎంసిల మిగులు జలాలను 65 శాతం నీటి లభ్యత ఆధారంగా 43 టిఎంసిలను, నదిలో కనీస ప్రవాహం కింద 3 టిఎంసిలను కేటాయించింది. దీంతో మహారాష్ట్ర వాటా 666కు చేరింది.

### తేజ్‌పాల్ అరెస్టు

లైంగిక ఆరోపణలు ఎదుర్కొంటున్న తెహల్కా వ్యవస్థాపక సంపాదకుడు తరుణ్ తేజ్‌పాల్‌ను గోవా పోలీసులు నవంబర్ 30న అరెస్టు చేశారు. ముందస్తు బెయిల్ కోసం తేజ్‌పాల్ పిటిషన్‌ను తిరస్కరిస్తూ జిల్లా సెషన్స్ కోర్టు జడ్జి అనూషా ప్రభుదేశాయ్ ఉత్తర్వులు జారీచేశారు. గోవాలో జరిగిన ఒక కార్యక్రమంలో తేజ్‌పాల్ తనను లైంగికంగా వేధించాడని ఆయన సహోద్యోగి ఆరోపణలు చేసింది. ఈ వార్త, వార్త పత్రికల్లో వచ్చిన కథనాలను ఆధారంగా చేసుకొని గోవా ప్రభుత్వం సుమోటాగా కేసు నమోదు చేసింది.

### ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ, చత్తీస్‌గడ్ రాష్ట్రాలకు ఐదు విడుతలుగా జరిగిన అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 8న, మిజోరం అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 9న వెలువడ్డాయి. రాజస్థాన్‌లో 199 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరగగా బిజెపి - 162, కాంగ్రెస్ - 21, బిఎస్‌పి - 3, ఇతరులు - 13 స్థానాలు గెలుచుకున్నాయి. వసుంధర రాజే ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. మధ్యప్రదేశ్‌లోని 230 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరగగా బిజెపి - 165, కాంగ్రెస్ - 58, బిఎస్‌పి - 7, ఇతరులు - 9 స్థానాలు సాధించాయి. మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రిగా శివరాజ్ సింగ్ చౌహాన్ మూడోసారి ఎన్నికయ్యారు. 70 స్థానాలు ఉన్న ఢిల్లీ అసెంబ్లీలో బిజెపి - 31, ఆమ్ ఆద్మీ పార్టీ (ఎఎపి) - 28, కాంగ్రెస్ - 8, ఇతరులు - 3 గెలుచుకున్నాయి. ఏ పార్టీకి మెజారిటీ రాకపోవడంతో, ఆమ్ ఆద్మీ పార్టీకి కాంగ్రెస్ బయట నుంచి మద్దతు ప్రకటించడంతో ప్రభుత్వ ఏర్పాటుకు ముందుకు వచ్చింది. చత్తీస్‌గడ్ లోని 90 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరిగాయి. బిజెపి - 49, కాంగ్రెస్ - 39, బిఎస్‌పి - 1, ఇతరులు - 1 స్థానాలు గెలుచుకున్నాయి. రమణ్‌సింగ్ ముఖ్యమంత్రిగా మూడోసారి ఎన్నికయ్యారు. మిజోరాం 40 అసెంబ్లీ స్థానాలకు గాను కాంగ్రెస్ - 33, ఎంఎన్ఎఫ్ - 5, ఎంపిసి -1 గెలుచుకున్నాయి. లాల్ తన్హాల్లా ఐదోసారి ముఖ్యమంత్రిగా పదవి బాధ్యతలు చేపట్టారు.

### దాణా కేసులో లాలూకు బెయిల్

దాణా కుంభకోణం కేసులో జైలుశిక్ష అనుభవిస్తున్న బీహార్ మాజీ ముఖ్యమంత్రి లాలూ ప్రసాద్ యాదవ్‌కు సుప్రీంకోర్టు డిసెంబర్ 13న బెయిల్ మంజూరు చేసింది. సిబిఐ కోర్టు తనకు విధించిన శిక్షపై జార్ఖండ్ కోర్టును ఆశ్రయించిన లాలూ ప్రసాద్, ఆ తీర్పు రావడానికి ఏడెనిమిదేళ్లు పట్టవచ్చని, ఈ అంశాన్ని పరిగణనలోకి తీసుకొని తనకు బెయిలు మంజూరు చేయాలన్న అభ్యర్థనను జస్టిస్ పి. సదాశివం నేతృత్వంలోని ధర్మాసనం పరిగణనలోకి తీసుకుని బెయిల్ మంజూరు చేసింది.

### లోక్‌పాల్ ఆమోదం

అవినీతి నిర్మూలనకు ఉద్దేశించిన లోక్‌పాల్ బిల్లుకు డిసెంబర్ 17న రాజ్యసభ, డిసెంబర్ 18న లోక్‌సభ ఆమోదం తెలిపాయి. ఈ బిల్లుకు సమాజ్‌వాదీ పార్టీ, శివసేన పార్టీలు వ్యతిరేకించగా, మిగతా అన్ని పార్టీలు మద్దతు తెలిపాయి. ఈ బిల్లును 2011లోనే లోక్‌సభలో ప్రవేశపెట్టగా కొన్ని పార్టీలు విభేదించాయి. లోక్‌పాల్ ముసాయిదాను ప్రభుత్వం పార్లమెంటరీ సెలెక్ట్ కమిటీకి నివేదించింది. మెజారిటీ పార్టీల అభిప్రాయాలను, సూచనలను పరిగణనలోకి తీసుకొని లోక్‌పాల్ బిల్లుకు కొన్ని సవరణలు చేసి, ఆ మార్పులతోనే బిల్లు ఆమోదం పొందింది.

### జాట్ల రిజర్వేషన్‌కు కేంద్రం ఆమోదం

తొమ్మిది రాష్ట్రాల్లోని జాట్లకు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో వారికి రిజర్వేషన్ కల్పించడానికి డిసెంబర్ 19న కేంద్ర క్యాబినెట్ నిర్ణయం తీసుకుంది. ఇప్పుడున్న నిబంధనల మేరకు వారిని ఒబిసిల్లో చేర్చే అంశంపై కేంద్ర బి.సి కమిషన్ (ఎన్‌సిబిసి) పరిశీలించాలని కేంద్ర సమాచార, ప్రసార మంత్రి మనీశ్ తివారీ ఎన్‌సిబిసిని ఆదేశించారు.

### కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డులు

ఈ ఏడాది కేంద్ర సాహిత్య అకాడమి అవార్డుకి దేశంలోని 22 భాషల నుంచి రచయితలను డిసెంబర్ 22న కేంద్ర సాహిత్య అకాడమి ముగ్గురు రచయితలను ఎంపిక చేసింది. ఎంపికైనవారిలో 55 ఉర్దూ కవితల సకలనం 'లావా' రచయిత జావేద్ అక్తర్, 'మిల్‌జుల్ మన్' రాసిన హిందీ నవలా రచయిత్రి మృదులా గార్గ్, తెలుగులో స్త్రీల కవిత్వం-కథ-అస్తిత్వ చైతన్యంపై 'సాహిత్యాకాశంలో సగం' అనే వ్యాస సంకలనం రాసిన ప్రొ. కాత్యాయని విద్మహేకు ఈ పురస్కారం లభించింది. 2014 మార్చి 11న ఢిల్లీలో జరిగే కార్యక్రమంలో పురస్కార గ్రహీతలకు లక్ష రూపాయల నగదు, జ్ఞాపిక, ప్రశంసాపత్రంతో సత్కరిస్తారు. వీ

## చిలీ అధ్యక్షురాలిగా మిచెల్ బాచ్‌లెట్

చిలీ వామపక్ష నేత మిచెల్ బాచ్‌లెట్ చిలీ అధ్యక్షురాలిగా రెండోసారి ఎన్నికయ్యారు. బాచ్‌లెట్‌కు 62 శాతం ఓట్లు వచ్చాయి. అధికార అలియన్‌జా కూటమి తరఫున పోటీ చేసిన కన్సర్వేటివ్ పార్టీకి చెందిన ఎవలిన్ మత్తేయ్‌కు కేవలం 38 శాతం ఓట్లు మాత్రమే వచ్చాయి. సమూలమైన మార్పులు తేవడానికి తమ ఆమోదాన్ని చిలీ ప్రజలు ఒక ప్రభంజనం ద్వారా తెలిపారు. మార్చ్‌లో అధికారంలోకి రాగానే తన మొదటి వంద రోజులలో యాభై సంస్కరణలు తెస్తానని ఆమె వాగ్దానం చేసింది. వీటిలో ప్రధానమైనది కార్పొరేట్ టాక్స్‌ను 20 శాతం నుండి 25 శాతానికి పెంచడం. ఈ ఆదాయాన్ని సామాజిక సంస్కరణలు తేవడానికి ఉపయోగిస్తారని, ముఖ్యంగా ఉన్నత విద్యను ఉచితంగా అందిస్తామని తెలిపింది.

## నెల్సన్ మండేలా మృతి

జాతి వివక్షతకు వ్యతిరేక ఉద్యమ నాయకుడు, దక్షిణాఫ్రికా వ్యవస్థాపక అధ్యక్షుడు నెల్సన్ మండేలా డిసెంబర్ 6న మరణించారు. 95 ఏళ్ల మండేలా సుదీర్ఘ కాలంగా అనారోగ్యంతో బాధ పడుతున్నారు. ఆయన 1918 జూలై 18న దక్షిణాఫ్రికా తూర్పు ప్రాంతంలోని ఓ చిన్న గ్రామంలో తెంబూ జాతిలో పుట్టారు. దక్షిణాఫ్రికా రాజధాని జొహెన్నస్‌బర్గ్‌లోని హౌటన్ ఎస్టేట్‌లోని తన స్వగృహంలో ఆయన తుదిశ్వాస విడిచారు. నల్లజాతీయుల విముక్తి కోసం మూడొంతుల జీవితం ఉద్యమం చేశారు. సుమారు 27 ఏళ్లపాటు రాబెన్ ఐలండ్ జైలులో కారాగార శిక్షను అనుభవించారు. ఆయన 1990లో జైలు నుండి విడుదలైన తరువాత దక్షిణాఫ్రికా తొలి అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. నల్లజాతీయుల విముక్తికి ఆయన చేసిన పోరాటానికి గాను 1993లో క్లెర్క్‌తో పాటు సంయుక్తంగా నోబెల్ శాంతి బహుమతితో పురస్కరించారు. 1990లో విడుదలైన తర్వాత మొట్టమొదటగా ఆయన సందర్శించింది మన దేశంలోనే. అదే ఏడాది భారతదేశం ఆయన్ను దేశ అత్యున్నత పౌరపురస్కారం 'భారత రత్న'తో గౌరవించింది.

## సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్‌లో ఘర్షణలు

సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్‌లో డిసెంబర్ మొదటి వారంలో కొనసాగిన వర్గపోరులో ఐదు వందల మందికిపైగా పౌరులు మరణించారు. క్రైస్తవ మత ప్రాబల్యం అధికంగా ఉన్న ఈ దేశంలో గత మార్చ్‌లో ఉత్తర ప్రాంత ఇస్లాం తిరుగుబాటుదార్లు అధికారాన్ని చేజిక్కించుకున్నారు. అధికారాన్ని చేజిక్కించుకోవడంలో మతపరమైన ఉద్దేశం లేదని ప్రకటించినా, వారి మధ్య వర్గపోరు సలుపుతూనే ఉంది. డిసెంబర్ మొదటివారంలో ఇది కట్టలు తెంచుకుని ఘర్షణలకు దారితీసింది.

## మయన్మార్‌లో రాజకీయ ఖైదీల విడుదల

మయన్మార్‌లో డిసెంబర్ 11న నలభై ఒక మంది రాజకీయ ఖైదీలను విడుదల చేస్తున్నట్లు మయన్మార్ అధ్యక్షుడి సలహాదారు ప్రకటించారు. సంస్కరణలో భాగంగా వీరిని విడుదల చేస్తున్నట్టు తెలిపారు. సంవత్సరం చివరికల్లా జైళ్లలో మగ్గుతున్న రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయనున్నట్లు అధ్యక్షుడు థియిన్‌సేన్ ఇదివరకే ప్రకటించారు. సైనిక పాలన చివరి రోజుల్లో దాదాపు రెండు వేల ఐదు వందల మందిని అరెస్టు చేసి తీవ్ర చిత్రహింసలకు గురిచేశారు. అరెస్టయిన వారిలో జర్నలిస్టులు, రాజకీయ నాయకులు, ఉద్యమకారులు సహా వివిధ రంగాలకు చెందిన ఎందరో నిరసనకారులు ఉన్నారు.

## దక్షిణ సుడాన్‌లో అనిశ్చితి

దక్షిణ సుడాన్‌లో ఆర్మీ యునిట్ల మధ్య జరిగిన ఘర్షణల్లో సుమారు ఐదు వందల మంది చనిపోయారు. డిసెంబర్ 15న ఘర్షణలు ప్రారంభమయ్యాయి. అధ్యక్షుడిగా ఉన్న సల్వాకీర్ ప్రభుత్వం గతంలో ఉపాధ్యక్షుడిగా ఉన్న రియెక్ మచార్‌కి అనుకూలంగా ఉన్న సైనికులను తొలగించింది. తొలగించిన సైనికులతో తిరుగుబాటు ప్రయత్నించడంతో ఘర్షణలు మొదలయ్యాయి. ఈ తిరుగుబాటుకు ఉసిగొల్పిన ఆరోపణలతో మచార్‌ను ప్రభుత్వం అదుపులోకి తీసుకునేందుకు చర్యలు తీసుకుంటోంది.

## జర్మనీ చాన్సలర్‌గా మెర్కెల్

జర్మనీ చాన్సలర్‌గా మళ్లీ ఏంజెలా మెర్కెల్ మూడోసారి ఎన్నికయ్యారు. సెప్టెంబర్ 22న జరిగిన ఎన్నికల్లో మెర్కెల్‌కు చెందిన సంప్రదాయవాద క్రిస్టియన్ డెమోక్రాట్స్ యూనియన్ గెలిచినా సంపూర్ణ ఆధిక్యాన్ని సాధించలేదు. దీంతో ప్రతిపక్ష సోషల్ డెమోక్రాటిక్ పార్టీతో సంప్రదింపులు చేసుకొని మద్దతు కూడగట్టుకుంది. జర్మనీ పార్లమెంట్ దిగువ సభ బుందెల్‌స్టగ్‌లోని 631 సీట్లలో డిసెంబర్ 17న జరిగిన విజయ నిర్ధారణ ఓటింగ్‌లో ఆమెకు 462 మంది ఎంపిల మద్దతు లభించింది. నాలుగేళ్లపాటు ఆ పదవిలో ఉంటారు.

## ఎన్ఎస్ఎ నిఘా చట్ట విరుద్ధం

అమెరికా జాతీయ భద్రతా సంస్థ (ఎన్ఎస్ఎ) పౌరుల ఫోన్ కాల్స్ వివరాలు, సమాచారం సేకరించడాన్ని అక్కడి ఫెడరల్ డిస్ట్రిక్ట్ కోర్టు తప్పుపట్టింది. ఈ విధంగా సమాచారం సేకరించడం చట్టవిరుద్ధమని జడ్జి రిచర్డ్ లియాన్ స్పష్టం చేశారు. ఎన్ఎస్ఎ కాంట్రాక్టర్‌గా పనిచేసిన ఎడ్వర్డ్ స్నోడెన్ ఆ సంస్థ నిర్వహిస్తున్న నిఘా కార్యకలాపాల గుట్టును ఈ ఏడాది జూన్‌లో బట్టబయలు చేశాడు. దీంతో ఎన్ఎస్ఎ రహస్యంగా పౌరుల సమాచారాన్ని సేకరిస్తున్న విషయం ప్రపంచానికి తెలిసివచ్చింది.

## థాయ్‌లాండ్ పార్లమెంట్ రద్దు

గత నెల రోజులుగా థాయ్‌లాండ్‌లో నిరసనలు మిన్నంటడంతో ప్రధాని ఇంగ్లక్ షినవత్రా పార్లమెంట్‌ను రద్దు చేసింది. ఆందోళనకారులు తాత్కాలిక కౌన్సిల్‌కు పాలనను బదిలీ చేయాలనీ, షినవత్రా కుటుంబం ఎన్నికలలో మళ్లీ పోటీ చేయకూడదని డిమాండ్ చేస్తున్నారు. ఇంగ్లక్ షినవత్రాను అడ్డం పెట్టుకొని ఆమె సోదరుడు థాక్సిన్ షినవత్రా పాలన నడుపుతున్నాడని ఆందోళనకారులు తెలిపారు. వారి కుటుంబ పాలనను అంతం చేయాలని వారు డిమాండ్ చేశారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎ.మల్లేశ్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 నవంబర్ నుండి 30 నవంబర్ 2013 వరకు 12 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1179)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 1 | – | 18 | 14 | 4 | 3 | 2 | 2 | 2 | 3 | 2 | – | – | 20 | 26 | – | – | – | 1 | – |
| మహబూబ్‌నగర్ | – | 5 | – | 10 | 11 | 5 | 11 | 1 | 4 | 4 | 7 | 19 | 14 | 13 | 48 | 1 | – | 1 | – | – | – |
| నల్గొండ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| హైదరాబాద్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| మెదక్ | – | 8 | – | 6 | 9 | 3 | 6 | 2 | – | 4 | 3 | 4 | – | 5 | 42 | 24 | – | – | – | – | – |
| కరీంనగర్ | 2 | 5 | 4 | 10 | 12 | 2 | 4 | 4 | 7 | 9 | 3 | 5 | 2 | 2 | 25 | 7 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 5 | – | 13 | 18 | 4 | 23 | 2 | 8 | 9 | 2 | 2 | 3 | – | 36 | 17 | – | – | – | – | – |
| వరంగల్ | – | 7 | – | 3 | 8 | 9 | 9 | 8 | – | – | – | – | – | 9 | 18 | 9 | – | – | – | – | 6 |
| అనంతపురం | – | 8 | 2 | 16 | 9 | 2 | – | – | 1 | 3 | 1 | 4 | – | 3 | 32 | 13 | – | – | – | – | – |
| ఖమ్మం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | – | – | – | 7 | 9 | 3 | – | 3 | – | 3 | 2 | 3 | 5 | 2 | 17 | 15 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 6 | 4 | 6 | 4 | 5 | 5 | 8 | 1 | 2 | 2 | – | 26 | 10 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 1 | 8 | 4 | 2 | 5 | – | 1 | – | 2 | 4 | 4 | 21 | 9 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 6 | 14 | 10 | 5 | – | – | – | 3 | 7 | 7 | 4 | 26 | – | – | – | – | – | – |
| విశాఖపట్నం | 1 | – | – | 3 | 7 | – | 2 | 1 | – | 10 | 2 | 4 | 5 | 5 | 25 | 23 | – | – | – | 6 | 1 |
| మొత్తం | **3** | **39** | **6** | **99** | **123** | **52** | **69** | **33** | **27** | **53** | **27** | **54** | **42** | **47** | **336** | **154** | **–** | **1** | **–** | **7** | **7** |




# हैदराबाद विश्वविद्यालय
# University of Hyderabad

**(A Central University established by an Act of Parliament)**
**Prof. C.R. Rao Road, Gachibowli, P.O. Central University, Hyderabad 500 046**



## प्रवेश घोषणा /ADMISSION ANNOUNCEMENT 2014-15

The University of Hyderabad invites bright, aspiring students committed to excellence to apply for admission to various postgraduate courses and research programmes through an All-India entrance examination. The University offers, subject to availability, hostel facility to the students admitted to any of its regular programmes of study.

## Courses / Programmes Offered

**I.M.A. and I.M.Sc. (5-year Integrated) Courses** (after +2 level education viz. Inter/HSC/CBSE/ ICSE): (10 Semesters) in Sciences, Humanities and Social Sciences.
**PG Courses** (after 3/4 year graduation): (4/6 semesters) in Sciences, Humanities, Social Sciences, Performing Arts, Fine Arts, Art History, Communication, Business Administration in Health Care and Hospital Management, Health Psychology, Master of Computer Applications and Master of Public Health

**Adv. PG Diploma and P.G Diploma:** (2 semesters) in Folk Culture Studies, Mineral Exploration, Sanskrit Computational Linguistics, Children Theatre/Theatre in Education and Health Communication.
**M.Tech. Programmes:** (4 semesters) in Computer Science, Artificial Intelligence, Information Technology (CS/AI/IT), Computational Techniques, Integrated Circuit Technology, Bioinformatics, Mineral Exploration, Materials Engineering and Nano Science and Technology.

**M.Phil. Programmes:** (2 semesters) in Humanities and Social Sciences.
**Ph.D. Programmes:** (2-5 years) in Sciences, Humanities, Social Sciences, Dance, Theatre Arts, Communication and Management studies.
**Integrated M.Phil./Ph.D.** in Cognitive Science.
**Integrated M.Sc./Ph.D.** in Biotechnology.

**Centres for the entrance examinations:** Ahmedabad, Aizawl, Ananthapur, Bengaluru, Bhubaneswar, Bhopal, Calicut, Chennai, Cochin, Coimbatore, Delhi, Dimapur, Guwahati, Hyderabad, Imphal, Jaipur, Jammu, Kadapa, Karimnagar, Kolkata, Lucknow, Mumbai, Nagpur, Nizamabad, Patna, Pune, Ranchi, Raipur, Shillong, Srinagar, Tirupati, Vijayawada, Visakhapatnam, Vizianagaram and Warangal. ***The University reserves the right to cancel any of the examination centres and allot another centre closer to the centre cancelled.***

**General Information:**
Detailed information is given in the Prospectus 2014-15 which is available on the University's website and also at **www.schools9.com**. Printed copies are not available with the University for sale. Candidates who are appearing in the final examination of the qualifying degree and expecting their results and certificates before 31st July 2014 are also eligible to apply.
**Reservation of seats:** Reservation of seats shall be as per the GOI/UGC norms for SC/ST/OBC/PH/ Wards/Dependants of Defence Personnel/ Kashmiri Migrants/ Foreign Nationals/ NRIs. Few seats are also provided to the nominees from some UT/NE states. Relaxation in the prescribed percentage of marks in the qualifying degree examination is also provided for SC/ST/PH category candidates.
**Entrance Examination fee** (Separate application is required for each course/programme):
For General & OBC Category Rs. 350/- For SC/ST/PH Category Rs. 150/-
**How to apply:** Candidates are required to apply **online** through University website: **http://acad.uohyd.ac.in.** The Prospectus and Instructions for filling the online application form can be downloaded from the University website.

## Important Dates

| | |
|---|---|
| **Downloading of Prospectus and submitting the online application from the University Website: http://acad.uohyd.ac.in** | **04-12-2013 to 03-01-2014** |
| **Last date for submitting the online Applications** | **03-01-2014** |
| **Downloading of Hall Tickets from** | **20-01-2014** |
| **Dates of Entrance Examinations** | **01-02-2014 to 07-02-2014** |

**Important Information:** *Hall Tickets and information to short-listed candidates for interview and selected/wait-listed candidates will only be notified in University website. It is the responsibility of the candidates to check the University website for downloading the Hall Tickets, results and the relevant formats required for admission. The University will not be held responsible for communication of the same.*

**Note: Admission enquiries: 040-23132102, 23132103**
**Dated: 02.12.2013**

**Dr.Ch.Venkateswara Rao**
**Controller of Examinations**

RO No. 451/HCU/2013-14/dt. 5-12-2013

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 150 - January 2014 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/12/2013 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

వీక్షణం ఆగిపోయినా ఫర్వాలేదనుకుంటే
ఈ విజ్ఞప్తి మీకోసం కాదు

తెలుగు సమాజంలో ప్రగతిశీల, ప్రజానుకూల ఆలోచనల వ్యాప్తికి
విశేషకృషి చేస్తున్న
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

**వీక్షణం**

ఎటువంటి పరిస్థితిలోనూ ఆగిపోగూడదని ఆకాంక్షిస్తున్న
వేలాది మంది పాఠకులకు, అభిమానులకు
విజ్ఞప్తి

వీక్షణం ఆర్థిక పరిస్థితి సరిగా లేదని, ఆర్థిక కారణాలవల్లనే వీక్షణం ఎప్పుడైనా ఆగిపోయే ప్రమాదం ఉందని కొంతకాలంగా విజ్ఞప్తి చేస్తూనే ఉన్నాం. వీక్షణం బడ్జెట్ నెలకు దాదాపు తొంబైవేల రూపాయలు. ఇందులో ముప్పై వేల రూపాయల దాకా లోటు ఉంటున్నది. అంటే మూడు పేజీల ప్రకటనలు వచ్చినా, ఆ మేరకు విరాళాలు వచ్చినా వీక్షణం గత పదకొండు సంవత్సరాలు ఒక్క సంచిక కూడ ఆగకుండా నిరాటంకంగా వెలువడినట్టుగానే ఇకముందు కూడ కొనసాగుతుంది. వీక్షణం పట్ల ప్రకటితమవుతున్న ఆదరాభిమానాలతో పోల్చినప్పుడు ఈ లోటు పూరించడం పెద్ద కష్టం కాదు. వీక్షణం ఆగిపోగూడదని కోరుకునే అభిమానులందరూ తలా ఒక చెయ్యివేసి వీక్షణంను నిలబెట్టండి.

ఇది మీ పత్రిక. ఇది ప్రజల పత్రిక. ఇది ఆగిపోగూడని పత్రిక.

మీకు అవకాశం ఉన్నచోటి నుంచి ప్రకటనలు, విరాళాలు సేకరించి పంపండి. వీక్షణం తన రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా కృషిని మరింత సమర్థంగా, మరింత ఎక్కువగా సాగించాలంటే ఈ ఆర్థిక సమస్యల నుంచి గట్టెక్కించండి.

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao